శాస్త్ర నిఘంటువులు - 9

# GLOSSARY OF ADMINISTRATIVE AND LEGAL TERMS

# పరిపాలన, న్యాయపదకోశం

## (ఇంగ్లీషు - తెలుగు)


సంపాదకులు

**డా. ముకురాల రామారెడ్డి,** ఎం.ఎ., బి.ఇడి., పిహెచ్.డి.
డిప్యూటీ డైరెక్టరు (రిటైర్డ్), తెలుగు అకాడమి

**డా. ఆవుల మంజులత,** ఎం.ఎ., పిహెచ్.డి.
డైరెక్టరు, తెలుగు అకాడమి

**శ్రీ మాదరి రామ్‌చందర్,** బి.ఎస్‌సి., ఎల్.ఎల్.ఎం.
రిసెర్చ్ అసిస్టెంటు (రిటైర్డ్), తెలుగు అకాడమి

సహాయ సంపాదకులు

**డా. ఎం. మాణిక్యలక్ష్మి,** ఎం.ఎ., పిహెచ్.డి.
రిసెర్చ్ అసిస్టెంటు, తెలుగు అకాడమి

మొదటి ముద్రణ సహాయ సంపాదకులు

**శ్రీ వి. రామకృష్ణారెడ్డి,** ఎం.ఎ., ఎల్.ఎల్.బి., బి.ఎల్.ఎస్‌సి
రిసెర్చ్ అసిస్టెంటు (రిటైర్డ్), తెలుగు అకాడమి





**తెలుగు అకాడమి**
**హైదరాబాదు**
**2000**

**paripaalana nyaaya padakooSam** (Glossary of Administrative and Legal Terms); ***Editors :*** Dr. M. Rama Reddy, Dr. A. Manjulata, Sri M. Ramchander; ***Assistant Editor:*** Dr. M. Manikyalakshmi; ***First Edition Assistant Editor:*** Sri V. Ramakrishna Reddy; Reprint : 2000, pp. viii + 640 + 8 + iv.



Frist Edition : 1980
Second Edition : 1985
Third Edition : 1988
Revised & Enlarged Edition : 1996
Reprint : 2000
Copies : 3000

Published by TELUGU AKADEMI, Hyderabad-500 029 (Andhra Pradesh) under the Centrally Sponsored Scheme of Production of Books and Literature in Regional Languages at the University level of the Government of India in the Ministry of Human Resource Development, New Delhi.



**Price : Rs. 145=00**

---

Printed in India
Laser typeset at Telugu Akademi, Hyderabad
Printed at M/s. Creative Offset Printers, Hyderabad
Andhra Pradesh.

# భూమిక

తెలుగును అధికార భాషగా అమలు జరపడంలో రాష్ట్ర ప్రభుత్వానికీ, బోధన మాధ్యంగా ప్రవేశ పెట్టడానికి విశ్వవిద్యాలయాలకూ సహకారమందించడం, తెలుగును పెరిగిన భాషావసరాల దృష్ట్యా నవీకరించడం తెలుగు అకాడమి ప్రధాన లక్ష్యాలు. ఈ లక్ష్యాలకనుగుణంగానే తెలుగు అకాడమి సుమారు 27,600 ఆరోపాలతో 'పరిపాలన, న్యాయపదకోశం' తయారుచేసి 1980లో మొదటిసారి ప్రచురించింది. 1988 నాటికే ఈ గ్రంథం మూడో ముద్రణ వెలువరించవలసి వచ్చిందంటే, అది ఎంత ప్రజాదరణ పొందిందో తెలుస్తున్నది. పరిపాలన శాఖలలో, న్యాయస్థానాలలో ఉపయోగించే పరిభాషకు తెలుగు సమానార్థకాలు కూర్చి అందించడం ఈ గ్రంథ పథకోద్దేశం.

1985లో ఈ కోశాన్ని రెండో ముద్రణ వేసేనాటికి, కొందరి నిపుణుల సలహాపై, ప్రతిలేఖనం చేసి ఆరోపాలుగా ఇచ్చిన 'పారీకత్తు, అడంగల్' వంటి భారతీయ పదాలను, కొన్ని సాధారణ పదాలను తీసి వేసి ముద్రించడం జరిగింది. అందువల్ల దానిలో ఆరోపాల సంఖ్య సుమారుగా 23,500కి తగ్గింది.

పరిపాలన, న్యాయవ్యవహారాలు తెలుగులో మరింత బాగా కొనసాగడానికి ఈ కోశాన్ని పరిష్కరించి, పరిభాషను అదనంగా సమకూర్చి పరివర్ధిత ప్రతిగా ప్రచురించాలని అకాడమి నిర్ణయించింది. ఈ నిర్ణయానుసారం ఈ కోశం పరిష్కరణ మొదట ప్రారంభమయింది. తెలుగు అధికార భాషగా ప్రవేశ పెట్టి మూడు దశాబ్దుల కాలం కావస్తున్నందున ఆరోపాలుగా ఇచ్చిన ముఖ్యమైన హోదాలు, సంస్థల పేర్లవంటివి ఇప్పటికి తెలుగులో అందరికీ పరిచితమయ్యాయనే ఉద్దేశంతో ఈ ప్రచురణలో తీసివేయడం జరిగింది. న్యాయస్థానాల్లో, పరిపాలన శాఖల్లో అవసరమవుతాయనుకొన్న పదాలు, పదబంధాలు ఇంకా సుమారు కొన్ని ఆరోపాలు అదనంగా చేర్చి ఈ పరివర్ధిత ప్రతి తయారు చెయ్యడమయింది. అట్లా చేర్చిన వాటిలో న్యాయపదబంధాలేకాక కార్యాలయ ఉద్యోగులకు కార్యాలయ వ్యవహారాల్లో తర్జుమా చేసేటప్పుడు మామూలు ఇంగ్లీషు పదాలే అనుకొన్నా, అర్థాలు వెంటనే స్ఫురించకపోవచ్చునుకొని కొన్ని పదాలూ, పదబంధాలూ చేర్చడం జరిగింది.

పరిపాలన, న్యాయపదకోశంలో నలభై పైచిలుకు ముద్రిత, అముద్రిత ఆకరాల నుంచి పదాలు, పదబంధాలు సేకరించడం జరిగింది. ముద్రిత ఆకరాలలో 1963లో ఆంధ్రప్రదేశ్ శాసనసభ సచివాలయం ప్రకటించిన 'పారిభాషిక పదకోశము', అముద్రిత ఆకరాలలో ఆంధ్రప్రదేశ్ అంతటా ఎనిమిది జిల్లాలలో (చిత్తూరు, అనంతపురం, శ్రీకాకుళం, నిజామాబాదు, ఆదిలాబాదు, హైదరాబాదు, కడప, కృష్ణా) సర్వే జరిపి సేకరించి, పరిష్కృతం చేసిన పదాలు ముఖ్యమైనవి. ఆరోపాలకు తెలుగు సమానార్థకాల నిర్ణయం చేసేటప్పుడు పరిపాలన శాఖలు, న్యాయస్థానాలు, ఈ రెండు రంగాలకే ప్రాధాన్యం ఇస్తూ, తెలుగువారి వ్యవహారంలో ప్రసిద్ధంగా ఉన్న రూపాలనే ముందుంచడం జరిగింది. అందువల్లే లైసెన్సు, కంపెనీ వంటి ఇంగ్లీషు సమాలు, తద్భవాలు; చీటీ, తనిఖీ వంటి ఆంధ్రేతర పదాలూ వాటి తద్భవాలు ఇవ్వడం జరిగింది. పరంపరాగతమైన తెలుగు ప్రాంతీయ పదాలు 'తాకట్టు' వంటి వాటిని యథాతథంగా స్వీకరించడమయింది. 'దరఖాస్తు ఫారం' వంటి మిశ్రపదాలు తరతరాలుగా పరిభాష స్థాయికెక్కినాయి కనుక, స్వీకరించడమయింది. పదసేకరణే తప్ప నూతన పదకల్పన

జరగలేదు. అవసరాన్నిబట్టి వ్యవహారంలో ఉన్న పదాలతోనే నూతన సమాసాలు మాత్రం, అంటే "నిర్ధారిత విశ్వాసబద్ధ రిజర్వు" వంటివి కల్పించడం జరిగింది. తెలుగు సమానార్థకాలు నిర్ణయించడంలో 'ఒక అర్థానికి లేదా భావనకు ఒక పదం' అన్న సూత్ర ప్రకారం నడిచినా, కొన్నిచోట్ల పర్యాయ పదాలు చూపక తప్పలేదు. పరిపాలన, న్యాయ విషయాలకే పరిమితంగా చూసినా ఒక ఇంగ్లీషు మాటకు విభిన్నార్థాలు వెలిశాయి. అట్లాచూపిన వాటిలో కేంద్రప్రభుత్వం వారి Comprehensive Glossary of Technical Terms (CGTT) (1974, Legal Glossary (1988)ని అనుసరించి ఇచ్చినవి గమనించదగ్గవి. అట్లాగే ఒకే తెలుగు మాట విభిన్న ఇంగ్లీషు మాటలకు సమానార్థకంగా కొన్ని సందర్భాల్లో ఇవ్వవలసి వచ్చింది. కోశంలో అవసరమైన చోట్ల వివరణ వాక్యాలున్నాయి.

ఆధునిక వైజ్ఞానిక పరిభాషను తెలుగులో రూపొందించే కార్యక్రమం తెలుగు అకాడమి తలపెట్టి కొనసాగిస్తున్నది. అందులో ఇది ఒక భాగం. పరిపాలన శాఖలలో తెలుగు అంతగా రాని ఉద్యోగుల పత్ర వ్యవహారాల ఉపయోగంకోసం ఈ కోశాన్ని తెలుగు-ఇంగ్లీషు క్రమంలో కూడా తెలుగు అకాడమి ప్రచురించబోతున్నది. ఈ విధంగా పరిపాలన, న్యాయ రంగాలలో ఉద్యోగులకూ, విద్యార్థులకూ, ఇతరులకూ కూడా ఈ కోశం ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాం. పరిభాష కల్పన ఇంకా పరిణామ దశలోనే ఉంది. ఈ రంగంలో ఇంకా ఎంతో కృషి జరగవలసే ఉంది. సహృదయులైన మేధావులు ఈ కోశాన్ని మెరుగుపరచడానికి సూచనలిస్తే రాబోయే ముద్రణలో తగిన సవరణలు చేపట్టగలం.

ఈ కోశ నిర్మాణ వివిధ దశలలో విలువైన విద్యావిషయక సలహాలిచ్చిన గౌ॥ జస్టిస్ ఆవుల సాంబశివరావుగారికి, అప్పటి లోకాయుక్త గౌ॥ శ్రీ డి.జె. జగన్నాథరాజుగారికి, అప్పటి అడిషనల్ అడ్వకేట్ జనరల్, ఇప్పటి న్యాయమూర్తి గౌ॥ శ్రీ జాస్తి చలమేశ్వర్‌గారికి, సహాయసహకారాలు అందించిన శ్రీ గోవిందరాజు రామకృష్ణారావుగారికి, సలహాలందించిన శ్రీ గిడుగు రామమూర్తిగారికీ ఈ సందర్భంలో కృతజ్ఞతాభి వందనాలు తెలియచేసుకుంటున్నాం.

తెలుగు భాషాభివృద్ధికి తగిన సలహా సహకారాలు అందిస్తూ, ఇటువంటి పథకాలు చేపట్టడానికి ప్రోత్సహిస్తున్న అకాడమి పాలకవర్గ సభ్యులకు కృతజ్ఞతాంజలులు.

ఈ కోశం కూర్పులో కొంతకాలం సంప్రదింపులందించి బాధ్యతవహించినవారు శ్రీయుతులు డా.పి. దక్షిణామూర్తి, ఆచార్య జి. చెన్నకేశవరెడ్డి. కొన్ని దశలలో సహకారమందించినవారు శ్రీ ఎన్. శంకరమోహనరావు, కంపోజింగు, ముద్రణ విషయంలో బాధ్యతవహించినవారు శ్రీయుతులు కె. డేనియల్, వి. నరసింహారావు; కంపోజు చేసినవారు శ్రీమతులు వి. సుజాత, వి. ప్రభావతి, ఎన్. సిహాబి. వీరికి వివిధ దశలలో తోడ్పడిన ఉద్యోగులందరికీ అభినందనలు.

డా. ఎ. మంజులత
సంచాలకులు
తెలుగు అకాడమి

హైదరాబాదు
తేదీ : 1 నవంబరు, 2000

# ప్రస్తావన

కళాశాల, విశ్వవిద్యాలయ స్థాయి పాఠ్య పఠనీయ గ్రంథాలు ప్రచురించడంతోపాటు సంప్రదింపు గ్రంథాలు, శాస్త్ర నిఘంటువులు, పదకోశాలు ప్రచురించే కార్యక్రమాన్ని కూడా తెలుగు అకాడమి చేపట్టింది. శాస్త్ర నిఘంటువుల పదకోశాల క్రమంలో ఇది 9వ గ్రంథం.

భాషా ప్రయుక్త రాష్ట్ర విభజనలో మొదటిదిగా 'ఆంధ్రరాష్ట్రం' ఏర్పడ్డనాటి నుంచీ తెలుగును అధికారభాషగా రూపొందించుకోవడానికీ అమలుపరచుకోవడానికీ ఈ తరం ఆంధ్ర ప్రముఖులు చేసిన కృషి ప్రశస్తమైనది. అధికారభాష తెలుగు విషయమై సముచితమైన నిర్ణయాలు జరగాలని నాటి ఆంధ్రరాష్ట్ర శాసనసభ చేసిన తీర్మానం (29-9-1955) ప్రప్రథమంగా స్మరించదగ్గది. ఆ తరవాతి పని కాస్త నిదానంగా సాగినా గణనీయమైందే. సువిశాలమైన 'ఆంధ్రప్రదేశ్' రాష్ట్రం అవతరించిన తరవాత నాటి స్పీకర్ శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు పారిభాషిక పదకోశ సంఘాలు రెండు ఏర్పరిచి చేయించిన కృషి ఫలితంగా 'పారిభాషిక పదకోశము' వెలువడింది (1963). ఆ గ్రంథం ప్రాతిపదికగానే ఈ పదకోశమూ వెలువడుతున్నా ఇతర ఆకరాల నుంచి అదనపు పదాలనూ పదబంధాలనూ కూర్చుకోవడం; ప్రధానారోప, ఉపారోప పద్ధతిని విడిచి అర్థనిశ్చయం చేసి స్వీకరించిన ప్రతిపదాన్నీ పదబంధాన్నీ ఆరోపం (entry) గా ఉంచడం; అర్థాలూ వివరణలూ వ్యావహారిక భాషలోనే రచించడం మొదలైనవి దీని ప్రత్యేకత.

ఈ పని యావత్తూ తెలుగు అకాడమి తన ఉద్యోగులతో చేయించి పరిపాలన, న్యాయ, పత్రికా రచన రంగాలలో అనుభవజ్ఞులైన 25గురు నిపుణులతో పరిశీలింపజేయించింది. వారు అందించిన సలహా సహకారాలకు, ముఖ్యంగా :

శ్రీ ఆవుల సాంబశివరావు, మాజీ ప్రధాన న్యాయమూర్తి, ఆంధ్రప్రదేశ్ హైకోర్ట్.

శ్రీ దేవులపల్లి రామానుజరావు, ఉపాధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి.

శ్రీ కాళోజీ రామేశ్వరరావు, న్యాయవాది, వరంగల్.

శ్రీ ఎమ్.ఎన్. రావు, న్యాయమూర్తి, ఆంధ్రప్రదేశ్ హైకోర్ట్,
(మాజీ న్యాయశాఖా కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం).

గార్లు ఈ పరిభాషను ప్రత్యేక శ్రద్ధతో పరిశీలించి, తుది నిశ్చయాలకు సూచనలిచ్చి అందించిన సహకారానికి అకాడమి రుణపడి ఉంది.

ఈ పరియోజన (project) నిర్వహణకు సంపాదకత్వం వహించినవారు డా. ముకురాల రామారెడ్డి, నమూనా పథకంతో పాటు భారతీయ పదాలకు ప్రతిలేఖనం తయారు చేసినవారు డా. బూదరాజు రాధాకృష్ణ - పదసేకరణ, ప్రాంతీయ పదాల సర్వే; అర్థనిశ్చయం, సంకలనం, ప్రతిలేఖనం వంటి పనికి, వివిధ దశలలో సహకరించిన వారు శ్రీయుతులు : వి. రామకృష్ణారెడ్డి, ఎం. రామ్‌చందర్, వి. శంకరలాల్, ఎం.ఎల్. నరసింహారావు, ఎస్.ఎస్. మోహన్‌రావు, డా. పి. దక్షిణామూర్తి, ఎ. పాండయ్య, డా. ఎ.వి. పద్మాకర్‌రెడ్డి, ఎన్. శివనారయ్యగార్లు; శ్రీమతులు : ఎ. మంజులత, పి. విజయలక్ష్మి, ఎం. ప్రమీలారెడ్డి, డా. వి. స్వరాజ్యలక్ష్మి, కుమారి ఉషాపన్నాలగార్లు. వీరి సమిష్టి కృషి ఫలితంగా వెలువడుతున్న ఈ పదకోశం ప్రభుత్వ కార్యాలయాల పత్రవ్యవహారానికి ఉపకరిస్తుందని అకాడమి ఆశిస్తున్నది. తెలుగు అనువాదంలో అవసరమైనచోట ఇంకా మెరుగుపరిచే సూచనలు పరిపాలన, న్యాయ విషయజ్ఞులు అందించి వాటిని తరవాతి ముద్రణల్లో చేర్చుకోవడానికి అవకాశమిస్తారని కూడా అకాడమి ఆశిస్తున్నది.

(ప్రథమ ముద్రణ : 1980)

# A

**ab alienate** పరాధీనం చేయు (హక్కు/ ప్రయోజనం)

**abandon** విడిచిపెట్టు, పరిత్యాగం చేయు

**abandoned** పరిత్యక్త, పరిత్యాగం చేసిన

**abandoned estate** విడిచిపెట్టిన ఆస్తి/ ఎస్టేట్

**abandonee** విడిచిన హక్కు గ్రహీత: విడిచిన హక్కులు పొందటానికి ఉద్దేశించిన వ్యక్తి

**abandoner** పరిత్యాగి (హక్కు సం॥)

**abandon his application** తన దరఖాస్తు వదులుకొను

**abandonment** విడిచిపెట్టడం, పరిత్యాగం

**abandonment and laches** విడిచి పెట్టటమూ ఉపేక్షా; ఉపేక్షాపూర్వక పరిత్యజనం **(undue delay in asserting a right)**

**abandonment and non-use** విడిచి పెట్టటమూ ఉపయోగించక పోవటమూ

**abandonment of action** దావా వదులు కోవడం

**abandonment of an easement** అనుభోగ హక్కు పరిత్యాగం

**abandonment of an execution** అమలు పరిత్యజించటం (జప్తు సం॥)

**abandonment of child** శిశు పరిత్యాగం

**abandonment of claim** హక్కు వదలటం

**abandonment of distress** జప్తును వదిలి వేయడం

**abandonment of domicile** అధివాస పరిత్యాగం

**abandonment of holdings** కమతాలు వదులుకోవటం

**abate** 1. తొలగించు 2. ముగించు 3. తగ్గించు, తగ్గు 4. ఉపశమనం చేయు, ఉపశమనం అవు

**abate in equal proportion** సమాన దామాషాలో తగ్గుదల చూపు

**abatement** 1. తొలగింపు 2. ముగింపు 3. తగ్గింపు, తగ్గుదల 4. ఉపశమనం

**abatement of action** 1. దావా/వ్యాజ్యం ముగింపు 2. చర్య ముగింపు

**abatement of appeals** అపీళ్ళ ఉపశమనం

**abatement of duty** సుంకంలో తగ్గింపు

**abatement of judgement** తీర్పు ఉపశమనం: అమలుకు వీలుకాని న్యాయస్థాన తీర్పు

**abatement of land revenue** శిస్తు తగ్గించడం/ రద్దుచేయడం

**abatement of legacies** వీలునామా హక్కుల తగ్గుదల, వసీయతు హక్కుల తగ్గింపు **(pro rata diminution of general legacies)**

**abatement of legal proceeding** శాసనిక చర్య ముగింపు

**abatement of nuisance** పీడ తొలగింపు

**abatement of purchase money** కొనుగోలు సొమ్ము తగ్గింపు

**abatement of rent** బాడుగ తగ్గింపు (కిరాయి, అద్దె, శిస్తు, కౌలు వగైరా సం॥)

**abatement of suit** దావా ముగింపు / రద్దు: వాద సమాప్తి

**abatement of suit and bar of suit** దావా ముగింపూ దావా నిరోధమూ

**abbreviated entry** 1. క్లుప్త ఆరోపం, క్లుప్త నమోదు 2. సంక్షిప్త పద్దు

**abbreviated name** సంక్షిప్తనామం

**abbreviation** సంక్షిప్తం, సంక్షేపరూపం

**abbreviation of above** పై దాని సంక్షిప్త రూపం

**abbreviation of name** నామ సంక్షిప్తం, పొడి అక్షరాలలో పేరు

**abdicate** (పదవి/ హక్కు) పరిత్యాగం చేయు

**abdication** (పదవి/ రాజ్య) హక్కు పరిత్యాగం

**abduction** 1. అపహరణం 2. (వ్యక్తిని) బలవంతంగా ఎత్తుకుపోవటం, మానవ అపహరణం

**abductor** అపహర్త
**aberrant behaviour** అపమార్గ ప్రవర్తన
**aberration 1.** అపమార్గం **2.** ఉల్లంఘన (నిబంధనల సం॥)
**abetment 1.** నేర ప్రేరణ/ దుష్ప్రేరణ **2.** పురికొల్పటం
**abetment of murder** హత్యకు పురికొల్పటం
**abetment of offence** నేరానికి పురికొల్పటం
**abetment of suicide** ఆత్మహత్యకు ప్రేరణ
**abettal/ abetment** నేర ప్రేరణ
**abetter/abettor** నేరప్రేరకుడు, దుష్ప్రేరకుడు
**abetting** నేర ప్రేరణ
**abeyance 1.** నిలుపుదల **2.** అనిర్ణీత స్థితి
**abeyant (in abeyance)** అనిర్ణీత స్థితిలో ఉన్న, తాత్కాలిక చలనం లేని
**abhorrence** అసహ్యం, ఏవగింపు
**abide** బద్ధమవు
**abide by decision** తీర్పుకు బద్ధుడై ఉండు
**abide by rules** నియమాలకు బద్ధమై ఉండు/ కట్టుబడి ఉండు
**abide by the constitution 1.** రాజ్యాంగానికి / సంవిధానానికి / స్థాపన నియమాలకు కట్టుబడి ఉండు / బద్ధమై ఉండు **2.** రాజ్యాంగ బద్ధమై ఉండు
**abiding conviction** స్థిరవిశ్వాసం, బద్ధవిశ్వాసం
**ability** సమర్థత, శక్తి, తాహతు, ప్రతిభ, సామర్థ్యం
**ability distribution** సామర్థ్య పంపిణీ
**ability test** సామర్థ్య పరీక్ష
**ability to elicit co-operation** సహకారం పొందే సామర్థ్యం
**ability to plan and organize** పథక రచనకూ నిర్వహణకూ సామర్థ్యం
**ability to read and write** చదవనూ రాయనూ సామర్థ్యం
**ab initio** ప్రారంభం నుంచి
**abjection** నికృష్టత, హీనత
**abjuration** నిరాకరణం/ త్యాగం (ప్రమాణ పూర్వక): ప్రమాణం చేసి లేదనటం
**abjurer** నిరాకరించే వ్యక్తి
**able** తాహతుగల, సమర్థ
**able and willing** సమర్థతా సంకల్పమూ గల
**able bodied** దృఢకాయంగల
**able bodied unemployee** శారీరక శక్తి గల నిరుద్యోగి
**able to get on well with** — తో కలిసి బాగా పనిచేయగల
**ablution** తీర్థస్నానం
**abnegation 1.** త్యాగం **2.** నిరాకరణం
**abnormal** అసాధారణ, అసామాన్య, అమితమైన, మితిలేని
**abnormal circumstances** అసాధారణ పరిస్థితులు
**abnormal wastage** మితిమీరిన దుబారా
**abolish 1.** రద్దుచేయు, తొలగించు, ఎత్తివేయు **2.** నిర్మూలించు
**abolisher** రద్దుచేసే వ్యక్తి, తొలగించే వ్యక్తి
**abolishment** రద్దు, తొలగింపు, ఎత్తివేత
**abolition** తొలగింపు, రద్దు, నిర్మూలన
**abolition and dissolution** రద్దూ విఘటనమూ (శాసనసభ సం॥)
**abolition of intermediaries** మధ్యవర్తుల తొలగింపు
**abolition of tax** పన్ను రద్దు
**abolition of untouchability** అస్పృశ్యతా నిర్మూలనం
**aboriginal population** ఆదిమవాసి జనాభా
**aboriginal tribe** ఆదిమవాసుల తెగ
**aborigines** ఆదిమవాసులు
**abort 1.** ఫలితం లేనిదవు **2.** గర్భస్రావమవు
**abortion** గర్భస్రావం
**abortive trial 1.** ఫలితం లేని విచారణ **2.** ఫలితంలేని యత్నం
**above average** సగటుకు మించిన

**above board** నిష్కల్మషమైన, దోష రహితం(గా)
**above defined** పైన నిర్వచించిన
**above given** పైన ఇచ్చినట్లుగా/ పేర్కొన్నట్లుగా
**above noted** పైన తెలిపిన
**above par value** విలువ కంటె మించిన
**above procedure** పై కార్యపద్ధతి
**above quoted** పైన ఉటంకించిన
**above standard** ప్రమాణంకంటె మించిన
**abrasive** కొట్టుకొని పోయేటట్లు చేసే (ది), అరగదీసే(ది)
**abridge** క్లుప్తపరచు, తగ్గించు, కుదించు, సంక్షిప్తపరచు
**abridged edition** సంక్షిప్త కూర్పు
**abridgement** క్లుప్తత, కుదింపు
**abridgement of damages** నష్టపరిహారం తగ్గింపు (కోర్టు సం॥)
**a brief note is placed below** సంగ్రహ నోటును కింద ఇవ్వడమైంది
**abroad 1.** బయట **2.** పరదేశం, పరప్రాంతం, విదేశాలు
**abrogable** రద్దుచేయదగిన/ నిరాకరించదగిన (శాసన సం॥)
**abrogate** రద్దుచేయు/ నిరాకరించు
**abrogation of agreement** ఒప్పందం రద్దు
**abrogation of contract** కాంట్రాక్టు రద్దు
**abrogation of orders** ఉత్తరువుల రద్దు
**abrogative** రద్దు చేయగల
**abrogator** రద్దుపరిచే వ్యక్తి
**abrupt fall** హఠాత్పతనం
**abscond** పారిపోవు, పరారీ అవు
**absconder** పరారీ (అయినవ్యక్తి)
**absconding debtor** పరారీ అయిన బాకీదారు
**absconding offender** పరారీ అయిన అపరాధి
**absconding person** పరారీ (అయినవ్యక్తి)
**absence 1.** గైరు హాజరు, హాజరు కాకపోవడం **2.** లోపం, అభావం, రాహిత్యం **3.** శూన్యప్రదేశం **4.** పరోక్షం
**absence beyond seas** సముద్రాలకు అవల ఉండటంవల్ల గైరుహాజరు
**absence of a written statement** లిఖిత పూర్వక స్టేట్‌మెంటు లేకపోవటం, రాత పూర్వక వివరణ లేకపోవటం
**absence of defects** లోపరహితం, లోప రాహిత్యం
**absence of integration** సమైక్యతా లోపం
**absence of malice or ill feeling** ద్వేషభావ రాహిత్యం
**absence of mind** పరాకు, పరధ్యానం
**absence without leave** సెలవు పెట్టకుండా గైరుహాజరు
**absence without permission** అనుమతి లేని గైరుహాజరు
**absent adj.** గైరుహాజరు, హాజరులేని, హాజరుకాని, పరోక్ష **v.** గైరుహాజరవు, మరోచోట ఉండు
**absent debtor** గైరుహాజరు బాకీదారు
**absente reo** ప్రతివాది గైరుహాజరు కావటం వల్ల
**absentee** గైరుహాజరు అయినవ్యక్తి
**absentee allowance** పరోక్ష భత్యం
**absentee land lord** పరోక్ష భూస్వామి
**absentee statement** గైరుహాజరు పట్టీ
**absent from duty** పనికి గైరుహాజరవు
**absenting himself** తానై గైరుహాజరు కావడం
**absent inspite of service of summons** సమన్లు అందజేసినప్పటికీ గైరుహాజరు
**absent members** హాజరుకాని సభ్యులు
**absent on tour** పర్యటనలో ఉండి గైరుహాజరు
**absent voter** హాజరుకాని వోటరు
**absent voting** హాజరు కాకుండా వోటు చేయటం
**absent with leave** సెలవు పొంది గైరుహాజరు
**absent without leave** సెలవు పొందకుండా

గైరుహాజరు

**absolute** పరమ, సంపూర్ణ, సమగ్ర, నిరపేక్ష, కేవల, నిరంకుశ, శుద్ధ, నిర్దిష్ట, అసలు, కచ్చిత, ఖరా, నికర, పక్కా, కల్తీలేని, బేషరతు, పూర్తి, అసందిగ్ధ, సర్వ

**absolute acceptance** సంపూర్ణ అంగీకారం

**absolute accuracy** పూర్తి యథార్థత

**absolute alcohol** కల్తీలేని సారా

**absolute and unconditional** సమగ్రంగానూ బేషరతుగానూ

**absolute assignment** పూర్తి అప్పగింత: అసైన్‌మెంట్ హక్కు పూర్తిగా కలిగించడం

**absolute authority** సంపూర్ణాధికారం

**absolute contraband** పూర్తి నిషిద్ధం

**absolute control** పూర్తి కంట్రోల్/ నియంత్రణ

**absolute conveyance** పూర్తి బదిలీ (ఆస్తి సం||), సంపూర్ణ అన్యాక్రాంత పత్రం

**absolute conviction 1.** పూర్తి నేరనిర్ణయం **2.** పూర్తి విశ్వాసం

**absolute dating method 1.** కచ్చితమైన కాలనిర్ణయ పద్ధతి **2.** నిరపేక్ష కాలనిర్ణయ పద్ధతి

**absolute differences** కచ్చితమైన భేదాలు

**absolute discharge** పూర్తి విడుదల

**absolute discretion** పూర్తి విచక్షణ

**absolute error** శుద్ధ తప్పు

**absolute estate** సంపూర్ణ హక్కులు గల ఆస్తి/ ఎస్టేటు

**absolute guarantee** పూర్తి పూచీ/ గ్యారంటీ

**absolute law 1.** అసందిగ్ధ నియమం **2.** ప్రకృతి ధర్మం

**absolute liberty** పూర్తి స్వేచ్ఛ

**absolutely 1.** బేషరతుగా **2.** పూర్తిగా

**absolutely above** పూర్తిగా వేరుగా

**absolutely correct** పూర్తిగా సరిఅయిన

**absolutely debarred and foreclosed** పూర్తిగా తొలగించబడిన, విడిపించుకొన్న (తాకట్టు ఆస్తి సం||)

**absolutely forbidden** కచ్చితంగా నిషేధించిన

**absolutely or conditionally** పూర్తిగా గాని షరతులతో గాని

**absolutely restraining the transferee** బదలాయింపు పొందే వ్యక్తిని పూర్తిగా నిరోధించటం (ఆస్తి సం||)

**absolutely transfer** కచ్చితంగా బదిలీ చెయ్యడం

**absolutely upright and sound** పూర్తిగా శ్రేష్ఠమూ దృఢమూ అయిన

**absolutely vested** పూర్తిగా సంక్రమింపజేసిన

**absolutely void in law** చట్టరీత్యా అసలు చెల్లనిది

**absolute majority** పూర్తి మెజారిటీ

**absolute monopoly** పూర్తి గుత్తాధికారం

**absolute necessities** పూర్తి అవసరాలు

**absolute occupancy (right)** పూర్తి స్వాధీనం (హక్కు సం||)

**absolute occupancy tenant** పూర్తి స్వాధీన హక్కుగల కౌలుదారు

**absolute or conditional** పూర్తిగా లేదా షరతుపై

**absolute order** కచ్చితమైన ఉత్తరువు

**absolute order of discharge** విడుదలకు పూర్తి ఉత్తరువు

**absolute owner** సర్వహక్కులు గల యజమాని

**absolute ownership** పూర్తి యాజమాన్యం

**absolute power** సంపూర్ణ / పూర్తి / నిరపేక్షాధికారం

**absolute priority** సంపూర్ణ అగ్రప్రాధాన్యం, ప్రప్రథమ ప్రాధాన్యం

**absolute property** సంపూర్ణ హక్కు భుక్తాలున్న ఆస్తి

**absolute right** సంపూర్ణ హక్కు

**absolute rule** అపవాదంలేని/ కచ్చితమైన నియమం

**absolute rule of order** కోర్టు పూర్తి నిర్ణయం చెపుతూ ఇచ్చిన ఉత్తరువు

**absolute sale 1.** బేషరతు అమ్మకం **2.** కచ్చితమైన అమ్మకం

**absolute sovereignty** సంపూర్ణ సార్వ భౌమాధికారం
**absolute title (complete title)** సంపూర్ణ హక్కుమూలం
**absolute undertaking** 1. షేషరతుగా రాసి ఇవ్వటం/ మాట ఇవ్వటం 2. పూర్తి అధీన బాధ్యత
**absolute unit** కచ్చితమైన ప్రమాణం
**absolute value** ఖరా విలువ, కచ్చిత విలువ
**absolution** విముక్తి, విమోచన : నిర్దోషి అని తీర్పు
**absolve** నేరవిముక్తి చేయు, నిర్దోషి అని చెప్పు
**absolved** నేరవిముక్త / విముక్తి అయిన
**absolved of the responsibility** బాధ్యత నుంచి విముక్తి అయిన
**absolve from liability** బాధ్యత నుంచి తప్పించు/ విముక్తుని చేయు
**absolvent** విమోచకం
**absolver** విమోచకుడు
**absorb** 1. లీనం చేసుకొను 2. పీల్చుకొను
**absorbed areas** లీనం చేసిన ప్రాంతాలు
**absorbed employee** లీనమైన ఉద్యోగి
**absorbed post** లీనం చేసిన పదవి
**absorbed wholly** పూర్తిగా లీనమైన
**absorbing state** లీనం చేసుకొనే రాష్ట్రం
**absorb in increments** వేతన వృద్ధిలో/ ఇంక్రిమెంట్లలో లీనం చేయు
**absorb in regular service** నియతసేవ లోకి తీసుకొను, క్రమబద్ధ సర్వీసులో లీనం చేయు
**absorption account** లీనం పద్దు
**absorption costing** లీనవ్యయ నిర్ధారణ
**abstain** హాజరు కాకుండా/ పాల్గొనకుండా/ విముఖంగా ఉండు
**abstained from** మానివేసిన
**abstain from a certain act** ఒకపని చెయ్యకుండా మానివేయు
**abstain from doing** చెయ్యకుండా ఉండు
**abstention / abstinence** చెయ్యకపోవడం
**abstention from work** పని చెయ్యకుండా / చేపట్టకుండా ఉండటం
**abstention from voting** వోటు చెయ్యక పోవడం
**abstract n. & adj. 1.** సంగ్రహ(ం) **2.** అవ్యక్త(ం), అమూర్త(ం) భావార్థక(ం) **v. 3.** ప్రత్యేకించు, వేరుచేయు, సంక్షిప్త
**abstract and transcript** సంగ్రహమూ ప్రతిలేఖనమూ
**abstract bill** సంగ్రహబిల్లు
**abstract budget** సంగ్రహ బడ్జెట్
**abstract concept** అమూర్త భావన
**abstract contingent bill** సంక్షిప్త ఆగంతుక బిల్లు
**abstracter** సంగ్రహలేఖరి
**abstract of account** పద్దు సంగ్రహం
**abstract of cases disposed of** తీర్మానించిన కేసుల సంగ్రహం
**abstract of estimate** అంచనా సంగ్రహం
**abstract of indictment** నేరారోపణ సంగ్రహం
**abstract of pleas** ప్రతివాది వాదసంగ్రహం
**abstract of tender** టెండరు సంగ్రహం
**abstract of the instrument** పత్ర సారాంశం
**abstract of the receipts of the company** కంపెనీ రాబడుల సంగ్రహం
**abstract of title** హక్కు మూల సంగ్రహం
**abstract statement** సంగ్రహ పట్టిక / వివరణ
**abstract statement of cases** కేసుల/ వ్యాజ్యాల వివరణ సంగ్రహం
**abstract term** అమూర్తపదం
**abstruse** గూఢ
**absurd** అసమంజస(ం), విడ్డూరమైన
**absurd argument** పొందికలేని/ పొసగని/ అసంగతవాదం
**absurdity** అసమంజసత్వం
**absurd practice** అసమంజసమైన ప్రాక్టీసు
**absurd statement** అసమంజస కథనం/

ప్రకటన

**abundance** పుష్కలం, సమృద్ధి

**abundant proof** 1. పుష్కలమైన రుజువు 2. కావలసినంత సాక్ష్యం.

**abuse n.** దురుపయోగం, దుర్భాష, దుర్వినియోగం, నింద, **v.** నిందించు, దుర్వినియోగం చేయు

**abuse of authority** అధికార దుర్వినియోగం

**abuse of discretion** వివేచన దురుపయోగం

**abuse of distress** జప్తు ఆస్తి దురుపయోగం : జప్తు ఆస్తిని ఉపయోగించడం

**abuse of flag** జెండా దురుపయోగం

**abuse of law** చట్ట/ శాసన దురుపయోగం, చట్ట / శాసన దుర్వినియోగం

**abuse of office** పదవి దుర్వినియోగం

**abuse of official position** అధికార హోదా దుర్వినియోగం

**abuse of power** అధికార దుర్వినియోగం

**abuse of process** కార్యవిధాన దురుపయోగం (కోర్టు సం॥)

**abuse of the right** హక్కు దుర్వినియోగం

**abuse of the right of questioning** ప్రశ్నాధికార దుర్వినియోగం

**abut** అనుకొని ఉండు

**abutment** ఆసరా, అండ

**abuttals** సరిహద్దులు

**abutting** అనుకొని ఉండే

**abutting owner** ఇరుగుపొరుగు యజమాని, సరిహద్దుదారు

**academic** విద్యా/ సిద్ధాంత సంబంధమైన

**academic advisory committee** విద్యా విషయక సలహా సంఘం

**academic aptitude** విద్యా విషయాభిరుచి

**academic body** 1. విద్యామండలి 2. విద్యా విషయక సంస్థ

**academic control** విద్యావిషయక అధికారం/ నియంత్రణ

**academic council** విద్యా విషయక మండలి/ పరిషత్తు

**academic course** విద్యాపాఠ్యక్రమం

**academic degree** విద్యావిషయక పట్టా/ డిగ్రీ

**academic discipline** విద్యపరంగా క్రమశిక్షణ

**academic discussion** విద్వత్ చర్చ, విద్యావిషయక చర్చ

**academic distinction** విద్యావిషయ విశిష్టత/ ఘనత

**academic experience and attainments** విద్యావిషయక అనుభవమూ పొందిన యోగ్యతలూ

**academic freedom** విద్యావిషయక స్వేచ్ఛ

**academic guidance** విద్యావిషయక మార్గదర్శనం

**academician** విద్యావేత్త

**academic institution** విద్యాసంస్థ

**academic interest** విద్యావిషయక ఆసక్తి/ ప్రయోజనం

**academic matter** విద్యావిషయం

**academic merit** విద్యా యోగ్యత

**academic officer** విద్యావిషయక అధికారి

**academic point of view** విద్యావిషయక దృక్పథం

**academic policy** విద్యావిషయక విధానం

**academic post** విద్యావిషయక పదవి

**academic qualification** విద్యార్హత

**academic record** విద్యావిషయక రికార్డు

**academic session** విద్యావిషయక సమావేశం/ సమావేశకాలం

**academic staff** విద్యావిషయక సిబ్బంది

**academic step** విద్యావిషయక చర్య

**academic work** విద్యావిషయక కృషి

**academic year** విద్యా సంవత్సరం

**academy / akademi** విద్వత్ పరిషత్తు, అకాడమి

**academy of fine arts** లలిత కళా పరిషత్తు/ అకాడమి

**accede** 1. చేరు 2. సమ్మతించు

**accede and acquiesce** సమ్మతించు.

మౌనంగా సమ్మతించు
**accede to** సమ్మతించు. చేరు. పొందు
**accede to one's demand** అభ్యర్థనను మన్నించు
**accede to one's request** మనవిని మన్నించు
**acceding government** అధికారంలోకి వచ్చిన ప్రభుత్వం
**acceding states** చేరే రాష్ట్రాలు
**accelerate** త్వరితపరచు. తీవ్రపరచు. శీఘ్ర పరచు. వేగం పెంచు
**accelerated depreciation** త్వరిత పరిచిన తరుగుదల (విలువ)
**accelerated promotion** శీఘ్రపరిచిన పదోన్నతి
**accelerated succession** వేగిరపరచిన పారంపర్య హక్కు
**accelerate the death** మృత్యువును త్వరితం చెయ్యటం (జీవకారుణ్య సం॥)
**acceleration of an estate** ఆస్తి ప్రాప్తిని త్వరితపరచడం
**acceleration of programme** కార్యక్రమాన్ని త్వరితం చెయ్యటం
**accelerator** వేగం పెంచే సాధనం/ వ్యక్తి
**accent n.** ఉచ్చారణ స్వరం **v.** నొక్కి చెప్పు
**accept** స్వీకరించు. అంగీకరించు. ఒప్పుకొను
**acceptability** అంగీకారయోగ్యత
**accept a bill** హుండీ/ బిల్లు/ వినిమయ పత్రం అంగీకరించు
**accept a motion** ప్రతిపాదన అంగీకరించు
**acceptance book** అంగీకార పుస్తకం
**acceptance credit** అంగీకార పరపతి
**acceptance form** అంగీకార పత్రం/ నమూనా
**acceptance in pinciple** సూత్రప్రాయ అంగీకారం
**acceptance is awaited** అంగీకారం రావలసి ఉంది
**acceptance letter** అంగీకారపత్రం / లేఖ
**acceptance must be absolute** అంగీకారం సంపూర్ణంగా ఉండాలి
**acceptance note** అంగీకార నోట్
**acceptance of an offer** ప్రతిపాదన అంగీకారం (కరారు సం॥)
**acceptance of bill** బిల్లు (హుండీ) అంగీకారం
**acceptance of offence** అపరాధ అంగీకారం
**acceptance of office** పదవి అంగీకారం
**acceptance of proposal** ప్రతిపాదన అంగీకారం
**acceptance of responsibility** బాధ్యత స్వీకారం
**acceptance of service** సర్వీసు అంగీకారం
**acceptance of supra protest** ఆక్షేపణ పూర్వక అంగీకారం
**acceptance register** అంగీకార రిజిస్టరు
**acceptance resolution** అంగీకార తీర్మానం
**acceptances** అంగీకరించిన బిల్లులు **(accepted bill)**
**acceptation** అంగీకరించిన అర్థం, **the sense in which a word or expression is generally received**
**accepted, allocated and passed for payment** స్వీకరించి, కేటాయింపు చేసి, చెల్లింపులకు అనుమతించడమైంది
**accepted amendments** ఆమోదించిన సవరణలు
**accepted as authentic** ప్రామాణికమని/ అధికారికమని అంగీకరించడమైంది
**accepted as correct** సరయినదని అంగీకరించడమైంది
**accepted in principle** సూత్రప్రాయంగా అంగీకరించిన
**accepted on trial basis** పరీక్షణ ప్రాతిపదిక మీద స్వీకరించడమైంది
**accepted provisionally** తాత్కాలికంగా అంగీకరించడమైంది
**accepted tenders** అంగీకరించిన టెండర్లు
**accepter / acceptor** అంగీకర్త. స్వీకర్త
**accepting house/institution** అంగీకార

సంస్థ (వినిమయ సం॥)
**acceptor for honour** గౌరవార్థ అంగీకరణదారు
**acceptor of bill of exchange** వినిమయ బిల్లు అంగీకరణదారు
**acceptor supra protest** ఆక్షేపణ పూర్వక అంగీకరణదారు
**accept the confidence** విశ్వాసాన్ని అంగీకరించు
**accept the plea** వాదాన్ని అంగీకరించు
**access 1.** ప్రవేశం **2.** ప్రవేశసాధ్యం, సుగమం, ప్రవేశ సౌలభ్యం
**accessibility** ప్రవేశ సౌలభ్యం, దర్శన సౌలభ్యం
**accessible documents** అందుబాటులో ఉన్న పత్రాలు
**accessible place** వెళ్ళడానికి వీలైనచోటు
**accessio** అనువృద్ధి (ఆస్తి సం॥)
**accession 1.** ప్రవేశం, విలీనం **2.** అనువృద్ధి **(increase by something added) 3.** సింహాసనారోహణం, పదవీ స్వీకారం
**accession book/ register** ప్రవేశపుస్తకం
**accession of property** ఆస్తి అనువృద్ధి
**accession register** ప్రవేశపట్టీ/ పుస్తకం
**accession to office** పదవీ స్వీకారం
**accessories** అనుబంధితాలు, సంబంధితాలు, సహాయకాలు
**accessory 1.** ఉపసాధనం, ఉపసాధకం **2.** సహాయకుడు/ సహాయం **3.** అనుబంధం (నేర సం॥)
**accessory after the fact** నేరాంతాన సహాయకుడు
**accessory before the fact** నేరానికి పూర్వం సహాయకుడు
**accessory contract** అనుబంధ ఒప్పందం
**accessory factor** అనుబంధకారకం
**accessory minerals** అనుబంధ / ఉప ఖనిజాలు
**accessory obligation** ఉపబాధ్యత
**accessory of an automobile** మోటారు వాహన ఉపకరణం
**accessory product** అనుబంధ ఉత్పాదితం
**accessory right** అనుబంధ హక్కు, ఉపహక్కు
**accessory to adultery** వ్యభిచార సహాయకం/ సహాయకుడు/ సహాయిని
**access to records or documents** రికార్డులు, దస్తావేజులు పరిశీలించే అవకాశం
**accident 1.** ఆకస్మిక ఘటన **2.** ప్రమాదం **3.** దుర్ఘటన
**accidental** అనుకోనివిధంగా, విధివశాత్తు, యాదృచ్ఛికమైన
**accidental death benefit** ఆకస్మిక మరణం కారణంగా పరిహార లబ్ధి
**accidental delay** అనుకోని జాప్యం
**accidental error** అనుకోని తప్పు
**accidental fire** ఆకస్మిక అగ్ని ప్రమాదం
**accidental fluctuation** అనుకోని హెచ్చు తగ్గులు, ఆకస్మిక అస్థిరత
**accidental happening** ఆకస్మిక సంభవం
**accidental omission** అనుకోని లోపం/ పొరపాటు
**accidental or unintentional** ఆకస్మిక లేదా అనుకోని
**accidental profit** ఆకస్మిక లాభం
**accidental slip** అనుకోని పొరపాటు/ మరుపు
**accident and casuality** ఆకస్మిక ప్రమాదం, దానికి లోనైన వ్యక్తి
**accident and health insurance** ప్రమాద, ఆరోగ్య భీమా
**accident and sickness benefit** ప్రమాద, అస్వస్థత పరిహార లబ్ధి
**accident at sea** సముద్రంలో ప్రమాదం
**accident insurance** ఆకస్మిక ప్రమాదాల భీమా
**accident policy** ప్రమాద భీమా పట్టా
**accident prevention** ప్రమాద నివారణ
**accident prone** ప్రమాదాలకు గురి అయ్యే
**accident spot** ప్రమాదస్థలం

**acclamation 1.** ఏక(గీవామోదం **2.** స్వాగత జయధ్యానం **3.** మూజువాణీ వోటు

**acclimatization** నూతన వాతావరణాను కూలం చేయు/ అవు

**accommodating terms** అనుకూల షరతులు

**accommodation 1.** అనుకూలం **2.** వసతి **3.** సర్దుబాటు

**accommodation bill** సిఫారసు/ సర్దుబాటు బిల్లు

**accommodation charges** వసతి కిరాయిలు

**accommodation free of charge** ఉచిత వసతి సౌకర్యం

**accommodation note or bill** సర్దుబాటు నోటు లేదా బిల్లు

**accommodation of travellers** ప్రయాణికుల వసతి

**accommodation paper** సిఫారసు చేసిన ఋణపత్రం

**accommodations** వసతి సౌకర్యాలు

**accommodation work** వసతి నిర్మాణం

**accompanied by** - తో పాటు

**accompanying letter** జతచేసిన పత్రం

**accomplice** సహాపరాధి: ఒక నేరంలోగాని ఒక తప్పుడు పనిలోగాని నేరస్తునితో సహకరించిన వ్యక్తి - సాక్ష్యమిచ్చి తప్పుకొన్న వాడు

**accomplish 1.** పూర్తిచేయు **2.** సాధించు

**accomplished fact** పూర్తయిన సంగతి/ అంశం

**accomplishment. 1.** సంపూర్ణత **2.** సిద్ధహస్తత **3.** నిర్వహణ **4.** సిద్ధి, సాఫల్యం

**accomplishment of purpose** ప్రయోజన సిద్ధి

**accord n.** సానుమోదం, అంగీకారం, ఒప్పందం **v.** దయచేయు, ఇచ్చు

**accordant** ఏకీభావంగల

**accord approval** ఆమోదం ఇచ్చు

**according, according as or in accoardance with, accordingly, according to** అనుసరించి, తదనుసారంగా, ఆ ప్రకారంగా

**according as the state of business** పని సరళికి అనుగుణంగా

**accordingly it has been decided** దాని ప్రకారం నిర్ణయమైంది

**according to convention** సంప్రదాయం/ పరిపాటి ప్రకారంగా

**according to current practice** ప్రస్తుత ఆచరణ ప్రకారం

**according to facts** వాస్తవాలను బట్టి

**according to indication** సూచన ప్రకారంగా

**according to law** న్యాయానుసారం/ శాసన ప్రకారం

**according to merit** యోగ్యత ప్రకారం

**according to order 1.** ఆదేశానుసారం **2.** క్రమానుసారం

**according to report** నివేదిక ప్రకారంగా

**according to rule** నియమానుసారం

**according to rules in vogue** అమలులో ఉన్న నియమాల ప్రకారం

**according to seniority** సీనియారిటీ ప్రకారం

**according to specification** నిర్దిష్ట పరచినట్లుగా/ నిర్దిష్టాంశం ప్రకారం

**according to speculation** ఊహాకల్పన ప్రకారం

**according to stipulation** నిబంధన ప్రకారంగా

**according to the form set out for the purpose** అందుకోసం నిర్ణయించిన నమూనా ప్రకారం

**according to the procedure prescribed for the purpose** అందునిమిత్తం నిర్ణయించిన విధానం ప్రకారం

**according to the terms of agreement** ఒప్పందం షరతులను బట్టి

**accord priority** ప్రాధాన్యమిచ్చు

**accord sanction** మంజూరు ఇచ్చు/చేయు

**account n. 1.** లెక్క, లెక్కింపు, గణన,

ఖాతా, పద్దు 2. జమా – ఖర్చు v. లెక్క చెప్పు, వివరించు
**accountability** జవాబుదారీ
**accountability methods** జవాబుదారీ పద్ధతులు
**accountable** 1. లెక్క చెప్పవలసిన 2. జవాబుదారీ అయ్యే
**accountable management** బాధ్యతగల నిర్వహణ/ యాజమాన్యం
**accountable officer** జవాబుదారీ అధికారి
**accountable or liable** లెక్క చెప్పవలసిన లేదా జవాబుదారీ అయిన
**accountable person** జవాబుదారీ వ్యక్తి
**accountable receipt** లెక్క చెప్పవలసిన జమ/ పద్దు
**accountant-general** మహా గణాంకాధికారి
**accountant member** అకౌంటెంట్ సభ్యుడు
**account book** లెక్క/ ఖాతా పుస్తకం, అకౌంటు పుస్తకం, పద్దు పుస్తకం, చిట్టా, ఆవర్జా
**account, brought to the** లెక్కలోకి తీసుకొన్న
**account code** ఖాతా నియమావళి
**account down to the time** సమయం వరకు ఖాతా
**account for** 1. జవాబుదారీ వహించు, కారణం చెప్పు 2. లెక్క పద్దులు చెప్పు 3.కారణమవు 4. సంజాయిషీ చెప్పు
**account form** లెక్క పద్దు నమూనా
**account for the proceeds** అమ్మకపు సొమ్ము లెక్క
**account head** పద్దు శీర్షిక, హెడ్ అకౌంట్
**accounting concepts** అకౌంటింగ్ భావనలు
**accounting entries** అకౌంటింగ్ పద్దులు
**accounting evidence** అకౌంటింగ్ సాక్ష్యం
**accounting for** లెక్క చెప్పటం
**accounting manual** అకౌంటింగ్ నియమ సంపుటి
**accounting period** అకౌంటింగ్ కాలం
**accounting policy** అకౌంటింగ్ విధానం
**accounting procedure** లెక్కల కార్య పద్ధతి / అమలు విధానం
**accounting system** అకౌంటింగ్ పద్ధతి
**accounting year** గణక సంవత్సరం, లెక్కల సంవత్సరం
**account is being maintained** ఖాతా రాయబడుతున్నది
**account is to be taken or vouched** లెక్క తీసుకోవాలి లేదా ధ్రువపరచాలి
**account of activities** కార్యకలాపాల వివరణ
**account of profits** లాభాల లెక్క
**account of receipts and balances** వసూళ్ళు, నిలవల ఖాతా
**account of the credits** జమల ఖాతా
**account of the winding up** పరిసమాపన లెక్కలు
**account opened** ప్రారంభించిన ఖాతా
**account payee** గ్రహీత ఖాతాకు జమ, అకౌంట్ పేయీ (credit to the payees account)
**account rendered** 1. లెక్క చెప్పడమైంది 2. లెక్క ఇవ్వడమైంది
**accounts** లెక్కలు, ఖాతాలు
**accounts and audit** అకౌంట్లు, ఆడిట్/ లెక్కల తనిఖీ
**accounts code** ఖాతాల నియమావళి/ అకౌంట్‌కోడ్
**account settled** పరిష్కారమైన ఖాతా
**accounts have been made up** లెక్కలు తయారయాయి
**accounts of the assessee have been made up-to-date** పన్ను చెల్లించే వ్యక్తి/ చెల్లింపుదారు లెక్కలు ఈనాటివరకు తయారయాయి
**accounts section** ఖాతాల విభాగం
**account shall also be taken of the deductions** తగ్గింపులను కూడా లెక్కలోకి

తీసుకోవాలి, తగ్గింపుల లెక్కలు కూడా తీసుకోవాలి

**account shall not be taken** లెక్కలోకి తీసుకోవడం జరగదు

**account sheet** లెక్కల పత్రం

**account should be taken** లెక్క / ఖాతా లోకి తీసుకోవాలి

**accounts payables** చెల్లించే పద్దులు

**accounts receivables** రావలసిన పద్దులు

**accounts, records and other documents** అకౌంట్లు, రికార్డులు, ఇతర దస్తావేజులు /పత్రాలు

**accounts suit** ఖాతాల దావా

**account, take into 1.** లెక్కలోకి తీసుకొను **2.** ఆలోచించు **3.** లెక్కపెట్టు

**accredit n.** జమ అయిన గుర్తింపు **(to acknowledge) v.** అధికారంతో పంపు

**accreditation** ప్రాతినిధ్యమిచ్చు, గుర్తించు

**accredited press correspondent** గుర్తింపు పొందిన పత్రికావిలేకరి

**accredited representative** గుర్తింపు పొందిన ప్రతినిధి

**accredited school** గుర్తింపు పొందిన పాఠశాల

**accrediting agency** గుర్తింపునిచ్చే ఏజన్సీ

**accretion 1.** పెంపు, వృద్ధి **2.**(హక్కు) కలగచెయ్యటం **3.** జమ

**accroach** తగిన అధికారం లేకుండానే అధికారాన్ని వినియోగించు

**accrual 1.** ప్రాప్తి **2.** పెరుగుదల

**accrual basis** పెరుగుదల ప్రాతిపదిక

**accrual increment** ప్రాప్తించిన వేతనవృద్ధి

**accrual of the income** ఆదాయం/ రాబడి పెరుగుదల

**accrue 1.** ప్రాప్తించు: ప్రతి వ్యక్తికి సహజంగా జరిగే అభివృద్ధి ద్వారాగాని అవకాశం ద్వారాగాని ప్రాప్తించేది **2.** (హక్కు) రూపొందు **3.** జమ అవు

**accrued** ప్రాప్తించిన, లభించిన, చేకూరిన

**accrued depreciation** ప్రాప్తించిన తరుగుదల

**accrued due** జమ అయిన బకాయి

**accrued holiday remuneration** జమ అయిన సెలవురోజు ప్రతిఫలం

**accrued income** ప్రాప్తించిన ఆదాయం

**accrued interest** ప్రాప్తించిన వడ్డీ

**accrued rights** ప్రాప్తించిన హక్కులు

**accrue or arise** పెరుగు లేదా కలుగు/ ఉద్భవించు

**accruing beneficial interest** పెరిగే లాభసాటి ప్రయోజనం

**accruing costs** ప్రాప్తించే ఖర్చులు (తీర్పు తరవాత)

**accruing dividend** ప్రాప్తించే లాభవాటా/ డివిడెండ్

**accruing due from a person** ఒక వ్యక్తి నుంచి రావలసిన / పెరుగుతున్న బకాయి

**accruing from -** నుంచి పుట్టిన / ప్రాప్తించిన/ సంభవించిన, జమఅయిన

**accruing from day to day** రోజు రోజుకూ పెరుగుతున్న

**accruing from the transfer** మార్పిడి/ బదిలీద్వారా పెరుగుతున్న

**accruing in cause of action** వ్యాజ్య కారణం ప్రాప్తించడం

**accruing of the cause of action** దావా/ వ్యాజ్య కారణం ప్రాప్తించడం

**accruing on the shares** వాటాల ద్వారా ప్రాప్తించే

**accruing profit** పెరుగుతున్న లాభం

**accumulate** కూడబెట్టు, కూడుకొను, పెంపుచెందు, పోగుచేయు, కూర్చు, జమచేయు, రాశిఅవు

**accumulated** కూడబెట్టిన, కూడిన, పోగైన

**accumulated income** పోగైన ఆదాయం

**accumulated profits** పోగైన లాభాలు

**accumulated surplus** పోగైన మిగులు

**accumulation** పోగు, పెంపు, వృద్ధి

**accumulation of capital** పెట్టుబడి రాశీకరణ

**accumulation of income** ఆదాయం/ రాబడి కూడటం/ జమ అవడం

**accumulative judgement** తరవాత అమలు జరిగే తీర్పు (మొదటి తీర్పు గడువు తీరిన తరవాత అమలులోకి వచ్చే తీర్పు: **it takes effect after the expiration of the first or its derivative word, gives the idea of consecutiveness)**

**accumulative legacy** అదనపు వీలు నామా హక్కు

**accuracy** యథార్థత, కచ్చితత్వం, రుజువర్తన (అంతరంగిక నివేదిక)

**accuracy of copy** నకలు యథార్థత

**accuracy of statement** ప్రకటన/ కథన యథార్థత

**accurate 1.** కచ్చితమైన **2.** సరి అయిన, యథార్థమైన

**accurate estimate** సరిఅయిన అంచనా

**accurately and fully** సరిగ్గానూ/ కచ్చితంగానూ పూర్తిగానూ

**accurately done** సరిగ్గా/ కచ్చితంగానూ చెయ్యడమైంది

**accurately obey** కచ్చితంగా పాటించు

**accurate reporter** సరి అయిన / యథాతథమైన రిపోర్టర్

**accusation** నిందారోపణ

**accused 1.** నిందితుడు **2.** ముద్దాయి **3.** నింద మోపిన, నేరం మోపిన

**accused officer** నిందిత అధికారి

**accused person** నిందిత వ్యక్తి

**accused of the same offence** అదే నేరానికి చెందిన నిందితుడు

**accused to continue as before** నిందితుడు పూర్వంలాగే కొనసాగుతాడు

**accused was bailed out** నిందితుడు జామీను మీద విడుదలయ్యాడు

**accuser** నింద మోపే వ్యక్తి/ ఫిర్యాది

**accustomed to act** చేయటానికి అలవాటు పడిన

**a certain reputation** ఒక ఖ్యాతి

**achieved status** సాధించిన అంతస్తు/ హోదా

**achievement** సాఫల్యం, సిద్ధి, సాధించిన కార్యం

**achievement of goals** లక్ష్య సాధన

**achievement of motive** ప్రయోజనం సాధించడం

**achievement orientation** పునశ్చరణ సాధన

**achievement tests** కార్యసాధన శోధనలు/ పరీక్షలు

**acid-test 1.** ఆమ్ల పరీక్ష **2.** సునిశిత పరీక్ష

**acknowledge 1.** రసీదు ఇచ్చు **2.** గుర్తించు **3.** అంగీకరించు

**acknowledge receipt** అందినట్లు రసీదు

**acknowledgment 1.** రసీదు, తిరుగు రసీదు, అంగీకారం, స్వీకృతి **2.** గుర్తింపు, ఒప్పుకోలు **3.** అందినట్లు రసీదు

**acknowledgment card 1.** రసీదు కార్డు **2.** గుర్తింపు కార్డు

**acknowledgment due** తిరుగు రసీదుతో

**acknowledgment in writing 1.** రాసిచ్చిన రసీదు **2.** లిఖితపూర్వకంగా ఒప్పుకోడం

**acknowledgment of a sum** ఒక మొత్తానికి రసీదు

**acknowledgment of debt** బాకీ ఒప్పుకోలు

**acknowledgment of liability** బాధ్యత ఒప్పుకోలు

**acknowledgment of source** ఆధారం గుర్తింపు ఒప్పుకోలు

**acknowledgment may be obtained** రసీదు పొందాలి

**acoustic presentation of the work** ఒక రచనను శ్రవ్య సాధనం ద్వారా అందించటం

**acquaint** పరిచయం చేయు (కలిగించు)

**acquaintance** పరిచయం, పరిచితుడు

**acquainted with the facts of the case** విషయ / కేసు వాస్తవాలతో పరిచితమైన

**acquiescence** నిరాక్షేపణ సమ్మతి, మౌనాంగీకారం: మౌనాంగీకారమిచ్చే పరిస్థితి: తనకున్న హక్కులు గుర్తించి కూడా వాటిని అమలుపరచక పోగొట్టుకోవటం

**acquiescence and waiver** మౌనాంగీకారమూ పరిత్యాగమూ: **act of intentionally relinquishing some known right, claim or privilege.** తనకున్నదని తెలిసిన హక్కును గాని, ప్రాప్తించే దాని విషయంలో గాని, విశేషాధికారాన్ని గాని బుద్ధిపూర్వకంగా వదులుకోవటం

**acquiescence by government and private owners** ప్రభుత్వ/ ప్రభుత్వేతర యజమానుల నిరాక్షేపణ సమ్మతి (మౌనాంగీకారం)

**acquire 1.** పొందు/ సంపాదించు, ఆర్జించు **2.** స్వాధీనపరచుకొను

**acquire citizenship** పౌరసత్వం పొందు

**acquired, accrued or incurred** ఆర్జించిన, జమఅయిన లేదా భరించిన

**acquired or requisitioned** పొందిన లేదా అభ్యర్థించిన

**acquired status** పొందిన అంతస్తు

**acquired surplus** పొందిన మిగులు

**acquired territories** ఆర్జించిన భూభాగాలు

**acquired variations** ఆర్జిత వ్యత్యాసాలు

**acquirement** సంపాదన, ఆర్జన

**acquirer** సంపాదనదారు, సంపాదనపరుడు, సంపాదించినవాడు, ఆర్జకుడు

**acquiring company** స్వాధీనపరచుకొనే కంపెనీ

**acquiring insurer** ఆర్జించే భీమాదారు

**acquisition 1.** సంపాదన, సేకరించు **2.** స్వాధీనం (అధికార సం॥)

**acquisition and termination of indian citizenship** భారతీయ పౌరసత్వం ఆర్జన, సమాప్తి

**acquisition by prescription** దీర్ఘానుభవ కారణంగా హక్కు సంపాదించడం (భూమి సం॥)

**acquisition of easement** అనుభోగ హక్కు ఆర్జన

**acquisition of fixed assets** స్థిరాస్తుల సంపాదన

**acquisition of land** భూస్వాధీనత/ ఆర్జన (అధికారంతో)

**acquisition of patent rights or copy rights** పేటెంటు హక్కులు లేదా కాపీరైట్ల సంపాదన

**acquisition of stowing** (సామాను మొ.) స్థలంలో అమర్చి పెట్టటానికి హక్కు సంపాదించటం

**acquit** పూర్తి విచారణపై విడుదలచేయు, విముక్తుని చేయు

**acquittal** విడుదల, విముక్తి, నిర్దోషిగా విడిచి పెట్టడం

**acquittal on merits** సాక్ష్యంపై నిర్దోషిగా విడుదల చెయ్యడం

**acquittance forms** బట్వాడా నమూనా పత్రాలు

**acquittance register / roll** బట్వాడా రిజిస్టరు / పట్టిక

**acquitted** విముక్తుడు, విముక్త: నిర్దోషిగా వదలి వెయ్యబడిన నిందితుడు

**acreable (per acre)** ఎకరం ఒక్కంటికి

**acreage 1.** ఎకరాల మొత్తం **2.** విస్తీర్ణం

**act 1.** చట్టం **2.** పని, కార్యం **3.** చర్య అమలు **v. 4.** వ్యవహరించు, పనిచేయు

**act as principal** ముఖ్యుడుగా వ్యవహరించు

**act as proxy** ప్రతినిధిగా వ్యవహరించు

**act at his discretion** వివేచనతో వ్యవహరించు

**act by notice in writing** రాతనోటీసు ద్వారా చర్య తీసుకొను

**act done under colour of office or duty** అధికారిగా తన పనిని సవ్యంగా నిర్వహించినట్లుగా నటించి చేసినపని

**act done under a statute** చట్టం కింద చెయ్యవలసిన పనిని చెయ్యడం

**acted from cowardice** పిరికితనంతో

చేసిన

**acted from negligence** ఉపేక్షవల్ల చేసిన

**acted illegally** చట్టవిరుద్ధంగా వ్యవహరించిన

**acted upon** తగిన చర్య తీసుకొన్న

**act fitted to deceive** మోసం చెయ్యటానికి తగినపని

**act in a representative character** ప్రతినిధి రూపంలో పనిచేయు

**act inconsistent with the purpose for which the land was let** భూమిని అద్దెకు ఇచ్చిన ప్రయోజనానికి భిన్నంగా వ్యవహరించే పని

**act in disobedience to (such) order** (అటువంటి) ఉత్తరువును ధిక్కరించే పని

**Act in force** అమలులో ఉన్న చట్టం

**acting** బదులుగా పనిచేసే, కార్యకారి, కారుబారు

**acting allowance** కార్యకారి బత్తెం, కారుబారు బత్తెం

**acting appointment** కార్యకారి/తాత్కాలిక నియామకం

**acting chairman** కార్యకారి/ తాత్కాలిక అధ్యక్షుడు

**acting in combination** కలిసికట్టుగా పని చెయ్యటం

**acting in concert** కలిసికట్టుగా పని చెయ్యటం

**acting incumbent** కార్యకారి ఉద్యోగి

**acting in execution** నిర్వహణలో పని చెయ్యటం

**acting in good faith** సద్భావపూర్వక వర్తన

**acting in his discretion** తన విచక్షణతో పని చెయ్యటం

**acting in legislative capacity** శాసన సంబంధ హోదాలో వ్యవహరించటం

**acting in official capacity** అధికార హోదాలో పనిచెయ్యటం

**acting in pursuance of his duties** తన విధుల ననుసరించి పనిచెయ్యటం

**acting in the ordinary course of business** మామూలుగా వ్యవహరించడం

**acting judge** కార్యకారి న్యాయాధికారి

**acting judicially** న్యాయసమ్మతంగా వ్యవహరించడం

**acting on behalf of** —తరఫున వ్యవహరించడం

**act in good fiath** సద్భావ పూర్వకంగా నడచు / వ్యవహరించు

**acting partner** నిర్వహణద్వారైన భాగస్థుడు

**acting president** కార్యకారి అధ్యక్షుడు

**acting promotion** కార్యకారి/ తాత్కాలిక పదోన్నతి

**acting within the scope of the authority** అధికారపరిధికి లోబడి చెయ్యటం

**act in his behalf** ఆయన తరఫున పనిచేయు

**act in law** న్యాయశాస్త్రానుసారంగా పని చేయు

**act in obedience** విధేయంగా పనిచేయు

**act in obedience to summons** సమనులకు విధేయంగా పనిచేయు/ వ్యవహరించు

**act in the execution of his office** తన పదవీ నిర్వహణలో వ్యవహరించు

**act in pais (as distinct from an act done in court which is a matter of record)** కోర్టు రికార్డుకు రాని వ్యవహారం

**action** 1. వ్యాజ్యం, దావా 2. క్రియ, చర్య, పని, వర్తన 3. కార్యం, కార్యకలాపం

**actionable** 1. చర్యకు తగిన, చర్య తీసుకోదగిన 2. దావా వేయదగిన

**actionable claim** 1. దావా వెయ్యడానికి వీలైన హక్కు 2. చర్యతీసుకోతగిన హక్కు

**actionable misrepresentation** చర్య తీసుకోదగిన తప్పుడు నివేదన/ కథనం

**actionable wrong** చర్య తీసుకోదగిన దోషం

**action and reaction** క్రియ, ప్రతిక్రియ/ చర్య, ప్రతిచర్య

**action as at 'A' above** పైన 'ఏ' వద్ద సూచించిన చర్య

**action at once please** వెంటనే చర్య తీసుకోండి
**action by an enemy** శత్రువు చేసిన పని/ చర్య
**action, civil** సివిల్ చర్య
**action contemplated 1.** ఉద్దేశించిన చర్య **2.** చర్య ఉద్దేశించడమైంది
**action, criminal** క్రిమినల్ చర్య
**action for account** లెక్క తేల్చటానికి దావా
**action for control** అదుపు చర్య
**action for debt** అప్పుదావా
**action may be taken as proposed** ప్రతిపాదించిన ప్రకారం చర్య తీసుకోవచ్చు
**action, mixed** మిశ్రమచర్య
**action of conversion** పరివర్తన దావా : ఇతరుల వస్తువులు సొంతం చేసుకొన్నందుకు దావా
**action oriented** క్రియోన్ముఖ, క్రియా ప్రధాన, క్రియా ప్రాముఖ్యంగల, కార్యసాధక
**action oriented administration** క్రియోన్ముఖ పాలన
**action, penal** దండనాత్మక చర్య
**action planning system** క్రియాత్మక ప్రణాళికీకరణ వ్యవస్థ: క్రియ ముఖ్యంగా గల ప్రణాళిక తయారుచేసేపద్ధతి
**action proposed to be taken** తీసుకోదలచిన చర్యను ప్రతిపాదించడమైంది
**action research** క్రియ ప్రాముఖ్యం గల పరిశోధన, క్రియాప్రధాన పరిశోధన
**action, subject of** చర్య మూలవిషయం
**action taken is valid** తీసుకొన్న చర్య చెల్లుతుంది
**action taken thereon** అందుపై తీసుకొన్న చర్య
**action theory** క్రియ ప్రాముఖ్యం గల సిద్ధాంతం, క్రియాప్రధాన సిద్ధాంతం
**action upon the case** దావాపై చర్య
**actio personalis moritur cum persona** వ్యక్తిగతమైన హక్కు/ చర్య ఆ వ్యక్తితో నశిస్తుంది (ఆ వ్యక్తి చనిపోగానే అంతమవుతుంది)
**activate** క్రియాత్మకం చేయు, చైతన్యవంతం చేయు
**active 1.** అమలు, ప్రత్యక్ష **2.** చురుకుగా పనిచేసే **3.** అనుకూల, విశేష **4.** క్రియాత్మక, క్రియాశీల
**active bonds 1.** అమలు ఒప్పందాలు **2.** వడ్డీ లభించే బాండ్లు
**active circulation** తీవ్ర/ అధిక/ విశేషమైన చెలామణి
**active concealment** బుద్ధిపూర్వకంగా దాచి పెట్టటం/ గుప్తంగా ఉంచటం
**active concealment of a fact** వాస్తవాన్ని బుద్ధిపూర్వకంగా దాచటం
**active consideration** విశేష పరిశీలన, చురుకైన పరిశీలన, తీవ్ర పరిశీలన
**active debt** వడ్డీ బాధ్యతగల అప్పు
**active demand** తీవ్ర/ విశేష గిరాకీ
**active duty** క్రియాశీల విధి
**active list** అమలులో ఉన్న జాబితా
**active market** చురుకైన మార్కెటు
**active officer** క్రియాశీల అధికారి
**active operation** చురుకుగా పని చెయ్యటం
**active participation** ప్రత్యక్షంగా పాల్గొనటం, క్రియాత్మక భాగస్వామ్యం
**active partner** పనిచేసే భాగస్థుడు
**active politics** ప్రత్యక్ష రాజకీయాలు, క్రియాశీల రాజకీయాలు
**active population** క్రియాశీల జనాభా
**active resistance** చురుకైన ప్రతిఘటన
**active role** ప్రత్యక్ష పాత్ర, చురుకైన పాత్ర
**active service 1.** యుద్ధసేవ **2.** క్రియాత్మక సేవాకార్యం
**active service ordinance** చురుకైన సేవకు ఆదేశం (యుద్ధ సం॥)
**active social recognition** ప్రత్యక్ష/ క్రియాశీల సాంఘిక పరిగణన
**active trust** అమలులో ఉన్న ధర్మనిధి
**activities for the extension of knowledge** విజ్ఞాన విస్తరణ/ వ్యాప్తి కార్య

కలాపాలు
**activities of the company** కంపెనీ కార్యకలాపాలు
**activity 1.** కార్యకలాపం, వ్యాసంగం **2.** క్రియ, క్రియాశీలత, పని, వ్యాపకం
**activity sampling** కార్యకలాప నమూనా ఎంపిక
**activize** క్రియానుకూలం చేయు, చురుకు పరచు
**act judicially** న్యాయానుసారంగా వ్యవహరించు
**act of addressing** సంబోధన
**act of approving** ఆమోదించటం
**act of a routine nature** నిత్య పరిపాటి చర్య
**act of bad faith** దురుద్దేశంతో చేసిన పని
**Act of dominion legislature** అధినివేశ విధానమండలి/ శాసన మండలి చట్టం
**act of evading** ఎగవెయ్యటం/ ఎగవేత
**act of forwarding** ముందుకు పంపటం/ సాగటం
**act of gallantry** సాహసకార్యం
**act of government** ప్రభుత్వచర్య
**act of grace** దయాధర్మం, క్షమాదానం
**act of honour** గౌరవపత్రం **(an instrument):** గౌరవార్థమై చేసే అంగీకారం గురించి నోటరీ పబ్లిక్ ప్రకటించే పత్రం
**act of hostility** విరోధచర్య: యుద్ధ కారణంగా ఎంచదగిన చర్య
**act of indecency** అమర్యాద, అసభ్యత
**act of indemnity** విమోచన చర్య: నష్టాన్ని, శిక్షను తప్పించే చర్య
**act of indiscretion** వివేచనలేని వర్తన
**act of inducing** ప్రేరేపణ చెయ్యడం
**act of insolvency** దివాలా (నిర్ధారణ) చర్య
**act of installation** స్థాపన, ప్రతిష్ఠాపన
**act of insubordination** అవిధేయ కార్యం / చర్య
**act of judge** న్యాయాధికారి చర్య
**act of justice** న్యాయకార్యం
**act of law** చట్ట సమ్మత చర్య, శాసన చర్య: శాసన అమలు ప్రభావం
**Act of legislature** విధానమండలి/ శాసన మండలి చట్టం
**act of omission** తప్పించటం: చెయ్య వలసిన కార్యాన్ని చెయ్యకపోవడం
**act of overlooking** ఉపేక్ష, ఉపేక్షాచర్య
**Act of Parliament** పార్లమెంట్ చట్టం
**act of parties** కక్షిదారుల వర్తన / చర్య
**act of providence / act of God** దైవ ఘటన, భగవత్కటాక్షం
**act of sabotage** అణచటం, వెన్నుపోటు
**Act of supremacy** సర్వాధిపత్యచట్టం
**act of trespass** అక్రమప్రవేశం / అతిక్రమణ చర్య
**act of uniformity** సమాన వర్తన
**act of vandalism** విధ్వంసకచర్య
**act of violence** హింసాత్మకచర్య
**act of war** యుద్ధచర్య
**act on behalf of** తరఫున పనిచేయు/ వ్యవహరించు
**act on business principles** వ్యాపార సూత్రాల ననుసరించి వ్యవహరించు
**actor 1.** కక్షిదారు **2.** వకీలు **3.** వాది **(plaintiff) 4.** సంరక్షకుడు **(guardian or tutor) 5.** నిర్వహణదారు **(manager) 6.** నటుడు **(stage player)**
**actor dominae 1.** సేద్యంపెత్తందారు **2.** సేరీదారు: తన యజమాని భూములపై పెత్తందారు **(manager of his master's farms or lands)**
**actor ecclesiae** చర్చి ధర్మకర్త **(manager of church property)**
**actori incumbit onus probandi** నిరూపణ బాధ్యత ఫిర్యాదిపై ఉంటుంది
**actor in rem suam** స్వయం వ్యవహర్త **(an agent in his own matter)**
**act or omission** చేయు లేదా వదలటం
**actor provinciarum** ప్రజాఋణాల వసూలుదారు **(collector or manager of public debt)**

**act prejudicial to law and order** శాంతిభద్రతలకు ప్రతికూలమైన చర్య
**Act, private** కొందరికే వర్తించే చట్టం
**Act, public** సార్వజనిక చట్టం
**acts and dealings** పనులూ వ్యవహారాలూ
**Acts and manuals** చట్టాలూ, నియమ సంపుటులు
**acts indicate the intention** చర్యలు ఉద్దేశాన్ని సూచిస్తాయి
**acts of commission and omission** చేసినవి, వదిలినవి
**acts of violence or cruelty** హింసాత్మక లేదా క్రూరచర్యలు
**Act, special** ప్రత్యేక చట్టం
**act to express dissent** భిన్నాభిప్రాయాన్ని తెలిపే చర్య
**act together** కలిసి పనిచేయు
**Act to have retrospective effect** వెనకటినుంచి అమలులోకి వచ్చే చట్టం
**act traitorously** దేశద్రోహానికి పాల్పడు
**act under a warrant of arrest** అరెస్టు వారంటు ప్రకారం పనిచేయు
**act under his warrant** అతని వారంటుకు లోబడి పనిచేయు
**act under the authority** అధికారం కింద పనిచేయు
**actual** వాస్తవిక, అసలు, నిజమైన, సాక్షాత్తు
**actual and probable expenditure** వాస్తవ, సంభావ్యఖర్చులు
**actual assets** వాస్తవంగా ఉన్న ఆస్తులు
**actual command** వాస్తవ అధికారం
**actual communications** 1. అసలైన రవాణా సాధనాలు 2. అసలైన పత్రాలు/ సందేశాలు
**actual conveyance** వాస్తవ అన్యాక్రాంత పత్రం/ దస్తావేజు
**actual costs and expenses** అసలు ఖరీదులు, ఖర్చులు
**actual damage or loss** అసలు నష్టం
**actual day-to-day operation** రోజువారీ వాస్తవ నిర్వహణ
**actual existing interest** వాస్తవంగా ఉన్న ఆసక్తి /ప్రయోజనం
**actual expenditure** వాస్తవవ్యయం/ అసలు ఖర్చు
**actuality** అసలు సంగతి
**actually allowed** వాస్తవంగా అనుమతించిన
**actually and voluntarily reside** వాస్తవంగానూ ఇష్టానుసారంగానూ నివసించు
**actually due and payable** వాస్తవంగా ఉన్న బాకీ, చెల్లించవలసిందీ
**actually employed** వాస్తవంగా నియమించిన
**actually issued** వాస్తవంగా జారీచేసిన
**actually present** వాస్తవంగా హాజరుగా ఉన్న
**actually received** వాస్తవంగా ముట్టిన
**actual monetary value** అసలు ద్రవ్య విలువ
**actual notice** ప్రత్యక్ష నోటీసు
**actual observation** వాస్తవిక పరిశీలన
**actual occupancy** వాస్తవ స్వాధీనం
**actual offender** నిజమైన/వాస్తవ అపరాధి
**actual partiality** నిజమైన/ వాస్తవ పక్షపాతం
**actual pecuniary damage** వాస్తవ ఆర్థిక నష్టం, వాస్తవ ధనహాని
**actual possession** అసలు కబ్జా, వాస్తవిక స్వాధీనం
**actual possession of the situation** పరిస్థితిని వాస్తవంగా స్వాధీనంలో ఉంచుకోటం
**actual produce** అసలు పంట/ ఉత్పత్తి
**actual proprietor of land** అసలు భూస్వామి / భూకామందు
**actuals** వాస్తవ గణాంకాలు, నిజమైన / అసలు అంకడాలు, వాస్తవ విలువలు/ గణాంకాలు
**actuals and targets** వాస్తవాలు, లక్ష్యాలు
**actual seizure** 1. ప్రత్యక్షంగా పట్టుకోవటం 2. వాస్తవ జప్తు

**actual service** వాస్తవ సర్వీసు
**actual total loss** అసలు మొత్తం నష్టం
**actual travelling expense** వాస్తవ ప్రయాణ ఖర్చులు/ వ్యయాలు
**actual users** అసలు వాడకందారులు
**actuarial calculation** జీవిత భీమా లెక్కింపు
**actuarial investigation** భీమా లెక్కల తనిఖీ
**actuarial liability** భీమా లెక్కల బాధ్యత
**actuarial report** భీమా లేఖరి నివేదిక
**actuarial valuation** భీమా లెక్కలు విలువ కట్టడం/ మూల్యాంకనం
**actuary** భీమా లేఖరి: భీమాలకు సంబంధించిన చావు పుట్టుకలు మొ॥ లెక్కలు రాసే వ్యక్తి
**actuate** ప్రేరేపించు
**actuated by conscientious motives** సదుద్దేశంతో/ సద్భావపూర్వకంగా ప్రేరేపించిన
**act under instruction** ఆదేశం/ సూచన ప్రకారం పనిచేయు
**act undutiful** కర్తవ్య విరుద్ధమైన పని
**actus curiae neminem gravabit** న్యాయస్థాన చర్యవల్ల ఎవరికీ నష్టం జరగదు
**actus non facit reum nisi mens sit rea** నేరబుద్ధితో చేస్తేనే గానీ ఏ చర్యయినా నేరం కిందికిరాదు
**actus reus** దోషయుక్తమైనపని, తప్పుడు చర్య
**act within the scope** పరిధికి లోబడి పనిచేయు
**acute 1.** తీవ్రమైన, క్లిష్టమైన **2.** సూక్ష్మగ్రాహ్య
**acute shortage** తీవ్రకొరత
**acute water problem** తీవ్రమైన నీటి ఎద్దడి
**ad alium diem (at another day)** మరొక రోజున
**adamant** మొండి
**adapt** అనుసరించు
**adaptation** అనుసరణ, అనుకూలానుసరణ
**adaptation order** అనుసరణాదేశం
**adaptation to the circumstances** పరిస్థితులకు అనుకూలంగా చేయడం
**ad arbitrium** యథేచ్ఛగా
**ad audiendum (to hear)** వినడానికి
**ad certum diem (at a certain day)** నిర్ణీతదినంనాడు
**added value tax** కలిపిన/ చేర్చిన విలువ మీద పన్ను, సమీకృత విలువపై పన్ను
**addendum** అనుబంధం **appendix**
**addicted to evil habit** దుర్వ్యసని
**addiction** వ్యసనం
**adding any other description or letters** ఏదైనా ఇతర వివరణ గాని అక్షరాలు గాని చేర్చటం
**adding machines** కూడిక/ జతపరిచే యంత్రాలు
**adding to the standing orders** స్థాయీ ఉత్తర్వులతో చేర్చటం
**addition** చేర్పు (చేరిన వస్తువు), అదనపు చేర్పు, కూడిక
**additional** అదనపు, అధిక
**additional agenda** అదనపు అజెండా
**additional allowance** అదనపు బత్తెం
**additional assessment** అదనపు నిర్ధారణ (పన్ను సం॥)
**additional capital** అదనపు మూలధనం
**additional charge 1.** అదనపు పదవీ బాధ్యత, **2.** అదనపు విధింపు
**additional collection** అదనపు వసూలు
**additional court fee** అదనపు కోర్టు రుసుం
**additional courts** అదనపు న్యాయస్థానాలు/ కోర్టులు
**additional dearness allowance** అదనపు కరువు బత్తెం
**additional dearness allowance deposit account** అదనపు కరువు బత్తెం డిపాజిట్ ఖాతా
**additional demands** అదనపు అభ్యర్థనలు
**additional evidence** అదనపు సాక్ష్యం

**additional expenditure** అదనపు ఖర్చు/ వ్యయం
**additional fee** అదనపు రుసుం
**additional fine** అదనపు జరిమానా
**additional freight** అదనపు రవాణా రుసుం (రేవు మొ॥)
**additional funds** అదనపు నిధులు
**additional grant** అదనపు గ్రాంటు/ మంజూరు
**additional hands** అదనపు పనివారు/ సహాయకులు
**additional issue** అదనపు వివాదాంశం
**additional legacy/ accumulative legacy** అదనపు విల్లు ఆస్తి: వీలునామా ద్వారా అదనంగా సంక్రమించిన ఆస్తి, అదనపు రిక్థం
**additional legal heads 1.** న్యాయబద్ధమైన అదనపు పద్దులు/ శీర్షికలు **2.** అదనపు న్యాయ శీర్షికలు
**additional measure** అదనపు చర్య
**additional or substituted security** అదనపు లేదా బదులు పూచీ
**additional profit** అదనపు లాభం
**additional provision 1.** అదనపు ఏర్పాటు **2.** అదనపు నిబంధింపు
**additional qualification** అదనపు అర్హత
**additional remarks** అదనపు షరాలు/ రిమార్కులు
**additional remuneration** అదనపు ప్రతిఫలం
**additional requirements should be indicated** అదనపు ఆవశ్యకాలు సూచించాలి
**additional skill and experience** అదనపు నేర్పూ అనుభవమూ
**additional statement of expenditure** అదనపు ఖర్చు వివరణ పట్టిక
**additional surcharge** అదనపు పై పన్ను / సర్‌ఛార్జి
**additional village munsiff** మజేదారు, అదనపు గ్రామ మునసబు
**additional written statement** అదనపు లిఖిత కథనం
**addition and alteration** చేర్పూ మార్పూ
**addition method 1.** అదనపు విధానం/ పద్ధతి **2.** కూడిక పద్ధతి
**address 1.** (ఉద్దేశించిన) ప్రసంగం **2.** చిరునామా **3.** సంబోధన
**address all concerned** సంబంధించిన వారికందరికీ రాయండి
**addressed to** ఫలానావారికి రాసి తెలిపింది
**addressee 1.** సంబోధితుడు **2.** చిరునామా దారు (one who is addressed) జాబు పొందే వ్యక్తి
**addresses and messages** చిరునామాలూ సందేశాలూ
**addressee's receipt** చిరునామాదారు రసీదు
**addresses corrected upto date** నేటి వరకు సరిపరిచిన చిరునామాలు
**address for service** అందజేయటానికి చిరునామా
**address of the Governor** గవర్నర్ ప్రసంగం
**address of welcome** స్వాగతపత్రం/ వచనం
**addressograph machine** చిరునామా లేఖన యంత్రం
**address presented to the President or Governor** రాష్ట్రపతికి గాని, గవర్నర్‌కు గాని సమర్పించిన వినతి పత్రం
**address the court** న్యాయస్థానానికి విన్నపం
**address the court generally on the whole case** మొత్తం కేసును గురించి న్యాయస్థానానికి సాధారణంగా విన్నవించటం
**address your remarks to the president** అధ్యక్షుని సంబోధించి ప్రసంగించండి
**adduce** నివేదించు, నిరూపించు
**adduced in disproof** కాదని నిరూపించటానికి చూపిన

**.dduce evidence** సాక్ష్యం నివేదించు/ప్రవేశ పెట్టు

**.demption** అనురిక్థం ఉపసంహరణ (నిర్దిష్ట వీలునామా ఆస్తుల సం॥)

**.demption of legacy** వీలునామా హక్కు ఉపసంహరణ (It cannot be effected by reason of the subject matter having been withdrawn from operation)

**adequacy of data** భోగట్టా సమృద్ధి

**adequate** సమృద్ధి/ చాలినంత/ తగినంత

**adequate accommodation** చాలినంత వసతి

**adequate compensation** చాలినంత నష్టపరిహారం/ ప్రతిఫలం

**adequate consideration** 1. చాలినంత పరిశీలన 2. చాలినంత ప్రతిఫలం

**adequate data** చాలినన్ని/ సముచిత వివరాలు, తగిన భోగట్టా

**adequate means** చాలినంత సాధన సామగ్రి

**adequate or comprehensive** చాలినంత లేదా సమగ్రమైన

**adequate proof** తగినంత రుజువు, చాలినంత రుజువు

**adequate protection** తగిన రక్షణ

**adequate provision** తగిన ఏర్పాటు/ పొందుబాటు / నిబంధింపు

**adequate reasons** చాలినన్ని /తగినన్ని కారణాలు

**adequate relief** చాలినంత సహాయం/ పరిహారం

**adequate remuneration** తగిన ప్రతిఫలం

**adequate security** తగిన పూచీ/ హామీ

**adequate step** తగిన చర్య

**adequate tools** తగిన సాధనాలు / పరికరాలు

**adequate wages** సముచిత వేతనాలు

**adherence** 1. అంటిపెట్టుకొని ఉండటం, నిష్ఠగా ఉండటం 2. అనుసరించటం

**adhere to a rule too rigidly** నియమానికి గట్టిగా అంటిపెట్టుకొని ఉండు

**adhere to earlier decision** పూర్వ నిర్ణయానికి కట్టుబడు

**adhesion** అంటుకోవటం

**adhesive court fee stamp** అంటించే కోర్టు రుసుం బిళ్ల

**adhesive or impressed stamp** అతికించే స్టాంపు/ మొహరుబిళ్ళ

**adhesive stamp** అంటించే బిళ్ల

**ad hoc** అడ్‌హాక్, తాత్కాలిక, తదర్థక

**ad hoc appointment** తాత్కాలిక నియామకం

**ad hoc authorities** తాత్కాలిక అధికారాలు; తాత్కాలిక అధికారులు

**ad hoc committee** తాత్కాలిక సంఘం

**ad hoc enquiry** తాత్కాలిక విచారణ

**ad hoc local body** తాత్కాలిక స్థానిక సంస్థ

**ad hoc offer** తాత్కాలిక ప్రతిపాదన

**ad hoc payment** తాత్కాలిక చెల్లింపు

**ad hoc sanction** తాత్కాలిక మంజూరు

**ad hominem** 1. ఒక వ్యక్తి ప్రవృత్తిని వివేకాన్ని కాక, పక్షపాతాలూ ఉద్రేకాలూ మొ॥ వాటిని ఆకర్షించడం 2. వ్యక్తి చేసిన వాదాన్ని కాక అతని శీలాన్ని దుయ్యబట్టడం

**ad infinitum** అంతులేని, అనంతం

**ad interim** మధ్యకాలంలో, ఈ లోగా

**ad interim injunction** మధ్యకాలీన నిషేధాజ్ఞ

**ad interim order** మధ్యకాలిక ఉత్తరువు

**adjacent** సమీప, అంటిఉన్న, పక్కనున్న అనుకొని ఉన్న, చేరి ఉన్న

**adjacent and adjoining** పక్కనే అనుకొని ఉన్న

**adjacent land** పక్క భూమి

**adjective law** కార్యసరళి శాసనం (procedural law) ప్రక్రియా సంబంధ శాసనం

**adjoining land** అనుకొని ఉన్న భూమి

**adjoining the platform** ప్లాట్‌ఫార్మ్‌ను అనుకొని ఉన్న

**adjourn** వాయిదావేయు, స్థగితం చేయు

**adjourned debate** వాయిదా వేసిన చర్చ, వాయిదా పడిన చర్చ

**ljourned hearing** వాయిదా పడిన విచారణ
**djourned meeting** వాయిదావడిన సమావేశం
**djourned sale** వాయిదా పడిన అమ్మకం
**djourned sine die** నిరవధికంగా వాయిదా పడిన
**djourned sitting** వాయిదా తర్వాతి సమావేశం **the next sitting after an adjournment**
**djournment 1.** వాయిదా **2.** విరామకాలం, విరామ పరిమితి **(time or interval for which a body adjourns)**
**djournment for want of quorum** కోరం లేకపోవడం వల్ల వాయిదావెయ్యటం, పూరకసంఖ్య లేకపోవటం వల్ల వాయిదా వెయ్యటం
**adjournment motion** వాయిదా తీర్మానం/ప్రతిపాదన
**adjournment of hearing** విచారణ వాయిదా (కోర్టు సం॥)
**adjournment of proceedings** ప్రొసీడింగులు వాయిదా వేయటం
**adjournment of the Assembly** విధాన సభ వాయిదా
**adjournment of the business** కార్య క్రమం వాయిదా
**adjournment of the House** సభ వాయిదా
**adjournment or stoppage of sale** అమ్మకం వాయిదా లేదా నిలుపుదల
**adjudge** న్యాయనిర్ణయం చేయు
**adjudged insolvent** దివాలాదారుగా తీర్పు పొందినవాడు
**adjudicate** న్యాయనిర్ణయం చేయు
**adjudicate insolvent** దివాలాదారుగా నిర్ణయం చేయు
**adjudication** న్యాయనిర్ణయం, తీర్పు
**adjudication as to stamp** స్టాంపు విషయమై న్యాయనిర్ణయం చెయ్యటం
**adjudication by a court of law** న్యాయస్థానం తీర్పు/ న్యాయనిర్ణయం
**adjudication by arbitral award** మధ్యవర్తి తీర్పు ద్వారా న్యాయనిర్ణయం
**adjudication machinery** న్యాయనిర్ణయ యంత్రాంగం
**adjudication of claims** అభ్యర్థనల న్యాయనిర్ణయం
**adjudication of insolvency** దివాలా దారుగా నిర్ణయించటం
**adjudication of penalties** జరిమానాల న్యాయనిర్ణయం
**adjudication of the respective rights** వారి వారి హక్కుల న్యాయనిర్ణయం
**adjudication order** న్యాయనిర్ణయ ఉత్తర్వు, తీర్పులోని ఉత్తర్వు : దివాలా కోర్టు ఒక ఋణగ్రస్తుని దివాలాకోరుగా ప్రకటించే ఆజ్ఞ
**adjudicator** న్యాయనిర్ణేత
**adjudicatory procedure** న్యాయనిర్ణయ పద్ధతి
**adjunct n.** అనుబంధ విషయం, సహాయకం
**adjunction** అనుబంధపరిచే చర్య (రెండు అంత కంటె ఎక్కువ)
**adjuration 1.** అభ్యర్థన **2.** ప్రమాణబద్ధం
**adjust** సర్దు, సర్దుబాటుచేయు
**adjust accounts** లెక్కలను సర్దుబాటు చేయు
**adjusted provisionally** తాత్కాలికంగా సర్దుబాటు అయిన
**adjusted total income** సర్దుబాటైన మొత్తం ఆదాయం
**adjusting operation** సర్దుబాటు పని
**adjusting section** సర్దుబాటుచేసే విభాగం
**adjusting the costs** ధరలను సర్దుబాటు చెయ్యటం
**adjustive capacity** సర్దుబాటు సమర్థత/ శక్తి
**adjustment** సర్దుబాటు
**adjustment account** సర్దుబాటు ఖాతా/ లెక్క
**adjustment against** (మరొకదానికి) ప్రతిగా సర్దుబాటు

**adjustment by transfer** బదిలీద్వారా సర్దుబాటు
**adjustment of decree** డిక్రీ సర్దుబాటు అవడం
**adjustment of rights** హక్కుల సర్దుబాటు
**adjustment of suits** దావాల సర్దుబాటు
**ad legation** రాయబార వర్గంతో పంపటం (to send away with a commission)
**ad libitum** స్వేచ్ఛగా, ఇష్టపర్యంతం
**ad litem** వాదం/ దావా నిమిత్తం
**admeasure** పాలు పంచు, కొలతకు వచ్చు
**admeasurement** భాగ నిర్ణయం (to determine the proper share, e.g., of dower)
**adminicle** సహాయక (బలపరిచే) సాక్ష్యం (adminicular, auxiliary, corroborative evidence)
**adminicular** సహాయకం auxiliary, corroborative
**adminicular evidence** బలపరిచే సాక్ష్యం, పూరక సాక్ష్యం (explanatory or completing testimony)
**administer** 1. పాలించు, నిర్వహించు, అమలుజరుపు 2. వ్యవహరించు, వ్యవస్థీకరించు (with respect to property) 3. ప్రమాణం చేయించు 4. ఇచ్చు, పెట్టు (మందు, విషం సం॥) 5. న్యాయపాలన చేయు
**administered in a summary manner** సంక్షిప్త రూపంలో శాసించిన
**administered price** ముందు నిర్ణయించిన ధర
**administering authority** పాలన అధికారి/ అధికారం
**administering the property** ఆస్తిని నిర్వహించటం
**administer justice** న్యాయపాలన నిర్వహించు
**administer justice according to law** చట్టం ప్రకారం న్యాయపాలన చేయు
**administer oath or affirmation** ప్రమాణం లేదా ప్రతిజ్ఞ చేయించు
**administer property** ఆస్తిని నిర్వహించు
**administer to any party interrogatories** ఏ కక్షిదారునైనా ప్రశ్నలు వేయు
**administer warning** హెచ్చరిక చేయు, హెచ్చరించు
**administration** 1. పాలన/ పరిపాలన 2. వ్యవహరణ, నిర్వహణ 3. ప్రభుత్వపాలన విభాగం 4. చనిపోయిన వ్యక్తి ఆస్తి నిర్వహణ
**administration action** వ్యవహరణ వ్యాజ్యం: మృతులైనవారి ఆస్తి పాలనకు సంబంధించిన దావా
**administration and control** నిర్వహణా నియంత్రణా
**administration bond** వ్యవహరణ బాండ్: మృతుల ఆస్తిపాలన వ్యవహారానికి సంబంధించిన పూచీపత్రం
**administration chart** పాలన వివరణ పటం/ పట్టిక
**administration, letters of** పరిపాలనాధికార పత్రాలు (మృతుని ఆస్తి సం॥)
**administration management** పాలన నిర్వహణ
**administration ministries** పాలన మంత్రిత్వ శాఖలు
**administration needs** పాలనావసరాలు
**administration of a union territory** కేంద్రపాలిత ప్రాంతపరిపాలన
**administration of civil and criminal justice** సివిల్, నేర సంబంధ న్యాయపాలన
**administration of justice** న్యాయపాలన
**administration of law** న్యాయపాలన
**administration of medical benefit** వైద్య సదుపాయ నిర్వహణ
**administration of property** ఆస్తి నిర్వహణ
**administration of the affairs** వ్యవహారాల నిర్వహణ
**administration of the estate** ఆస్తి/ ఎస్టేటు నిర్వహణ
**administration of trust** ధర్మనిధి

నిర్వహణ
**administration planning** పరిపాలన ప్రణాళికారచన
**administration policies** పరిపాలన విధానాలు
**administration post** పాలన విభాగ పదవి
**administration report** పాలన విభాగ నివేదిక
**administration services** పరిపాలన శాఖలు, పరిపాలన సేవా విధులు
**administration suit** వ్యవహారణ వ్యాజ్యం: మృతులైన వారి ఆస్తి పాలనకు దావా
**administration tribunal** పాలన వ్యవహారాల న్యాయ వ్యవస్థ
**administrative ability** పాలన సామర్థ్యం
**administrative action** పాలన స్థాయి చర్య
**administrative adhocracy** పాలన తాత్కాలికత
**administrative adjudication** పాలన స్థాయి పరిష్కారం/ న్యాయనిర్ణయం
**administrative advice** పాలన సంబంధ సలహా
**administrative affairs** పరిపాలన వ్యవహారాలు
**administrative agreement** పరిపాలన ఒప్పందం
**administrative alienation** పాలన పరాయీకరణ
**administrative and legal obstacles** పరిపాలన, న్యాయ సంబంధమైన ఆటంకాలు / అడ్డంకులు
**administrative apparatus** పరిపాలన సాధనాలు/ యంత్రాంగం
**administrative approval** పరిపాలక ఆమోదం
**administrative approval may be obtained** పాలన స్థాయి ఆమోదం పొందవచ్చు
**administrative awareness** పాలన స్పృహ
**administrative behaviour** పాలన ప్రవర్తన / తీరు
**administrative cadre** పరిపాలన కాడర్
**administrative capacity** పరిపాలక హోదా
**administrative certificate** పరిపాలన ధ్రువపత్రం
**administrative charge** పరిపాలన భారం/ బాధ్యత
**administrative charges** పరిపాలన ఖర్చులు/ వ్యయాలు
**administrative class** పరిపాలక వర్గం
**administrative committee** పరిపాలన సంఘం
**administrative control** పరిపాలన నిర్ణాయకం/ నియంత్రణ/ అదుపు
**administrative convenience** పరిపాలనా సౌలభ్యం/ సౌకర్యం
**administrative cost** పరిపాలన వ్యయం
**administrative court** వ్యవహారణ న్యాయస్థానం
**administrative decentralization** పరిపాలన వికేంద్రీకరణ
**administrative decision** పరిపాలక నిర్ణయం
**administrative department** పరిపాలన శాఖ
**administrative discretion** పరిపాలనాత్మక వివేచన
**administrative divisions** పరిపాలన విభాగాలు
**administrative effort** పరిపాలన కృషి
**administrative event** పరిపాలన సంబంధ సంఘటన
**administrative expenses** పరిపాలన ఖర్చులు/ వ్యయాలు
**administrative experience** పాలనానుభవం
**administrative finality** పరిపాలనాత్మక అంతిమత
**administrative functions** పరిపాలన

కార్యవిధులు
**administrative improvement** పరిపాలన అభివృద్ధి
**administrative integration** పరిపాలన సమైక్యం
**administrative integrity** పరిపాలన నిజాయితీ
**administrative lapse** పాలనలోపం
**administrative law** పరిపాలనాపరమైన శాసనం
**administratively subordinate** పరిపాలన పరంగా అధీనుడు/ కింది ఉద్యోగి
**administrative machinery** పాలన యంత్రాంగం
**administrative office** నిర్వహణ/ పరిపాలన కార్యాలయం
**administrative operation** పరిపాలన అమలు / క్రియ / పని
**administrative orders** పరిపాలక ఆదేశాలు / ఉత్తరువులు
**administrative organisation** పరిపాలన వ్యవస్థ
**administrative planning** పరిపాలన ప్రణాళికా రచన
**administrative policy** పరిపాలన విధానం
**administrative power** పరిపాలన అధికారం
**administrative process** పరిపాలన ప్రక్రియ
**administrative reforms** పరిపాలన సంస్కరణలు
**administrative regulations** పరిపాలన నిబంధనలు
**administrative relations** పాలనా సంబంధాలు
**administrative reorganisation** పరిపాలన పునర్వవస్థీకరణ
**administrative revenue** పరిపాలన రెవెన్యూ/ ఆదాయం
**administrative review** పరిపాలన సమీక్ష
**administrative rule** పరిపాలనానిబంధన
**administrative sanction** పరిపాలక స్థాయి మంజూరు/ సమ్మతి
**administrative set up** పరిపాలన వ్యవస్థ
**administrative skill** పరిపాలన నేర్పు/ నైపుణ్యం
**administrative staff** పరిపాలక సిబ్బంది
**administrative state** పాలక రాష్ట్రం/ రాజ్యం
**administrative surcharge** పరిపాలన అదనపు పన్ను (సర్చార్జి)
**administrative system** పాలన పద్ధతి
**administrative technique** పరిపాలన/ నిర్వహణ మెలకువ
**administrative transactions** పరిపాలన లావాదేవీలు
**administrative tribunal** పరిపాలన ట్రిబ్యునల్
**administrative union** పరిపాలన సంఘం
**administrative unit** నిర్వహణ / పరిపాలన విభాగం/ యూనిట్
**administrative unity** పరిపాలన ఐక్యత
**administrator 1.** పరిపాలకుడు, పాలకుడు, పాలనాధికారి, నిర్వహణదారు **2.** మృతుని ఆస్తిపై వ్యవహర్త
**admiralty 1.** నౌకాదళాధికారం **2.** నౌకాదళ కార్యాలయం
**admiralty action** నౌకాదళ చర్య
**admiralty court** నౌకాదళ న్యాయస్థానం
**admiralty jurisdiction** నౌకాదళ అధికార పరిధి
**admiralty law** నౌకాదళ శాసనం
**admiralty power** నౌకాదళాధికారం
**admissibility** అనుమతి యోగ్యత, అంగీకార యోగ్యత
**admissibility of allowance** భత్యానికి అనుమతి యోగ్యత
**admissibility of amendments** సవరణల అంగీకార యోగ్యత
**admissibility of a motion** ప్రతిపాదన/ తీర్మాన అంగీకార యోగ్యత

**admissibility of claim** క్లెయిమ్‌కు అనుమతి యోగ్యత
**admissibility of cut motions** కోత తీర్మానాల/ప్రతిపాదనల అంగీకారయోగ్యత
**admissibility of questions** ప్రశ్నల అంగీకార యోగ్యత/ అనుమతి యోగ్యత
**admissibility of resolution** తీర్మానం అంగాకారయోగ్యత/ అనుమతి యోగ్యత
**admissible estimate** అనుమతించదగిన అంచనా
**admissible evidence** అనుమతి యోగ్య సాక్ష్యం
**admissible in evidence** సాక్ష్యానికి తీసుకోతగిన
**admissible in proof** రుజువుకు తీసుకో తగిన
**admissible under rules** నియమాల ప్రకారం అనుమతించదగిన/ స్వీకరించ దగిన/ చేర్చుకోదగిన
**admission 1.** ప్రవేశం, చేర్చుకోవటం **2.** అనుమతి **3.** అంగీకరణ, ఒప్పుదల, ఒప్పుకోలు
**admission and rejection of proof** రుజువు అనుమతీ నిరాకరణ
**admission card** అనుమతికార్డు
**admission committee** ప్రవేశ సంఘం
**admission form** ప్రవేశ పత్రం
**admission of appeal** అపీలు అనుమతి
**admission of candidates** అభ్యర్థుల ప్రవేశం
**admission of claim** దావా అనుమతి, క్లెయిమ్ అనుమతి: హక్కుగా కోరిన దాని అంగీకరణ (ప్రతివాది దావాను ఒప్పు కోవడం)
**admission of execution** రాసి ఇచ్చినట్లు ఒప్పుకోవటం (దస్తావేజు సం॥)
**admission of fact** వాస్తవ విషయ అంగీకరణ
**admission of parties** కక్షిదారులను చేర్చుకోవటం/ అనుమతించటం
**admission of petition** అర్జీ తీసుకోవటం
**admission of plaint** దావాపత్రం తీసు కోవటం
**admission of students** విద్యార్థుల ప్రవేశం / విద్యార్థులను చేర్చుకోవడం
**admission pass** ప్రవేశ చీటీ
**admission requirements** ప్రవేశ అవసరాలు / అపేక్షితాలు
**admission slip** ప్రవేశ చీటీ, అనుమతిచీటీ
**admission standards** ప్రవేశ ప్రమాణాలు
**admission with permission** అనుమతి తో ప్రవేశం
**admit 1.** ప్రవేశమిచ్చు, అనుమతించు, ఒప్పుకొను, స్వీకరించు, చేర్చుకొను **2.** అంగీకరించు
**admit an appeal** అపీలు అనుమతించు
**admit an application** దరఖాస్తు తీసు కొను/ స్వీకరించు
**admit as a minor** మైనరుగా అనుమ తించు/ అంగీకరించు
**admit by pleadings** వాదంలో అంగీక రించు/ ఒప్పుకొను
**admit document** దస్తావేజు తీసుకొను/ స్వీకరించు
**admit one** ఒక్కరిని అనుమతించండి
**admit one's mistake** (తన) తప్పును ఒప్పుకొను
**admittance** ప్రవేశానుమతి
**admitted** అనుమతించిన/ ఆమోదించిన
**admitted claim 1.** అనుమతించిన అభ్య ర్థన/ క్లెయిం **2.** అనుమతించిన దావా
**admitted debt** ఒప్పుకొన్న అప్పు
**admitted in evidence** సాక్ష్యానికి తీసు కున్న, సాక్ష్యంగా అంగీకరించిన
**admitted the plaintiff's claim** వాది దావా (హక్కును)/ అభ్యర్థనను స్వీకరిం చటమయింది/ అనుమతించటమయింది
**admitted to evidence** సాక్ష్యానికి తీసు కొన్న / అనుమతించిన
**admitted to hearing** విచారణకు అనుమ తించిన
**admitted to probate** వీలునామా ధ్రువ

పత్రం స్వీకరించటమయింది/ అనుమతిం చటమయింది
**admitted to registration** రిజిస్ట్రేషన్ కోసం స్వీకరించటమయింది
**admit the execution** అమలు అనుమతించు
**admit the truth** నిజం/ సత్యాన్ని ఒప్పుకొను
**admitting or appointing members** సభ్యులను చేర్చుకోవటం లేదా నియమించటం
**admit to bail** జామీనుకు అనుమతించు
**admit to proof** రుజువు అనుమతించు
**admit to proof against the estate of the insolvent** దివాలాదారు ఆస్తి విషయంలో రుజువు అనుమతించు
**admit to the privileges of the university** విశ్వవిద్యాలయ విశేషాధికారాలు అనుమతించు
**admonish** మందలించు
**admonish and let off** మందలించి విడుచు
**admonition for negligence** నిర్లక్ష్యానికి/ అలక్ష్యానికి మందలింపు
**ad nauseam** విసుగు పుట్టేవరకు
**adolescence** కిశోరప్రాయం, కిశోరావస్థ
**adolescent** కిశోరి, కిశోరుడు; కిశోర ప్రాయుడు / ప్రాయురాలు
**adopt** దత్తు చేసుకొను
**adopted children** దత్తత సంతానం
**adopted citizen** దత్త పౌరుడు
**adopted minutes** స్వీకరించిన / ఆమోదించిన సమావేశ వివరాలు
**adopted son** దత్త పుత్రుడు
**adopted village** దత్తత గ్రామం
**adopter** దత్తు స్వీకర్త
**adoption 1.** దత్తు **2.** ఎంపిక **3.** అనుక్రమ దత్తత స్వీకారం **4.** అనుసరణ
**adoption deed** దత్తుపత్రం
**adoption document** దత్తు దస్తావేజు
**adoption, fabricated** బూటకపు దత్తు
**adoption of or succession to the title** హక్కు మూలం స్వీకరించటం లేదా వారసత్వం పొందటం
**adoption, revocation of** దత్తు ఉపసంహరణ
**adoptive family** దత్తత చేసుకొనే కుటుంబం
**adoptive father** దత్తు తండ్రి
**adoptive mother** దత్తు తల్లి
**adoptive trials** అనుసరణీయ ప్రయత్నాలు / విచారణలు
**adopt policy** పాలసీ స్వీకరించు
**a double decree cannot be regarded** డబుల్ డిక్రీని పాటించలేం
**ad promisor** సహ వాగ్దాతః **one who adds his own promise to the promise given by the principal debtor,** సహ పూచీదారు
**ad quantum** తూకం మీద
**a draft reminder is put up** జ్ఞాపిక ముసాయిదాను సమర్పించడమైంది
**ad referendum** ఇంకా పరామర్శించే నిమిత్తం
**ad rem** ప్రస్తుత విషయానికి సంబంధించి **to the point, to the purpose**
**adrogation** ఒక విధమైన దత్తు **(a form of adoption)**
**adult consumption unit** వయోజన వినియోగ యూనిట్/ ప్రమాణం
**adult crime** వయోజన నేరం
**adult education** వయోజన విద్య
**adulterant** కల్తీ చేసే వస్తువు
**adulterated drug** కల్తీ మందు
**adulterated food** కల్తీ ఆహారం
**adulteration** కల్తీ
**adulteration of food and drugs** ఆహారం, మందుల కల్తీ
**adulterer** వ్యభిచారి
**adulteress** వ్యభిచారిణి
**adulterine 1.** నకిలీ **2.** అక్రమ సంతానం
**adultery** వ్యభిచారం
**adult franchise** వయోజన వోటుహక్కు

**adult literacy centre** వయోజన విద్యా కేంద్రం
**adult male member of the family** కుటుంబ వయోజన సభ్యుడు
**adult member** వయోజన సభ్యుడు
**adult suffrage** వయోజన వోటు హక్కు
**adult women's school** వయోజన మహిళా పాఠశాల
**adult worker** వయోజన కార్మికుడు
**adumbration** స్థూలంగా సూచించటం
**ad valorem** విలువను బట్టి, మూల్యానుసారమైన, విలువమీద
**ad valorem duty** విలువను బట్టి సుంకం
**ad valorem scale** విలువను బట్టి సూచి
**advance n. 1.** బయానా, సంచకారం, ముందు డిపాజిట్టు (వ్యాపారంలో) **2.** అడ్వాన్స్, అగావు చెల్లింపు (జీతభత్యాలు మొ|| విషయంలో) **3.** అభ్యుదయం **v. 4.** బయానా మొ|| ఇచ్చు, పురోగమించు, అభివృద్ధి చెందు, ముందుగా ఇచ్చు
**advance against the security of goods** సరుకుల పూచీమీద అడ్వాన్సుగా డబ్బు ఇచ్చు
**advance and its recovery** బయానా/ అడ్వాన్స్, దాని వసూలు
**advance announcement** ముందుగా ప్రకటించటం, ముందు ప్రకటన
**advance arrangements are necessary** ముందు ఏర్పాట్లు అవసరం
**advance bearing interest** వడ్డీ పడే అడ్వాన్సు
**advance bill** ముందు/ అడ్వాన్సు బిల్లు
**advance copy** ముందు పంపే ప్రతి
**advanced by way of loan** అప్పుగా ఇచ్చిన(ది)
**advanced countries** అభివృద్ధి చెందిన దేశాలు
**advanced economy** ఉన్నత ఆర్థిక వ్యవస్థ
**advanced study and research** ఉన్నత అధ్యయనం, పరిశోధన
**advance paid paper** ముచ్చలికా
**advance training** ఉన్నత శిక్షణ
**advance from contingency fund** ఆగంతుక నిధినుంచి అడ్వాన్స్
**advance grants** ముందుగా ఇచ్చిన గ్రాంటు
**advance increment** ముందుగా ఇచ్చే వేతనవృద్ధి, అడ్వాన్సు ఇంక్రిమెంటు
**advance knowledge** ముందుగా తెలిసి ఉండటం
**advancement 1.** ఉన్నతి, పెరుగుదల/ అభివృద్ధి (చెందటం) పురోగమనం **2.** అగ్రతోదానం (ఆస్తి సం||)
**advancement of commerce** వాణిజ్యాభివృద్ధి
**advancement of learning** విద్యాభివృద్ధి
**advancement of public justice** ప్రజా న్యాయ అభివృద్ధి / పురోగమనం
**advancement of trial** విచారణ తేదీ ముందుకు జరపడం
**advance notice** ముందు నోటీసు
**advance of pay** అడ్వాన్సు వేతనం/ అగావు వేతనం
**advance of transfer** బదిలీ ప్రయాణ భత్యం సంచకారం/ ముందుగా ఇవ్వటం
**advance or loan** అడ్వాన్సు లేదా అప్పు
**advance pay** అడ్వాన్సు వేతనం
**advance payment** ముందు చెల్లింపు
**advance payment of tax** పన్ను ముందుగా చెల్లించడం
**advance premium** ముందుగా చెల్లించే ప్రీమియం, ముందుకిస్తు, అగావుకిస్తు
**advance quota** ముందుగా ఇచ్చే కోటా (అడ్వాన్సుగా)
**advance reservation** ముందు రిజర్వేషను, ముందుగా రిజర్వు చేసుకోవడం
**advances** అడ్వాన్సులు, బయానాలు
**advance sample** ముందు నమూనా/ మచ్చు
**advance schedule** అడ్వాన్సు అనుసూచి
**advances repayable** వాపసు ఇచ్చే బయానాలు, తిరిగి చెల్లించదగిన బయా

నాలు / అడ్వాన్సులు

**advances repayable objection book** తిరిగి చెల్లించవలసిన సంచకారం ఆక్షేపణల జాబితా

**advances to customers** ఖాతాదార్లకు అడ్వాన్సులు

**advance tax** అడ్వాన్సు పన్ను/ ముందుగా చెల్లించే పన్ను

**advancing of money** డబ్బును అడ్వాన్సుగా ఇవ్వడం, సంచకారం

**advantage** సానుకూలం, ప్రయోజనం, అనుకూలం, అలుసు, లాభం

**advantage gained by fiduciary** విశ్వాసం ద్వారా పొందిన లాభం

**advantages obtained** పొందిన ప్రయోజనాలు / లాభాలు

**adventurer** సాహసికుడు

**ad verbum** మాటకు మాట

**adversary claimant** ప్రతికూల దావాదారు

**adversary's advocate** ప్రత్యర్థి న్యాయవాది

**adverse** ప్రతికూలమైన, వ్యతిరేక, విరుద్ధ

**adverse circumstances** ప్రతికూల పరిస్థితులు

**adverse claimant** ప్రతికూల దావాదారు

**adverse comment** ప్రతికూల వ్యాఖ్య

**adverse criticism** ప్రతికూల విమర్శ

**adverse decision** ప్రతికూల తీర్పు/ నిర్ణయం

**adverse effect** ప్రతికూల ప్రభావం

**adverse enjoyment** వ్యతిరేక భుక్తం (కబ్జా సం||)

**adverse entry** విరుద్ధ నమోదు/ దాఖలా

**adverse findings** ప్రతికూల నిష్కర్షలు/ పరిశీలనలు/ నిర్ణయాలు

**adversely effected** ప్రతికూల ప్రభావానికి గురిఅయిన

**adversely effect the revenue** భూమిశిస్తుపై ప్రతికూల ప్రభావం చూపు

**adverse party** విరుద్ధపక్షం, ఎదురు పక్షకారులు

**adverse possession** ప్రతికూల స్వాధీనం, ప్రతికూల భుక్తం (అధీనం)

**adverse remark** ప్రతికూల రిమార్కు

**adverse report** ప్రతికూల నివేదిక/ రిపోర్టు

**adverse seasonal conditions** ప్రతికూల కాల పరిస్థితులు

**adverse title** ప్రతికూల హక్కుమూలం

**adverse to that of minor** మైనరుకు ప్రతికూలమైన

**adverse to the title** హక్కు మూలానికి ప్రతికూలమైన

**adverse witness** ప్రతికూలసాక్షి

**advertised for sale** అమ్మకానికి ప్రకటించిన

**advertised tender enquiry** ప్రకటిత టెండరు విచారణ

**advertisement** ప్రకటన

**advertisement copy** ప్రకటన ప్రతి

**advertisement of the assignment** అప్పగింత ప్రకటన/ ప్రత్యేక కేటాయింపు ప్రకటన

**advertising composition** ప్రకటన కూర్పు

**advertising media** ప్రకటన సాధనాలు/ మాధ్యాలు

**advertising value** ప్రకటన విలువ

**advice** 1. సలహా 2. సూచన

**advice note** సూచన పత్రం (నోట్)

**advice of court** కోర్టు సలహా

**advice of credit transfer** జమ బదలాయింపు పత్రం

**advice of debt transfer** అప్పు బదలాయింపు పత్రం

**advice of payment** చెల్లింపు సూచన

**advice on evidence** సాక్ష్యం గురించిన సలహా

**advisable** 1. సలహా ఇవ్వదగిన 2. హితమైన

**adviser/ advisor** సలహాదారు, హితవరి

**advise telegraphically** తంతి ద్వారా తెలపండి

**advise that the transfer proposed would not be in order** ప్రతిపాదించిన బదిలీ సక్రమంగా ఉండదని తెలపండి
**advise the action taken** తీసుకొన్న చర్యను తెలపండి
**advise the party that -** అని కక్షిదారుకు తెలపండి
**advisory and coordinating functions** సలహా, సమన్వయ విధులు
**advisory board / advisory council** సలహా మండలి
**advisory body / advisory committee** సలహా సంఘం
**advisory council of employment** ఉపాధికల్పన సలహా మండలి
**advisory jurisdiction** సలహా రూపక అధికారపరిధి
**advisory panel** సలహా సంఘం, సలహాదారుల జాబితా
**advisory service** సలహా సర్వీసు/ సేవ
**advocacy** వకాలతు, వాదం
**advocate** న్యాయవాది, వకీలు
**advocate entitled to practice** ప్రాక్టీసుకు అర్హుడైన న్యాయవాది
**advocate on record** నియమించిన న్యాయవాది, నమోదైన న్యాయవాది
**advocating the object** లక్ష్యానికి అనుకూలంగా వాదించటం, లక్ష్యాన్ని బలపరచటం
**aegis** రక్షణ, అభేద్యమైన రక్షణ
**aequitas/ equity** సమధర్మం/ న్యాయం
**aequitas factum habet quod fieri oportuit** చేయవలసిన పనిని చేసినట్లుగా న్యాయం భావిస్తుంది
**aequitas sequitur legem** సమధర్మం (equity) న్యాయాన్ని (law) అనుసరించి ఉంటుంది
**aequo animo** సమభావంతో
**aerated water** వాయుపూరిత జలం
**aerial 1.** ఏరియల్, వాయుగత (తంతి) **2.** వైమానిక
**aerial lines** తంతి మార్గాలు
**aerial navigation** విమాన యానం
**aerial rope way** ఆకాశ రజ్జుమార్గం
**aerial survey** వైమానిక సర్వే, అంతరిక్ష సర్వే
**aerodrome** విమానాశ్రయం
**aeronaut** వైమానికుడు, రోదసీ యాత్రికుడు
**aeronautical communication** వైమానిక రాకపోకలు
**aeronautical education** వైమానిక విద్య
**aesthetics** సౌందర్యశాస్త్రం
**affair 1.** వ్యవహారం, కార్యం **2.** పరిస్థితి **3.** విషయం
**affairs and business** వ్యవహారాలూ కార్యక్రమాలు
**affairs of customers** ఖాతాదారుల వ్యవహారాలు
**affairs of factory** ఫ్యాక్టరీ వ్యవహారాలు
**affairs of family** కుటుంబ వ్యవహారాలు
**affairs of management** నిర్వహణ/ యాజమాన్య వ్యవహారాలు
**affairs of state** దేశ/ రాష్ట్ర వ్యవహారాలు
**affairs of the company** కంపెనీ వ్యవహారాలు
**affairs of the firm** సంస్థ వ్యవహారాలు
**affairs of the union 1.** కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలు **2.** సంఘ వ్యవహారాలు
**affairs of the university** విశ్వవిద్యాలయ వ్యవహారాలు
**affairs of undertaking** అధీన (బద్ధ) సంస్థ వ్యవహారాలు
**affected 1.** గురిఅయిన **2.** పీడిత(ం)
**affected area 1.** పీడిత ప్రాంతం **2.** ప్రభావిత రంగం / క్షేత్రం
**affecting** గురిచేసే, హాని కలిగించే, ప్రభావితం చేసే
**affecting the human body** మానవ శరీరానికి హాని కలిగించే, మానవ శరీరంపై ప్రభావం చూపే
**affect injuriously** హాని కలిగించు, గాయాలకు గురి అవు

**affection** అనురాగం, అప్యాయత
**affection or ill will** రాగ ద్వేషాలు
**affect or alter** గురి చేసే లేదా మార్చే
**affect prejudicially** ప్రతికూలంగా పరిణమింపజేయు
**affect the merits** గుణాలను ప్రభావితం చేయు
**affective** గురి అయ్యే, ఉద్వేగం కలిగించే
**affiance** నిశ్చితార్థం, ప్రదానం (పెండ్లి సం॥) **(promise between man and woman upon agreement of marriage)**
**affiant** అఫిడవిట్‌దారు, ప్రమాణ ప్రకటనదారు **(one who makes an affidavit)** హలఫ్‌నామాదారు
**affidavit** ప్రమాణపత్రం / అఫిడవిట్ / హలఫ్‌నామా
**affidavit by several** అనేకులతో ప్రమాణ పత్రం
**affidavit of valuation** మూల్యాంకన ప్రమాణపత్రం/ అఫిడవిట్
**affidavit submitted by the employee is not in order** ఉద్యోగి సమర్పించిన ప్రమాణపత్రం (అఫిడవిట్) క్రమబద్ధంగా లేదు
**affiliated college** అనుబంధ కళాశాల
**affiliated organisation** అనుబంధ సంస్థ
**affiliated with -** తో అనుబంధమై ఉన్న
**affiliating university** అనుబంధం చేసుకొనే విశ్వవిద్యాలయం
**affiliation 1.** అనుబంధం **(of a college to the university) 2.**తండ్రి నిశ్చయం **(assignment of a child to its father)**
**affinal kin** వైవాహిక బంధువు
**affinity** సంబంధం, సామ్యం
**affinity kinship** వైవాహిక సంబంధం/ బంధుత్వం
**affirm 1.**ప్రమాణపూర్వకంగా వాగ్దానం చేయు **2.** ధ్రువపరచు, రూఢిపరచు
**affirmant** ధ్రువీకర్త
**affirmanti non neganti incumbit probatio** రుజువు భారం వాదిపై ఉంటుంది; ప్రతివాదికి రుజువు భారం లేదు
**affirmation** ప్రతిజ్ఞ, ప్రమాణం, ధ్రువీకరణ
**affirmation on oath** ప్రమాణపూర్వక ప్రతిజ్ఞ
**affirmative agreement** నిర్ధారక/ అనుకూల ఒప్పందం
**affirmative implies a negative** ధ్రువీకరణలో వ్యతిరేక భావం గర్భితమై ఉంది
**affirmative reply** నిర్ధారక/ ధ్రువీకారక ప్రత్యుత్తరం
**affirmative servitude** కర్తవ్యాత్మక అనుభోగ తాకట్టు / భారం: కర్తవ్యంతోను, అనుభవంతోను కూడుకొన్న తాకట్టు
**affirmative vote** అనుకూలవోటు, అవుననే వోటు, స్థిరపరచే వోటు
**affirm solemnly** సత్యనిష్ఠతో ప్రమాణం చేయు
**affirm the decision** నిర్ణయాన్ని ధ్రువపరచు
**affix 1.** కూర్చు, కలుపు, అంటించు **2.**పెట్టు, చేయు (సంతకం సం॥) **3.** వేయు (ముద్ర సం॥)
**affix a copy of the summons** సమనుల ప్రతి జోడించండి
**affix a seal** ముద్రవేయు, మొహరు వేయు
**affix initial** పొడి సంతకం చేయు
**affix one's signature** సంతకం పెట్టు
**affliction** బాధ
**affluence** సమృద్ధి, సంపత్తి
**affluent society** సంపన్న సమాజం
**afflux** ప్రవాహం
**afforce** బలపరచు (నిపుణులతో, **to strengthen a judicial body by adding specially qualified members)**
**afford assistance** సహాయం చేయు / ఇచ్చు

**affording entrance** ప్రవేశమిచ్చే
**affording grounds for relief** సహాయం చెయ్యడానికి ఆధారాలు చూపే
**afford opportunities/ facilities to** అవకాశాలు/ సౌకర్యాలు కలిగించు
**afforestation** అడవుల పెంపకం
**afforestment** అటవీకరణం
**affranchise** వోటు అధికారం ఇచ్చు
**affray** జగడం
**affreight** అద్దెకు తీసుకొను (నౌకను)
**affreightment** సరుకు తీసుకు వెళ్ళటానికి ఓడను అద్దెకు తీసుకోటం
**afloat** తేలియాడు
**afore-said terms** పైన చెప్పిన షరతులు
**afore-thought** పూర్వం ఆలోచించిన
**a fortiori** బలవత్తరమైన కారణం చేత
**afresh** మళ్ళీ కొత్తగా, సరికొత్తగా
**after acquired** తర్వాత సంపాదించిన
**after acquired property** తర్వాత సంపాదించిన ఆస్తి
**after adequate consideration** సమగ్రంగా పరిశీలించిన తర్వాత
**after-care** అనంతర / తరవాతి సంరక్షణ: తర్వాత తీసుకొనే జాగ్రత్త
**after careful consideration** జాగ్రత్తగా పరిశీలించిన మీదట
**after-care home** అనంతర / తర్వాతి సంరక్షణ గృహం, ఆఫ్టర్ కేర్ హోమ్
**after-care organization** అనంతర / తర్వాతి సంరక్షణ సంస్థ
**after-care programme** తర్వాతి సంరక్షణ కార్యక్రమం
**after considering the matters** విషయాలను పర్యాలోచించిన మీదట / పరిశీలించిన తర్వాత
**after consultation with** -తో సంప్రదించిన తర్వాత
**after crop** తరవాతి పంట, అదే సంవత్సరంలో వేసిన రెండో పంట
**after deducting costs** ఖర్చులు మినహాయించిన తరవాత
**after due deliberation** తగిన సమాలోచన చేసిన తరవాత
**after effect** తరవాతి పరిణామం/ ఫలితం
**after great persuation** ఎంతో నచ్చజెప్పిన తరవాత
**after making allowance** అవకాశం కల్పించిన తరవాత
**after perusal** పరిశీలన తర్వాత
**after presentment for sight** చూడటానికి సమర్పించిన తర్వాత (ప్రామిసరీ నోటు సం॥)
**after previous publication** పూర్వ ప్రచురణ తరవాత
**after production costs** ఉత్పత్తి తరవాతి ఖర్చులు
**after sales service** అమ్మకం తరవాతి సర్వీసు
**after the close of the investigation** దర్యాప్తు ముగిసిన తరవాత
**after taking into consideration of all aspects** అన్ని పక్షాలనూ/ అంశాలనూ పరిశీలించిన మీదట
**after the disability has ceased** అశక్తత తొలగిన తరవాత
**after the end of the question hour** ప్రశ్నల సమయం గడిచిన తరవాత
**after the expiry** ముగింపు/ సమాప్తి తరవాత
**again revive the same** దాన్నే అలాగే పునరుద్ధరించండి
**against 1.** ప్రతికూలం, విరుద్ధం, వ్యతిరేకం **2.** ఎదురుగా, ఎదిరి **3.** పై
**against his will** తన ఇష్టానికి వ్యతిరేకంగా
**against public interest** ప్రజాహితానికి విరుద్ధంగా
**against such defendant** అటువంటి ప్రతివాదికి విరుద్ధంగా
**against the name** పేరుకు ఎదురుగా
**against the rules** నియమాలకు విరుద్ధంగా
**age 1.** యుగం **2.** వయస్సు, ప్రాయం **3.** తరం, పురుషాంతరం

**age certificate** వయస్సు ధ్రువపత్రం
**aged male person** వయసు మీరిన పురుషుడు
**age for suffrage** వోటు చేసే వయస్సు
**age group** వయోవర్గం
**age limit** వయః పరిమితి
**agency** ప్రతినిధి సంస్థ, ఏజన్సీ, ముక్త్యారీ, సేవాసంస్థ
**agency area** మన్య ప్రాంతం, ఏజన్సీ ప్రాంతం
**agency by holding out** హోల్డింగ్ అవుట్ రీత్యా ఏర్పడిన ఏజన్సీ: యజమాని అనుమతించిన వ్యక్తి (ఏజంటు) చేసే వ్యవహారాల బాధ్యత యజమానిదేనని న్యాయశాస్త్రం భావిస్తుంది
**agency by ratification** అనుమోదించిన ఏజన్సీ
**agency by subsequent authority** తరవాతి అధికారంతో ఏర్పడిన ఏజన్సీ
**agency coupled with interest** ప్రయోజనంతో కూడుకొన్న ఏజన్సీ
**agency of necessity** అవసర ఏజన్సీ: ఆవశ్యకతవల్ల ఏర్పడిన ఏజన్సీ
**agency police** ఏజన్సీ పోలీస్
**agency system** ఏజన్సీ పద్ధతి
**agenda 1.** అజెండా **2.** చర్చనీయాంశాలు, కార్యక్రమాల పట్టిక
**agenda is sent herewith** అజెండా దీనితో పంపడమైంది
**agenda item** అజెండా అంశం, కార్యక్రమ అంశం
**agenda will follow** అజెండా తరవాత పంపుతున్నాం
**agent 1.** ఏజెంట్, ప్రతినిధి **2.** ఉపకరణం
**agent of the carrier** వాహకుడి ఏజెంటు
**agent to party** పార్టీ /పక్షకారుని ఏజెంటు
**age of consent** ఒప్పుదగిన వయస్సు (వివాహ సం॥)
**age of discretion** వివేచన వయస్సు
**age of majority** యుక్త వయస్సు, మెజారిటీ వయస్సు
**age of minority** అయుక్త వయస్సు, మైనారిటీ వయస్సు
**age of retirement** విరమణ వయస్సు
**age of superannuation** ఉద్యోగ విరమణ వయస్సు
**age relaxation** వయః పరిమితి సడలింపు
**agglomerate** సమీకరించు
**agglomerative forces** సమీకృత శక్తులు
**aggravate** పెంచు, తీవ్రతరం చేయు
**aggravate disease or infirmity** జబ్బును లేదా దుర్బలతను పెంచు
**aggravate the situation** పరిస్థితిని తీవ్రతరం చేయు
**aggravation** (పరిస్థితి) విషమించటం, తీవ్రం కావటం
**aggregate** వెరశి, మొత్తం, సమష్టి
**aggregate amount** మొత్తం డబ్బు
**aggregate attendance** మొత్తం హాజరు
**aggregate behaviour** సమష్టి ప్రవర్తన
**aggregate capacity** సమర్థత మొత్తం
**aggregate consumer expenditure** మొత్తం వినియోగ వ్యయం
**aggregate consumption** సమష్టి వినియోగం
**aggregate demand** మొత్తం డిమాండు
**aggregate income** మొత్తం రాబడి/ ఆదాయం
**aggregate marks** మొత్తం మార్కులు
**aggregate money** మొత్తం ద్రవ్యం/ డబ్బు
**aggregate number of attendance** హాజరు మొత్తం సంఖ్య
**aggregate pay** మొత్తం జీతం/ వేతనం
**aggregate punishment** మొత్తం శిక్ష
**aggregate subject-matter** మొత్తం విషయం
**aggregate value** మొత్తం/ సమష్టి విలువ
**aggregate variables** మొత్తం చలాంకాలు
**aggregate votes** మొత్తం వోట్లు
**aggregation** రాశి చేయటం, మొత్తం

చెయ్యటం
**aggregation of income** ఆదాయం మొత్తం లెక్కకట్టటం
**aggregation of property** ఆస్తి మొత్తం లెక్క కట్టటం
**aggression** దురాక్రమణ
**aggressive mob** దురాక్రమించే మూక, అల్లరిమూక
**aggressive policy** దురాక్రమించే విధానం
**aggressive tendency** దుడుకుతనం, దుడుకు ధోరణి, దురాక్రమణ ధోరణి
**aggressor** దురాక్రమణదారు
**aggressor state** దురాక్రమణ చేసిన దేశం/ రాజ్యం
**aggrieved** ఆర్త, వేదన పొందిన, బాధపడ్డ, నష్టపడిన
**aggrieved party** నష్టపడిన కక్షిదారు, బాధపడ్డ పక్షం
**aggrieved person** నష్టపడ్డ/ బాధపడ్డ వ్యక్తి
**agio** తరుగు, వట్టం
**agist** పుల్లరికి తీసుకొను
**agister** పుల్లరిదారు: పుల్లరికి తీసుకొన్నవాడు
**agitate the question** ప్రశ్నలేవనెత్తడం
**agitation** ఆందోళన
**agitational activities** ఉద్యమ కార్య కలాపాలు
**agitational approach** ఆందోళనకర పంథా
**agitator** ఆందోళనదారు
**agnate** తండ్రి బంధువు **(relation on the father's side)**
**agnation** తండ్రి తరఫు బంధుత్వం **(kinship by the father's side)**
**agonising death** యాతనతో మరణం
**agony** యాతన, దుఃఖం
**agrarian** భూసంబంధ, సేద్యసంబంధ
**agrarian law** భూసంబంధ శాసనం
**agrarian policy** భూవిధానం
**agrarian reforms** భూసంస్కరణలు
**agrarian system** భూవ్యవస్థ
**agree** ఏకీభవించు, ఒప్పుకొను, అంగీకరించు, సమ్మతించు
**agreeable personality** ఒప్పుదగిన వ్యక్తిత్వం
**agreeable proposal** ఒప్పుదగిన ప్రతిపాదన
**agreed 1.** ఖాయపడింది **2.** అంగీకరిస్తున్నాను
**agreed amount** ఒప్పుకొన్న మొత్తం
**agreed by the meeting** సమావేశం అంగీకరించిన
**agreed period** ఒప్పుదల అయిన కాలం
**agreed statement of facts** అంగీకరించిన వాస్తవాంశాల వివరణ
**agreement 1.** ఒప్పందం, ఒప్పందపత్రం కరారు, కరారునామా **2.** ఏకీభావం
**agreement area** ఒడంబడిక మేర / ప్రాంతం
**agreement bond** కరారునామా/ఒప్పంద పత్రం
**agreement by way of wager** పందెంపై ఒప్పందం
**agreement deed** కరారునామా/ ఒప్పంద పత్రం
**agreement for avoidance** తప్పించటానికి ఒప్పందం
**agreement form** కరారునామా / ఒప్పంద పత్రం నమూనా
**agreement in restraint of legal proceedings** న్యాయకార్య వ్యవహారాలు నిరోధించటానికి ఒప్పందం
**agreement in restraint of marriage** వివాహం నిలుపుదల ఒప్పందం
**agreement in restraint of trade** వ్యాపార నిరోధానికి ఒప్పందం
**agreement in writing** రాతపూర్వక ఒప్పందం
**agreement is entered** ఒప్పందం చేసుకోవటమైంది
**agreement of arbitration** మధ్యవర్తి ఒప్పందం / కరారు
**agreement of indemnity** నష్ట భర్తీ

ఒప్పందం : రెండు పార్టీలు నష్టపూచీలను గురించి రాసుకొన్న ఒప్పందపత్రం
**agreement period** ఒడంబడిక గడువు/ కాలపరిమితి
**agreements contingent on impossible events** అసంభవ సంఘటనలకు కట్టుబడిన ఒప్పందాలు
**agreements for future separation** ముందు ముందు విడిపోవటానికి ఒప్పందం
**agreement shall not be discharged** ఒప్పందం అమలు చెయ్యకూడదు
**agreement to lease** కౌలు ఒప్పందం
**agreement to live apart** (వేరు) వేరుగా నివసించటానికి ఒప్పందం
**agreement to sell** అమ్మకం ఒప్పందం: అమ్మటానికి చేసుకొన్న ఒప్పందం
**agreement void for uncertainty** అనిశ్చితంగా ఉండటంవల్ల చెల్లని ఒప్పందం
**agreement without consideration** ప్రతిఫలం లేని ఒప్పందం
**agricultural advances** వ్యవసాయ అడ్వాన్సులు / ఋణాలు
**agricultural bank** వ్యవసాయ బాంకు
**agricultural calendar** వ్యవసాయ కేలెండర్ / జంత్రి
**agricultural cattle** వ్యవసాయ పశువులు
**agricultural census** కమతాల / పంటల వివరాలు
**agricultural credit** వ్యవసాయ పరపతి
**agricultural credit activities** వ్యవసాయ పరపతి కార్యకలాపాలు
**agricultural credit department** వ్యవసాయ పరపతి విభాగం
**agricultural credit society** వ్యవసాయ పరపతి సంఘం
**agricultural economy** వ్యవసాయ ఆర్థిక వ్యవస్థ
**agricultural extension** వ్యవసాయ విస్తరణ
**agricultural farm** వ్యవసాయ క్షేత్రం
**agricultural finance** వ్యవసాయ ఆర్థిక విధానం / ధనసహాయం
**agricultural finance corporation** వ్యవసాయ ధనసహాయ సంస్థ
**agricultural forecasting** వ్యవసాయ పనులకు ముందు సూచన
**agricultural holding** వ్యవసాయ కమతం
**agricultural implements** వ్యవసాయ పనిముట్లు, సేద్యపు పనిముట్లు
**agricultural improvement** వ్యవసాయ అభివృద్ధి
**agricultural income** వ్యవసాయ ఆదాయం / రాబడి
**agricultural income-tax** వ్యవసాయ ఆదాయపు పన్ను
**agricultural indebtedness** వ్యవసాయ ఋణగ్రస్తత
**agricultural inputs** వ్యవసాయ ఉత్పాదకాలు
**agricultural labour** వ్యవసాయ కూలిపని
**agricultural labourer** వ్యవసాయ కూలీ
**agricultural land** సేద్యంభూమి : వ్యవసాయ యోగ్యభూమి, సాగుభూమి
**agricultural lease** వ్యవసాయ కౌలు
**agricultural machinery** వ్యవసాయ యంత్రాలు
**agricultural operation** వ్యవసాయ కార్యకలాపం
**agricultural policy** వ్యవసాయ విధానం
**agricultural price commission** వ్యవసాయ ధరల నిర్ణయ సంఘం
**agricultural price index** వ్యవసాయ ధరలసూచి
**agricultural produce / production** వ్యవసాయ పంట/ ఫలసాయం, వ్యవసాయోత్పత్తి
**agricultural purpose** వ్యవసాయ ప్రయోజనం
**agricultural refinance corporation** వ్యవసాయ పరోక్ష సహాయక సంస్థ
**agricultural rent** వ్యవసాయ కౌలు / మక్తా

**agricultural sector** వ్యవసాయ రంగం
**agricultural service** వ్యవసాయ సేవ, వ్యవసాయ శాఖ సర్వీసు
**agricultural society** వ్యవసాయ సొసైటీ / సంఘం
**agricultural statistics** వ్యవసాయ గణాంకాలు : వ్యవసాయ స్థితిగతి లెక్కలు
**agricultural technology** వ్యవసాయ సాంకేతికశాస్త్రం / సాంకేతికం
**agricultural village** వ్యవసాయ గ్రామం
**agricultural warehouse** వ్యవసాయ ఉత్పత్తుల గిడ్డంగి
**agricultural year** వ్యవసాయ సంవత్సరం, ఫసలీ సంవత్సరం
**agriculture and allied service** వ్యవసాయమూ అనుబంధసేవా
**agriculturist** వ్యవసాయదారు, రైతు, కర్షకుడు
**agriculturist debt relief bill** వ్యవసాయ దారుల ఋణవిముక్తి బిల్లు
**agro-climatic zone** వ్యవసాయ వాతావరణ మండలం
**agro-industries corporation** వ్యవసాయ పరిశ్రమల సంస్థ
**aid 1.** సహాయం **2.** పరికరం **v.** సహాయం చేయు
**aid and abet** సహాయపడు, దుష్ప్రేరణ చేయు
**aid and advice** సలహా సహాయాలు
**aid any title** ఏదైనా హక్కుకు సహాయపడు
**aided** సహాయాధార, సహాయం పొందిన
**aided institution** సహాయాధారిత సంస్థ
**aided school** సహాయాధార పాఠశాల
**aide memoire** స్మృతికి తోడ్పడే పత్రం/ గ్రంథం
**aid material** సహాయ వస్తువు
**aid of power** అధికార సహాయం
**aiding escape** పరారీకి సహాయం చెయ్యటం
**aim** లక్ష్యం, ఉద్దేశం, ధ్యేయం
**aimless** ధ్యేయంలేని, నిరుద్దేశ
**aims and objects** లక్ష్యాలూ ఉద్దేశాలూ
**air base** విమాన స్థావరం
**air carrier** విమానం
**air conditioned accommodation** ఎర్ కండిషన్ చేసిన వసతి
**air-conditioned room** వాతానుకూలనం/ ఎర్‌కండిషన్ చేసిన గది
**air consignment note** విమాన రవాణా నోటు / పత్రం
**air controller** వాయు నియంత్రణాధికారి
**air corporation** విమాన సంస్థ
**air cover** విమానాల తోడ్పాటు / సంరక్షణ
**aircraft** విమానం
**aircraft carrier** విమాన వాహక నౌక
**aircraft interception** విమాన నిరోధం
**aircraft warning** వైమానిక హెచ్చరిక
**aircrew** వైమానిక సిబ్బంది
**air defence** వైమానిక రక్షణ
**air defence reserve** విమాన రక్షణ రిజర్వు
**air force** వాయుసేన
**air force custody** వాయుసేన అధీనం
**air force discipline** వాయుసేన క్రమశిక్షణ
**air force operations** వాయుసేన కార్యకలాపాలు
**air force prison** వాయుసేన కారాగారం
**air force reward** వాయుసేన పారితోషికం/ బహుమానం
**air gun** విమాన తోపు / ఎయిర్ గన్
**air hostess** విమాన సత్కారిణి
**air intelligence** విమాన గూఢచారి వ్యవస్థ
**airlift** విమానం ద్వారా చేర్చు / తీసుకొని వెళ్ళు
**air line** వాయుమార్గం
**airliner** ప్రయాణీకుల విమానం
**air mail** విమాన టపా
**air mail advice** విమాన టపా సూచన
**air mail service** విమాన తపాలా సేవ / సర్వీసు
**airmen** వైమానికులు

**air navigation** విమానయానం
**air navigation service** విమానయాన సర్వీను
**air navigator** విమాన మార్గదర్శకుడు
**air passage 1.** విమాన మార్గం **2.** విమాన యాత్ర
**airport** విమానాశ్రయం
**air raid** విమాన దాడి
**air raid precautions** విమాన దాడికి సంబంధించిన ముందు జాగ్రత్తలు
**air raid shelter** విమానదాడి రక్షణాశ్రయం
**air reconnaissance** వైమానిక పరిశీలన
**air route** విమానమార్గం, వాయుమార్గం
**air service** విమాన సర్వీసు
**airship** విమానం
**air signal** విమాన సంకేతం
**air space 1.** గాలి ఆడేచోటు **2.** ఆకాశ మండలం
**airstrip** చిన్న విమానాశ్రయం: విమానాలు తాత్కాలికంగా దిగేచోటు
**air task force** ప్రత్యేక వైమానిక దళం
**air traffic** వైమానిక రవాణా, విమాన రాకపోకలు
**air transport** వైమానిక రవాణా
**air transport council** విమాన రవాణా మండలి
**air transport service** విమాన రవాణా సర్వీసు
**airway bill** విమాన రహదారి బిల్లు
**airways** వాయుమార్గాలు/ రహదార్లు
**air worthiness** వాయుప్రయాణ అర్హత
**alarm n. 1.** హెచ్చరిక ధ్వని **v. 2.** భయ కంపితమవు (సమయధ్వని)
**alarm chain** అలార్మ్ గొలుసు
**alarm signal** హెచ్చరిక సంకేతం
**alcoholic liquors** నిషాసారాలు, ఆల్కహాలు సారాలు
**alcoholism** మద్యపాన వ్యసనం
**alderman** పౌరముఖ్యుడు, ఆల్డర్‌మన్
**aleatory contract** జూదపు కరారు
**ale-house** సారాకొట్టు
**alertness** అప్రమత్తత
**alias** అనే, ఉరఫ్, ప్రతినామం **(another name)**
**alias writ** రెండో రిట్టు
**alibi** స్థలాంతర ఉనికి: నేరారోపణ చేసిన సమయానికి ఆ వ్యక్తి ఆ ప్రదేశంలో లేడని, మరో చోట ఉన్నాడని చెప్పటం
**alien** పరదేశి
**alienable** అన్యాక్రాంతం/ అన్యపరం చేయదగిన
**alienage** పరదేశీయత
**alienate the land** భూమిని అన్యాక్రాంతం చేయు
**alienation** అన్యాక్రాంతం: ఆస్తి హక్కు బదలాయింపు, తన ఆస్తినిగాని లేదా అందులో ఉన్న హక్కునుగాని మరొకరికి బదలాయించే చర్య
**alienation and attachment** అన్యాక్రాంతమూ జప్తూ
**alienation and partition** అన్యాక్రాంతమూ విభజనా (పంపిణీ)
**alienation is restricted** అన్యాక్రాంతం చేయటాన్ని పరిమితం చెయ్యడమైంది
**alienation office** అన్యాక్రాంత వ్యవహారాల కార్యాలయం
**alienation of land** భూమి అన్యాక్రాంతం చెయ్యటం
**alienation of property** ఆస్తిని అన్యాక్రాంతం చేయటం
**alien corporation** పరదేశ వ్యాపార సంస్థ
**alienee** అన్యాక్రాంత ఆస్తిని పొందిన వ్యక్తి
**alien enemy** పరాయిదేశ శత్రువు
**alien friend** పరదేశి మిత్రుడు
**alieni juris** పరతంత్ర, మరొకరి యాజమాన్యంలో **(under authority of another)**
**alienism** పరదేశీయత
**alienor** అన్యాక్రాంతం చేసే వ్యక్తి
**alieno solo** మరొకని భూమిమీద
**alien propaganda** అన్యదేశ ప్రచారం

శాసించినట్లుగా భావిస్తూ
as if the Act was in force ఈ చట్టం అమలులో ఉన్నట్లుగా
as in force for the time being ప్రస్తుతం అమలులో ఉన్నట్లు
as incidental to అనుషంగికంగా, (దాని) సంబంధంగా
as in force for the time being ప్రస్తుతం అమలులో ఉన్నట్లు
as is mentioned in అందులో చెప్పిన విధంగా
as is, where is (అది) ఫీట్లా ఎక్కడ ఉందో అట్లాగే
as it should be ఉండవలసిన విధంగా
as laid down నిబంధించినట్లు
as listed below కింది, జాబితా ప్రకారం
as may be agreed upon అంగీకరించే విధంగా
as may be considered expedient ఉపయుక్తమని భావించినట్లు
as may be deemed fit యుక్తమని భావించినట్లుగా
as may be fixed in this behalf ఇందుకోసం నిర్ణయించినట్లుగా
as may be just న్యాయమైన విధంగా
as may be mutually agreed upon పరస్పరం అంగీకరించే విధంగా
as may be necessary అవసరమైన విధంగా
as may be prescribed నిర్ణయించే విధంగా
as may be recognized గుర్తించే విధంగా
as my be specified నిర్దిష్టపరిచే విధంగా
as mentioned below కింద పేర్కొన్నట్లుగా
as modified మార్పు చేసిన విధంగా
as much expeditious as may be సాధ్యమైనంత శీఘ్రంగా
as nearly as circumstances admit పరిస్థితులు అనుకూలించినంత దగ్గరగా
as nearly as may be /as nearly as possible వీలైనంత దగ్గరగా
as next hereinafter mentioned ఇక మీదట పేర్కొనేటట్లుగా
as notified ప్రకటించినట్లుగా
as occasion requires సందర్భాన్నిబట్టి, అవసరమైన పరిస్థితిని బట్టి
as often as may be వీలైనంత తరచుగా
as ordered ఆదేశించినట్లుగా
as originally enacted ఆదిలో చట్టం చేసినట్లు
as otherwise expressly provided నిర్దిష్టంగా/ స్పష్టంగా పొందుపరిస్తేనే తప్ప
as part of the transaction వ్యవహారంలో భాగంగా
aspect దృక్పథం
aspect of a question ప్రశ్నదృక్పథం
aspect of legislation, doctrine of శాసన దృక్పథ సిద్ధాంతం
as per advice సలహా మేరకు
as per concluding para ముగింపు పేరా ప్రకారంగా
as per contra విరుద్ధంగా
as per conversation మాట్లాడిన మేరకు
as per details below కింది వివరాల ప్రకారం
as per instruction సూచన ప్రకారం
as per item in the schedule అనుసూచిలోని అంశం ప్రకారంగా
as per need అవసరం మేరకు
as per noting నివేదించినట్లుగా
as per opinion of అభిప్రాయానుసారంగా
as per orders on page — పుట ఉత్తర్వుల మేరకు
as per pahani అడంగల్/ పహాని ప్రకారం
as per regulations నిబంధనల ప్రకారం
as per standard distribution list ప్రామాణిక పంపిణీ జాబితా ప్రకారంగా
as per the article ఆర్టికల్ ప్రకారం
as per verbal orders మౌఖిక ఉత్తర్వుల మేరకు

**aspiration** అభిలాష, ఆశ
**as pointed out above** పైన సూచించినట్లుగా
**as precisely as possible** వీలయినంత కచ్చితంగా
**as presented to the legislature** శాసన మండలికి / సభకు సమర్పించిన విధంగా
**as proposed** ప్రతిపాదించిన ప్రకారం
**as provided by law** శాసనంలో పొందుపరచినట్లు
**as recommended** సిఫారసు చేసినట్లుగా
**as recorded** దాఖలా పరచినట్లు, రికార్డు చేసినట్లు
**as regards** సంబంధంలో, విషయంలో
**as regards his post** ఆయన పదవి గురించి
**as required under rules** నియమాల రీత్యా అవసరమైన మేరకు
**as respects the particular matter in question** ప్రసక్తిలో ఉన్న ప్రత్యేక అంశం విషయంలో
**as revised** సవరించినరీతిగా, పరిష్కరించిన రీతిగా
**assail** పై బడు, ప్రతిహతం చేయు
**assailant** దౌర్జన్యపరుడు, పైబడిన వ్యక్తి
**assassin** హంతకుడు
**assassination** హత్య
**assault n.** దౌర్జన్యం **v.** పైబడి కొట్టు, దౌర్జన్యం చేయు
**assayer** వస్తు పరీక్షకుడు (లోహాది)
**assaying** వస్తు పరీక్ష
**assay office** వస్తు పరీక్షా కార్యాలయం
**assay of weights and measures** తూనికల, కొలతల పరీక్ష (లోహాది)
**assemblage 1.** సమూహం, గుంపు **2.** జోడింపు
**assemble 1.** కూడు, కూర్చు **2.** జోడించు
**assemble together (both Houses)** కలిసి సమావేశమవు (రెండు సభలు)
**assembling** పోగుచేయటం, కూర్చటం, సమీకరించటం
**assembling of parts** విడిభాగాల జోడింపు
**assembling the court** కోర్టును సమావేశ పరచటం
**Assembly 1.** అసెంబ్లీ, విధానసభ, శాసనసభ ప్రతినిధిసభ **2.** సమావేశం **3.** జోడింపు
**Assembly chamber** విధాన/ శాసనసభా సదనం
**Assembly constituency** శాసన సభ నియోజక వర్గం
**Assembly hall** సభా భవనం/ సమావేశగది
**assembly of court** కోర్టు సమావేశం
**assembly of persons** వ్యక్తుల సమావేశం
**Assembly secretariat** విధాన/ శాసన సభా సచివాలయం
**Assembly sessions** విధాన/ శాసనసభా సమావేశాలు
**assembly, unlawful** చట్టవిరుద్ధ సమావేశం
**assent n.** సమ్మతి, అనుమతి, ఆమోదం, అంగీకారం, ఆమోద స్థిరీకరణ **v.** స్థిరపరచు
**assent to bills** బిల్లులకు స్థిరీకరణ/ అంగీకారం, చిత్తుచట్టాలకు స్థిరీకరణ/ అంగీకారం, చట్టాలకు ఆమోదం
**assert** నొక్కి చెప్పు
**assert positively** కచ్చితంగా చెప్పు
**asserted or denied** ఉన్నదో లేదో, ఉన్నదని గానీ లేదని గానీ చెప్పిన
**assertion of right** హక్కును రూఢిగా చెప్పటం / సమర్థించు కోవటం / ఉందని చెప్పు
**assess** మదింపు చేయు, నిర్ధారించు
**assessable** మదింపు చేయదగిన, నిర్ధారించదగిన
**assessed as a company** కంపెనీగా నిర్ధారించిన
**assessed income** నిర్ధారిత ఆదాయం
**assessed tax** నిర్ధారిత పన్ను
**assessed value** నిర్ధారిత విలువ
**assessee** పన్ను చెల్లించే వ్యక్తి
**assessee has once exercised the option** పన్ను చెల్లించే వ్యక్తి/చెల్లింపుదారు

ఇచ్చికాన్ని లేదా అభిమతాన్ని ఒకసారి వినియోగించుకొన్నాడు
**assessee in default** ఉపేక్షించిన పన్ను చెల్లింపుదారు
**assessing authority** మదింపు అధికారి / అధికారం
**assessing officer** మదింపు అధికారి. నిర్ధారణాధికారి
**assessment 1.** మదింపు, నిర్ధారణ **2.** ధారాబందీ : పన్ను విధించడానికి గాను ఆస్తి విలువ గాని ఆదాయపు విలువగాని అధికారికంగా వేసే అంచనా
**assessment by way of penalty** జరిమానా ద్వారా మదింపు చేయటం
**assessment levied contrary to the classification** వర్గీకరణకు విరుద్ధంగా వేసిన పన్ను
**assessment list** నిర్ధారిత పన్నుల పట్టిక
**assessment of compensation** నష్ట పరిహార నిర్ధారణ
**assessment of damage** నష్ట నిర్ధారణ
**assessment officer** నిర్ధారణ / మదింపు అధికారి
**assessment of land rent** భూమి కౌలు నిర్ధారణ
**assessment of loss** నష్ట నిర్ధారణ
**assessment of the instalment** వాయిదా/ కిస్తు నిర్ధారణ
**assessment of resources** వనరుల నిర్ధారణ
**assessment of revenue** పన్ను ఆదాయ / రెవెన్యూ నిర్ధారణ
**assessment of tax** పన్ను నిర్ధారణ
**assessment register** మదింపు పుస్తకం
**assessment order** నిర్ధారణ ఉత్తర్వు
**assessment year** నిర్ధారణ సంవత్సరం (పన్నులు, వగైరా విషయంలో)
**assessor 1.** నిర్ధారకుడు **2.** మదింపుదారు **3.** న్యాయనిర్ధారకుడు
**assess or reassess** మదింపు చేయు లేదా తిరిగి మదింపు చేయు, నిర్ధారణ చేయు లేదా పునర్నిర్ధారణ చేయు
**asset** ఆస్తి
**as set forth in first schedule** మొదటి అనుసూచిలో పేర్కొన్నట్లు
**assets, acquisition of** ఆస్తుల సంపాదన
**assets and liabilities** ఆస్తులు, అప్పులు
**assets, disproportionate** పొసగని/ లెక్కకు అందని ఆస్తులు
**assets, disproportionate to known sources of income** తెలిసిన రాబడి వనరులతో పొసగని ఆస్తులు
**assets surety** స్థిరాస్తి హామీ
**asseveration** ప్రమాణపూర్వక ప్రకటన
**as shown in diagram** రేఖా చిత్రంలో చూపినట్లు
**assignable by will** వీలునామా ద్వారా అప్పగించదగిన
**assigned** అప్పగించిన
**assignee** అప్పగింత పొందిన వ్యక్తి, అనుదేశితుడు, కార్యానుదేశితుడు, కార్య నియుక్తుడు
**assignee in insolvency** దివాలాదశలో అప్పగింత పొందిన వ్యక్తి
**assign good cause** మంచి కారణం చూపించు
**assigning authority** అనుదేశించే / అప్పగించే అధికారి / అధికారం
**assign interest** ప్రయోజనం కలిగించు / బదలాయించు / నియతం చేయు
**assign in writing** రాత మూలకంగా అప్పగించు
**assignment 1.** అప్పగింత, అనుదేశకార్యం, నియతకార్యం **2.** ప్రత్యేక కేటాయింపు
**assignment book** అప్పగింత పుస్తకం
**assignment card** అప్పగింత చీటీ / పత్రం
**assignment in writing** రాసి యిచ్చిన అప్పగింత
**assignment of contract** ఒప్పందం / కాంట్రాక్టు అప్పగింత
**assignment of copyright** గ్రంథహక్కు నియతం చెయ్యటం

**assignment of office** పదవి అప్పగింత
**assignment officer** అనుదేశాధికారి
**assignment of policy to G.P.F.** సాధారణ భవిష్యనిధికి పాలసీ నియత పరచు
**assignor** అప్పగించే వ్యక్తి, అనుదేశకుడు, కార్యానుదేశకుడు
**assignment sheet** అప్పగింత పత్రం
**assimilation 1.** ఇమడటం, ఆత్మీయీకరణం **2.** సమానీ కరణం
**assistance board** సహాయక మండలి / బోర్డు
**assistance in cash** నగదు రూపంలో సహాయం
**assistance in kind** వస్తు రూపంలో సహాయం
**assistance in traffic** రాకపోకలలో సహాయం
**assistance of counsel** సలహా వకీలు సహాయం
**assistant** సహాయకుడు
**assisted** సహాయం పొందిన
**assisted emigration scheme** సహాయం పొందిన వలస పథకం
**assisted return emigrant** సహాయం పొందిన వాపసు వలసదారు
**associate 1.** సహ, సహవాసి **2.** సహచరుడు
**associate advocate** సహన్యాయవాది
**associated** సహ, సహసంబంధ
**associated company** సహ కంపెనీ, సహ సంబంధ కంపెనీ
**associated evidence** సహసంబంధ సాక్ష్యం
**associated operation** సంయుక్త నిర్వహణ
**associated trade mark** సహసంబంధ వ్యాపార చిహ్నం
**associated with** కలిసి ఉన్న, సంబంధించిన
**associate member** సహసభ్యుడు
**association 1.** సమాజం, సంఘం, సంస్థ **2.** సంబంధం, సావాసం, సాహచర్యం
**association clause** సంబంధ క్లాజు
**association dangerous to the public peace** ప్రజాశాంతికి భంగం కల్గించే కలయిక
**association fee** సంఘ రుసుం
**association of employers** యజమానుల సంఘం
**association of persons** వ్యక్తుల సంఘం
**associative process** అనుబంధ కార్య సరళి, అనుబంధ ప్రక్రియ
**as soon as may be** వీలైనంత తొందరగా
**as soon as may be convenient** వీలైనంత శీఘ్రంగా
**as soon as possible** సాధ్యమైనంత త్వరగా
**as soon as practicable** సాధ్యమైనంత త్వరగా, ఆచరణ యోగ్యమైన తక్షణమే
**as specified in the instructions** ఇదివరలో జారీచేసిన సూచనల ప్రకారంగా
**as stipulated** నియతం చేసుకొన్నట్లు
**as stood on - (తేదీ)** నాటికి ఉన్నట్లుగా
**as such officers** అటువంటి అధికారులు
**assume 1.** గైకొను, తీసుకొను **2.** భావించు, కల్పించు
**assume charge** కార్యభారం వహించు, బాధ్యత గైకొను; ఛార్జి తీసుకొను, పనిలో ప్రవేశించు
**assumed liability** స్వీకరించిన బాధ్యత, కల్పిత బాధ్యత
**assumed to himself** తానే తీసుకొన్న
**assume office** పదవి చేపట్టు
**assumed character** ఆరోపించుకొన్న రూపం
**assumed pay** కల్పిత వేతనం
**assumpsit 1.** బాధ్యతాస్వీకారం **2.** స్వేచ్ఛా వాగ్దానం
**assumption 1.** ఊహ, భావన, కల్పన **2.** స్వీకరణ **3.** వహనం
**assumption of charge** పదవీ బాధ్యతల స్వీకరణ
**assumption of duty** విధికార్యకలాప స్వీకరణ
**assumption of office** పదవీ స్వీకరణ

**assumptions** ప్రమేయాలు
**assurance 1.** హామీ, హామీపత్రం **2.** భీమా **3.** ఆస్తిని అందజేసే ధ్రువపత్రం **4.** నమ్మకం, పూచీ, భరోసా
**assurance amount** భీమా మొత్తం / సొమ్ము
**assurance company** భీమా కంపెనీ
**assurance of property** ఆస్తి ధ్రువ పత్రం
**assurance on the life** జీవిత భీమా
**assurances** హామీ పత్రాలు
**assure 1.** హామీ ఇచ్చు, నమ్మించు **2.** భీమా చేయు
**as surmised** సందేహించినట్లుగా
**asterisk** నక్షత్రపు గుర్తు
**as the case may be** సందర్భానుసారంగా
**as the circumstances appear to him to require** పరిస్థితులను బట్టి ఆయనకు అవసరమని తోచినట్లు
**as the circumstances of the case may require** కేసు పరిస్థితులను బట్టి అవసరమైనట్లు
**as the matter stands** ప్రస్తుత స్థితిని బట్టి
**as to accounts** ఖాతాల విషయంలో
**as to afford reasonable probability** సహేతుకమైన సంభావ్యత కలిగించే విషయంలో
**as to compensation** నష్టపరిహారం విషయమై
**astronomical figures** అపరిమిత సంఖ్యలు, అనంత సంఖ్యలు, ఖగోళ సంఖ్యలు
**astronomical observatory** వేధశాల: ఖగోళశాస్త్ర పరిశోధనశాల
**a substitute may be appointed as an interim arrangement** మధ్య కాలిన ఏర్పాటుకు గాను మరొకరిని నియమించవచ్చు
**asylum** శరణాలయం, ఆశ్రయం
**asymmetrical** సౌష్ఠవరహిత(ం) / చదును గా లేని
**at a discount** వట్టంపైన, తగ్గింపుపైన
**at a higher rate** ఎక్కువ రేటుకు ధరకు
**at all events** అన్ని సందర్భాలలో
**at an earliest convenience** వీలైనం శీఘ్రంగా
**at an instant** ఆ క్షణంలో
**at any rate** ఏమైనప్పటికి, ఏమైనా
**at any stage** ఏ దశలో అయినా, ఏ స్థితి అయినా
**at a premium** ప్రీమియం పై
**at bar** న్యాయవాద వర్గంలో ఉండు
**at close quarters** దగ్గరగా / సమీపం
**at consigner's expense** రవాణాదార ఖర్చుపై
**at current commercial rates** ప్రస్తు మార్కెటు ధరల ప్రకారం
**at fair prices** సరసమైన ధరలకు
**at flag 'A'** జెండా గుర్తు 'ఎ' వద్ద
**at Govt. expenses** ప్రభుత్వ ఖర్చులపై
**at his discretion** అతని వివేచనపై
**at his option** అతని అభిమతం / ఇష్టంపై
**at his own cost** తన ఖర్చుమీద
**at his own risk** సొంత పూచీపై, సొం బాధ్యతపై
**at his peril** నష్టపోయే ప్రమాదంపై
**at his own request** అతని (సొంత అభ్యర్థనపై
**athlete** క్రీడాకారుడు
**athletics** క్రీడలు, వ్యాయామ క్రీడలు
**at intervals** అప్పుడప్పుడు, విరామకాలం
**at large** నిర్బంధంగా **without restrain**
**at last** ఆఖరికి, చివరి
**at least answer / reply** కనీసపు జవాబు
**at leisure** విశ్రాంతిగా / తీరికగా
**at liberty to withdraw** ఉపసంహరించుకునే స్వేచ్ఛపై
**at more frequent intervals** అం కన్న తరచు విరామాల్లో
**atmosphere** వాతావరణం

**atomic device** పరమాణు సాధనం
**atomic energy** అణుశక్తి, పరమాణుశక్తి
**atomic minerals division** పరమాణు ఖనిజ విభాగం
**atomic power plant** అణువిద్యుత్ కేంద్రం
**atomic warfare** అణుయుద్ధం
**atomic weapons** అణ్వస్త్రాలు, అణ్వాయుధాలు
**atom reactor** అణుశక్తి ఉత్పాదక కేంద్రం
**atonement 1.** ప్రాయశ్చిత్తం, పరిహారం **2.** పశ్చాత్తాపం
**at owner's risk** సొంతదారు నష్టపూచీపై
**at par** సమాన విలువపై, సమమూల్యంపై, సమానంగా
**at present** ఇప్పుడు, వర్తమాన కాలంలో
**at public expense** ప్రభుత్వ ఖర్చుపై
**at random** యాదృచ్ఛికంగా
**atrocity** అఘాయిత్యం, అత్యాచారం
**at shipper's risk** నౌకా వ్యాపారి నష్ట పూచీపై
**at sight** చూడగానే
**at source** వనరులను బట్టి, ఆధారంపై
**attach 1.** జతపరచు, తగిలించు, అనుబంధించు **2.** జప్తు చేయు
**attachable proportion** జప్తు చేయదగిన దామాషా / మోతాదు
**attachable proposition** జప్తు చేయదగిన ప్రతిపాదన
**attach by seizure** అధీనంలోకి తీసుకొని చేసే జప్తు
**attache** సహాధికారి
**attached** జప్తు చేయబడిన
**attached and subordinate office** అనుబంధ - అధీన కార్యాలయం
**attached decree** జప్తు చేసిన డిక్రీ
**attached estates** జప్తు చేసిన ఆస్తులు / ఎస్టేట్లు
**attached office** అనుబంధ కార్యాలయం
**attached officer 1.** అనుబంధ-అధికారి **2.** జప్తు అధికారి
**attached property** జప్తు అయిన ఆస్తి
**attched thereto** దానికి జతపరచిన
**attached to the court** న్యాయస్థానానికి చెంది ఉన్న
**attache of an embassy** రాయబారి కార్యాలయ ఉద్యోగి
**attach importance** ప్రాముఖ్యం ఇచ్చు
**attaching creditor** జప్తు చేయించే ఋణదాత
**attaching officer** జప్తు అధికారి
**attachment 1.** జప్తు **2.** అనుబంధం
**attachment and sale** జప్తూ అమ్మకమూ (వేలం)
**attachment before judgement** తీర్పుకు ముందు జప్తు
**attachment by actual seizure** వాస్తవంగా పట్టుకోవటం ద్వారా జప్తు
**attachment of immovable property** స్థిరాస్తి జప్తు
**attachment of pay** వేతనం జప్తు
**attachment of property** ఆస్తి జప్తు
**attachment of salary** జీతం జప్తు
**attachment order** జప్తు ఉత్తరువు
**attack n. 1.** దాడి **2.** ఆక్షేపణ **v. 1.** దాడి చేయు, పైబడు **2.** ఆక్షేపించు
**attainable** పొందదగిన
**attainder n.** కళంకం (మరణశిక్షవల్ల)
**attain majority** మేజరు అవు, యుక్త వయస్సుకు వచ్చు, **attain the age of majority**
**attainment** ప్రావీణ్యం, పొందినది, సాధించినది
**attainment of qualification** అర్హతలు సాధించటం
**attain the age of** వయస్సుకు చేరు
**attaint writ** కళంకితుడి రిట్టు
**attempt n.** యత్నం, సాధింపు **v.** యత్నించు
**attempted sale** యత్నించిన అమ్మకం
**attempting to wreck** ధ్వంసం చేయటానికి ప్రయత్నించటం

**attempt to commit a crime / offence** నేరం చెయ్యడానికి యత్నించు
**attempt to commit murder** హత్య చెయ్యడానికి యత్నించు
**attempt to commit suicide** ఆత్మ హత్యకు యత్నించు
**attempt to murder** హత్యాప్రయత్నం
**attempt to ravish** చెరపట్ట యత్నించు: బలాత్కారంగా ఎత్తుకొని పోవడానికి ప్రయత్నించు
**attendance** హాజరీ, హాజరు
**attendance area** హాజరుగా ఉన్న ప్రాంతం
**attendance bonus** హాజరు బోనస్: హాజరుకు ఇచ్చే ప్రోత్సాహక పారితోషికం
**attendance by the jurors** జ్యూరీ సభ్యుల హాజరు
**attendance calculation** హాజరీ లెక్క
**attendance money** హాజరు వేతనం: హాజరుకు ప్రోత్సాహకరంగా ఇచ్చే వేతనం
**attendance officer** హాజరు అధికారి
**attendance record system** హాజరు నమోదు పద్ధతి
**attendance register** హాజరు పట్టిక
**attendant** పరిచరుడు, అనుచరుడు, అటెండంట్
**attend diligently to duties** విధులను శ్రద్ధతో నిర్వహించు
**attended to forthwith** తక్షణచర్య తీసుకోవటమైనది
**attender** పరిచారకుడు, పరిచారిక, అటెండర్
**attending on a sick person** రోగికి పరిచర్య చేయటం
**attend in person** స్వయంగా హాజరవు
**attend on** ఉపచారం / పరిచర్య చేయు
**attend to duties, to** విధులకు హాజరవు
**at tentative proposal** తాత్కాలిక ప్రతిపాదనపై
**attention** సావధానం, గమనిక, శ్రద్ధ
**attention, draw** దృష్టికి తెచ్చు, దృష్టిని ఆకర్షించు
**attention is invited** గమనించగోరటమయింది
**attention, pay** శ్రద్ధ చూపు, దృష్టి పెట్టు
**attention, to invite** దృష్టిని ఆహ్వానించు
**attest** సాక్షిగా ధ్రువీకరించు, సాక్షి సంతకం చేయు
**attestation** సాక్షి సంతకం / ధ్రువీకరణ
**attestation certificate** సాక్షి సంతక ధ్రువపత్రం
**attestation clause** కక్షిదారులు పత్రం రాసుకొని చివర సంతకం చేసే భాగం
**attestation of a deed** దస్తావేజు సాక్షి సంతకం / ధ్రువీకరణ
**attested** సాక్షి సంతకం చేసిన / అయిన, ధ్రువపరచిన / ధ్రువీకరించిన
**attested copies** ధ్రువీకరించిన ప్రతులు
**attested copies of certificates** ధ్రువీకరించిన ధ్రువపత్రాల ప్రతులు
**attested document** సాక్షి సంతకం చేసిన దస్తావేజు
**attested true copy** ధ్రువీకరించిన నకలు ప్రతి / అసలుకు నకలు
**attesting officer** ధ్రువీకరించే అధికారి
**attesting witness** దస్కతు చేసిన సాక్షి, సంతకం చేసిన సాక్షి
**attestor** సాక్షిసంతకందారు / ధ్రువీకరణదారు
**attest with signatures** సంతకాలతో ధ్రువీకరించు
**at the appointed hour** నియమిత సమయంలో
**at the bar of public opinion** ప్రజా సమక్షంలో (విచారణ సం॥)
**at the close of the day** రోజు చివర: పనివేళ ముగింపు సమయంలో
**at the close of month** నెల ముగింపులో/ నెల చివర
**at the commencement of** ప్రారంభంలో
**at the discretion of** వివేచన పైన
**at the disposal of** (వారి) అధీనంలోఉంచు

**at the earliest opportunity** సాధ్యమైనంత త్వరలో

**at the election of the plaintiff** వాది ఇష్టానుసారం

**at the end of March** మార్చి నెల అంతం నాటికి

**at the expense of** (ఒకడికి) నష్టం / హాని కలిగేటట్లుగా

**at the hearing of the case** కేసు విచారణ సమయంలో

**at the helm of affairs** వ్యవహార నియంత్రణలో / నాయకత్వంలో

**at the instance of** ప్రేరణపై

**at the latest** ఆఖరి పక్షంలో / లోపుగా / చిట్ట చివరి గడువు (దాటకుండా)

**at the latest on the 30th** 30వ తేదీ దాటకుండా

**at the option** ఇష్టానుసారంగా, ఇష్టపూర్తిగా

**at the outset** ప్రారంభంలో

**at the pleasure of** చిత్తానుసారంగా

**at the request of** అభ్యర్థనపై

**at the suit of either party** ఉభయ కక్షిదారులలో ఎవరి దావాపై నైనా

**at the time of convicting** శిక్ష విధించేటప్పుడు

**at the time of passing the decree and order** ఉత్తరువూ డిక్రీ ఇచ్చేటప్పుడు

**at the trial** విచారణలో

**at times** కొన్ని సమయాల్లో

**attitude** వైఖరి

**attitude of neutrality** తటస్థ వైఖరి

**attitudes** వైఖరులు, భావాలు

**attorney** అటార్నీ / ముఖ్త్యారు / అధికార దత్తత: **1.** వ్యాపారంలోగాని, న్యాయ విషయంలో గాని ఒకరి తరఫున వ్యవహరించేందుకు చట్టసమ్మతంగా నియమించబడిన వ్యక్తి. **2.** న్యాయవాది, వకీలు.

**attorney and client** న్యాయవాది, కక్షిదారు

**attorney at fact / attorney in fact** ప్రైవేటు ముఖ్త్యారు **private attorney**

**attorney at law** వకీలు

**attorney's lien** ముఖ్త్యారు ధారణహక్కు, అటార్నీ లీన్

**attornment** కౌలుదారు కొత్త భూస్వామిని ఒప్పుకోవటం, **tenants acknowledgement of a new land-lord**

**attributable to** సంబంధించినదనదగిన

**attribute v.** ఆరోపించు

**attribution** ఆరోపణం

**at variance with** (దానికి) భిన్నంగా

**at your earliest convenience** మీకు వీలైనంత తొందరగా

**at your end also** మీ తరఫున కూడా

**at will** యథేచ్ఛగా, ఇష్టప్రకారం

**auction n.** వేలం, హర్రాజు **v.** వేలం వేయు

**auctioneer** వేలందారు

**auctioneering agent** వేలం ఏజెంటు / ప్రతినిధి

**auctioneering agreement** వేలం ఒప్పంద పత్రం

**auctioneer's commission** వేలం కమీషన్

**auction notice** వేలం నోటీసు

**auction on his account** ఆయన ఖాతాపై వేలం

**auction purchase** వేలం కొనుగోలు

**auction sale** వేలం అమ్మకం

**auction the produce** ఫలసాయం వేలం

**audi alteram partem** అవతలి పక్షం వారు చెప్పేది వినాలి, **hear the other side**

**audience** శ్రోతలు, ప్రేక్షకులు

**audience hall** సభా భవనం

**audio-visual education** దృశ్య శ్రవ్య విద్య / విద్యా విధానం

**audio-visual publicity** దృశ్య శ్రవ్య ప్రచారం

**audit** ఆడిట్, లెక్కల తనిఖీ

**audit and account** ఆడిటూ లెక్కా
**audit and inspection note** ఆడిటూ తనిఖీనోటూ
**audit balance sheet** ఆడిట్ జమా ఖర్చు పట్టిక
**audit bureau of circulation** సర్క్యులేషన్ ఆడిట్ బ్యూరో, సంచరణ ఆడిట్ బ్యూరో
**audit certificate** ఆడిట్ ధ్రువపత్రం
**audit chart** లెక్కల తనిఖీ పట్టిక
**audit code** లెక్కల తనిఖీ నిబంధనావళి
**audit commission** ఆడిట్ కమీషన్
**audit control** లెక్కల తనిఖీ నియంత్రణ / కంట్రోల్
**audited account** తనిఖీ చేసిన లెక్క
**audited statement** తనిఖీ చేసిన లెక్క పట్టిక
**audit fee** లెక్కల తనిఖీ రుసుం
**auditing** లెక్కల తనిఖీ
**audit instructions** లెక్కల తనిఖీ సూచనలు
**audit manual** లెక్కల తనిఖీ నియమ సంపుటి
**audit memorandum** లెక్కల తనిఖీ జ్ఞాపన పత్రం
**audit of accounts** లెక్కల / ఖాతాల ఆడిట్
**audit objection** లెక్కల తనిఖీ ఆక్షేపణ
**auditor** ఆడిటర్
**auditorium** ప్రేక్షకశాల
**auditor's certificate** ఆడిటర్ ధ్రువపత్రం
**auditory defect** వినికిడి లోపం
**audit procedure** లెక్కల తనిఖీ / ఆడిట్ విధానం
**audit programme** లెక్కల తనిఖీ / ఆడిట్ కార్యక్రమం
**audit report** లెక్కల తనిఖీ / ఆడిట్‌నివేదిక
**audit year** లెక్కల తనిఖీ / ఆడిట్ సంవత్సరం
**augmentation** అధికం, వర్ధనం
**augmentation of the product** ఉత్పత్తి వృద్ధి చేయటం
**augmentative** అధికం చేసే, వర్ధక, హెచ్చించే
**augmenter** వర్ధకుడు; హెచ్చు చేసేవాడు
**aural education** శ్రవణ / వినేవిద్య
**auspices 1.** పోషణ, ఆశ్రయం **2.** ఆధ్వర్యం
**auspices of, under the** ఆధ్వర్యంలో
**auspicious** శుభ, శుభకర
**auspicious commencement** శుభారంభం
**austere** మితవ్యయి, ఆడంబర శూన్యమైన
**austerity measures** మితవ్యయ చర్యలు
**authentic** అధికారిక, సాధికార / ప్రామాణిక
**authenticate 1.** అధికారమిచ్చు, అధి ప్రమాణితం చేయు **2.** ప్రమాణీకరించు
**authenticated copy** ప్రమాణీకరించిన / అధికారికమైన నకలు
**authentication of bills** బిల్లుల ప్రమాణీకరణం
**authentication of power of attorney** అధికార దత్తత / ముఖ్తార్‌నామా ప్రమాణీకరణం
**authentic extract** అధికారికంగా ఇచ్చిన సంగ్రహం
**authenticate records** రికార్డులు ప్రమాణీకరించు
**authenticated by the signature** సంతకం ద్వారా ప్రమాణీకరించిన
**authentication of bills** చిత్తు చట్టాల ప్రమాణీకరణం
**authenticity** ప్రామాణికత / అధికారికత
**authenticity of the orders** ఉత్తర్వుల ప్రామాణికత
**authentic translation** ప్రామాణికమైన అనువాదం
**authorised dealer** అధికారం పొందిన డీలరు / అమ్మకందారు

**authorised depository** అధికారం పొందిన డిపాజిటరీ
**authorised investments** అధికారం పొందిన పెట్టుబడులు
**authorised in writing** రాతపూర్వకంగా అధికారమిచ్చిన
**authorised medical practitioner** అధికృతవైద్యుడు, అధికారం పొందినవైద్యుడు
**authorised valuer** అధికారం పొందిన / అధికృత మదింపుదారు
**authoritarian** అధికారతత్వవాది. adj. అధికారతత్వ
**authoritarianism** అధికారతత్వం
**authoritarian leadership** అధికారయుత నాయకత్వం
**authoritarian system** అధికారతత్వ విధానం
**authorities quoted in the note** నోట్‌లో పేర్కొన్న ప్రమాణాలు
**authoritative** అధికారతత్వ పూర్వక
**authoritative book** ప్రామాణిక గ్రంథం
**authoritative text** అధికారిక పాఠం
**authority 1.** అధికారం **2.** అధికారి **3.** ప్రమాణం
**authority affording technical sanction to the estimates** అంచనాలకు సాంకేతిక మంజూరీ ఇచ్చే అధికారం / అధికారి
**authority, appellate** అపీలు అధికారి
**authority competent to make payment** చెల్లించటానికి సమర్థమైన అధికారం / అధికారి
**authority competent to sanction** మంజూరుకు సమర్థమైన అధికారం / అధికారి
**authority delegating such powers** అట్లాంటి అధికారాల దత్తం చేసే అధికారం
**authority in writing** లిఖిత పూర్వక అధికారం
**authority letter** అధికారపత్రం
**authority of speaker** సభాపతి అధికారం (విధాన సభ సం॥)
**authorization 1.** అధికారపత్రం **2.** అధికారం ఇవ్వటం
**authorize** అధికారమిచ్చు : ఒకరి తరఫున వ్యవహరించడానికి హక్కుగాని అధికారంగాని కలగజేయు
**authorized** అధికారం పొందిన, అధికృత
**authorized agent** అధికృత ఏజంటు, నిర్ణీత ఏజంటు, అధికారం పొందిన ఏజంటు
**authorized capital** అధికృత మూలధనం
**authorized dealer** అధికృత / నిర్ణీత అమ్మకందారు
**authorized distribution** ఆధికారిక పంపిణీ
**authorized grant** ఆధికారిక గ్రాంటు
**authorized investments** ఆధికారిక పెట్టుబడులు
**authorized leave** ఆధికారిక సెలవు
**authorized medical attendant** ఆధికారిక వైద్యుడు
**authorized person** అధికృతుడైన / అధికారం పొందిన వ్యక్తి
**authorized version / text** ఆధికారిక కథనం / పాఠం / పాఠాంతరం
**author of a report** నివేదికా రచయిత
**author of the trust** ధర్మనిధి కర్త
**autocrat** నిరంకుశుడు, కులీనుడు
**autocratic power** నిరంకుశాధికారం
**autocratic ruler** నిరంకుశ పరిపాలకుడు
**autograph 1.** స్వదస్తూరి, స్వహస్తాక్షరి, స్వహస్తలిపి **2.** సంతకం, దస్కతు, చేవ్రాలు
**automatic** స్వయంచలన, ఆటోమాటిక్, స్వయంగమన
**automatically 1.** స్వతః **2.** యాంత్రికంగా
**automatically terminate** స్వతహాగా సమాప్తమవు, దానికదే పూర్తి అవు
**automatic data processing** ఆటోమాటిక్ దత్తాంశ ప్రక్రియ
**automatic device** స్వయంచలన సాధనం
**automatic machine** స్వయం చలన

యంత్రం
**automatic numerator** స్వయంచలన గణన యంత్రం
**automatic rain gauge** స్వయం చాలక వర్షమాపకం
**automatic reappointment** దానంతట అదే జరిగే పునర్నియామకం
**automatism** స్వయంచలనం, స్వయం గమనం
**automobile** స్వయంచలన శకటం, మోటారు వాహనం
**automobile ancillaries** మోటారు వాహన అనుబంధ భాగాలు
**autonomous** స్వాయత్త, స్వయంపాలక
**autonomous administration** స్వయం పరిపాలన, స్వతంత్ర పరిపాలన (వ్యవస్థ)
**autonomous and sovereign** స్వయం పాలకమూ స్వాధికారమూ అయిన
**autonomous body** స్వయంపాలక సంస్థ
**autonomous district** స్వాయత్త జిల్లాలు
**autonomous institutions / organisations** స్వయంపాలక సంస్థలు
**autonomous status** స్వయంపాలక ప్రతిపత్తి
**autonomous unit** స్వయంపాలక విభాగం
**autonomy** స్వయంపాలన, స్వతంత్ర ప్రతిపత్తి, స్వయం పాలనాధికారం
**autopsy** శవపరీక్ష, **post mortem examination**
**auto-suggestion** స్వయంసూచన
**autrefois acquit** పూర్వ విముక్తుడు, **formerly acquitted** : పూర్వమే నిర్దోషిగా విముక్తుడైనవాడు
**autrefois attaint** పూర్వ కళంకితుడు **formerly attainted**
**autrefois convict** పూర్వదోషి: పూర్వమే దోషిగా నిర్ధారించబడినవాడు, **formerly convicted**
**auxiliary** సహాయక, సహకారి, ఆనుషంగిక
**auxiliary air force** సహాయక విమాన / వైమానిక దళం
**auxiliary capital** సహాయక మూలధనం
**auxiliary legislation** సహాయక శాసన నిర్మాణం
**auxiliary service** సహాయక సేవాకార్యం
**availability** అందుబాటు, లభ్యత, ప్రాప్తి
**availability of funds** నిధుల లభ్యత/ అందుబాటు
**availabe** లభ్యమయ్యే, లభ్యం చేయదగిన
**available assets** అందుబాటులోని ఆస్తులు
**available capital** లభ్యమయ్యే మూలధనం
**available cash** అందుబాటులో ఉన్న నగదు
**available day** లభించే రోజు
**available surplus** అందుబాటులో ఉన్న మిగులు
**avail of** వినియోగించుకొను
**avail of leave** సెలవు వాడుకోవటం
**avail oneself of the opportunity** అవకాశాన్ని తాను వినియోగించుకొను
**aver** నొక్కిచెప్పు
**average ability** సగటు సమర్థత / యోగ్యత
**average amount** సగటు మొత్తం
**average amount of profit** లాభ సగటు మొత్తం
**average annual increase** సగటు సాలుసరి వృద్ధి
**average annual turnover** సగటు సాలుసరి అమ్మకం మొత్తం / టర్నోవర్
**average attendance** సగటు హాజరు
**average bank rate** సగటు బాంకు రేటు
**average bond** సగటు బాండు: సరుకు రవాణా పొందేవారు రాసి ఇచ్చే దస్తావేజు
**average clause** సగటు క్లాజు: ఓడ సరుకుల దామాషా నష్ట పంపిణీలో మినహాయింపు క్లాజు
**average competence** సగటు సామర్థ్యం
**average cost** సగటు వ్యయం
**average day and night temperature**

సరాసరి రోజువారీ ఉష్ణోగ్రత, పగలు–రాత్రి సగటు ఉష్ణోగ్రత
**average enrolment** సగటు నమోదు
**average income** సగటు ఆదాయం
**average intelligence** సగటు ప్రజ్ఞ
**average leave** సగటు సెలవు
**average life span** సగటు జీవన కాలం
**average market rate** సగటు మార్కెట్ రేటు
**average merit** సగటు ప్రతిభ
**average net revenue** నికరమైన సగటు రెవెన్యూ (పన్ను ఆదాయం)
**average net weight** సగటు నికర తూకం
**average of the results** ఫలితాల సగటు
**average out-turn** సగటు ఉత్పత్తి / దిగుబడి
**average pay** సగటు జీతం
**average percentage of marks** మార్కుల సగటు శాతం
**average production** సగటు ఉత్పత్తి
**average return** సగటు రాబడి, సగటు ప్రతిఫలం
**average revenue** సగటు రెవెన్యూ
**average weekly earnings** వారం వారీ సగటు సంపాదన
**average weight** సగటు తూకం / బరువు
**average yield 1.** సగటు దిగుబడి, సగటు ఫలసాయం **2.** సగటు ఉత్పత్తి (అటవీ సం॥)
**averment** గట్టిగా / నొక్కి చెప్పటం, దృఢోక్తి
**aver performance** పాటింపు లేదా నిర్వర్తన గురించి నొక్కి చెప్పు
**averse** అసమ్మతమైన, వ్యతిరేకమైన
**aversion** అయిష్టం, విముఖత
**avert** నివారించు
**aviation** విమానయానం
**aviation construction circle** విమానాశ్రయ నిర్మాణశాఖ
**avocation** వ్యాసంగం, వృత్తి, వ్యాపకం
**avoid 1.**తప్పించు, తప్పుకొను **2.** టలాయించు **3.** పరిహరించు, నివారించు
**avoidable cause** నివారించదగిన కారణం
**avoidable delay** నివారించదగిన ఆలస్యం
**avoidable extra expenditure** నివారించదగిన అతివ్యయం
**avoid a contract** కరారును / ఒప్పందాన్ని తప్పించుకొను
**avoidance** నివార్యం, తప్పించుకోవటం, టలాయింపు
**avoidance of doubt** సందేహ నివారణ
**avoidance of income-tax** ఆదాయపు పన్ను తప్పించుకోవటం
**avoidance of loss** నష్టం (నుంచి) తప్పించుకోవటం
**avoidance of tax** పన్ను ఎగవేత, పన్ను తప్పించుకోవటం
**avoid any process of the court** కోర్టు సమను తప్పించుకొను
**avoid the risk** నష్టభరణం తప్పించు కొను
**avouch 1.**రూఢిగా చెప్పు **(assert positively) 2.** ఒప్పుకొను **(acknowledge)**
**avow 1.** ప్రకటించు **(declare openly) 2.** ఒప్పుకొను, స్వీకరించు **(to admit)**
**avowal** ఒప్పుదల
**avowedly** స్పష్టంగా, ప్రకటంగా, బాహాటంగా
**await** నిరీక్షణ చేయు, నిరీక్షించు, ఎదురు చూచు
**await further comments** తదుపరి అభిప్రాయాలకోసం నిరీక్షించు
**await further report** తదుపరి నివేదిక (రిపోర్టు) కోసం నిరీక్షించు
**awaiting** నిరీక్షిస్తూ **(it is awaiting trial,** విచారణకు రానున్నది)
**awaiting approval** ఆమోదించవలసి ఉంది
**awaiting assent of the President** రాష్ట్రపతి ఆమోదంకోసం నిరీక్షిస్తున్న
**awaiting clearance** విముక్తి కావలసి ఉన్న, ఖాళీ చేయవలసి ఉన్న

**awaiting decision** నిర్ణయం తీసుకోవలసి ఉంది
**awaiting despatch** జారీ చేయవలసి ఉంది
**awaiting orders** ఉత్తరువులు రావలసి ఉంది
**awaiting trial** విచారణకు రానున్నది
**await reply** జవాబు కోసం నిరీక్షించండి
**awaken** మేల్కొన్ను
**award 1.** తీర్పు, నిర్ణయం, ప్రదానం **2.** బహుమతి **3. v.** తీర్పు ఇచ్చు
**award compensation** నష్టపరిహారం : ఎంత నష్టపరిహారం ఇవ్వాలో నిర్ణయించటం
**award costs** ఖర్చులు భరించే నిర్ణయం
**awarding authority** నిర్ణయాధికారం / అధికారి
**awarding compensation** ఇచ్చే నష్టపరిహారం (అప్పటి మార్కెట్ విలువను బట్టి)
**award making** తీర్పు చెప్పటం
**award of arbitrator** మధ్యవర్తి తీర్పు
**award of black mark** నల్ల మార్కు వెయ్యటం, అభిశంసన చిహ్నం వెయ్యటం
**award of pension** పింఛను ప్రదానం (చెయ్యటం)
**award of punishment** శిక్ష విధింపు
**award of red entry** ఎర్ర మార్కు వేయటం, ప్రశంసా చిహ్నం వేయటం
**award punishment** శిక్ష ఇచ్చు
**awareness** స్పృహ, జాగృతి

# B

**back a bill** బిల్లు విషయమై పూచీ ఇచ్చు (వినిమయ బిల్లు సం॥)
**back a warrant, to** విదేశీ వారంటును బలపరచు
**back - biter** చాడీకోరు, చాటున నింద చేసే వ్యక్తి
**backbiting** పరోక్షదూషణ / విమర్శ
**back-bond** రక్షణ పత్రం (జామీను దారుకిచ్చింది) **a bond of indemnification given to a surety**
**back date** వెనక తేదీ
**back-freight** ఎగుమతి రవాణా ఛార్జి (ఓడ సం॥)
**back ground** నేపథ్యం (వెనకటి చరిత్ర), పూర్వరంగం
**back ground of the case** కేసుకు పూర్వ రంగం **1.** దావాకు పూర్వ రంగం (సివిల్), **2.** అభియోగానికి పూర్వ రంగం (క్రిమినల్)
**back journey** తిరుగు ప్రయాణం
**back log** బకాయి, పాత నిలవలు / మిగులు
**back out** వెనుదీయు, మాటతప్పు
**back reference** పూర్వ సందర్భం / నిర్దేశం, వెనకటి నిర్దేశం
**backward and forward files** వెనకటి, ముందటి ఫైళ్లు
**backward and forward linkage** ముందు వెనకల అనుబంధం
**backwardation** ఆలస్య ప్రతిఫలం: సరుకుల ధర దిగిపోయినప్పటి పరిస్థితిలో సరుకుల అప్పగింతను వాయిదా వేసినందుకు ఇచ్చే ప్రతిఫలం
**backward classes** వెనకబడిన తరగతులు
**backward position** వెనకబడిన స్థితి
**backward tribes** వెనకబడ్డ తెగలు
**bad** నకిలీ, చెల్లని, అధమ, దోష, విరుద్ధ, అసత్, అప, లోప, దుర్, చెడ్డ, మొండి
**bad and doubtful debts** వసూలు కాని మొండి బాకీలు
**bad and written off debt** వసూలు కాని, రద్దయిన బాకీ
**bad blood** చెడ్డ భావం, ద్వేషబుద్ధి
**bad character 1.** చెడు నడవడి, దుర్వర్తన, చెడు ప్రవర్తన, **2.** చెడు ప్రవర్తన కలవాడు, దుర్మార్గుడు
**bad climate** అప / అధమ / సరిపడని శీతోష్ణస్థితి
**bad climate allowance** అప / అధమ శీతోష్ణస్థితి బత్తెం
**bad coin** నకిలీ నాణెం
**bad debt** వసూలు కాని / పారుబాకీ : ఒక శాసనం నిషేధించిన అప్పు పారుబాకీ

కాదు

**bad debts reserve** వసూలు కాని బాకీల నిధి

**bad faith** దుర్భావం, దురుద్దేశం : తనకు బాధ్యత ఉన్నదని తెలిసి కూడా నెరవేర్చక పోవడం

**badge** (గుర్తు) బిళ్ళ, బాడ్జి

**badge and belt** బిళ్లా పట్టీ

**bad in law** చట్టవిరుద్ధం / శాసన విరుద్ధం

**badli worker** బదిలీ కార్మికుడు

**bad loading** నిల్వపుడు లోపం (ఎగుమతి)

**badly infested** అత్యంత దూషితమైన

**badly neglected** అత్యంత ఉపేక్షిత

**bad management** లోపయుత నిర్వహణ, చెడు నిర్వహణ

**bad money** చెల్లని డబ్బు

**bad reputation** అపకీర్తి

**bad security** అపజామీను

**bad temper** కటు స్వభావం

**bad title** అపహక్కు : లోపభూయిష్ఠమైన హక్కు మూలం

**baffling situation** గాభరా పరిస్థితి

**bag and baggage** పెట్టే బేడా, మూటా ముల్లె

**baggage allowance** సామాను భత్యం

**baggage check** సామాను తనిఖీ

**bail** జామీను, జమానతు, బెయిలు: నేరస్తుని బందీ నుంచి తాత్కాలికంగా విడిపించటానికి ఇచ్చిన హామీ

**bailable action** జామీనుకు తగిన కేసు, జమానతు వీలుగల అభియోగం

**bailable offence** జమానతు వీలుగల అపరాధం, జామీను ఇవ్వదగిన నేరం

**bailable process** జామీను విడుదల తాఖీదు

**bail, admit** బెయిలు మీద వదలు

**bail bond** జమానతునామా, జమానత్ పత్రం: బందీని విచారణ రోజున న్యాయస్థానంలో హాజరుపరుస్తామని బందీ, అతని హామీదారు ఇద్దరూ రాసి ఇచ్చిన పత్రం

**bailee** బెయిలీ, నిక్షేపగ్రాహి : తిరిగి ఇచ్చే ఏర్పాటుతో ఇతరుల సరుకును ఉంచుకొన్న వాడు

**bailee of the goods** సరుకుల నిక్షేపగ్రాహి

**bailee's lien** బెయిలీహక్కు, నిక్షేపగ్రాహి లీనుహక్కు

**bailee's particular lien** బెయిలీ ప్రత్యేకమైన లీనుహక్కు: బెయిలీకి మాత్రమే గల ప్రత్యేక లీను (ధారణాధికారం)

**bail for good conduct** సత్ప్రవర్తనకు జమానతు

**bail for personal appearance** స్వయంగా హాజరు కావటానికి బెయిలు

**bailiff** కోర్టు అమీను, బైలిఫ్ : న్యాయస్థానం ఉత్తరువులపై వారంట్లు జారీ చెయ్యటం అరెస్టు చెయ్యటం మొ॥న పనులు చెయ్యటానికి నియమించిన అధికారి

**bailment** 1. బెయిల్మెంట్, వస్తు నిక్షేపం 2. పూచీపై విడుదల action of bailing a prisoner

**bailment for hire** బాడుగపై సరుకును ఉంచటం

**bailment, gratuitus** ఉచితంగా సరుకును ఉంచడం

**bailment of pledges** వస్తువుల తాకట్టుకు బెయిల్మెంటు : ఒక బాకీ తీర్చడానికిగాని, ఒక వాగ్దానం నెరవేర్చడానికి గాని, వస్తు తాకట్టుకు సంబంధించిన బెయిల్మెంటు

**bailor** బెయిలరు, నిక్షేపదాత : నమ్మకంపై సరుకు ఉంచేవాడు

**bail, to stand** జామీనుగా నిలచు

**balance n. 1.** మిగులు, నిలవ, ఖాతా నిలవ **2.** త్రాసు **3.** సరితూనిక, సమతులనం **V. 4.** సరిపరచు, సమానీకరించు

**balance amount** నిలవ డబ్బు/ సొమ్ము/ మొత్తం

**balance an account** లెక్క సరిపరచు

**balance and debt system** నిలవ బాకీల పద్ధతి

**balance at the credit** ఖాతా నిలవ

**balance available** లభ్యమై ఉన్న నిలవ

**balance brought down** కూడిన నిలవ

**balance brought forward** ముందు పుటకు ఎత్తిన నిలవ, ఉతారు
**balance carried down** తేల్చిన నిలవ
**balance, closing** ఖాతా ముగింపు నిలవ
**balanced accounts** సంతులిత పద్దులు
**balanced budget** సంతులిత బడ్జెట్
**balanced constitution** సంతులిత రాజ్యాంగం
**balanced development** సంతులిత అభివృద్ధి (సమాభివృద్ధి)
**balanced diet** సంతులిత ఆహారం: ఉండవలసిన నిష్పత్తిలో పోషక పదార్థాలు ఉన్న ఆహారం
**balanced economy** సంతులిత ఆర్థిక వ్యవస్థ
**balance due** నిలవ బాకీ/ తేలిన బాకీ
**balanced food** సంతులిత పౌష్టికాహారం
**balanced growth** సంతులిత వృద్ధి, సమవృద్ధి
**balanced industrial development** సంతులిత పారిశ్రామికాభివృద్ధి
**balanced population** సంతులిత జనాభా
**balanced price changes** సంతులిత ధర మార్పులు
**balanced regional development** సంతులిత ప్రాంతీయాభివృద్ధి
**balanced regional industrialization** సంతులిత ప్రాంతీయ పారిశ్రామికీకరణ
**balance has been struck** నిల్వతేల్చుటమయింది
**balance in account** ఖాతాలో ఉన్న నిలవ
**balance in hand** చేనిలవ, చేతిలో నిలవ
**balance of accounts, general** సాధారణ ఖాతా నిలవలు
**balance of licence fee** మిగతా లైసెన్సు రుసుం
**balance of payments** చెల్లింపుల మిగులు
**balance of power** అధికార సంతులనం
**balance of the deficiency** లోటు మిగులు
**balance of trade 1.** వర్తక శేషం **2.** ఎగుమతి దిగుమతుల సంతులనం
**balance, opening** ఖాతా ఆరంభ నిల్వ
**balance order** బకాయి చెల్లింపు ఉత్తరువు: వ్యాపారసంస్థ ఎత్తివేయటానికి వాటాల కిస్తీలను చెల్లించాలని కోర్టువారిచ్చే ఉత్తరువు
**balance portion** మిగిలిన భాగం
**balance sheet** జమాఖర్చు పట్టికలు/ ఆస్తి- అప్పుల పట్టికలు, సమీకరణ పత్రం, బాలన్స్ షీట్
**balance the budget** బడ్జెట్‌ను సమతులనం చేయు
**balance to be completed** బకాయి పూర్తి చెయ్యాలి
**balance to credit** ఖాతా నిలవ
**balance to the credit of an employee** ఉద్యోగి పేర జమలో ఉన్న నిలవ
**balancing point** సమతులన బిందువు
**ballast 1.** కంకర **2.** తూకపుబరువు (ఓడ అడుగున వేసే బరువు)
**ballastage** తూకపు బరువు సుంకం
**ballistic expert** తుపాకి గుండ్ల నిపుణుడు/ క్షేపణ శాస్త్ర నిపుణుడు
**ballot** బాలెట్, రహస్య వోటు చీటీ (రహస్య వోటింగ్)
**ballot box** వోట్లపెట్టె, బాలెట్ పెట్టె
**ballot paper** వోటుపత్రం
**ban n.** నిషేధం **v.** నిషేధించు
**band 1.** బృందం, **company,** కంపెనీ, దళం, **crew,** సరంగులు, **gang,** మూక, ముఠా **2.** పటకా
**banded structure** పట్టీ పద్ధతి నిర్మాణం
**bandit** బందిపోటు దొంగ
**banish** దేశభ్రష్టుని చేయు
**bank n. 1.** బాంకు **2.** నది ఒడ్డు **3.v.** బాంకుతో వ్యవహరించు **4.** ఆధారపడు
**bank acceptance** బాంకు అంగీకారం
**bank account** బాంకుఖాతా, బాంకు లెక్క
**bank advances** బాంకు అడ్వాన్సులు, బాంకు అప్పులు
**bank balance** బాంకు నిలవ
**bank bill 1.** బాంకు బిల్లు **2.** బాంకు ప్రామిసరీ నోటు **(promissory note)**

**bank book** బ్యాంకు పుస్తకం (పాస్ పుస్తకం)
**bank charges** బ్యాంకు ఛార్జీలు / రుసుములు
**bank credit** బ్యాంకు పరపతి
**bank crisis** బ్యాంకు సంక్షోభం
**bank custody** బ్యాంకు అధీనం
**bank discount** బ్యాంకు వట్టం / డిస్కౌంటు
**bank draft** బ్యాంకు డ్రాఫ్టు
**banker 1.** బ్యాంకరు **2.** షాహుకారు : వడ్డీ వ్యాపారం చేసే వ్యక్తిగాని, కార్పొరేషన్ గాని, కంపెనీగాని
**banker's books** బ్యాంకరు ఖాతా పుస్తకాలు: బ్యాంకు వ్యాపారానికి సంబంధించిన ఖాతా పుస్తకాలు
**banker's cheque** బ్యాంకరు చెక్కు
**banker's enquiry** బ్యాంకరు విచారణ
**banker's note** బ్యాంకరు పేర వేరొక బ్యాంకు ఇచ్చే ప్రామిసరీ నోటు
**bank for international settlements** అంతర్జాతీయ పరిష్కారాల బ్యాంకు
**bank guarantee** బ్యాంకు పూచీ
**bank holiday** బ్యాంకు సెలవు
**banking** బ్యాంకు వ్యాపారం
**banking account** బ్యాంకు లెక్క / ఖాతా
**banking accommodation** బ్యాంకింగ్ సౌకర్యం
**banking business** బ్యాంకింగ్ వ్యాపారం
**banking company** బ్యాంకింగ్ వ్యవహారాలు నడిపే కంపెనీ
**banking corporations / firms / institutions** బ్యాంకింగ్ సంస్థలు
**banking deposit** డిపాజిట్ బ్యాంకు
**banking facilities** బ్యాంకింగ్ సదుపాయాలు
**banking operation** బ్యాంకింగ్ కార్యవర్తన
**banking policy** (రిజర్వుబ్యాంకు నిశ్చయించే) బ్యాంకింగ్ విధానం
**banking regulation** బ్యాంకింగ్ క్రమబద్ధీకరణ
**banking transactions** బ్యాంకింగ్ లావాదేవీలు
**banking treasury** బ్యాంకింగ్ ట్రెజరీ
**bank note** బ్యాంకు నోటు
**bank of issue** జారీచేసే బ్యాంకు
**bank rate** బ్యాంకు రేటు
**bank rebate** బ్యాంకు రిబేటు: బ్యాంకు వడ్డీ వగైరాలు తగ్గింపు
**bank reconciliation statement** బ్యాంకు లెక్కల సమన్వయ పట్టిక
**bank reference** బ్యాంకు నిర్దేశం
**bank return** బ్యాంకు జమాఖర్చుల పట్టీ, బ్యాంకు రిటర్న్
**bankrupt** దివాలాదారు
**bankruptcy** దివాలా
**bankruptcy, acts of** దివాలా కోరు పనులు: ఋణదాతలకు ఆస్తి దక్కకుండా చెయ్యజూడటం
**bankruptcy court** దివాలా కేసుల న్యాయస్థానం
**bankruptcy law** దివాలా కేసుల చట్టం
**bankruptcy notice** దివాలా నోటీసు: ఇంత కాలంలో అప్పు చెల్లించి తీరాలని ఋణదాత ఇచ్చే నోటీసు
**bankruptcy or insolvency** దివాలా లేదా బాకీ తీర్చలేని స్థితి
**bankruptcy proceedings** దివాలా చట్టపరమైన కార్యవ్యవహారాలు
**bank scroll** జమాఖర్చుల జాబితా
**bank stock** బ్యాంకుస్టాకు / నిల్వ : ప్రభుత్వ సెక్యూరిటీల ఏకీకరణం చేసిన స్టాకు
**ban of secrecy** రహస్య నిషేధం
**ban on creation of posts** పదవీ కల్పన పై నిషేధం
**ban on further promotion** తదుపరి పదోన్నతిపై నిషేధం
**ban on further recruitment** తదుపరి భర్తీపై నిషేధం
**ban on future promotion** రాబోయే / భవిష్య పదోన్నతిపై నిషేధం
**ban on future recruitment** రాబోయే / భవిష్య భర్తీపై నిషేధం
**ban on the filling of posts** (ఖాళీ)

పదవుల భర్తీ నిషేధం
**banned** నిషేధించి ఉన్న, నిషిద్ధ
**banns** వివాహప్రకటన (క్రైస్తవ సం॥)
**banquet** విందు: ఉపన్యాసాలతో కూడిన విందు
**bar 1.** న్యాయవాది వర్గం **2.** బోను (కోర్టు) **3.** న్యాయస్థాన సమక్షం **denotes the presence of the court 4.** విచారణ స్థానం, ట్రిబ్యునల్ **any tribunal, 5.** బార్, మద్యశాల **6.** ఆటంకం, అడ్డంకి, ప్రతిబంధకం, నిరోధం **v.** ఆటంకపరచు, నిషేధించు
**bar against** .......కి ఆటంకం
**bar association** న్యాయవాది సంఘం
**bar a suit** దావా ఆటంకపరచు
**barbarous stage** ఆటవిక దశ
**barbed wire** ముళ్ళతీగ
**bar council** బార్ కౌన్సిల్, న్యాయవాది మండలి
**bare 1.** కేవలమైన **2.** అచ్చమైన
**bare denial** కేవల నిరాకరణ
**bare majority** కటాకటి మెజారిటి
**bare trustee** నిస్వార్థ ధర్మకర్త: **a trustee without any beneficial interest**
**bare trusteeship of treasurer** కోశాధికారి కేవల ధర్మకర్తృత్వం
**bar future employment** భవిష్య ఉపాధి నిషేధం
**bargain** బేరం
**bargain and sale** బేరమూ అమ్మకమూ
**bargain catching** అక్రమబేరం: ఒకరి ఆస్తిని కాజేసే ఉద్దేశంతో హెచ్చు వడ్డీ మీద అప్పు ఇవ్వటం
**bargainee** బేరంలో కొనుగోలుదారు
**bargainer** బేరంలో అమ్మకందారు
**bargaining price orders** బేరమాడే ధర ఆర్డర్లు
**bargaining theory of wages** వేతనాలు బేరమాడే సిద్ధాంతం
**bargain money** బయానా సొమ్ము
**bar of jurisdiction** పరిధికి ఆటంకం (అధికార సం॥)
**bar of limitation** కాలదోషం
**bar, plea in** నిరోధవాదం: కోర్టుకు అధికార పరిధిలేదనీ, కేసు సంగతులపై ఆధారపడి రుజువుచేసి దావా నిలవదనే వాది వాదం
**barrack** బారక్, బారకాసు (సైనిక వసతి, గృహ సం॥)
**barrage of questions** ప్రశ్నల పరంపర
**barrator** దావాకోరు
**barred by any law** ఏ చట్ట ప్రకారమయినా నిషేధమయినది
**barred by limitation** కాలదోషం పట్టిన
**barred by time** కాలదోషం పట్టిన
**barred debt** కాలదోషం పట్టిన (చట్టపు గడువు దాటిన) ఋణం
**barren and unculturable land** చవిటి, వ్యవసాయ యోగ్యం కాని భూమి
**barren land** బంజరు భూమి, పోరంబోకు
**barren money** వడ్డీలేని అప్పు
**barrenness 1.** పోరంబోకు **2.** గొడ్డుతనం
**barretry / barratry** దావాకోరుతనం
**barricade** అడ్డు
**barrier 1.** అవరోధం, అడ్డుగోడ (బొగ్గు గనిలో రెండు పొరల మధ్య ఉండే గోడ) **2.**టోల్‌గేటు, **gate where duties are collected.**
**barrier clerk** టోల్‌గేట్ గుమాస్తా
**barring a few** కొన్నింటిని తప్పించి
**bar room 1.** న్యాయవాదుల గది **2.** మద్యశాల
**barter** సాటా, వస్తుమార్పిడి: ఒకవస్తువు ఇచ్చి దాని బదులుగా మరొక వస్తువు తీసుకొనే పద్ధతి
**barter economy** వస్తుమార్పిడి (సాటా) ఆర్థిక వ్యవస్థ
**barterer** సాటాదారు, వస్తుమార్పిడిదారు
**barter system** వస్తుమార్పిడి పద్ధతి
**bar to interference** జోక్య నిషేధం
**bar to proceedings** కార్యవర్తనల నిషేధం
**bar to the suit** దావాకు ఆటంకం
**base 1.** స్థావరం, మూలస్థానం **2.** సైనిక

స్థావరం 3. పునాది 4. adj. భూస్వామ్య 5. హీన 6. నకిలీ, కేటు 7. దిగువ

**base coin** ప్రాతిపదిక నాణెం, చిన్న నాణెం

**base court** దిగువ న్యాయస్థానం, **inferior court of justice**

**based on actuals** వాస్తవిక గణాంకాల ఆధారంగా

**based on authority** ప్రమాణంపై ఆధారపడిన

**based on conjecture** ఊహపై ఆధారపడి

**based on facts** వాస్తవాల ఆధారంగా

**based on figures** అంకెల ఆధారంగా

**baseless** నిరాధార

**base line** ఆధార రేఖ

**base metal** విలువ తక్కువ లోహం

**base of supply** సరఫరా స్థావరం

**base period** ఆధార కాలం

**base price** మూలధర

**base stock method of valuation** బేస్ స్టాక్ విలువ కట్టే పద్ధతి

**base year** ఆధార / ప్రాతిపదిక సంవత్సరం

**base year shifting method** ఆధార సంవత్సరం మార్చే పద్ధతి

**basic** మూల, మౌలిక, ప్రాతిపదిక ఆధార భూత, అసలు, ప్రాథమిక, కీలక

**basically wrong** మౌలికంగా తప్పు

**basic and intermediate products** మౌలిక, మధ్యస్థ ఉత్పత్తులు

**basic coin** మూలనాణెం

**basic components** మౌలికాంశాలు, మౌలిక ఘటకాలు

**basic concept** మూలభావన

**basic craft** ఆధార వృత్తి కళ

**basic economy** మౌలిక ఆర్థిక వ్యవస్థ

**basic education** ప్రాతిపదిక విద్య

**basic element** 1. ఆధారమూలకం / అసలు మూలకం 2. మౌలిక లక్షణం

**basic expenditure** అసలు ఖర్చు

**basic features** మూల విలక్షణతలు / రూపు రేఖలు

**basic form** మూలరూపం, మొదటి రూపం, మౌలిక నమూనా

**basic holding** ప్రాథమిక కమతం : కుటుంబ కమతంలో మూడోవంతు

**basic industry** ఆధార మౌలిక పరిశ్రమ, **key industry** కీలక పరిశ్రమ

**basic minerals** మూల ఖనిజాలు

**basic necessities** ప్రాథమిక అవసరాలు

**basic needs** ప్రాథమిక అవసరాలు

**basic pattern of education** ప్రాతిపదిక విద్యా విధానం

**basic pay** అసలు జీతం, మూలవేతనం

**basic period** ప్రాతిపదిక కాలపరిమితి

**basic plan** ప్రాతిపదిక ప్రణాళిక

**basic principle** మూలసూత్రం

**basic question** మౌలిక ప్రశ్న, మూల సమస్య

**basic rate of wage** వేతనం ప్రాతిపదిక రేటు

**basic raw materials** మౌలిక ముడి పదార్థాలు

**basic rights** ప్రాతిపదిక హక్కులు

**basic scale of pay** ప్రాతిపదిక వేతనం స్కేలు / శ్రేణి

**basic standard** ప్రాతిపదిక ప్రమాణం

**basic structure** ప్రాథమిక స్వరూపం

**basic training** ప్రాథమిక శిక్షణ

**basic wages** ప్రాతిపదిక వేతనాలు

**basic yield** అసలు దిగుబడి

**basin** పరీవాహక ప్రాంతం

**basis** ఆధారం, ప్రాతిపదిక

**basis of charge** ఆరోపణ ఆధారం

**basis of facts** వాస్తవాల ఆధారం

**bastard** జారసంతు

**bastardize** 1. జారసంతును నిర్ణయించు 2. హీనపరచు

**bastardy** జారసంతుతనం **state or condition of a bastard**

**batch production** జట్టు ఉత్పత్తి

**baton** బ్యాటన్, అధికార బెత్తం

**battalion** పటాలం, సైనికదళం

**battery 1.** ఒంటిమీద దెబ్బ (అక్రమంగా కొట్టింది) **2.** ఫిరంగిదళం **3.** బ్యాటరీ, ఘటకం

**battle formation** యుద్ధరూప క్రమం, యుద్ధవిన్యాసం

**battle ship** యుద్ధనౌక

**battle zone** యుద్ధమండలం

**bawdyhouse** తార్పుడు గృహం

**beacon 1.** ఆకాశదీపం, సంకేతదీపం **2.** దీపగృహం (లైట్‌హౌస్)

**beaconage 1.** సంకేత దీపమాల **2.** సంకేత దీప నిర్వహణ **3.** వ్యయం / సుంకం

**beadle** కోర్టు అమీను, **messenger of the court**

**bear n. 1.** ధరలు దించడానికి ప్రయత్నం చేసేవాడు, బేర్ **v. 2.** భరించు

**bearer bond** బేరరు పత్రం

**bearer cheque** బేరరు చెక్కు (తెచ్చిన వారికి చెల్లించేటందుకు రాసింది), వాహక ధనాదేశం

**bearer, payable to** బేరరుకు చెల్లించ వలసింది

**bearer security** బేరరు హామీ: ఆ పత్రం ఎవరి చేతుల్లో ఉంటే దాని హక్కు వారిదే, అప్పు తీర్చటానికి కాని మరొక పని చేయటానికి గాని ఇచ్చిన హామీ

**bearing interest** వడ్డీగల

**bearing of question** ప్రశ్నకు సంబంధించిన

**bearing signature** సంతకం గల

**bearing the seal of the court** న్యాయస్థాన ముద్ర ఉన్న

**bearing the stamp required for an instrument** దస్తావేజుకు అవసరమైన స్టాంపు ఉన్న

**bearish tendency** ధరలు మందగించే ధోరణి

**bear the cost** ఖర్చు భరించు

**bear true faith and allegiance** నిజమైన విశ్వాస విధేయతలు చూపు

**bear or takeup arms** ఆయుధాలు ధరించు లేదా యుద్ధానికి సిద్ధమవు

**bear witness to** సాక్షిగా ఉండు, సాక్ష్యమిచ్చు, నిరూపించు, ప్రమాణీకరించు

**beast of burdens** బరువులు మోసే పశువు

**beat** గస్తీ

**beat a bargain** బేరం నిర్ణయించు, ఫైసలా చేసుకొను

**beat book** బీటు పుస్తకం

**beat guard** బీటు చౌకీదారు

**beat postman** గస్తీ టపాజవాను

**be called to the bar** న్యాయవాది అవు

**be called to the bar of the legislative assembly** విధానసభ విచారణకు పిలవబడు

**be cautious** జాగ్రత్త వహించు

**become bail** జమానత్‌దారు అవు

**become enforceable** అమలుపరచ దగినదవు

**become inoperative** అమలు జరపడానికి వీలులేనిదవు

**become useless and inoperative** నిరుపయోగమవు, అమలులో లేనిదవు

**become vested 1.** నిహితమవు **2.** సంక్రమించు

**becoming exercisable** అమలుపరచ దగినది కావటం

**becoming subject to any disqualification** ఏదైనా అనర్హతకు లోనవడం

**bedel** కోర్టు అమీను, కోర్టు దూత **(beadle)**

**bedelry** కోర్టు అమీను అధికారపరిధి

**bedlam 1.** పిచ్చి ఆసుపత్రి, **lunatic asylum,** పిచ్చివాళ్ల శరణాలయం **2.** గందర గోళం **any place or scene of uproar and confusion, tumult**

**befall 1.** వచ్చిపడు **2.** సంభవించు

**befitting** తగి ఉండటం, కుదరటం

**before 1.** పూర్వ, లోగడ **2.** ఎదుట, సమక్షం, ముందు

**before due date** నిర్ణీత తేదీకి ముందే

**before final orders are passed** తుది ఉత్తరువులు జారీ అయ్యే లోగా
**before such settlement** సదరు పరిష్కారానికి ముందు
**before taking his seat** ఆసీనుడయ్యే ముందు
**before the court** న్యాయస్థానం / కోర్టు సమక్షంలో
**before the date of submission** సమర్పణ తేదీకి ముందు
**before the end** ముగియడానికి ముందు
**before the end of the month** నెలాఖరు లోగా
**before the expiration of the term** గడువు ముగియక ముందే
**before the fact** వాస్తవ సంఘటనకు పూర్వం
**before the house** సభాసమక్షంలో
**before the rising of the court** కోర్టు ముగిసేలోగా
**beggar homes** భిక్షుక గృహాలు
**beginning anew each year** ఏటేటా కొత్తగా మొదలు పెట్టటం
**beg to state** మనవి చేసుకొను
**beg to the question** ప్రశ్ననే అర్థించు : నిశ్చయంకాని దానిని రెండో వ్యక్తి ఒప్పుకొనని దానిని ప్రమాణంగా గ్రహించడం
**beguile 1.** మోసగించు **2.** కాలక్షేపం చేయు
**beguilement 1.** మోసం **2.** కాలక్షేపం
**behalf** తరఫున, పక్షాన, **in that behalf,** ఆ సందర్భంలో, అందుకోసం; **in this behalf ,** ఈ సందర్భంలో, ఇందు కోసం; **on behalf of,** తరఫున **on his behalf,** అతని తరఫున
**behave with contempt** ధిక్కార ప్రవర్తన
**behaviour** ప్రవర్తన, వర్తన
**behavioural method** ప్రవర్తన పరిశీలన పద్ధతి
**behaviour pattern** ప్రవర్తన రీతి
**behead** శిరచ్ఛేదం చేయు
**behind 1.** వెనక **2.** తదనంతరం
**behind schedule** నిర్ణీత గడువు మీరిన తరవాత
**be in force** అమలులో ఉండు
**being cognizant** అధికారిక జోక్యం అయి ఉంటూ
**being concerned in any quarrel, affray or disorder** ఏదైనా తగాదాతో, జగడంతో లేదా ఉపద్రవంతో ప్రమేయ ముండు
**being in command** ఆదేశిస్తూ, ఆదేశంలో ఉండు
**be inoperative** అమలులో లేకుండు
**belie** అబద్ధం చేయు
**belief in good faith** సద్భావపూర్వకమైన నమ్మకం
**believes that it does not exist** లేదని విశ్వసిస్తున్నారు
**belligerency** యుద్ధావస్థ
**belligerent right** యుద్ధ నిమగ్నుల హక్కు
**belongings** ఒకరికి చెందిన సామానులు
**belonging to a particular denomination** ప్రత్యేక నామ తరగతులకు చెందిన (రూపాయలు వగైరా)
**belonging to them in common** ఉమ్మడిగా వారికి చెందిన
**belong to the force** బలానికి చెంది ఉండు (సైనిక సం॥)
**below court** కింది కోర్టు
**below par** కంటె తగ్గిన
**below standard** ప్రమాణానికి తక్కువ
**below the mark** స్థాయికి దిగువ
**benami assets** బినామీ ఆస్తులు
**benami transaction** బినామీ వ్యవహారం
**bench** ధర్మాసనం / బెంచి : ఇద్దరు, అంత కంటె ఎక్కువ మంది జడ్జీలు కలది
**bench clerk** బెంచి గుమాస్తా (కోర్టు సం॥)
**bench court** బెంచి కోర్టు
**benches shall hold sittings** ధర్మాసనాలు సమావేశాలు జరుపుతాయి
**bench mark** బెంచి మార్కు, సర్వే గుర్తు
**bench of Judges** న్యాయమూర్తుల

ధర్మాసనం
**bench of the High Court** ఉన్నత న్యాయస్థాన / హైకోర్టు ధర్మాసనం
**bench warrant** న్యాయస్థాన తాఖీదు, బెంచి వారంటు
**bends and corners** మలుపులూ మూలలూ
**benefaction** ఉపకారం
**benefactor** ఉపకారి
**beneficial** లాభసాటి, ప్రయోజనంగల
**beneficial and healthy use** లాభసాటి గానూ సదుపయోగంగానూ ఉన్న
**beneficial effect** లాభసాటి ఫలితం
**beneficial enjoyment** లాభసాటి అనుభవం
**beneficial interest in such shares** అలాంటి వాటాల్లో లాభసాటి ప్రయోజనం
**beneficially entitled** లాభసాటిగా హక్కు గల
**beneficially interested** లాభసాటిగా ప్రయోజనంగల: స్థిరాస్తిలో ఒకానొక సంఘటనపై ఆధారపడిన ప్రయోజనంగల
**beneficial owner** లాభం పొందే యజమాని
**beneficial owner of shares** లాభం పొందే యజమాని వాటాలు
**beneficial ownership** లాభం పొందే సొంత హక్కు
**beneficial to mankind** మానవజాతికి ప్రయోజనం గల
**beneficial winding up** లాభసాటి పరిసమాపనం / ముగింపు
**beneficiary** లాభం పొందే వ్యక్తి, లబ్ధిదారు
**benefit** 1. లాభం 2. హితం, మేలు
**benefit accruing to the company** కంపెనీకి ప్రాప్తించే లాభం
**benefit assured by the rules** నియమాలు నిర్ధారించిన లాభం, నియమాలతో హామీ ఇవ్వబడిన లాభం
**benefit ceiling** లాభ గరిష్ఠ పరిమితి
**benefit directly, take** ప్రత్యక్ష లాభం తీసుకొను/పొందు
**benefit for the advantage of employee** ఉద్యోగికి అనుకూలమైన లాభం
**benefit fund** ఉపకార నిధి
**benefiting the land** భూమికి లాభం కలిగించడం
**benefit of a class of persons** ఒక వర్గం వ్యక్తుల లాభం
**benefit of doubt** సందేహ లాభం: సందేహం కారణంగా నేరస్థునికి కలిగే లాభం
**benefit of exception** మినహాయింపు లాభం: మినహాయింపు కారణంగా కలిగే లాభం
**benefit of public** ప్రజాహితం
**benefit of survivorship** శేష వారస లాభం: ఆస్తి సొంతదారు చనిపోయిన తరవాత జీవించిన వారసులకు లభించేది
**benefit of the lessor** కౌలుదాత ప్రయోజనం
**benefit of the public** ప్రజల లాభం / ప్రయోజనం
**benefit period** ప్రయోజనం పొందే వ్యవధి
**benefit show** సహాయార్థ ప్రదర్శన
**benefit society** ప్రయోజనకారి సంఘం
**benefits to arise out of land** భూమి వల్ల కలిగే లాభాలు
**benefit to the revenue** రాబడికి / రెవెన్యూకు లాభం
**benefit under will** వీలునామా రీత్యా హక్కు లాభం
**benevolence** హితకరం, ఔదార్యం
**benevolent fund** హితకార నిధి
**benevolent intention** హిత చింతన
**benevolent reserve fund** హితకారి రిజర్వు నిధి
**be overcome** అధిగమించు
**bequeath** వీలునామా ప్రకారం ఆస్తి ఇచ్చు
**bequeathed** వీలునామా ప్రకారం ప్రత్యేకించి ఇచ్చిన
**bequeathed by deceased person by will** చనిపోయిన వ్యక్తి వీలునామా ద్వారా సంక్రమింపజేసిన

**bequeathed to Government** ప్రభుత్వానికి వీలునామా ద్వారా సంక్రమింప జేసిన
**bequest** వీలునామాతో వదిలిన ఆస్తి
**bereavement** మరణ వియోగం
**berth** 1.బర్త్, నియామక స్థితి 2.పడక (రైలులో గాని, పడవలో గాని) 3. ఎడం (రెండు ఓడల మధ్య ఎడం) 4. లంగరు స్థానం
**berthing accommodation** రేవులో నౌకలు నిలిపే స్థలం / వసతి
**bertillon system** బెర్టిలాన్ పద్ధతి: అవయవాల కొలతల వివరాలపై నేరస్థులను గుర్తించే పద్ధతి
**be sanctioned** మంజూరైన
**besides this** ఇంతేకాకుండా
**besiege** ముట్టడించు
**best adapted** శ్రేష్ఠంగా అనుసరించిన
**best endeavour** ఉత్తమ కృషి
**best evidence** ప్రధాన సాక్ష్యం, **primary evidence**
**best evidence rule** ప్రధాన సాక్ష్య నియమం
**best fitted** బాగా అమరిన
**bestiality** 1. పాశవికత 2. అస్వాభావిక రతి (మనిషితో గాని, పశువుతోగాని)
**best judgement assessment** శ్రేష్ఠతమ న్యాయనిర్ధారణ
**best of ability** సామర్థ్య లోపం లేకుండా
**best of information** పూర్తి సమాచారం
**bestow** అర్పించు, ప్రదానం చేయు
**best of one's knowledge and belief** ఒకరి పూర్తి ఎరుక, నమ్మకం మేరకు
**best of my judgement** నా వివేకం మేరకు
**best of skill and ability** నైపుణ్యం, సామర్థ్యం మేరకు
**bestow a degree** పట్టా ప్రదానం చేయు
**bestow a title** బిరుదు ప్రదానం చేయు
**bestow designation** హోదా ఇవ్వటం / ప్రదానం చెయటం
**bestower** ప్రదాత
**best price obtainable** పొందగలిగే అత్యధిక ధర
**best serve the interests of the public** ప్రజా ప్రయోజనాల కోసం ఉత్తమ సేవ అందించు
**best terms** ఉత్తమ షరతులు
**bet** 1. n. పందెం 2.v. పందెం వేయు, పణం ఒడ్డు
**betrayal** నమ్మక ద్రోహం
**betray one's own ignorance** తన తెలివితక్కువను బయలుపరచు
**betrothal/betrothment** పెండ్లి నిశ్చయం, నిశ్చితార్థం
**better** 1.n. పందెగాడు 2.v. మెరుగుపరచు
**better accept the proposal** ప్రతిపాదన అంగీకరించడం మంచిది
**better co-ordination** ఇతోధిక సమన్వయం
**bettering house** సంస్కరణాలయం (reformatory)
**betterment** అభివృద్ధి, మేలుతరం/ మెరుగుపరచటం
**betterment contribution** అభివృద్ధి వాటా విరాళం
**betterment levy** అభివృద్ధి లెవీ
**betterment tax** అభివృద్ధి పన్ను
**better offer** (అంతకన్న) మంచి ప్రతిపాదన
**better prevention** (అంతకన్న) మంచి నివారణ
**better security** (అంతకన్న) మంచి పూచీ
**better title** శ్రేష్ఠమైన హక్కు
**betting** 1. జూదం 2. పణం, పందెం ఒడ్డటం, పందెం సొమ్ము
**between the parties** 1. పక్షాల మధ్య 2. కక్షిదారుల మధ్య
**be up in arms** సాయుధ తిరుగుబాటుకు దిగు
**be void** చెల్లనిదవు
**beyond a period of** గడువుకు మించి
**beyond a reasonable doubt** సహేతుకమైన సందేహానికి అతీతంగా
**beyond comprehension** అవగాహనకు

అతీతమైన

**beyond control** అదుపుకు మించి

**beyond doubt** సందేహాతీతమైన

**beyond jurisdition** అధికారపరిధికి వెలుపల

**beyond midnight** అర్ధరాత్రి తరవాత

**beyond power** శక్తికి అతీతమైన, శక్తికి మించిన

**beyond reach** అందుబాటులో లేని

**beyond territorial waters** దేశాధికార పరిధి సముద్ర భాగం వెలుపల

**beyond that age** ఆ వయస్సు దాటి

**beyond the control of** అదుపుకు మించి, అదుపులో లేని

**beyond the maximum period** గరిష్ఠ కాలావధి తరవాత, గరిష్ఠ గడువు తరవాత

**beyond the said period** చెప్పిన గడువు తరవాత

**beyond the scope of his authority** అతని అధికార కార్య పరిధికి వెలుపల

**beyond the scope of the agreement** ఒప్పందం పరిధికి మించి

**bi** ఉభయ, ద్వి, రెండు, ఇరు

**bias 1.** పూర్వాభిప్రాయం **2.** పక్షపాతం, ఆసక్తి, మొగ్గు **3.** అధికాభిమానం

**biased** మొగ్గు చూపిన, పక్షపాతం వహించిన

**biased error** పక్షపాత దోషం

**biased opinion** పక్షపాతంతో కూడిన అభిప్రాయం

**bibliography** గ్రంథసూచి, గ్రంథసూచీ శాస్త్రం

**bicameralism** ఉభయ సభాపద్ధతి

**bicameral legislation** ఉభయ సభా శాసనం

**bicameral legislature** ఉభయ శాసన సభలు

**bicollateral** ఉభయ పార్శ్వ సాదృశ్యంగల

**bid n. 1.** వేలంపాట **v. 1.** వేలంపాడు **2.** ఆజ్ఞాపించు **3.** ప్రయత్నం చేయు

**bidder** వేలంపాటదారు

**bidding** వేలం పాడటం

**bidding sheet** వేలం పత్రం

**biennial** ద్వివార్షిక

**biennial election** ద్వివార్షిక ఎన్నికలు

**biennial gathering** ద్వివార్షిక సమావేశం

**bifacial** ద్విముఖ

**bifid** ద్విశాఖ: మధ్య అగాధం వల్ల ఏర్పడింది

**bifurcation** రెండుగా విభజించటం

**bigamy** రెండో వివాహం: భర్తగాని భార్యగాని బతికి ఉండగా మళ్లీ వివాహమాడటం

**big majority** భారీ మెజారిటీ

**bilateral** ఉభయపక్ష

**bilateral agreement** ఉభయపక్ష ఒప్పందం

**bilateral and unilateral contracts** ఉభయపక్ష, ఏకపక్ష కరారులు

**bilateral monopoly** ఉభయపక్ష గుత్తాధిపత్యం

**bilateral negotiations** ఉభయపక్ష సంప్రదింపులు

**bilateral pact** ఉభయపక్ష సంధి

**bilateral talks** ఉభయపక్ష చర్చలు

**bilateral trade agreements** ఉభయ పక్ష వ్యాపార ఒప్పందాలు

**bilingual** ఉభయ భాషా సంబంధ

**bilinguist** ద్విభాషి, దుబాసి

**bill 1.** బిల్లు, చిత్తు చట్టం, ముసాయిదా చట్టం **2.** రసీదు

**bill, after sight** దర్శనానంతర బిల్లు, చూసిన బిల్లు

**bill at maturity** పరిణత బిల్లు

**bill board** ప్రకటనల బోర్డు: ప్రకటన పత్రాలు అంటించే బోర్డు

**bill book** బిల్లు పుస్తకం, **in which traders keep a record of their bills of exchange etc.,**

**bill broker** బిల్లు దలాలీ, హుండీ దలాలీ

**bill buying** బిల్లు కొనుగోలు, హుండీ కొనుగోలు

**bill, cancelled** రద్దయిన బిల్లు

**bill cashed on** - తేదీన బిల్లు నగదు

చేసుకోవడమైంది

**bill counter** బిల్లు కౌంటరు: బిల్లులు చెల్లించే స్థలం

**bill disbursed on** – తేదీన బిల్లు బట్వాడా అయింది

**bill drawn after date** తేదీ తదుపరి డ్రా చేసిన బిల్లు

**billet n.** వసతి ఆజ్ఞాపత్రం (సైనిక); **a written order or ticket, an official requisition upon a person for the lodging of a soldier v.** వసతి చీటి ఇచ్చు: **to direct by a ticket or note where to lodge**

**bill form** బిల్లు నమూనా

**bill has been paid** బిల్లు చెల్లించడమైంది

**bill has been verified** బిల్లు సరి నిరూపణ చెయ్యడమైంది

**bill(s) have been drawn** బిల్లు(ల) డబ్బు పొందటమైంది

**bill head** బిల్లు పద్దు / మద్దు

**bill(s) may be passed for payment** బిల్లు(ల)ను చెల్లింపుల కోసం అనుమతించవచ్చు

**bill not payable** డబ్బు చెల్లించదగని బిల్లు

**bill of abstract** సంగ్రహ బిల్లు

**bill of attainder** 1. దోషిని విచారణ లేకుండా శిక్ష విధించే బిల్లు 2. ఇంగ్లండులో ప్రభువునుగాని, పెద్ద పదవిలో ఉన్న వ్యక్తిని గాని శిక్షించటానికి ప్రవేశపెట్టే బిల్లు

**bill of contingency charges** యాదృచ్ఛిక / ఆకస్మిక ఖర్చుల బిల్లు

**bill of costs** ఖర్చుల బిల్లు: సొలిసిటర్లు ఇచ్చేది

**bill of credit** పరపతి బిల్లు

**bill of debt** అప్పుల బిల్లు

**bill of discovery** ప్రకటన ఉత్తరువు: ఒకరి అధీనంలో ఉన్న అంశాలను వెల్లడించటానికి శాసించే ఉత్తరువు

**bill of entry** ప్రవేశబిల్లు, ప్రవేశపత్రం (ఎగుమతి, దిగుమతుల సం॥)

**bill of exceptions** మినహాయింపుల బిల్లు

**bill of exchange** వినిమయపత్రం, హుండీ బిల్లు

**bill of export** ఎగుమతి పత్రం / బిల్లు

**bill of indemnity** నష్టపూర్తి బిల్లు: శిక్షనూ నష్టాన్నీ తప్పించే బిల్లు

**bill of indictment** నేరారోపణ బిల్లు

**bill of lading** సరుకు భర్తీ బిల్లు (ఓడల సం॥)

**bill of particulars** వివరణాంశాల బిల్లు

**bill of payment** చెల్లింపు బిల్లు, చెల్లింపు పత్రం

**bill of reviver** పునరుద్ధరణ బిల్లు: మొదటి కక్షిదారులలో ఒకరి వివాహం చేతగానీ, మరణం చేతగానీ నిలుపు చెయ్యబడిన దావా పునరుద్ధరణకు దాఖలు చేసే పత్రం

**bill of rights** హక్కుల చట్టం

**bill of sale** అమ్మకపు బిల్లు

**bill of sight** దర్శన బిల్లు / హుండీ

**bill of simple receipt** మామూలు / సాదా రసీదుగల బిల్లు

**bill of transhipment** రవాణా మార్పిడి పత్రం / బిల్లు

**bill outstanding** బకాయి బిల్లు

**bill paid** చెల్లించిన బిల్లు

**bill passed** బిల్లు ఆమోదించడమైంది

**bill payable after date** గడువు తరవాత చెల్లించదగిన బిల్లు

**bill payable at sight** దాఖలు చెయ్యగానే చెల్లించదగిన బిల్లు

**bill payable on demand** కోరగానే చెల్లించే బిల్లు

**bill pay order** బిల్లు చెల్లింపు ఉత్తరువు

**bill receivable** వసూలు (కాదగిన) బిల్లు

**bill returned** తిప్పి పంపిన బిల్లు

**bills for signature** బిల్లులపై సంతకాల కోసం

**bills passed with amendments** సవరణలతో ఆమోదం పొందిన చిత్తు చట్టాలు

**bills payable** చెల్లించదగిన బిల్లులు

**bills pending realisation** వసూలు కావలసిన బిల్లులు

**bills register** బిల్లుల రిజిస్టరు / పుస్తకం
**bill then pending** అప్పుడు పరిశీలనలో ఉన్న బిల్లు
**bill to be paid** చెల్లించవలసిన బిల్లు
**bill to be referred to a committee** బిల్లును కమిటీ సమాలోచనకు పంపవలసి ఉంది
**bill will be retained** బిల్లును నిలిపి ఉంచటం జరుగుతుంది
**bilocal residence** రెండు స్థలాలలో నివాసం.
**bi-monthly** ద్వైమాసిక
**bind 1.** కట్టు, బంధించు **2.** ముచ్చెలిక తీసుకొను
**bind down** పూచీకత్తు తీసుకొను, బద్ధుని చేయు
**binding 1.** కట్టుబాటు, కట్టడి, కట్టుదిట్టం **2.** సంపుటకారీ పని, బైండింగ్ పని
**binding on** –కి బద్ధుని చేయటం, –కి బద్ధమవు
**binding agreement** ముచ్చెలిక, కట్టడి దస్తావేజు: కక్షిదారులు పరస్పరం రాసుకొన్న ఒప్పందం
**binding upon** బద్ధమయ్యే
**bind over** ముచ్చెలిక తీసుకొను, బద్ధుని చేయు
**biographical sketch** జీవిత సంగ్రహం
**biological** జీవ, జీవశాస్త్ర
**biological environment** జీవ పరిసరం
**bipartisan** ఉభయపక్ష
**bipartite agreement** ఉభయపక్ష ఒప్పందం
**bipartite decision** ఉభయపక్ష నిర్ణయం
**bird's eye view** విహంగదృష్టి, పర్యాలోకన
**birth certificate** జన్మ ధ్రువపత్రం
**birth control** సంతాన నిరోధం, కుటుంబ నియంత్రణ
**birth day celebration** జన్మదినోత్సవం
**birth land** జన్మభూమి
**birth place** జన్మస్థలం
**birth rate** జనన రేటు
**birth right** జన్మహక్కు
**bit by bit** ముక్కలు ముక్కలుగా, కొద్దికొద్దిగా, మెల్లమెల్లగా
**bitterness** కటువు, చేదు, తీవ్రత
**bitterness, to cause any** కటుత్వం ఏర్పడటానికి కారణమవు
**biweekly 1.** పక్ష: **once in two weeks 2.** అర్ధవార: **twice a week**
**biweekly statement** పక్ష వివరణ
**black book** అనుమానాస్పదుల జాబితా రిజిస్టరు
**black cotton soil** రేగడి నేల, నల్లరేగడి
**black deed** చెడుకార్యం
**blackleg 1.** జూదజీవి **2.** సమ్మెద్రోహి: సమ్మె కాలంలో పనిలోకి వెళ్ళేవాడు
**blacklist** అనుమానాస్పదుల పట్టిక
**blackmail** బెదురు సాకు చూపు / సాకు చూపి బెదిరించు
**black mark** నల్లమార్కు : ఉద్యోగి సర్వీసు రిజిస్టరులో ప్రతికూలమైన రిమార్కు
**black market** చీకటి బజారు, నల్లబజారు
**black money** నల్లడబ్బు: పన్ను ఎగవేసిన ఆదాయం
**blackout** బ్లాకవుట్, (యుద్ధకాలంలో) దీపాలు తీసివెయ్యడం
**black topping the road** తారు రోడ్డు వెయ్యటం
**blame n.** నింద **v.** నిందించు
**blame follows the person** నింద వ్యక్తిని అనుసరిస్తుంది
**blame worthy** నిందించదగిన
**blank 1.** ఖాళీ స్థలం, శూన్యం **2.** నిర్దేశించని
**blank acceptance** నిర్దేశించని అంగీకారం: సొమ్ము నిర్దేశించని బిల్లు అంగీకారం
**blank cheque** ఖాళీ చెక్కు: డబ్బు మొత్తం రాయకుండా ఇచ్చిన చెక్కు
**blank credit** నిర్దేశించని పరపతి పత్రం, సర్దుబాటు పరపతి పత్రం
**blank endorsement** నిర్దేశించని పీటి రాత
**blank form** ఖాళీ నమూనా పత్రం

**blanket insurance** బ్లాంకెట్ ఇన్సూరెన్స్: అన్ని అపాయాల నుంచి రక్షణ భీమా
**blanket price** అన్నీ కలిసిన ధర
**blank papers** ఖాళీ కాగితాలు
**blank record** ఖాళీ రికార్డు
**blank sign** ఖాళీ సంతకం: వట్టి సంతకపు కాగితం
**blank space** ఖాళీ స్థలం
**blank transfer** ఖాళీ బదిలీ; ప్రాప్తిదారు పేరు లేని బదిలీ, executed without the name of the transferee
**blast** ధ్వంసం చేయు
**blast accident** పేలుడు ప్రమాదం
**blasting operation** పేలుడు పని, పేల్చటం
**blasting powder** పేలుడు మందు
**blemish n.** మచ్చ **v.** మలిన పరచు
**blemishless** మచ్చలేని
**blended fund** సమ్మిళిత నిధి (వీలునామా సం॥)
**blending** మిశ్రం
**blighted area** మురికివాడ ప్రాంతం
**blind alley position** పెరుగుదలలేని స్థితి/పదవి
**block 1.** బ్లాకు, సమితి **2.** ఖండం **3.** అవరోధం **4.** పడి అచ్చు
**blockade** రవాణా బందీ, దిగ్బంధం
**blockade telegram** రవాణా బందీ టెలిగ్రాం
**block advisory committee** సమితి సలహా సంఘం
**blocked accounts** బందు అయిన ఖాతాలు
**blocked capital** చిక్కుబడిన మూలధనం
**block field work** సమితి క్షేత్ర కృషి
**block grant** బ్లాకు గ్రాంటు, విభజన లేని గ్రాంటు: విభజన వివరణలు లేని గ్రాంటు
**block loans** బ్లాకు ఋణాలు
**blood and iron policy** కఠోర విధానం/నీతి
**blood bank** రక్తనిధి
**blood donor** రక్తదాత
**blood feud** కులవైరం, రక్తవైరం, జ్ఞాతి వైరం
**blood group test** రక్తవర్గ పరీక్ష
**blood-guiltiness** హత్యాదోషం, guilt or crime of shedding blood
**bloodless revolution** రక్తరహిత విప్లవం
**blood money** రక్తధనం : హత్యా పరిహార ధనం, compensation for bringing about the death of another
**blood relationship** రక్తసంబంధం, జ్ఞాతి సంబంధం
**bloodshed** రక్తపాతం
**bloodstain** రక్తపు మరక
**blood transfusion** రక్తం ఎక్కింపు
**bloody 1.** రక్తాంకిత(ం) : నెత్తురు మరకలు గలది **2.** రక్తపూరిత(ం)
**blot on title** హక్కులో లోపం
**blue print 1.** పథకం నమూనా **2.** ఛాయా ముద్రణ
**bluff** బుకాయింపు
**blunder** తప్పు
**blunt 1.** నిర్మొగమాటం, మొరటు **2.** మొద్దు బారిన
**board 1.** మండలి, పరిషత్తు, సమితి **2.** పలక, బల్ల
**boarding 1.** భోజన వసతి (డబ్బు చెల్లించి) **2.** ఎక్కటం (ఓడ, బస్సు మొ॥)
**boarding charges** భోజన ఖర్చులు
**boarding houses** వసతి గృహాలు
**boarding school** వసతి పాఠశాల
**board of control** నియంత్రణ బోర్డు
**board of governors** పాలకమండలి
**board of management** యాజమాన్య బోర్డు/మండలి
**board's proceedings** మండలి /బోర్డు కార్య వ్యవహారాలు
**board's standing order** బోర్డు స్థాయీ ఉత్తరువు
**boat building yard** నావల నిర్మాణ కేంద్రం

**boat note** నౌకా పత్రం
**boatman** నావికుడు
**bodily feeling** శారీరక అనుభూతి
**bodily heirs** ఔరస సంతానం
**bodily infirmity** శారీరక అశక్తత
**bodily injury** శారీరక గాయం/శరీర క్షతి
**bodily offence** శరీరానికి హాని కలిగే నేరం
**bodily pain** శారీరక బాధ
**bodily weakness** శారీరక బలహీనత/ దుర్బలత్వం
**body 1.** సమితి, సమష్టి **2.** మండలి, సంస్థ **3.** ముఖ్య భాగం, అంగం, దేహం
**body corporate** నిగమనికాయం, సంఘటిత సంస్థ
**bodyguard** అంగరక్షకుడు
**body, in a** ఏకమొత్తం
**body of a deed** దస్తావేజు ముఖ్యభాగం
**body of an instrument** దస్తావేజు ముఖ్యభాగం
**body of laws** శాసనాల సమూహం / ముఖ్య భాగం
**body of soldiers** సైనిక సమూహం
**body of the code** సంహిత ప్రధాన భాగం
**body of the letter** ఉత్తరంలోని ప్రధాన భాగం
**body of persons** వ్యక్తుల సంస్థ
**body of the suspicious character** అనుమానాస్పద ప్రవర్తనగల సమూహం
**body of the villagers** గ్రామీణుల సంస్థ
**body politic 1.** రాజ్యం **2.** సమష్టి పౌర వ్యవస్థ
**bogus** బూటకపు, కపటపు, మోసపు
**bogus claim** బూటకపు హక్కు / అభ్యర్థన
**bogus document** బూటకపు దస్తావేజు
**bogus share holder** బూటకపు వాటాదారు
**bogus transaction** బూటకపు లావాదేవీ
**bogus voucher** బూటకపు వోచర్
**boiling point** బాష్పీభవన స్థానం
**boisterous** కోలాహల(ం)
**bolt away** పారిపోవు
**bolt from the blue 1.** పిడుగుపాటు **2.** ఆకస్మిక ఘటన
**bombardment** బాంబుగుండ్ల వర్షం
**bona fide 1.** యథార్థమైన, ప్రామాణిక **2.** సదుద్దేశ పూర్వకమైన
**bona fide annual value** యథార్థమైన సాలుసరి విలువ
**bona fide defence** యథార్థమైన/సదుద్దేశ పూర్వకమైన రక్షణ
**bona fide dispute** యథార్థమైన వివాదం
**bona fide employment** యథార్థమైన ఉద్యోగం
**bona fide error** యథార్థమైన పొరపాటు
**bona fide holder** యథార్థమైన కబ్జాదారు
**bona fide interest 1.** యథార్థమైన వడ్డీ **2.** సదాసక్తి
**bona fide invitation** సదుద్దేశ పూర్వక ఆహ్వానం
**bona fide list of subscribers** చందాదారుల యథార్థపట్టిక
**bona fide mistake** పొరపాటు: సదుద్దేశం తోనే ఉన్నా జరిగిన తప్పు
**bona fide occupation** పొరపాటు ఆక్రమణ : హక్కు ఉందని నమ్మి చేసిన ఆక్రమణ
**bona fide payment** సదుద్దేశపు చెల్లింపు: తిరిగి రాబట్టుకొనే ఉద్దేశం లేనిది
**bona fide possession** వాస్తవ అధీనం/ కబ్జా
**bona fide purchaser** వాస్తవ కొనుగోలు దారు
**bona fide resident** వాస్తవ నివాసి
**bona vacantia** బేవారసు ఆస్తి
**bond 1.** బాండు, పత్రం, దస్తావేజు **2.** ఒప్పంద పత్రం **3.** ముచిల్కా, బంధ పత్రం
**bondage 1.** దాస్యం **2.** బంధనం
**bond creditor** దస్తావేజు ఋణదాత: దస్తావేజురీత్యా అప్పు ఇచ్చిన వ్యక్తి
**bond debtor** దస్తావేజు బాకీదారు: దస్తావేజు పత్రం రీత్యా అప్పు తీసుకొన్న వ్యక్తి
**bond deed** బాండునామా/దస్తావేజు

**bonded 1.** బద్ధ (పన్ను చెల్లించవలసిన) **2.** తాకట్టు పడిన, తనఖాలో ఉన్న **mortgaged 3.** దస్తావేజు రీత్యా రక్షితం, **secured by bonds**
**bonded debt** బాండు ఋణం
**bonded goods** పన్ను చెల్లించే సరుకులు
**bonded labour** వెట్టిపని, వెట్టి చాకిరీ, కట్టుబానిస
**bonded property** తాకట్టు ఆస్తి, తనఖా ఆస్తి
**bonded warehouse** బాండు గిడ్డంగి: సుంకం బాధ్యత వహించే గిడ్డంగి
**bond for appearance** హాజరు బాండు: హాజరవుతానని కోర్టుకు రాసి ఇచ్చిన పత్రం
**bond for good behaviour** మంచి నడవడికి పూచీ పత్రం, సత్ప్రవర్తన బంధపత్రం
**bond holder** బాండుదారు
**bond note** బాండు నోటు: గిడ్డంగి నుంచి సరుకు విడుదలకు అనుజ్ఞాపత్రం
**bond of indemnity** నష్టపరిహార హామీ పత్రం
**bond of obligation** బాధ్యతా పత్రం (సొమ్ము చెల్లించటానికి పూచీ పత్రం)
**bond paper** బాండు కాగితం
**bond, personal** వ్యక్తిగత పూచీ బాండు
**bond service** వెట్టి చాకిరీ
**bond slave** వెట్టి బానిస
**bondsman** పూచీదారు, **surety**
**bond tenant** బాండు కౌలుదారు: పరంపరగా వచ్చిన కౌలుదారు
**bond tester** బాండు పరీక్షకుడు, బంధపత్ర పరిశీలకుడు
**bond to keep the peace** శాంతి రక్షణ పత్రం: శాంతిని పరిరక్షిస్తానని రాసి ఇచ్చే బాండు
**bone of contention** వివాద విషయం
**bonitarian** ధర్మసమ్మతమైన, **equitable**
**bonitarian right** న్యాయమైన హక్కు
**bonum vacans** బేవారసు ఆస్తి, **property without owner**
**bonus** బోనసు, అదనపు లాభాంశం
**bonus based on reduced labour cost** తగ్గించిన శ్రామిక వ్యయాన్ని బట్టి బోనసు
**bonus based on reduced production cost** తగ్గించిన ఉత్పత్తి వ్యయాన్ని బట్టి బోనసు
**bonus fund** బోనసు నిధి
**bonus payment** బోనసు చెల్లింపు
**bonus shares** బోనసు వాటాలు
**book-account** ఖాతా దాఖలా పద్దు, **detailed book record of transaction not evidenced by an instrument** పత్రసాక్ష్యం లేకుండా ఖాతా పుస్తకంలో మాత్రమే రాసిన పద్దు
**book adjustment** ఖాతా సర్దుబాటు
**book balance** ఖాతా నిలవ
**book bank** గ్రంథనిధి
**book, circular** గస్తీపత్రాల పుస్తకం
**book credit** ఖాతా దాఖలా పరపతి
**book debit** ఖాతా దాఖలా ఖర్చు
**book debt** ఖాతా దాఖలా అప్పు
**book display** పుస్తక ప్రదర్శన
**booked route** నిర్ధారిత మార్గం
**book examination clause** ఖాతా పరీక్షా ఖండం
**book expenditure** నమోదైన ఖర్చు
**booking 1.** నమోదు (చేయటం) **2.** టికెట్టు జారీ
**booking agency** నమోదు ఏజన్సీ
**booking clerk 1.** నమోదు గుమాస్తా **2.** టికెట్టు గుమాస్తా
**booking goods** సరుకు నమోదు చెయ్యడం
**booking note** నమోదు చీటీ, బుకింగ్ నోట్
**booking office 1.** నమోదు ఆఫీసు **2.** టికెట్ ఆఫీసు
**booking of seat** సీటు బుక్ చేసుకోవటం (రైలు, బస్సు మొ॥)
**booking restrictions** నమోదు పరిమితులు **(in railways)** రవాణాల, ప్రయాణాల పరిమితులు
**book-keeper** ఖాతా నిర్వాహకుడు: లెక్కల

పుస్తకాలు రాసే వ్యక్తి
**book-keeping** ఖాతా నిర్వహణ: లెక్కలు రాయటం
**bookmaker** పందెం నిర్వాహకుడు, బుక్ మేకర్: **one who makes a book of bets, makes a book to record bets in a book,** పందెపు లెక్కలు నిర్వ హించేవాడు
**book making** పందెం నిర్వహణ: పందెపు లెక్కలు వ్రాయటం వగైరా
**book, memorandum** జ్ఞాపన పుస్తకం, మెమొరాండమ్ పుస్తకం, యాదాస్తు జంత్రీ
**book of account** ఖాతాపుస్తకం
**book of daily accounts** రోజువారీ ఖాతా పుస్తకం
**book of final entry** తుది పద్దు పుస్తకం
**book of original entry** చిట్టా: అసలు పద్దుల పుస్తకం
**book of rates** రేట్ల పుస్తకం **(declares the duties of customs)** ఛార్జీల పుస్తకం
**book of reference** సంప్రదింపు పుస్తకం
**book of treasury receipts** ఖజానా రసీదుల పుస్తకం
**book rate** ఖాతా దాఖలా రేటు
**books of the firm** సంస్థ ఖాతా పుస్తకాలు
**books of treasury receipts** ఖజానా రసీదుల పుస్తకాలు
**books to be open to inspection** పుస్త కాలు తనిఖీ కోసం తెరచి ఉంచాలి
**book transaction** ఖాతా లావాదేవీలు
**book value** ఖాతా విలువ: ఖాతా దాఖలా ఖరీదు
**boom period** తేజుకాలం (వ్యాపార సం॥), వ్యాపార విజృంభణ కాలం, బూమ్ పీరియడ్
**boosting up** పెంచి రాయటం
**booth** బూత్, **a covered stall or temporary structure 1.** కేంద్రం **2.** అర
**boothage** బూత్ సుంకం
**booty** దోపిడి ధనం
**booty of war** యుద్ధ దోపిడి ధనం
**border** సరిహద్దు, ఎల్ల, **frontier,** పొలిమేర
**border dispute** సరిహద్దు తగాదా
**border land** సరిహద్దు భూమి
**border relations** సరిహద్దు సంబంధాలు
**border security force** సరిహద్దు భద్రతా దళం
**border state** సరిహద్దు రాష్ట్రం
**boring** బోరింగు: రంధ్రం చేయటం, గొట్టాలు దింపటం
**born citizen** జన్మతః పౌరుడు
**borne on the books** పుస్తకం దాఖలా
**borne on the cadre** కేడర్‌లో, కేడర్‌కి సంబంధించి
**borne on the establishment** సిబ్బంది వ్యవస్థ దాఖలాలో ఉన్న
**borne on the muster roll** హాజరు పట్టీలో ఉన్న
**borrow and repay method** .(రుణం) పుచ్చుకొని తిరిగి చెల్లించే పద్ధతి
**borrowed funds** అరువు తీసుకొన్న నిధులు
**borrower's index** బాకీదార్ల సూచిక
**borrowing power** అప్పు చేసే అధికారం / అప్పు తీసుకొనే శక్తి
**borstal institution** బోర్‌స్టల్ సంస్థ, బాల నేరస్తుల సంస్థ
**borstal school** బాల నేరస్తుల పాఠశాల
**both days inclusive** రెండు రోజులూ కలిపి
**botheration** గొడవ, చికాకు, ఇబ్బంది
**both inclusive** రెండూ కలిసి ఉన్న
**bottleneck** ఇరకాటం, అడ్డంకి
**bottom note** కింది నోటు
**bottom price** అట్టడుగు ధర
**bottomry** ఓడ తాకట్టు ఋణం
**bottomry bond** ఓడ తాకట్టు దస్తావేజు
**bottomry contract** ఓడ తాకట్టు ఒడం బడిక / కరారు
**bottomry on the ship** ఓడ మీద తాకట్టు

(అప్పు)

**bottomry respondentia** ఓడ తాకట్టు కరారునామా

**bought journal** కొనుగోలు చిట్టా

**bought ledger** కొనుగోలు ఆవర్జా

**bought note** కొనుగోలు నోట్

**bound 1.** బద్ధ, **constrained by the obligations of a bond 2.** చుట్టబడిన, **3.** సీమ, హద్దు

**boundary** ఎల్ల, సరిహద్దు

**boundary alignment** సరిహద్దు వరసరేఖ

**boundary dispute** సరిహద్దు వివాదం

**boundary mark** సరిహద్దు గుర్తు

**boundary pillar** సరిహద్దు స్తంభం

**boundary wall** హద్దుగోడ

**bound by law** న్యాయబద్ధ, శాసనబద్ధ

**bounden duty** నిబద్ధ కర్తవ్యం

**bound over** కట్టడి అయి ఉండటం, బద్ధుడై ఉండటం

**bound to accept** అంగీకారానికి బద్ధమవు

**bound to do that act** ఆ చర్యకు బద్ధమవు, ఆ పని చెయ్యటానికి బద్ధమవు

**bound to furnish** పంపటానికి / సమకూర్చి ఇవ్వటానికి బద్ధమవు

**bound to prove** నిరూపించటానికి బద్ధమవు

**bounty 1.** ప్రోత్సాహ ద్రవ్యం, బౌంటీ, ఔదార్యం **2.** అదనపు లాభం, **additional benefit**

**bourgeois class** బూర్జువా వర్గం

**bowl 1.** పాత్ర **2.** క్షేత్రం

**boycott n. 1.** బహిష్కరణ **v.2.** బహిష్కరించు

**boy scouts** బాలభటులు

**bracketed heads** కుండలీకరించిన పద్దులు / పద్దు శీర్షికలు; బ్రాకెట్ చేసిన పద్దులు/ కుండలి పద్దులు

**brain drain** మేధావుల వలస

**brain washing** మనస్సు మారేటట్లు బోధించటం

**brake n.** బ్రేకు, బ్రేకుపెట్టె (యాంత్రికం) **n.** అడ్డగింపు **v.** అడ్డగించు

**branch account** శాఖ లెక్క

**branch library** శాఖా గ్రంథాలయం

**branch manager** శాఖ నిర్వహణాధికారి

**branch office** శాఖా కార్యాలయం

**branch of learning** అధ్యయన శాఖ, విద్యలో ఒక శాఖ

**brand 1.** వ్యాపార ముద్ర **2.** రాత ముద్ర

**branded goods** ముద్రపడ్డ సరుకులు

**brand monopoly** వ్యాపార ముద్ర గుత్తాధిపత్యం

**brand name** బ్రాండ్ పేరు, వ్యాపార ముద్ర పేరు

**brassage** టంకసాల సుంకం, **mintage**

**brawl** కలహం

**breach 1.** భంగం (శాంతి మొ॥) **2.** ఉల్లంఘనం, దాటవెయ్యటం (షరతులు మొ॥) **3.** గండి (చెరువు, నది మొ॥) ఘాతం

**breach is continuing** భంగం కొనసాగుతున్నది

**breach of a condition subsequent** తరవాతి నిబంధన ఉల్లంఘన

**breach of agreement** ఒప్పంద భంగం

**breach of arrest** నిర్బంధ నియమభంగం

**breach of bond** దస్తావేజు (ఒడండిక మొ॥) ఉల్లంఘన

**breach of canal** కాలువ గండి

**breach of conditions** షరతుల ఉల్లంఘన

**breach of conditions of discharge** విడుదల నియమాల ఉల్లంఘన

**breach of confidence** విశ్వాసఘాతం

**breach of contract** కరారునామా ఉల్లంఘన, కాంట్రాక్టు/ఒప్పందం ఉల్లం ఘన, కట్టడి భంగం

**breach of convenant** ఒప్పంద ఉల్లంఘన

**breach of discipline** క్రమశిక్షణ భంగం/ ఉల్లంఘన

**breach of duty** కర్తవ్య ఉల్లంఘన/భంగం

**breach of faith** విశ్వాసభంగం

**breach of guarantee** గ్యారంటీ భంగం
**breach of law** శాసన ఉల్లంఘన/భంగం
**breach of orders** ఉత్తరువుల ఉల్లంఘన/భంగం
**breach of partnership** భాగస్వామ్య భంగం/ఉల్లంఘన
**breach of partnership articles** భాగస్వామ్య నిబంధనల భంగం/ఉల్లంఘన
**breach of peace** శాంతి భంగం
**breach of prison discipline** జైలు క్రమశిక్షణ భంగం / ఉల్లంఘన
**breach of privilege** ప్రత్యేక హక్కు భంగం
**breach of privilege of the House** సభాహక్కుల ఉల్లంఘన
**breach of promise** వాగ్దాన ఉల్లంఘన
**breach of regulation** నిబంధన భంగం/ఉల్లంఘన
**breach of rule** నియమభంగం/ఉల్లంఘన
**breach of terms** షరతుల దాటవేత/ఉల్లంఘన
**breach of trust** నమ్మకద్రోహం
**breach of warranty** వారంటీ ఉల్లంఘన
**breach of warranty in diminution or extinction of the price** ధర తగ్గింపు లేదా నిర్మూలనలో పూచీ ఉల్లంఘన
**bread-winner** సంపాదనపరుడు, గడించే వ్యక్తి
**break n. 1.** భంగం **2.** ఆపుదల (బ్రేకు) **3.** విరామం **4.** అంతరాయం **v. 1.** భంగం చేయు **2.** చట్టం అతిక్రమించు, **to violate a law 3.** దివాలా తీయించు, **to make bankrupt 4.** విఘటన చేయు, రద్దు చేయు, **to disband**
**breakage** పగులు, చీట
**breakage in transit** రవాణా మధ్య భంగం / పగులు
**breakdown** భగ్నమవు, చెడిపోవు
**breakdown of administration** పరిపాలన భగ్నమవు/కుంటుపడు
**breakdown of machinery** యంత్రాంగం చెడిపోవు/నిలిచిపోవు
**break for nursing** ఉపచార నిమిత్తం విరామం
**breaking bulk** సామానులో కొంతభాగం తీసివెయ్యటం
**breaking point** సహన పరిమితి, **limit of endurance**
**break in prices** ధరలలో అంతరాయం
**break in service** ఉద్యోగంలో అంతరాయం
**break in service has been condoned** సర్వీసులో అంతరాయం మాఫీ చెయ్యడమైంది
**break into** బలవంతంగా చొరబడు, **to enter by force esp. burglariously**
**break loose** పట్టు వదిలించుకొను/సడలు, **to get free by force or violence**
**break neck speed** అతివేగం
**break of journey 1.** ప్రయాణానికి అంతరాయం **2.** ప్రయాణం మధ్య ఆపుదల
**break of nursing** పోషణ (పాలు వగైరా) నిలిచిపోవటం
**break of service** సర్వీసుకు అంతరాయం
**break open** బద్దలుకొట్టు
**break the public peace** ప్రజాశాంతికి భంగం కలిగించు
**breakup n.** విభజన **v.** విచ్ఛిన్నం చేయు, విడదీయు
**breakup figures** వివరణాత్మక సంఖ్యలు, తబిసీళ్ళు
**breakup value** ఖండిత విలువ
**breed 1.** జాతి: పశు లేదా వృక్ష సంబంధమైనది **2.** ఉత్పత్తి
**breeder** జనకం, ఉత్పత్తిదారు, ఉత్పాదకం
**breeding** ఉత్పాదన, పోషణ
**breeding farm** పశువృద్ధి క్షేత్రం
**breeze 1.** వాక్కలహం, వాదం **2** పిల్లగాలి
**breve** అసలు రిట్టు
**breviate** పార్లమెంటు చట్టపు సార సంగ్రహం
**brevity** క్లుప్తత
**brew n. 1.** సారా **2.** సారా తయారీ **v. 3.** కుట్రపన్ను

**brewer** 1. సారాబట్టీ 2. సారా ఉత్పత్తిదారు
**brewery** సారాబట్టీ. **brew house**
**bribe n.** లంచం **v.** లంచమిచ్చు
**bribery and corruption** లంచగొండి తనం, అవినీతి
**bribe taker** లంచగొండి
**bride wealth** వధూధనం
**bridewell** జైలు
**brief n.** 1. సంగ్రహం **v.** క్లుప్తం చేయు, క్లుప్తంగా చెప్పు 2. దావా అప్పజెప్పు
**brief communication** క్లుప్త సమాచారం (పత్రం)
**brief for the meeting** సమావేశం కోసం విషయ సారాంశం
**brief history of the case is as follows** కేసు క్లుప్త వృత్తాంతం కింది విధంగా ఉంది
**briefing** సారాంశ వివరణ/నివేదన
**briefless** 1. ఫైలు లేని 2. క్లయంట్లు లేని (Law): having no brief, without clients
**briefly and precisely** క్లుప్తంగానూ నిర్దిష్టంగానూ/కచ్చితంగానూ
**brief memorandum** క్లుప్త మహజరు
**brief resume** క్లుప్త సారాంశం
**briefs** వాద సంగ్రహం
**brief sketch** క్లుప్త రూపచిత్రం/రేఖాచిత్రం
**brief statement** సంగ్రహ ప్రకటన, సంక్షిప్త/ క్లుప్త వివరణ
**brief summary of the case is placed below** కేసు క్లుప్తసారాంశం కింద సమర్పించడమైంది
**brigade** బ్రిగేడు పరిధి (సైనిక)
**brigand** దోపిడి దొంగ: a lawless fellow who lives by plunder
**bring against** విరుద్ధంగా ప్రవేశపెట్టు
**bring an action** దావా వేయు/తెచ్చు
**bring forward** ప్రవేశపెట్టు
**bring indictment** అభియోగం చేయు
**bringing a suit and prosecuting a suit** దావా వెయ్యటం, దావా నడిపించటం
**bringing into cultivation** సాగులోకి తేవటం
**bringing up** 1. పోషణ 2. శిక్షణ
**bring into** అనురూపం చేయు, **accord with**
**bring into action** యుద్ధంలోకి దింపు/ప్రవేశపెట్టు (నావికా సం॥)
**bring into commission** నిర్వర్తింపజేయు
**bring into force** అమలులోకి తెచ్చు
**bring into hatred** ద్వేషం కలిగించు
**bring off** విడుదల చేయించు: to procure to be acquitted
**bring offenders to justice** అపరాధులను న్యాయస్థానానికి లాగు/అప్పగించు
**bring out** వెలువరించు/బయటపెట్టు
**bring over** అనుకూల పరచుకొను
**bring round to** ఒప్పించు
**bring suit** దావా వేయు
**bring the case before a court** కేసును కోర్టుకు తెచ్చు
**bring to** ఆపు, నిలుపుచేయు (నావ సం॥)
**bring to book** విచారణకు గురిచేయు
**bring to effect** ఫల పర్యవసానానికి తెచ్చు, కార్యసిద్ధికి తెచ్చు
**bring to hammer** బహిరంగ వేలానికి పెట్టు
**bring to notice** దృష్టికి తెచ్చు
**bring to the notice of** (ఫలానావారి) దృష్టికి తెచ్చు
**bring under** వశం చేసుకొను, లోబరచుకొను
**bring upto date** ప్రస్తుతం చేయు/తాజా పరచు
**brisk trade** చురుకు వ్యాపారం
**broad** 1. స్థూల 2. విశాల
**broadcast n.** ప్రసారం **v.** ప్రసారం చేయు
**broadcaster** 1. ప్రసారకుడు 2. ప్రసారకం (యంత్రం)
**broadcasting authority** ప్రసారణ అధి

కారం/అధికారి
**broadcasting station** ప్రసార కేంద్రం
**broadcast receiver** రేడియో (సెట్టు)
**broadcast reproduction right** ప్రసార పునరుత్పాదన హక్కు
**broad distinction** స్థూల విభేదం
**broad guage** పెద్దలైను (రైల్వే)
**broadly classified** స్థూలంగా వర్గీకరించిన
**broadly speaking** స్థూలంగా చెప్పాలంటే
**broad outline** స్థూల రూపురేఖ
**broad outlook** స్థూల దృష్టి. దూరదృష్టి
**broad principles** స్థూల సూత్రాలు
**brochure** వివరణిక (చిన్న పుస్తకం)
**brokage** 1. దళారీ ద్వారా ఏర్పాటు 2. దళారీతనం 3. దళారీ వృత్తి
**broken** భగ్న, ఖండిత, విచ్ఛిన్న
**broken home** విచ్ఛిన్న కుటుంబం
**broken period** ఆటంక కాలపరిమితి
**broken period of service** సర్వీసు భగ్నకాలం, సర్వీసులో ఆటంక కాలపరిమితి
**broker** దళారీ, బ్రోకర్
**brokerage** 1. దళారీతనం 2. దళారీ రుసుం, బ్రోకరేజి
**brokerage office** దళారీ కార్యాలయం
**broker's bought note** దళారీ కొనుగోలు పత్రం
**broker's contract note** దళారీ ఒప్పంద పత్రం
**broker's note stamp** దళారీ నోటు స్టాంపు
**broker's sold note** దళారీ అమ్మిన పత్రం
**brothel** వ్యభిచార గృహం
**brother by full blood** పూర్ణరక్త సోదరుడు (తోబుట్టువు)
**brother by half blood** అర్ధ రక్త సోదరుడు: సవతి తల్లికి/తండ్రికి పుట్టిన వాడు, సవతి సోదరుడు
**brought forward** ముందుకు తీసుకొన్న/ఎక్కించిన
**brought forward account** వెనకపేజీ నుంచి ఎత్తిరాసిన లెక్క
**brought over** ముందుకు తీసుకొన్న/ఎక్కించిన
**brought upto date** ఇప్పటివరకు లెక్క రాసిన/తీసుకొన్న
**browbeating** గద్దింపు, బెదిరింపు
**brutal** క్రూర, పాశవిక
**brutum fulmen** ప్రభావం లేని తీర్పు
**bubble company** వంచక వ్యాపార సంస్థ
**buccaneer** ఓడదొంగ, సముద్రపు దొంగ, Pirate
**bucketshop** పందెపు దుకాణం, where facilities are given for making bets
**budget** బడ్జెటు, ఆయ వ్యయపట్టిక
**budget allotment** బడ్జెటు కేటాయింపు
**budgetary control** బడ్జెటు సంబంధ నియంత్రణ
**budgetary costing** బడ్జెటు సంబంధ వ్యయం
**budgetary deficit** బడ్జెటులో లోటు
**budgetary powers** బడ్జెటు సంబంధ అధికారాలు
**budgetary procedure** ఆయ వ్యయాల కార్యపద్ధతి, బడ్జెట్ కార్యపద్ధతి/విధానం
**budgetary process** బడ్జెటు సంబంధ ప్రక్రియ
**budgetary surplus** బడ్జెటు సంబంధ మిగులు
**budget control** బడ్జెటు నియంత్రణ
**budget demands** బడ్జెటు అభ్యర్థనలు, బడ్జెటు డిమాండ్లు
**budget division** బడ్జెటు విభజన
**budget estimates** బడ్జెటు అంచనాలు
**budget execution** బడ్జెటు నిర్వహణ / అమలు
**budget-grants** బడ్జెటు గ్రాంట్లు: డబ్బు మంజూరు చేసే పద్దుల ఏర్పాటు
**budget head** బడ్జెట్ పద్దు/మద్దు

**budgeting** బడ్జెట్ తయారు చేయటం
**budget motions** బడ్జెటు ప్రతిపాదనలు
**budget proposals** బడ్జెటు ప్రతిపాదనలు
**budget provision** బడ్జెటులో కేటాయింపు
**budget provision exists** బడ్జెట్ ఏర్పాటు ఉంది
**budget provision is not adequate** బడ్జెట్ ఏర్పాటు చాలినంతగా లేదు
**budget reform** బడ్జెటు సంస్కరణ
**budget session** బడ్జెటు సమావేశం
**budget, supplementary** అనుబంధ బడ్జెటు
**budget speech** బడ్జెటు ప్రసంగం
**budgetted** బడ్జెటు కెక్కిన
**buffer** కూటసాక్షి: డబ్బు తీసుకొని కూట (దొంగ) సాక్ష్యం ఇచ్చే వ్యక్తి
**buffer belt** రక్షిత ఆవరణ
**buffer-spring** బఫర్ స్ప్రింగ్: రైలు పెట్టెల పరస్పర సంఘర్షణ ప్రతిబంధకం
**buffer state** బఫరు రాజ్యం, మధ్య రాజ్యం: సంఘర్షణ ప్రతిబంధక రాజ్యం, బలమైన రాజ్యాలు సంఘర్షించకుండా మధ్య ఉన్న చిన్న రాజ్యం
**buffer stock** బఫర్ స్టాకు, రక్షిత నిలవ, అవసర నిలవ
**buffer zone** మధ్యస్థ మండలం
**buffet car** ఫలహారాల బోగీ (రైలు సం॥)
**buggery** వికృత మైథునం, **unnatural sexual intercourse**
**builder** భవన నిర్మాత
**building n.** భవనం **v.** భవన నిర్మాణం
**building association** భవన నిర్మాణ సమితి
**building contract** భవన నిర్మాణ కాంట్రాక్టు (గుత్తా)
**building equipment** భవన నిర్మాణ సామగ్రి
**building grant** భవన నిర్మాణ గ్రాంటు
**building land** నిర్మాణయోగ్య భూమి
**building laws** నిర్మాణ నియమాలు / చట్టాలు
**building lease** భవన కౌలు : భవన నిర్మాణానికి స్థలం కౌలు
**building lien** భవనంపై ధారణహక్కు
**building line** నిర్మాణ రేఖ
**building material** భవన నిర్మాణ సామగ్రి
**building operation** నిర్మాణ ప్రక్రియ
**building rules** భవన నిర్మాణ నియమాలు
**building site** ఇండ్ల స్థలం, భవన నిర్మాణ స్థలం
**building society** భవన నిర్మాణ సంఘం
**build up** పెంచు, నిర్మించు
**built up area** నిర్మిత స్థలం/భాగం
**bulk** రాశి, **main mass or body** స్థూలం, అధికాంశం, సామూహికం, అధికమొత్తం
**bulk cargo** భర్తీ సరుకు (ఓడ సం॥)
**bulk expenditure** భారీ వ్యయం/ఖర్చు; పెద్ద మొత్తంలో వ్యయం
**bulk indent** రాశి ఇండెంటు: పెద్ద పరిమాణంలో సరుకు అభ్యర్థన
**bulk inspection** స్థూల తనిఖీ
**bulk license** అధిక మొత్తాల లైసెన్సు (సరుకుల సం॥)
**bulk purchase** అధిక మొత్తం కొనుగోలు
**bulk sale** భారీ విక్రయం
**bulk supplies** అధిక మొత్తం సరఫరాలు
**bulky** స్థూల, భారీ, అధిక మొత్తంగల
**bulky entry system** భారీ నమోదు పద్ధతి
**bull 1.** ఎద్దు **2.** వెల పెంచేవాడు, బుల్ **(stock exchange) 3.** మతాధికారి శ్రీముఖం **4.** పరస్పర విరోధం, **a gross inconsistency 5.** హాస్యాస్పదమైన తప్పు
**bull-dog 1.** బుల్‌జాతి కుక్క **2.** మొండి ధైర్యశాలి
**bull-doze** భయభ్రాంతి కలిగించు
**bull-dozer** బుల్‌డోజర్: చదును యంత్రం (మిట్టపల్లాలకు)
**bullet** గుండు (తుపాకి)
**bulletin** బులెటిన్, లఘు వివరణిక (పత్రిక), సమాచార పత్రం

**bulletin of the House** సభా సమాచార పత్రం/వివరణిక
**bullet-proof** బులెట్ నిరోధక
**bullion exchange** బులియన్ వినిమయ స్థానం
**bullion market** వెండి బంగారాల బజారు, బులియన్ మార్కెట్
**bullion or ingot** వెండి బంగారాలు లేదా ముద్ద వెండి బంగారాలు
**bullish tendency** వెలలు పెంచే ధోరణి, బులిష్ ధోరణి
**bull's eye** 1. పోలీసులాంతరు, **dark police lantern** 2. లక్ష్యకేంద్రం
**bum-bailiff** 1. కింది బెయిలిఫ్, కింది అమీనా, **under bailiff** 2. అప్పు వసూలుదారు
**bumper crop** పుష్కల పంట
**bungle** n. గొప్ప పొరపాటు v. చెడగొట్టు, పాడుచేయు
**bunkering of vessels with liquid fuel** నౌకలలో ద్రవరూప ఇంధనాన్ని నింపటం
**burdened with onerous covenants** కష్టసాధ్యమైన ఒప్పంద పత్రాలతో కూడుకొన్న
**burden of debt** ఋణభారం
**burden of obligation** ధర్మ బాధ్యత భారం
**burden of proof** రుజువు చేసే భారం **onus probandi**
**burden of proving** రుజువు చేసే భారం
**burden of taxation** పన్నుల భారం
**bureau** 1. బ్యూరో, విభాగం 2. కార్యకేంద్రం
**bureaucracy** ఉద్యోగుల పెత్తందారీ, అధికార తంత్రాంగం, ఉద్యోగిస్వామ్యం, ఉద్యోగి వర్గపాలన
**bureaucrat** ఉద్యోగి-పెత్తందారు, అధికార తంత్రవాది
**bureaucratic approach** ఉద్యోగిస్వామ్య దృక్పథం
**bureaucratic power** ఉద్యోగి-పెత్తందారీ అధికారం
**bureau of documents** దస్తావేజుల విభాగం
**bureau of information** సమాచార కార్య కేంద్రం
**burglar** కన్నపు దొంగ, **a house breaker**
**burglar alarm** దొంగదాడి అలారం
**burglar proof** దొంగదాడి అరికట్టే(ది)
**burglary insurance** దొంగదాడి భీమా
**burial** సమాధి, గోరీ
**burial ground** శ్మశానం
**burial rites** అంత్యక్రియలు
**burn alive** సజీవ దహనం చేయు
**burning problem** అవశ్య సమస్య, రగులుతున్న సమస్య
**burning question** అవశ్య ప్రశ్న, ప్రస్తుతానికి సంబంధించిన ప్రశ్న, రగులుతున్న ప్రశ్న
**burnt sacrifice** ఆహుతి, **burnt offering**
**bursar** 1. బర్సర్ 2. పంపిణీదారు (డబ్బు)
**burthen of vessel** ఓడసరుకు భారం
**bury** సమాధి చేయు, పూడ్చు
**burying place** శ్మశానం
**business** 1. వ్యాపారం / కార్యం 2. వ్యవహారం 3. కార్యక్రమం
**business ability** వ్యాపార సమర్థత / దక్షత
**business acceptance** వ్యాపార అంగీకారం
**business activity** వ్యాపార కార్యకలాపం
**business acumen** వ్యాపార (కార్య) కుశాగ్రబుద్ధి
**business advisory committee** కార్యక్రమ సలహా సమితి
**business affairs** వ్యాపార / కార్య వ్యవహారాలు
**business already in existence** నడుస్తున్న వ్యాపారం/వ్యవహారం
**business asset** వ్యాపార ఆస్తి
**business combination** వ్యాపార సమ్మేళనం
**business concern** వ్యాపార సంస్థ

**business craft** వ్యాపార తంత్రం
**business cycle** వ్యాపార చక్రం
**business depression** వ్యాపార మాంద్యం
**business entrepreneur** వ్యాపార వ్యవస్థాపకుడు
**business enterprise** 1. వ్యాపార సంస్థ 2. వ్యాపార సాహసం
**business ethics** వ్యాపార నీతి
**business failure** వ్యాపార విఫలత
**business forecast** వ్యాపార భావిసూచన
**business group** వ్యాపార కూటం / వర్గం
**business growth** వ్యాపార వృద్ధి
**business hours** 1. వ్యాపార వేళలు 2. పనివేళలు (సమావేశ సం॥)
**business is no longer in existence** ప్రస్తుతం నడవకుండా ఉన్న వ్యాపారం/ వ్యవహారం, ప్రస్తుతం అస్తిత్వం లేని వ్యాపారం / వ్యవహారం
**business, list of** వ్యాపార / కార్యక్రమ పట్టిక
**business magnate** పలుకుబడిగల వ్యాపారి
**business management techniques** వ్యాపార నిర్వహణ మెలకువలు
**business morality** వ్యాపార నీతి / బద్ధత
**business motivation** వ్యాపార ప్రేరణ
**business of booking passages** ప్రయాణాల నమోదు వ్యవహారం / వ్యాపారం
**business of corporation** కార్పొరేషను వ్యవహారం
**business of dealing in securities** పూచీ పత్రాల వ్యాపారం
**business of Govt.** ప్రభుత్వ వ్యవహారం
**business of the House** సభాకార్యక్రమం
**business outstanding** మిగిలిపోయిన కార్యక్రమం
**business outstanding at the end of the day** రోజు చివర మిగిలిన పని
**business paper** వ్యాపార పత్రం
**business premises** వ్యాపార స్థలం
**business principles** వ్యాపార సూత్రాలు
**business prosperity** వ్యాపార వర్ధనం / వృద్ధి
**business prudence** వ్యాపార వివేకం
**business purchase** వ్యాపార కొనుగోలు
**business returns** 1. వ్యాపార రాబడులు 2. వ్యాపార లెక్కల పట్టికలు
**business revenue** వ్యాపార రాబడి
**business risk** వ్యాపార నష్టపూచీ
**business rules** వ్యాపార నియమాలు
**business, sudden and urgent** అకస్మాత్తు, జరూరు కార్యం
**business talent** వ్యాపార ప్రజ్ఞ
**business to be dealt with at the meeting** సమావేశంలో చర్చించవలసిన వ్యవహారం
**business transactions** వ్యాపార లావాదేవీలు
**busy season** పనిఒత్తిడి కాలం
**busy year** పనిఒత్తిడి సంవత్సరం
**butchering habits** వధ విధానాలు
**but for the provision** నిబంధన లేనట్లయితే
**but not exceeding in any case** ఏ పరిస్థితులలోనూ అధిగమించని / అతిక్రమించని
**but on the contrary** దానికి వ్యతిరేకంగా
**butt end** 1. పనిముట్టు పిడి 2. మడమ
**butts and bounds** హద్దులూ ఎల్లలూ
**buy again** విడిపించుకొను, **redeem**
**buy at a bargain** చౌకగా కొను, **buy cheaply**
**buy back** అమ్మినదాన్ని తిరిగికొని తీసుకొను, క్రయం ద్వారా వాపసు తీసుకొను
**buyer's market** కొనుగోలుదార్ల మార్కెట్
**buyer's monopoly** కొనుగోలుదార్ల గుత్తాధిపత్యం
**buyer's risk** కొనుగోలుదారు నష్టపూచీ
**buyer's surplus** కొనుగోలుదార్ల మిగులు
**buy in** కొని తెచ్చు: వేలంలో పాట చాలా

తక్కువగా ఉన్నప్పుడు యజమాని తరఫున అమ్మజూపిన వస్తువును కొనుగోలు చెయ్యటం
**buying agent** కొనుగోలు ఏజెంటు
**buying and selling** కొనుగోలు-అమ్మకం, క్రయవిక్రయాలు
**buying and selling of shares** వాటాల అమ్మకాలూ కొనుగోళ్లూ/ క్రయ విక్రయాలు
**buying committee (purchase)** కొను గోలు సంఘం
**buy off** కొనివేయు
**buy on credit** అరువుపై కొను
**buy over** కొనివేయు
**buy the bargain dear** ప్రియంగా కొను: సరుకు అంతాకొను, మొత్తంకొని వేయు
**by 1.** ద్వారా, వల్ల, చేత, తో **2.** మారిఫత్తున **(on one's behalf) 3.** కారణంగా, రీత్యా, ప్రకారం, వారీగా
**by a certain date** ఫలానా తేదీకి
**by agency of** ఏజన్సీ ద్వారా (మూలకంగా)
**by air mail** విమాన టపా ద్వారా
**by all means** అన్ని విధాలా; అవశ్యంగా
**by an order on the bank** బాంకు ఆర్డరు ద్వారా
**by and by** క్రమక్రమంగా, మెల్లమెల్లగా
**by any means** ఏ విధంగానైనా
**by authority** అధికారంతో (ద్వారా)
**by beat of drums** దండోరా ద్వారా
**by birth** జన్మతో, పుట్టుకతో
**by cash** నగదు రూపంలో
**by cheque** చెక్కు రూపంలో
**by command** ఆజ్ఞ ద్వారా
**by count** లెక్క ప్రకారం
**by duly authorised agent** యథా క్రమంగా అధికారం పొందిన ఏజెంటు ద్వారా
**bye election** ఉప ఎన్నిక
**bye-laws** ఉప నిబంధనావళి/ శాసనాలు/ నియమాలు
**by error in writing** రాతలో తప్పు వల్ల
**by escheat or lapse or as bona vacantia** బేవారసు ఆస్తివల్ల లేదా కాలా తీతం కావటంవల్ల లేదా యజమాని లేక పోవటంవల్ల
**by express delivery** ఎక్స్‌ప్రెస్ /సత్వర బట్వాడా ద్వారా
**by far the best** చాలా ఉత్తమంగా
**by force** బలవంతంగా
**by general order** సాధారణ ఉత్తర్వు ద్వారా
**by general or special order** సాధారణ లేదా ప్రత్యేక ఉత్తరువు ద్వారా
**bygone** గతించిన
**by guess** ఊహామాత్రంగా
**by hand** చేతితో
**by implication** అంతస్సూచనగా
**by instalment** కిస్తులవారీగా, వాయిదాలుగా
**by itself** స్వయంగా **(intrinsically, directly)** (ప్రత్యక్షంగా, నేరుగా)
**by land** భూమార్గంగా
**by-lane** చిన్న సందు
**by law** శాసన ప్రకారం, చట్టరీత్యా
**by-legislation** ఉపశాసనం
**by-line** రచయిత పేరు
**by means of** అనుసరించి, పద్ధతి ప్రకారం
**by mere letters** కేవలం ఉత్తరాల కారణం గా
**by mistake** పొరపాటున
**by name n.** పేరుతో, మారుపేరు, ఇంటి పేరు
**by nature** ప్రకృతి సిద్ధంగా
**by necessary implication** అవసరమైన అంతస్సూచనతో
**by no means** సుతరామూ, ససేమిరా, ఏమైనా
**by notification** ప్రకటన ద్వారా/ రీత్యా
**by order** ఉత్తరువు ప్రకారంగా, ఉత్తరువుతో
**by order of the Governor** గవర్నరు ఉత్తరువుతో
**by ordinary telegram** సాధారణ తంతి ద్వారా

**by or on behalf of** ద్వారా గాని లేదా తరఫున గాని
**by or under** ద్వారా లేదా అధీనంలో
**by or under the law** శాసనం ద్వారా లేదా అధీనంలో
**by-pass n. 1.** ఉపమార్గం, పక్కదారి **v. 2.** తప్పించుకొనిపోవు, తప్పుకొని పోవు, దాటవేసుకొని పోవు
**by parol** నోటిమాట ద్వారా
**by post** తపాలా/ పోస్టు ద్వారా
**by-product** ఉప ఉత్పత్తి
**by proxy** ప్రతినిధి ద్వారా
**by-purpose** ఉప ప్రయోజనం
**by reason of** కారణం చేత
**by reason of absence** గైర్ హాజరు కారణంగా
**by reason of a mistake of law** శాసన విషయక పొరపాటు వల్ల
**by reason of death** మరణకారణంగా
**by reason of youth** యౌవనావస్థవల్ల
**by reference to** నిర్దేశానుసారంగా
**by registered post** రిజిస్టరు పోస్టు ద్వారా
**by return of post** తిరుగు టపాలో
**by right** హక్కుగా
**by rotation** వంతుల వారీగా
**by securing and protecting** చేకొంటూ రక్షిస్తూ
**by special messenger** ప్రత్యేక వార్తా వహుడి ద్వారా
**by special order** ప్రత్యేక ఉత్తర్వుద్వారా
**by-stander** చూసిన వ్యక్తి
**by subjecting** అధీనం చేసి, గురిచేస్తూ, లోనయ్యే విధంగా చేస్తూ
**by suppression** అణచివేతవల్ల
**by surface route** నేలమార్గంగా
**by the action of** చర్యవల్ల
**by the by** ప్రసంగవశాత్తు **(incidentally)**
**by the variance** తేడాతో
**by trial** విచారణతో (న్యాయ సం॥)
**by trial and error** ప్రయత్న-దోష ఫలిత క్రమంగా
**by virtue of** ఆ రీత్యా, ఫలానా కారణం (బలం) వల్ల
**by virtue of commutation of sentence** శిక్ష తగ్గించటం వల్ల
**by virtue of office** పదవిరీత్యా, హోదాను బట్టి
**by virtue of the authority vested** అధికార సంక్రమింపువల్ల
**by volume** పరిమాణం ప్రకారం
**by warrant under his hand and seal** తన చేవ్రాలు, ముద్రగల అధిపత్రం ద్వారా
**by way** దగ్గరి మార్గం, పక్కదారి
**by way of** ద్వారా
**by way of amendment** సవరణ ద్వారా
**by way of beneficial ownership** లాభం పొందే సొంత హక్కువల్ల
**by way of damage** నష్టపరచడం ద్వారా
**by way of depreciation** విలువ తగ్గింపు ద్వారా
**by way of etiquette** సంఘ మర్యాద రీతిగా
**by way of exchange** మార్పిడిద్వారా, వినిమయ రూపంగా
**by way of penalty** జరిమానా రూపంలో
**by way of repeal or amendment** రద్దు లేదా సవరణ రూపంలో
**by way of trial 1.** విచారణ ద్వారా **2.** ప్రయత్నపూర్వకంగా
**by whatever form of words** అది ఎట్లాంటి పదాలతో ఉన్నా
**by whatever name called** ఏ పేరుతో వ్యవహరించినా/ పిలిచినా
**by word or action** మాట ద్వారా లేదా కార్యం ద్వారా
**by word of mouth** మౌఖికంగా
**by writing under his hand** తన వ్రాత మూలకంగా

# C

**cabal** కుట్రదారుల ముఠా, కక్ష
**cabinet** మంత్రిమండలి
**cabinet allocation** మంత్రిత్వ శాఖల కేటాయింపు
**cabinet council** మంత్రిమండలి
**cabinet councillor** మంత్రి మండలి సభ్యుడు
**cabinet crisis** మంత్రిమండలి సంక్షోభం
**cabinet minister** కాబినెట్ హోదా మంత్రి
**cabinet mission** మంత్రివర్గ రాయబారం
**cabinet of arms** ఆయుధ పరికరాల పెట్టె
**cabinet rank** కాబినెట్ హోదా
**cabinet reshuffle** మంత్రివర్గ పునర్వ్యవస్థీకరణ
**cabinet resolution** మంత్రిమండలి తీర్మానం
**cabinet responsibility** మంత్రిమండలి బాధ్యత: మంత్రిమండలి సమష్టి బాధ్యత
**cable** కేబుల్, అంతర్దేశ తంతి
**cablegram** కేబుల్‌గ్రాం, అంతర్దేశతంతి, సముద్ర తంతివార్త
**cable guard** కేబుల్ రక్షకుడు
**cable supervisor** కేబుల్ పర్యవేక్షకుడు
**cabotage** కోస్తా నౌకా వ్యాపారం **navigation along the coast**
**caco economy** దుష్ట నిర్వహణ, **bad management**
**cadastral** భూబందులెక్కల రిజిస్టరు: శిస్తు పన్ను విధించడం కోసం స్థిరాస్తి పరిమితి, దాని విలువ, హక్కులు తెలిపే రిజిస్టరు
**cadastral surveyor** భూముల సర్వేయరు
**cadastre** స్థిరాస్తి రిజిస్టరు: పన్నులు విధించటానికి సమస్త వివరాలతో దేశంలో సకల స్థిరాస్తి నమోదు చేసిన రిజిస్టరు
**cadaver** మనిషి శవం
**cadaveric rigidity** శవంలాగా బిగిసి ఉండటం
**cadaverous** 1. శవ సదృశ 2. పూర్తిగా పాలిపోయిన, **pale**
**cadet** కడెట్, యువసైనికుడు
**cadet corps** కడెట్‌కోర్, యువసైనిక దళం
**cadit quaestio** ప్రశ్న వీగిపోయింది
**cadre authority** కాడర్ అధికారం
**cadre check** కాడర్ తనిఖీ
**cadre post** కాడర్ పదవి
**cadre register** కాడర్ రిజిస్టరు
**cadre strength** కాడర్ బలం (సంఖ్య)
**caduciary right** వేవారసు ఆస్తి స్వాధీన హక్కు: వారసులు లేని వారి ఆస్తిని ప్రభుత్వం తీసుకొనే హక్కు
**caesarean operation** సిజేరియన్ ఆపరేషన్, శస్త్రచికిత్స ద్వారా బిడ్డను తీయడం
**cage** 1. బోను 2. పంజరం
**cairn** గుర్తురాళ్ల కుప్ప: సరిహద్దులు మొ॥ వానిపై గుర్తుగా పేర్చిన రాతికుప్ప
**caitiff** నీచ, దుష్ట (వ్యక్తి)
**calamity** అరిష్టం, దుర్ఘటన, విపత్తు
**calculable** గణనీయ
**calculate** 1. గణనం చేయు 2. ఉద్దేశించు
**calculated to deceive** మోసగించటానికి ఉద్దేశించిన
**calculated to deprive** రిక్తపరిచే దృష్టితో లెక్కించిన
**calculated to embarrass** కలవరపెట్టే ఆలోచనతో
**calculated to the nearest multiple of** సమీపగుణకం వరకు లెక్కకట్టిన
**calculating machine** గణన యంత్రం
**calculation of cash price** నగదు ధర లెక్కకట్టటం
**calculation of interest** వడ్డీ లెక్కకట్టడం
**calculation of means** సాధనాలు లెక్కకట్టటం
**calculation of purchase consideration** కొనుగోలుధర లెక్కకట్టటం
**calculations and rates checked** లెక్కింపులూ రేట్లూ తనిఖీ చెయ్యడమయింది
**calculations checked by me** నేను / నా ద్వారా లెక్కింపులు తనిఖీ చెయ్యడమైంది

**calculation slip** లెక్కింపు కాగితం
**calculator 1.** గణకయంత్రం **2.** గణకుడు
**calendar 1.** కాలెండర్, జంత్రి (తేదీల పట్టిక) **2. v.** క్రమప్రకారం పేర్చు, పట్టికలో చేర్చు
**calendar cases** కాలెండర్ కేసులు
**calendar day** కాలెండర్ దినం (అర్ధరాత్రి నుంచి అర్ధరాత్రివరకు)
**calendar month** కాలెండర్ నెల
**calendar returns** కాలెండర్ వివరణికలు
**calendar year** కాలెండర్ సంవత్సరం
**caliber** ప్రవీణత, సామర్థ్యం
**calibration** పరిమాణ మాపనం, ప్రమాణ నిర్దేశం
**call n. 1.** వాటాకిస్తీ **2.** పిలుపు **v.1.** ఆహ్వానించు **2.** ఆదేశించు, సమను చేయు, పిలిపించు
**call a halt** ఆపు చేయు/ ఆగమని నిర్ణయించు
**call account** పిలుపు ఖాతా
**call attention motion** సావధాన తీర్మానం
**call attention notice** సావధాన నోటీసు
**call attention to** గుర్తుచేయు, దృష్టికితెచ్చు
**call back pay 1.** విశేష పని వేతనం **2.** ఉపస్థితి వేతనం
**call bell** పిలుపు గంట
**call bond** వసూలు వాయిదా నిర్ణయపత్రం
**call book** కాల్‌బుక్, వాయిదాల పుస్తకం
**call by whatever name** పేరు ఏది ఉన్నప్పటికీ
**call cousins (claim kinship with)** చుట్టరికం కలుపుకొను
**call counting machine** పిలుపుల లెక్కింపు యంత్రం
**call day** వకాలతులో చేరే దినం
**call deposit** కోరిన డిపాజిట్/ కాల్ డిపాజిట్ **(demand deposit)**
**called forth** చేరబిలిచిన (సైన్యం వగైరా)
**called for trial** విచారణకు పిలిచిన
**called on for hearing** విచారణకు పిలవనంపు
**called to the bar** న్యాయవాదిగా అంగీకరించబడిన
**called up capital** చెల్లించగోరిన మూలధనం
**call evidence** సాక్ష్యం రప్పించు
**call for** పిలువనంపు, తెప్పించు (రికార్డులు వగైరా)
**call for and examine the record** రికార్డు తెప్పించి పరిశీలించు
**call for applications** దరఖాస్తులనుకోరు
**call for a report** నివేదిక అడుగు
**call for documents** దస్తావేజులు తెప్పించుకొను / కోరు
**call for explanation** సంజాయిషీ అడుగు
**call for explanation or information** సంజాయిషీ లేదా సమాచారం అడుగు
**call for inspection** తనిఖీకి ఆజ్ఞాపించు
**call for interview** ఇంటర్వ్యూకు పిలుచు/ పిలువనంపు
**call for such recommendations as are deemed fit** యుక్తమని భావించిన సిఫారసులు తెప్పించు
**call forth** ముందుకు తెచ్చు, హాజరుపరుచు
**call for the file** ఫైలును తెప్పించు
**call for the record** రికార్డుకోరు/ తెప్పించు
**calligraphist** సులేఖరి/ వ్రాయసకాడు
**calligraphy** సులేఖనం
**call in 1.** సంగ్రహించు, పోగుచేయు, **2.** ఉపసంహరించు, చలామణి నుంచి తొలగించు
**call indicator** పిలుపు గుర్తు
**calling 1.** వృత్తి **2.** పిలుపు
**calling a case for trial** కేసు విచారణకు పిలిపించు
**calling signal** పిలుపు సిగ్నల్
**callings tax** వృత్తుల పన్ను
**calling witness for the prosecution** ప్రాసిక్యూషన్‌కు సాక్షిని పిలవటం
**call in pay** హాజరు వేతనం/ జీతం
**call in question 1.** వివాదించు **2.** అనుమానించు

**call loans** పిలుపు ఋణాలు
**call money** కాల్‌మనీ. కోరిన ధనం: అడిగినప్పుడు చెల్లించవలసిన డబ్బు
**call names to** దూషించు
**call off** మానిపించు, విరమించు. ఉపసంహరించు: కర్తవ్యం నుంచి మళ్లించు
**call off duty** కర్తవ్యం నుంచి మళ్లించు/ విరమింపజేయు
**call of the House** శాసన సభ్యుల హాజరీ పిలుపు
**call out** బిగ్గరగా పిలుచు
**call out for service** సేవకోసం పిలుచు
**call over** హాజరీ పిలుపు (పేర్ల వారీగా)
**call rate** పిలుపు రేటు
**call in advance** ముందుగా వసూలుకు పిలుపులు
**calls in arrears** బకాయి వసూలు పిలుపులు
**calls on shares** వాటాల వసూలు పిలుపులు
**calls unpaid** చెల్లించని వాటికి పిలుపులు
**call the roll** హాజరీ పరిశీలనకు పిలుపు
**call to account for** 1. సంజాయిషీ కోరు 2. లెక్క చూపవలసిందిగా కోరు
**call to mind** స్మరించు, జ్ఞాపకం చేసుకొను
**call to order** క్రమం పాటింపు హెచ్చరిక చేయు
**call to witness** సాక్ష్యానికి పిలుచు
**call up** సైనిక సేవకు / కొలువుకు ఆదేశించు, **summon to serve in the army**
**call up for training** శిక్షణ కోసం పిలువనంపు / పిలుచు
**call upon** ప్రేరేపించు, అడుగు
**call upon to give evidence** సాక్ష్యం ఇవ్వడానికి పిలుచు
**call upon to show cause** కారణం చూపమని ఆదేశించు
**call upto** 1. దృష్టికి తెచ్చు 2. చెల్లించమని కోరు
**calm** 1. నిశ్చలమైన 2. నెమ్మదైన
**calumniation** అపనింద
**calumniator** అపనింద వేసేవాడు
**camarilla** గూడుపుఠాణీదార్లు, ముఠా, వర్గం
**cambist** 1. బిల్లుల (వినిమయ పత్ర) వ్యాపారి: **a dealer in notes and bills of exchange** 2. వినిమయ వ్యాపార నిపుణుడు: **a person skilled in exchange**
**cambium** వినిమయం (రొక్కం, భూమి సం॥)
**cameral** 1. ఛేంబర్ సంబంధమైన విధాన సభ / న్యాయస్థానం సం॥ 2. ప్రభుత్వ ఖజానా సంబంధమైన **or pertaining to public finance**
**camouflage** మభ్యపెట్టు, కప్పిపుచ్చు
**camp** 1. శిబిరం 2. మకాం
**campaign** 1. కార్యవర్తన/ ప్రచారం, 2. దాడి
**campaign activities** ఉద్యమ కార్య కలాపాలు
**campaign officer** కార్యవర్తన అధికారి
**camp assistant** శిబిర సహాయకుడు
**camp equipment** శిబిర సాధన సామగ్రి
**camper** మకాం చేసే వ్యక్తి
**camping site / ground** మకాం స్థలం/ చోటు
**camp office** మకాం / శిబిర కార్యాలయం
**camp officer** శిబిర అధికారి / దౌరా అధికారి
**campus** ఆవరణ
**can act with balance and strength in emergency** అత్యవసర పరిస్థితిలో సమతుల్యంగానూ పటిష్ఠంగానూ వ్యవహరించగల(రు)
**canal irrigation** కాలవ నీటి పారుదల
**canal system** కాలవల పద్ధతి
**cancellation** రద్దు
**cancellation and consolidation of debts** ఋణాల రద్దు, రాశీకరణం/ ఏకీకరణ
**cancellation clause** రద్దు క్లాజు/ ఖండం
**cancellation deed** రద్దు పత్రం
**cancellation notice** రద్దు నోటీసు

**cancellation of allotment** కేటాయింపు రద్దు
**cancellation of indent** ఇండెంటు రద్దు
**cancellation of instrument** దస్తావేజు రద్దు
**cancellation of nomination** నామినేషన్ రద్దు, నామనిర్దేశం రద్దు
**cancellation of registration** రిజిస్ట్రేషన్ రద్దు
**cancellation of shares** వాటాల రద్దు
**cancelled cheque** రద్దయిన చెక్కు
**cancelled draft** 1. రద్దయిన డ్రాఫ్ట్ 2. రద్దయిన ముసాయిదా
**cancelled note** రద్దయిన నోటు
**cancelled stamp** రద్దయిన స్టాంపు
**cancel release** విడుదల రద్దు చేయు
**cancel the charge** ఆరోపణ రద్దు చేయు
**cancel the pardon** క్షమార్పణ రద్దు చేయు
**candidacy / candidature** అభ్యర్థిత్వం
**candidate** అభ్యర్థి
**candidate for election** ఎన్నికకు అభ్యర్థి
**cannon** ఫిరంగి
**cannonade** ఫిరంగుల వర్షం
**cannot be acceded to** సమ్మతించరాని/ వీలులేని
**cannot be permitted** అనుమతించ కూడదు / వీలులేదు
**canon** 1. సూత్రం 2. ధర్మనియమం
**canonical** ధర్మనియమానుకూల(ం), సూత్రానుబద్ధ(ం)
**canonical form** సూత్రప్రమాణ రూపం
**canon law** సూత్ర న్యాయశాసనం (క్రైస్తవ సం॥)
**canon of book number** గ్రంథ సంఖ్యా సూత్రం
**canon of certainty** నిశ్చయక సూత్రం
**canon of collection number** వసూలు/ సేకరణ సంఖ్యా సూత్రం
**canon of context** సందర్భ సూత్రం
**canon of convenience** సౌకర్య నియమం
**canon of currency** ద్రవ్య చలామణి సూత్రం
**canon of economy** పొదుపు సూత్రం
**canon of equality** సమతా సూత్రం
**canon of financial propriety** విత్తీయ ఔచిత్య సూత్రం
**canon of hospitality** ఆతిథ్య సూత్రం/ ధర్మం
**canon of inheritance** వారసత్వ సూత్రం
**canon of interpretation** వ్యాఖ్యాన సూత్రం
**canon of productivity** ఉత్పాదకతా సూత్రం
**canon of taxation** పన్నుల విధింపు సూత్రం
**cantonment** సైనిక స్థావరం, లష్కరు, కంటోన్మెంట్
**contonment area** కంటోన్మెంట్ ప్రాంతం/ ఏరియా
**cantonment authority** కంటోన్మెంటు పాలకసంఘం/ అధికారి
**cantonment board** కంటోన్మెంటు మండలి
**canvas background** కాన్వాసు ఆధారం
**canvasser** ప్రచారకుడు
**canvass for vote** వోట్ల ప్రచారం
**capability** సామర్థ్యం
**capable** 1. సమర్థ(ం) 2. ధారక(ం) 3. వ్యాపక(ం) 4. యోగ్య(ం)
**capable but bit slow** సమర్థమైనప్పటికీ కాస్త నిదానం/ మందగోలు
**capable by law** శాసనరీత్యా సమర్థం
**capable in difficult job** కష్టతరమైన పనిలో సమర్థమైన
**capable of being perceived** తెలుసుకోటానికి వీలయిన
**capable of being perceived by the senses** సరియైన స్మృహలో ఉండు
**capable of correction** సరిదిద్దడానికి సమర్థమైన
**capable of delivery** అప్పగించటంలో సమర్థమైన

**capable of execution** అమలుపరచటానికి/ నిర్వహించటానికి యోగ్యమైన
**capable of instituting a suit** దావా వేయదగిన
**capable of making defence** రక్షించుకో గలిగిన సమర్థతగల
**capable of manual delivery** చేతి మీదుగా అందించగల/ బట్వాడా చెయ్యగల
**capable of meeting the charge** 1. ఆరోపణను ఎదుర్కొనగలిగే 2. పదవీ బాధ్యత ఎదుర్కొనే
**capable of physical possession** స్వాధీనానికి వీలైన
**capable of remedy** 1. చికిత్సకు తగిన 2. పరిహారానికి తగిన
**capacity** 1. సమర్థత 2. భారకత 3. వ్యాపకత 4. యోగ్యత 5. హోదా
**capacity, mental** మానసిక సమర్థత/ యోగ్యత
**capacity, official** అధికార హోదా
**capacity of parties** పార్టీల సమర్థత
**capacity to contract** కాంట్రాక్టు చేసుకొనే యోగ్యత
**capacity to pay wages** జీతాలు చెల్లించే సమర్థత
**capital** 1. మూలధనం: స్థిర చరాస్తి రూపంలో వాటాల రూపంలో ఉన్న పెట్టుబడి 2. రాజధాని 3. పెద్ద
**capital account** మూలధనం ఖాతా
**capital accumulation** మూలధన సంచయనం
**capital acquisition** మూలధన సేకరణ
**capital and revenue accounts** మూలధన రాబడి ఖాతాలు
**capital appropriation** మూలధన వినియోజనం
**capital asset** మూలధన ఆస్తి
**capital budget** మూలధన బడ్జెట్
**capital charge** మూలధన విధింపు
**capital cost** మూలధనం వ్యయం: స్థిరాస్తి సంపాదనకై పెట్టిన ఖర్చు మొత్తం - భూములూ యంత్రాలూ వగైరాలు కొనటానికైన ఖర్చు
**capital cost of the building** భవన నిర్మాణ మూలధన వ్యయం
**capital credit** మూలధన పరపతి
**capital credited as paid** మూలధనం చెల్లించినట్లుగా జమచూపటమైంది
**capital crime** మరణ దండనార్హమైన నేరం
**capital deficiency** మూలధన లోటు
**capital dividend** మూలధన లాభాంశం
**capital duty** మూలధనంపై పన్ను
**capital employed in the business** వ్యాపారంలో పెట్టిన మూలధనం
**capital equipment** మూలధన సాధన సామగ్రి
**capital expenditure** మూలధన వ్యయం
**capital formation** మూలధన కల్పన
**capital fund** మూలధన నిధి
**capital gains** మూలధన ఆదాయం
**capital gains tax** మూలధన లాభాలపై పన్ను
**capital gearing** మూలధన నిష్పత్తి నిర్ణయం
**capital goods** ఉత్పాదక వస్తువులు
**capital improvement** మూలధనం పెంపు / వృద్ధి
**capital inflow** మూలధన అంతర్గమనం
**capital inputs** మూలధన ఉత్పాదకాలు
**capital intensity industry** మూలధన సాంద్రత పరిశ్రమ
**capital investment** మూలధన వినియోగం
**capital issue method** మూలధనం జారీ పద్ధతి
**capitalist** పెట్టుబడిదారు
**capitalistic** పెట్టుబడిదారీ (లక్షణాలు గల)
**capitalistic economy** పెట్టుబడిదారీ ఆర్థికవ్యవస్థ
**capitalistic industrial economy** పెట్టుబడిదారీ పారిశ్రామిక ఆర్థికవ్యవస్థ
**capitalistic production** పెట్టుబడిదారీ

ఉత్పత్తి
**capitalistic system** పెట్టుబడిదారీ వ్యవస్థ
**capitalization** మూలధనంగా మార్పిడి, మూలధనీకరణ
**capitalization of assets** మూలధనంగా ఆస్తుల మార్పిడి
**capitalization of profits** మూలధనంగా లాభాల మార్పిడి
**capitalization of reserves** మూలధనంగా నిల్వల మార్పిడి
**capitalized expenditure** మూలధనంగా మారిన ఖర్చు
**capitalized profit** మూలధనంగా మార్చిన లాభం
**capital lease** అయివేజు
**capital loan** మూలధన ఋణం
**capital loss** మూలధన నష్టం
**capital offence** మరణ దండనార్హమైన నేరం
**capital outflow** మూలధన బహిర్గమనం
**capital outlay** మూలధన పరివ్యయం
**capital output** మూలధన ఉత్పత్తి
**capital output ratio** మూలధన ఉత్పత్తి నిష్పత్తి
**capital payment** మూలధన చెల్లింపు
**capital plant** పెద్ద యంత్రాగారం
**capital profit** మూలధన లాభం
**capital punishment** మరణదండన, ఉరి శిక్ష
**capital receipts** పెట్టుబడి వసూళ్ళు
**capital redemption business** మూలధన విమోచన వ్యాపారం
**capital redemption fund** మూలధన విమోచక నిధి
**capital redemption reserve account** మూలధన విమోచన రిజర్వు ఖాతా
**capital redemption reserve fund** మూలధన విమోచన రిజర్వు నిధి
**capital reserve** మూలధన క్షేమనిధి: పెట్టుబడి నష్టం పూడ్చడానికి లాభంలోంచి తీసి ఉంచిన సొమ్ము
**capital sentence** ఉరిశిక్ష
**capital stores** మూలధన సామగ్రి
**capital structure** మూలధన వ్యవస్థ
**capital subscribed** చెల్లించిన మూలధనం
**capital turn over** మూలధన ఆవర్తనం
**capital value determination** మూలధన విలువ నిర్ధారణ
**capital work** భారీపని
**capitation** తలసరి (పన్ను)
**capitation allowance** తలసరి బత్తెం
**capitation fee** తలసరి రుసుం
**capitis deminutio** హక్కుల భంగం (స్వేచ్ఛ, పౌరసత్వ, కుటుంబ సం||)
**capitula** ఆర్డినెన్సు ఉత్తరువుల వర్గీకరణ
**capitulation** 1. షరతులపైన వశపడటం 2. వశ పడటానికి చేసుకొన్న షరతుల ఏర్పాటు పత్రం
**capricious partiality** అనుచిత పక్షపాతం
**capsize** తలకిందవు, బోల్తాపడు
**capsule** 1. నాళిక 2. గుళిక
**captain** దళపతి, కేప్టెన్
**captain of industry** పరిశ్రమ దళపతి, పరిశ్రమ కేప్టెన్
**caption** 1. నిర్బంధం 2. పత్రధ్రువీకరణ 3. శీర్షిక
**captivate** బందీ చేయు, వశపరచుకొను
**captive** బందీ
**captive animal** బందెల పశువు
**captivity or confinement** బందీ లేదా నిర్బంధం
**captor** బందీచేసేవాడు
**capture** బందీచేయు, వశమవు, చిక్కు
**capturing force** బందీ చేసే బలం/ దళం
**caput** న్యాయసమ్మత హక్కులు: స్వేచ్ఛ, పౌరహక్కులు (రోమన్‌లా ప్రకారం)
**carat** 1. వన్నె (బంగారు సం||) 2. ఇరవై నాలుగో వంతు 3. నాలుగు వడ్ల గింజల ఎత్తు
**carcass** మృత కళేబరం
**carcass utilisation centre** మృత

కళేబరాల వినియోగ కేంద్రం
**card board** దళసరి అట్ట
**card holder** కార్డున్న వ్యక్తి, కార్డు హోల్డర్
**cardinal** ప్రధానమైన
**cardinal issue** ప్రధానాంశం, ప్రధాన వివాదాంశం
**cardinal principles** ప్రధానసూత్రాలు
**card index cabinet** కార్డు సూచిక అర
**carding 1.** కార్డు పద్ధతి **2.** ఏకడం.
**card system** కార్డు విధానం
**care 1.** జాగ్రత్త **2.** సంరక్షణ
**care and caution** జాగ్రత్తా హెచ్చరికా
**care and custody for the goods** అధీన సరకుల సంరక్షణ
**care entrusted to him** సంరక్షణ భారం అతనికివ్వటమైంది
**career** వ్యాసంగం (విద్యా, వ్యాపార, జీవన సం॥), జీవనోపాధి మార్గం
**career management** వ్యాసంగ / జీవనోపాధి నిర్వహణ
**career master** వ్యాసంగ పరామర్శకుడు
**career principle** వ్యాసంగ సూత్రం, జీవనోపాధి సిద్ధాంతం
**career service** జీవనవృత్తి సేవ
**carefulness** జాగరూకత, సావధానత
**careful observance** మెలకువతో పరిశీలించటం
**care home** సంరక్షణ గృహం
**careless and negligent** అశ్రద్ధ, నిర్లక్ష్య
**carelessness** అజాగ్రత్త, నిర్లక్ష్యం
**care of** ద్వారా, సంరక్షణలో
**caretaker** సంరక్షకుడు: ఆపద్ధర్మకర్త (ఆస్తిపాస్తుల సం॥), కేర్‌టేకర్
**caretaker government** ఆపద్ధర్మ ప్రభుత్వం: పని జరిపించటానికేర్పడిన తాత్కాలిక ప్రభుత్వం
**cargo** రవాణా సరుకు
**cargo clearance** రవాణా సరుకు ఖాళీ చేయటం
**cargo rate** రవాణా రేటు
**cargo ship** సరుకుల ఓడ
**caricature** వికట చిత్రణ, వ్యంగ్య చిత్రణ
**car load rate** కారు ఖర్చీ రేటు
**carnage** మారణహోమం (ముఖ్యంగా జనుల సం॥)
**carnal intercourse** సంభోగం (శారీరక)
**carnal knowledge** లైంగిక జ్ఞానం
**carp** దోషాన్వేషణ
**carpe diem** వర్తమాన స్థితిని ఆనందించాలి, enjoy the present
**carping criticism** కువిమర్శ
**carriage 1.** వాహకం **2.** ధారణ **3.** వైఖరి
**carriage account** రవాణా ఖాతా
**carriage bill** రవాణా బిల్లు
**carriage charges** రవాణా ఖర్చులు
**carriage forward** రవాణా చెయ్యటం: కొనే వారి బాధ్యతపై సరుకు చేరవెయ్యటం
**carriage inward** రవాణా చేసుకోవటం
**carriage of goods** సరుకుల రవాణా
**carriage outward** రవాణా చెయ్యడం
**carried into effect** అమలు పరిచిన
**carried on** సాగించిన
**carried over** ముందుపుటకు ఎత్తిన, ఉతారు ఎత్తిన
**carrier 1.** వాహకుడు, రవాణాదారు **2.** వాహనం
**carry down** ఉతారు దింపు, వెనక పుట నుంచి దించు
**carry forward** ఉతారెక్కించు, ముందు పుటకు ఎత్తు
**carrying arms** ఆయుధాలు ధరించు
**carrying interest** వడ్డీ ఉన్న
**carrying into execution** అమలులోకి తీసుకొని రావటం
**carrying out inquiries** విచారణలు జరపటం
**carrying out the provisions** నిబంధనలు అమలు జరపటం
**carrying over 1.** వాయిదా వేయించటం: రుసుమిచ్చి పరిష్కారం వాయిదా వేయించ

టం. 2. ముందుకు తీసుకుపోవటం
**carry into effect** నెరవేర్చు, అమలు పరుచు
**carry on** నిర్వహించు, జరిపించు
**carry on business** వ్యాపారం నడుపు
**carry out functions** విధులను అమలు జరుపు/నెరవేర్చు
**carry out obligation** బాధ్యత నెరవేర్చు
**carry out orders** ఉత్తరువులు అమలు పరుచు
**carry over facilities** పరిమితులు పెంచటానికి సౌకర్యాలు
**carte blanche** సంపూర్ణాధికారం: ఇష్టం వచ్చినట్లు జరిపించడానికి అధికారం ఇచ్చే పత్రం
**cartel** 1. యుద్ధ ఖైదీల మార్పిడి ఒప్పందం 2. హెచ్చు ధరల కూటం: ఉత్పత్తి హెచ్చు ధరల కోసం ఉత్పత్తిదారుల సంఘం
**cartel ship** యుద్ధ ఖైదీల మార్పిడి ఓడ
**cartridge** తూటా, తోటా (తుపాకీ సం॥)
**carve out** 1. నగిషీ చేయు 2. విడగొట్టు/ప్రత్యేకించు
**carve up** పంచుకొను, పంచు
**case** 1. వ్యవహారం, కేసు, ముకద్దమా 2. దావా, వ్యాజ్యం 3. దశ, అవస్థ 4. విషయం, విచారణాంశం 5. దృష్టాంతం
**case adjourned for** -కి కేసు వాయిదా పడింది
**case agreed on** అంగీకరించిన విషయం
**case book** కేసు పుస్తకం
**case certified** ధ్రువపడ్డ కేసు: ఇద్దరు న్యాయాధిపతుల మధ్య న్యాయాంశ విషయమై అభిప్రాయ భేదం కలిగినప్పుడు పూర్ణ న్యాయసభకు నివేదించింది
**case decided** తీర్పయిన కేసు: కోర్టు పరిష్కరించిన వ్యవహారం
**case diary** కేస్ డైరీ: నేర పరిశోధన నమోదు చేసే దినచర్య
**case file** కేస్‌ఫైల్: కేసుకు సంబంధించిన ఫైలు
**case file is put up below for perusal** పరిశీలన నిమిత్తం కేస్‌ఫైలు సమర్పించడమైంది
**case fixed for** -కి కేసు నిర్ధారితమైంది
**case for orders on** -కి కేసుపై ఉత్తరువుల జారీకి వేచి ఉంది
**case for trial** విచారణ జరపవలసిన కేసు
**case general** సామాన్య దృష్టాంతం
**case has been closed** కేసు ముగించటమైంది
**case history** కేసు చరిత్ర/వృత్తాంతం
**case is filed** కేసు దాఖలు చేయడమైంది
**case is not traceable** కేసు జాడ తెలియటం లేదు
**case is put up for orders** ఉత్తర్వుల కోసం కేసు సమర్పించడమైంది
**case is remanded for fresh disposal** సరికొత్త పరిష్కారం కోసం కేసును పంపించడమైంది
**case is resubmitted as directed on prepage** వెనుక పుటలో నిర్దేశించినట్లుగా కేసును తిరిగి సమర్పించడమైంది
**case is to be reviewed** కేసును సమీక్షించవలసి ఉంది
**case is under consideration** కేసు పరిశీలనలో ఉంది
**case is under investigation** కేసు దర్యాప్తులో ఉంది
**case-law** కేస్‌లా, న్యాయదృష్టాంతాలు: కోర్టు తీర్పులు, అంతకు ముందు చేసిన న్యాయస్థాన తీర్పులు
**case-list** కేసుల పట్టిక: విచారణ దావాల పట్టిక
**case may be heard and decided in his absence** అతని గైరు హాజరీలో కేసును విచారణ చేసి నిర్ణయించవచ్చు
**case may be processed in accordance with the extent orders** ప్రస్తుత ఉత్తర్వుల ప్రకారం కేసును నడపవచ్చు/ప్రక్రియాత్మకం చేయవచ్చు
**case merits** కేసు అర్హతలు/యోగ్యతలు
**case pending** అనిర్ణీతంగా ఉన్న కేసు

**case referred** నిర్దేశిత కేసు (వ్యాజ్య సం॥): ఇద్దరు న్యాయాధిపతులకు న్యాయాం శాలపై అభిప్రాయ భేదం కలిగినప్పుడు ఇతర న్యాయమూర్తులకు నివేదించింది
**cases at law** సాధారణ దావాలు / కోర్టు లోని దావాలు
**cases covered by** పరిధిలోకి వచ్చే దావాలు
**case should pending till** -వరకు కేసును నిలిపి ఉంచాలి/ఆపాలి
**cases instituted** దాఖలు చేసిన కేసులు
**cases of food adulteration** ఆహార కల్తీకేసులు
**case stated** ఉదాహరించిన వ్యాజ్యం
**case study** విషయ/కేసు పరిశీలన
**case study method** విషయ పరిశీలన పద్ధతి
**case system** కేసు పద్ధతి
**cash** రొక్కం, నగదు
**cash account** నగదు ఖాతా
**cash advance** నగదు అడ్వాన్సు
**cash and carry** నగదు కొనుగోలు
**cash asset** నగదు ఆస్తి
**cash at bank** బాంకులో నగదు
**cash audit** నగదు ఆడిట్
**cash award** నగదు బహుమతి/ పారితోషికం
**cash balance** నగదు / రొక్కం నిలవ
**cash balance report** నగదు నిలవ నివేదిక/ రిపోర్టు
**cash bonus** నగదు బోనస్
**cash book** నగదు చిట్టా/ పుస్తకం
**cash box** గల్లా పెట్టె
**cash certificate** నగదు ధ్రువపత్రం
**cash certificate scheme** నగదు ధ్రువ పత్ర పథకం
**cash charges** నగదు/ రొక్కం ఖర్చులు
**cash checking machine** నగదు తనిఖీ యంత్రం
**cash check sheet** నగదు తనిఖీ పట్టిక
**cash chest** నగదు పెట్టె
**cash clerk** నగదు గుమాస్తా
**cash counter** నగదు కౌంటరు
**cash consideration** నగదు ప్రతిఫలం
**cash credit** నగదు పరపతి
**cash credit agreements** నగదు పరపతి ఒప్పందాలు
**cash crops** వాణిజ్య పంటలు
**cash deposit** నగదు డిపాజిట్
**cash discount** నగదు పట్టం / డిస్కౌంటు
**cash down payment** తక్షణ నగదు చెల్లింపు
**cash equivalent** నగదు సమానం
**cash flow forecasting** వచ్చే నగదు సూచన
**cash flow statement** వచ్చే నగదు వివరణ పట్టిక
**cashier** నగదు గుమాస్తా, షరాబు, క్యాషియరు
**cash imprest** చేతి ఖర్చు నగదు
**cash, in** నగదు రూపంలో
**cash in flow** వచ్చే నగదు
**cash in hand** చేతి నగదు
**cash in transit** సంచారణ నగదు
**cash in transit account** సంచారణ నగదు ఖాతా
**cash journal** నగదు చిట్టా
**cash management** నగదు నిర్వహణ
**cash memo** నగదు చీటీ
**cash on delivery** అప్పగింతపై నగదు చెల్లింపు
**cash order** నగదు ఉత్తరువు
**cash out flow** బయటు ఇవ్వవలసిన నగదు
**cash paid in Rs.** రూ॥ లలో నగదు చెల్లించటమైంది
**cash price** నగదు ధర
**cash purchase** నగదు కొనుగోలు
**cash ratio** నగదు నిష్పత్తి
**cash received book** ముట్టిన నగదు పుస్తకం
**cash recovery** నగదు వసూలు
**cash register** నగదు లెక్క పుస్తకం
**cash remittance** నగదు చెల్లింపు, పంపిన

నగదు, జమ కట్టిన నగదు
**cash rent** నగదు బాడుగ
**cash reserves** నగదు. నిల్వలు
**cash reward** నగదు బహుమతి
**cash sale** నగదు అమ్మకం
**cash security** నగదు జమానతు/పూచీ
**cash sheet** నగదు పత్రం
**cash solvency** నగదు తీర్చే క్షమత
**cash surrender value** నగదు అర్పణ విలువ: గడువుకు ముందే నగదు కావాలంటే ఇచ్చే విలువ
**cash system** నగదు పద్ధతి
**cash trading** నగదు వర్తకం
**cash transactions** నగదు లావాదేవీలు
**cash under double lock** రెండు తాళాల్లో పెట్టిన నగదు
**cash value** నగదు విలువ
**cash wage** నగదు వేతనం/కూలి
**cassare 1.** రద్దు / చెల్లకుండా చేయు **2.** ఆపు, ఆగు
**cast aspersion** నిందవేయు
**cast a vote** వోటు వేయు. వోటు ఇచ్చు
**cast away** వదలి వేయు
**caste autonomy** కుల స్వతంత్రత
**caste bureaucracy** కులవర్గ పెత్తందారీ, వర్గ/కుల ఉద్యోగిస్వామ్యం
**caste certificate** కుల ధ్రువపత్రం
**caste disability** కుల లోపం
**casting vote** నిర్ణయవోటు: రెండు వర్గాలకు సమంగా వోట్లు వచ్చినప్పుడు సభాపతి తన వోటును ఏదో ఒక వర్గం తరఫున వేసి విషయ నిర్ణయం చెయ్యటం
**cast vote** వోటు చేయు
**casual 1.** ఆకస్మిక(ం) **2.** తాత్కాలిక(ం) **3.** ప్రసంగవశ(ం) **4.** యాదృచ్ఛిక(ం) **5.** అనియత(ం)
**casual and non-recurring nature** ఆకస్మిక, ఆవర్తనలేని స్వభావం గల
**casual election** అనియత ఎన్నిక
**casual employee** అనియత ఉద్యోగి
**casual employment** అనియత ఉద్యోగం
**casual explanation** ప్రాసంగిక వివరణ
**casual income** అనియత ఆదాయం
**casual inspection** అనియత/యాదృచ్ఛిక తనిఖీ
**casual labour** అనియతకూలి (శ్రమ)
**casual leave** ఆకస్మిక సెలవు
**casual receipts** అనియత వసూళ్లు
**casual remarks** ప్రాసంగిక వ్యాఖ్యలు
**casual service** అనియత సేవ
**casual talk** తాత్కాలిక ప్రసంగం
**casualty 1.** దుర్ఘటన **2.** దుర్మరణం
**casualty insurance** దుర్ఘటన భీమా
**casualty officer** దుర్ఘటన అధికారి
**casualty ward** ప్రమాద చికిత్సల విభాగం
**casualty worker** ప్రమాద విభాగ సేవాకర్త
**casual unemployment** తాత్కాలిక నిరుద్యోగం
**casual vacancy** ఆకస్మిక ఖాళీ
**casual worker** అనియత కార్మికుడు
**casus fortuitus** అనివార్య సంఘటన
**casus major** అసాధారణ సంఘటన
**casus omissus** లోపించిన అంశం: శాసనంలో చెప్పకుండా విడిచిన విషయం
**catalogue** కేటలాగ్. సూచీ పట్టిక
**catalogue of books** గ్రంథసూచి/పుస్తకాల కేటలాగు
**cataract 1.** కంటి శుక్లం **2.** ఎత్తిపోతలు, చిన్న జలపాతం
**catastrophe** ఘోర విపత్తు
**catch crop** మధ్యస్థ పంట
**catch hold** పట్టుకొను
**catching a bargain** అక్రమ ఒప్పందంలోకి దింపు: ఇరకాటంలో పెట్టి హెచ్చు లాభం సంపాదించు
**catchment area** పరీవాహ ప్రదేశం
**catch the speaker's eye** సభాపతి దృష్టిని ఆకర్షించు
**catch word** ప్రచార శబ్దం
**categorically 1.** నిశ్చితంగా **2.** శ్రేణివారీగా

**categorization** శ్రేణీకరణ
**category of amounts** మొత్తాల/డబ్బు శ్రేణి
**category of employees** ఉద్యోగుల శ్రేణి
**category of persons** వ్యక్తుల శ్రేణి
**category of securities** పూచీల శ్రేణి
**category of staff** సిబ్బంది శ్రేణి
**cater** సమకూర్చు
**catering** ఏర్పాటు (ఆహారం)
**catering charges** ఆహారం ఏర్పాటు ఖర్చులు
**catering establishment** ఆహార సదుపాయ వ్యవస్థ
**cattle breeding** పశు పెంపకం
**cattle breeding farm** పశు సంవర్ధక క్షేత్రం
**cattle census** పశుగణన
**cattle disease** పశురోగం
**cattle farm** పశుక్షేత్రం
**cattle feed** పశువుల దాణా/మేత
**cattle insurance** పశువుల భీమా
**cattle lifter** పశువుల దొంగ
**cattle mortality** పశు మరణం
**cattle pound** బందెల దొడ్డి
**cattle quarantine station** రోగగ్రస్త పశుకేంద్రం
**cattle rearing** పశుపోషణ
**cattle show** పశుప్రదర్శన
**cattle trespass** పశు అక్రమప్రవేశం
**cattle wagon** పశురవాణా వాగను (రైలు పెట్టె)
**cattle welfare** పశుసంక్షేమం
**caucus** రాజకీయకూటమి (రహస్యంగా)
**causa causans** ప్రత్యక్ష కారణంగా
**causa consanguinitatis** రక్తసంబంధ కారణంతో
**causa impotentia** బలహీనతవల్ల
**causa mortis** మరణ కారణంగా
**causans** అవ్యవహిత కారణం
**causa proxima** సమీప కారణంగా
**causare** వ్యాజ్యమాడు
**causa sine qua non** తోసివేయరాని కారణంగా
**causation** కార్యకారణ సంబంధం
**causation No.** దావా సంఖ్య
**causative factors** కారణ కారకాలు
**causator** 1. దావాకర్త 2. కక్షిదారు
**causa turpis** దురుద్దేశం
**cause** 1. కారణం, హేతువు 2. వ్యాజ్యం, అభియోగం, దావా 3. ప్రేరకం, ఉద్దేశం
**cause and effect** కారణ పరిణామాలు
**cause an election to be held** ఎన్నిక జరిపించడానికి కారణమవు
**cause apprehension** భయశంకకు కారణమవు
**cause celebre** ధర్మశాస్త్ర నిబద్ధమైన ప్రసిద్ధ విచారణ
**cause disturbance of public tranquility** ప్రజాశాంతికి భంగం కలగటానికి కారణమవు
**caused by** -ద్వారా కారణమైన
**cause list** వ్యాజ్య పట్టీ (హైకోర్టు), కేసుల పట్టీ, వ్యాజ్యాల పట్టిక/దావాల పట్టిక
**cause of accusation** నేరం మోపే కారణం
**cause of action** వ్యాజ్య కారణం / వాద కారణం
**cause of action joined in one suit** ఒకే దావాలో చేరిన వ్యాజ్య కారణం
**cause of collision** సంఘట్టన కారణం
**cause of complaint** ఫిర్యాదు కారణం
**cause of death** మరణ కారణం
**cause of delay** జాప్య కారణం
**cause of detention** నిర్బంధకారణం
**cause of exceptional nature, by any** అసాధారణ స్వభావం గల ఏకారణంవల్లనైనా
**cause of Hindi** హిందీ ప్రయోజనం
**cause of like nature** అదే రకమైన వ్యాజ్యం, **on all fours**
**cause of salvage** ఉద్ధరణ దావా: నీటిలో మునిగి పోకుండా లేదా నిప్పులో తగలబడి పోకుండా వసువులను, ఓడలను, వాహనా

లను కాపాడినందుకు రావలసిన పారితోషికం కోసం న్యాయస్థానంలో దావా

**causes to be produced** దాఖలు పరచవలసిన వ్యాజ్యాంశాలు

**cause to be laid** దాఖలు చెయ్యవలసిన వ్యాజ్యం/వెయ్యవలసిన వ్యాజ్యం

**cause to be laid down** దాఖలు చేయడానికి వ్యాజ్యం

**cause to believe** విశ్వాస కారణం

**cause to be produced** దాఖలు పరిచేటట్లు చేయు

**cause to investigate** దర్యాప్తుకు కారణం

**causeway** అలుగు వంతెన

**cause written notice** వ్యాజ్య కారణాలు రాసిన నోటీసు

**cause wrongful loss** అక్రమ నష్టం కలిగించు

**causing disappearance of evidence** సాక్ష్యం మాయం చెయ్యటం

**causing enquiry** విచారణకు హేతువవడం

**causing fear of hurt** హానిభయం కలిగించటం

**causing grievous hurt** తీవ్రఘాతం కలిగించటం

**causing of miscarriage** గర్భస్రావం కలిగించటం

**causing restraint** అడ్డగించటం, అవరోధం కలిగించటం

**causing the loss** నష్టం కలిగించే(ది)

**causing the mortgage to be merged** తాకట్టు విలీనమయ్యేటట్లు చెయ్యడం

**caution** హెచ్చరిక

**caution deposit** కాషన్ డిపాజిట్, పూచీ ధరావతు

**cautioner** పూచీదారు/జామీనుదారు

**caution money** పూచీధనం

**cautious** జాగ్రత్తగల, జాగ్రత్తపడ్డ, మెలకువగల

**cautious investor** జాగ్రత్తగల పెట్టుబడిదారు

**caveat** హెచ్చరిక (చర్య విరమణ సం॥)

**caveat emptor** కొనుగోలుదారుకు హెచ్చరిక

**caveator** ఆక్షేపణదారు/హెచ్చరికదారు: చర్య విరమణ నోటీసు దాఖలు చేసినవాడు

**caveat venditor** అమ్మేవాడికి హెచ్చరిక

**caveat viator** ప్రయాణికుడికి హెచ్చరిక

**cavil** వితండవాదం చేయు, సరికాని ఆక్షేపణ (లేవదీయు)

**cease** విరమించు, ఆగిపోవు, అంతమవు, మానివేయు

**ceased to remain in force** అమలులో లేకుండా పోయింది

**ceasefire** యుద్ధవిరమణ

**ceasefire order** యుద్ధ విరమణ ఉత్తరువు

**cease on becoming insolvent** దివాలా తియ్యటంతో ముగిసిపోవు

**cease on marriage** పెళ్లితో ముగిసిపోవు

**cease to be** లేకుండా పోవు, ఆగిపోవు

**cease to be a member** సభ్యత్వం కోల్పోవు

**cease to be a partner** భాగస్థుడుగా విరమించు

**cease to be enforceable** అమలు చెయ్యటానికి వీలుకాకుండా పోవు

**cease to be in force** అమలు ముగిసిన

**cease to be levied** విధింపు ఆపివేయు

**cease to continue in being** కొనసాగడం విరమించు

**cease to exercise jurisdiction** అధికార పరిధి వినియోగించడం / విరమించు

**cease to exist** లేకుండా ఉండు, లేకపోవు

**cease to have effect** 1. ప్రభావరహితమవు 2. అమలు అంతమవు

**cease to hold office** పదవి నుంచి విరమించు

**cease to operate** అమలు ఆగిపోవు

**cease to reside** నివసించకుండా ఉండు, నివసించకపోవు

**cede** దత్తం చేయు

**cedent** దాత: అర్పించిన వ్యక్తి

**ceiling** 1. సీలింగ్, గరిష్ఠ పరిమితి 2. లోకప్పు

**ceiling, fixation of** గరిష్ఠ పరిమితి నిర్ధారణ
**ceiling limit** గరిష్ఠ పరిమితి
**ceiling on holdings** కమతాల గరిష్ఠ పరిమాణ నిర్ణయం/కమతాలపై సీలింగు/గరిష్ఠ పరిమితి
**ceiling price** గరిష్ఠ పరిమితి ధర
**ceiling quota** గరిష్ఠ పరిమితి కోటా
**ceiling rate** గరిష్ఠ పరిమితి రేటు
**celebration** ఉత్సవం
**celibacy** బ్రహ్మచర్యం
**cell 1.** విభాగం, కక్ష్య **2.** విద్యుద్ఘటం
**cellar** నేలమాళిగ
**cellar confinement** ఒంటరిగది ఖైదు: జైలులో ఇతర ఖైదీలను చూడటానికిగాని వారితో మెసలటానికిగాని వీలులేనిది
**celt** పనిముట్టు: రాతితో/ఇనుముతో చేసింది
**cemetery** శ్మశానవాటిక (క్రైస్తవ సం॥)
**censor n. 1.** పూర్వ పరిశీలన, సెన్సారు **v. 2.** పూర్వ పరిశీలన చేయు
**censorate** పూర్వ పరిశీలన మండలి
**censorious** పూర్వ పరిశీలక
**censorship** పూర్వ పరిశీలకత్వం
**censorship bureau** సెన్సారు కార్యాలయం
**censure** అభిశంసించు
**censured for his omission and false statement** అతని లోపానికి తప్పుడు వివరణకూ అభిశంసించటమైంది
**censure motion** అభిశంసన తీర్మానం/ప్రతిపాదన
**censure, vote of** అభిశంసన వోటు
**census** గణన, జనాభా లెక్కలు
**census block** గణన విభాగం, జనాభా లెక్కల బ్లాకు
**census figures** జనాభా లెక్కలు, జనాభా గణన అంకెలు
**census of fire arms** అగ్ని ఆయుధాల లెక్కలు
**census of population** జనాభా లెక్కింపు
**census of production** ఉత్పత్తి లెక్కింపు
**census report** జనాభా లెక్కల నివేదిక
**centenary celebration** శత వార్షికోత్సవాలు
**centesimal system** శతాంశ పద్ధతి
**centigram** సెంటిగ్రాం, నూరు గ్రాములు
**cent per cent** నూటికి నూరు శాతం
**cent per cent weighment** నూటికి నూరుశాతం తూకం
**central 1.** కేంద్ర, కేంద్రీయ **2.** ప్రధాన
**central account** ముఖ్యకేంద్ర ఖాతా
**central accounts office** ప్రధాన/కేంద్రీయ ఖాతాల /లెక్కల కార్యాలయం
**central accounts section** కేంద్రీయ ఖాతాల విభాగం
**central Act** కేంద్రీయ చట్టం
**central administration** కేంద్ర పాలన
**central advisory council** కేంద్ర సలహా మండలి
**central agencies** సెంట్రల్ ఏజన్సీలు; కేంద్రీయ శాఖా కార్యాలయాలు
**central audit** కేంద్రీయ లెక్కల తనిఖీ/కేంద్రీయ ఆడిట్
**central bank** కేంద్ర బ్యాంకు, సెంట్రల్ బ్యాంకు
**central chancellery** కేంద్రీయ ధర్మాధికారి శాఖ
**central civil services** కేంద్ర సివిల్ సర్వీసులు
**central claims organization** కేంద్ర పరిహార అభ్యర్థనల సంస్థ
**central committee** కేంద్ర సంఘం
**central composite food laboratory** కేంద్ర మిశ్రాహార పరిశోధనాలయం
**central control 1.** కేంద్ర నియంత్రణ **2.** కేంద్ర నిర్ణాయకం
**central exchequer** కేంద్ర ఖజానా విభాగం
**central excise** కేంద్ర ఎక్సైజ్, కేంద్ర ఉత్పాదన పన్ను
**central excise tariff** కేంద్ర ఎక్సైజ్ ధరల సూచి
**central executive** కేంద్ర కార్య నిర్వాహక

మండలి
**central investigation unit** కేంద్ర దర్యాప్తు విభాగం
**centralization** కేంద్రీకరణ
**centralization of administration** పాలన కేంద్రీకరణ
**centralization of cash reserves** నగదు నిలవల కేంద్రీకరణ
**centralization of powers** అధికారాల కేంద్రీకరణ
**centralized arrangements** కేంద్రీకృత ఏర్పాట్లు
**centralized behaviour** కేంద్రీకరించిన ప్రవర్తన
**centralized buying** కేంద్రీకృత కొనుగోలు
**centralized direction** కేంద్రీకృత నిర్దేశం
**centralized executive agency** కేంద్రీకృత కార్యనిర్వాహక ఏజన్సీ
**centralized legal system** కేంద్రీకృత న్యాయవ్యవస్థ
**centralized planning** కేంద్రీకృత ప్రణాళికా రచన
**centralized stores** కేంద్రీకృత భాండారం/ స్టోర్స్
**central jail** సెంట్రల్ జైలు, కేంద్ర కారాగారం/ చెరసాల
**central legislature** కేంద్ర శాసన మండలి/ విధాన మండలి
**centrally administered unit** కేంద్ర పరిపాలిత భాగం
**centrally sponsored scheme** కేంద్ర ప్రతిపాదిత పథకం
**central management** కేంద్ర నిర్వహణ/ యాజమాన్యం
**central office** కేంద్ర / ప్రధాన కార్యాలయం
**central planning** కేంద్ర ప్రణాళికా రచన
**central planning agency** కేంద్ర ప్రణాళికా రచన ఏజన్సీ
**central pool** 1. కేంద్ర నిలవలు 2. సెంట్రల్ పూల్ (కేంద్రీయ ఏకత్రం)
**central registry** కేంద్ర రిజిస్టరీ
**central reserve** కేంద్ర రిజర్వు
**central secretariat** కేంద్ర సచివాలయం
**central secretariat service** కేంద్ర సచివాలయ సేవ/ ఉద్యోగం
**central sector** కేంద్ర రంగం
**central service** కేంద్ర సర్వీసు/ కేంద్ర ప్రభుత్వోద్యోగం
**central subject** కేంద్ర విషయం (పాలనాంశం)
**central tabulation unit** కేంద్ర పట్టీకరణ విభాగం
**central tendency** కేంద్రీయ ప్రవృత్తి
**central works** కేంద్ర నిర్మాణాలు/ పనులు
**centred** కేంద్రిత
**centre of curvature** వక్రతా కేంద్రం
**centre of gravity** ఆకర్షక కేంద్రం
**centre of pressuree** పీడన కేంద్రం
**centre of study** అధ్యయన కేంద్రం
**centre of symmetry** సమమితి కేంద్రం
**centre, primary health** ప్రాథమిక ఆరోగ్య కేంద్రం
**centres** కేంద్రాలు
**centrifugal** అపకేంద్ర
**centrifugal force** అపకేంద్ర బలం/ శక్తి
**centripetal** కేంద్రాభిముఖ(ం)
**ceramic industry** పింగాణీ పరిశ్రమ
**ceremonial** శిష్టాచార, లాంఛన, ఉత్సవ
**ceremonial capture** లాంఛన పాణిగ్రహణం (గిరిజన సం॥)
**ceremonial exchange** లాంఛనప్రాయ ఆదాన ప్రదానం/ వినిమయం
**ceremonial function** శిష్టాచార/ లాంఛనప్రాయ ఉత్సవం
**ceremonial matters** ఉత్సవ వ్యవహారాలు
**ceremonial occasion** ఉత్సవ సందర్భం
**ceremonial parade** ఉత్సవ విన్యాసం
**ceremonials** శిష్టాచారాలు, లాంఛనాలు, ఉత్సవాలు
**ceremony** 1. ఉత్సవం 2. ఆచారకర్మ, ధార్మిక కర్మకాండ

**certain** 1. నిశ్చిత 2. ఒకానొక, ఫలానా, కొన్ని, కొంత
**certain cases** కొన్ని కేసులు, కొన్ని సందర్భాలు
**certain classes of persons** కొన్ని వర్గాల వ్యక్తులు
**certain hours** నిర్దిష్టమైన గంటలు
**certain intention** ఒకానొక ఉద్దేశం, నిర్దిష్టమైన ఉద్దేశం
**certainly** అవశ్యంగా, తప్పకుండా
**certain offences** కొన్ని నేరాలు
**certain opinion** ఒకానొక / నిర్దిష్ట అభిప్రాయం
**certain rent** నిర్ణీతమైన అద్దె (శిస్తు)
**certainty** నిశ్చయం, అసందిగ్ధ విషయం
**certificate** ప్రమాణపత్రం/ ధ్రువపత్రం
**certificate as to fitness** పాటవ ధ్రువ పత్రం
**certificate by the competent authority is required** సమర్థ అధికారి ద్వారా ధ్రువపత్రం కోరడమైంది
**certificate, identity** గుర్తింపు ధ్రువపత్రం
**certificate No.** ధ్రువపత్రం సంఖ్య
**certificate of administration** పరిపాలన ధ్రువపత్రం
**certificate of age and nationality** వయస్సు, జాతీయత ధ్రువపత్రం
**certificate of air-worthiness** విమాన ప్రయాణానుకూలత ధ్రువపత్రం
**certificate of appeal** అపీలుకు ధ్రువ పత్రం
**certificate of assumption of charge** అధికార స్వీకరణ ధ్రువపత్రం
**certificate of authorization** అధికారమిచ్చే ధ్రువపత్రం
**certificate of character** ప్రవర్తన ధ్రువ పత్రం
**certificate of charge** కార్యవిధి ధ్రువపత్రం
**certificate of commencement of business** వ్యాపార ప్రారంభ ధ్రువపత్రం
**certificate of committal** బద్ధతా ధ్రువ పత్రం
**certificate of competence** సామర్థ్య ధ్రువపత్రం
**certificate of costs** ఖర్చుల ధ్రువపత్రం
**certificate of credit** పరపతి ధ్రువపత్రం
**certificate of damage** నష్టధ్రువపత్రం
**certificate of deposit** 1. ధరావతు ధ్రువ పత్రం 2. డిపాజిట్ ధ్రువపత్రం
**certificate of fitness** పాటవ ధ్రువపత్రం
**certificate of identity** గుర్తింపు ధ్రువ పత్రం
**certificate of incorporation** (కంపెనీ) స్థాపన నమోదు ధ్రువపత్రం
**certificate of indebtedness** ఋణ ధ్రువీకరణ పత్రం
**certificate of leave** సెలవు ధ్రువీకరణ పత్రం
**certificate of legitimacy** ఔరసత్వ ధ్రువపత్రం
**certificate of naturalization** దేశీకరణ ధ్రువపత్రం: విదేశీయుని స్వదేశీయునిగా పరిగణించే ధ్రువపత్రం
**certificate of nomination** నామినేషన్ ధ్రువపత్రం
**certificate of non satisfaction of decree** డిక్రీ అమలు కాలేదనే ధ్రువపత్రం
**certificate of origin** జన్మస్థాన ధ్రువపత్రం
**certificate of physical fitness** శరీర పాటవ ధ్రువపత్రం
**certificate of posting** టపాలు ధ్రువపత్రం
**certificate of postponement** వాయిదా ధ్రువపత్రం
**certificate of practice** అభ్యాస కుశలత ధ్రువపత్రం
**certificate of premium deduction** ప్రీమియం తగ్గింపు ధ్రువపత్రం
**certificate of qualification** అర్హత ధ్రువపత్రం
**certificate of quality** నాణ్యత ధ్రువపత్రం
**certificate of quantity** పరిమాణ ధ్రువ

పత్రం
**certificate of recognition** గుర్తింపు ధ్రువపత్రం
**certificate of registration** రిజిస్ట్రేషన్ ధ్రువపత్రం
**certificate of registration charges** రిజిస్టరీ ఖర్చుల ధ్రువపత్రం
**certificate of sale** అమ్మకపు ధ్రువపత్రం: కోర్టువారు చేసిన అమ్మకంలో కొన్న వ్యక్తికి, కొనుగోలు విషయం నమోదు చేస్తూ కోర్టువారు ఇచ్చే పత్రం
**certificate of sea-worthiness** సముద్ర ప్రయాణానుకూలత ధ్రువపత్రం
**certificate of service** సేవా/ సర్వీసు ధ్రువపత్రం
**certificate of share** వాటా ధ్రువపత్రం
**certificate of sickness** అనారోగ్య ధ్రువపత్రం
**certificate of survey** సర్వే ధ్రువపత్రం
**certificate of training** శిక్షణ ధ్రువపత్రం
**certificate of transfer of charge (C.T.C)** పదవీ బాధ్యత బదిలీ ధ్రువపత్రం
**certification** ప్రమాణీకరణ/ ధ్రువీకరణ
**certification centre** ధ్రువీకరణ కేంద్రం
**certification mark** ధ్రువీకరణ గుర్తు
**certification of cheques** చెక్కుల ధ్రువీకరణ
**certification of costing fact** వాస్తవ వ్యయాంశ ధ్రువీకరణ
**certification of financial fact** ఆర్థికాంశ ధ్రువీకరణ
**certification of shares** వాటాల ధ్రువీకరణ: ఒక వాటాల పత్రంలో కొన్ని వాటాలను విడిగా అమ్మేటప్పుడు కంపెనీ వారిచ్చే ధ్రువపత్రం
**certification of transfer** బదిలీ ధ్రువీకరణ
**certification trade mark** వ్యాపార చిహ్న ధ్రువీకరణ
**certified** ధ్రువీకరించిన/ ధ్రువపరచిన, ధ్రువీకృత
**certified bankrupt** ధ్రువపరచబడిన దివాలాదారు: ఋణ విమోచనం ధ్రువపరచబడిన దివాలాదారు
**certified cheque** ధ్రువపరచిన చెక్కు: డిపాజిటర్/ నిక్షేపణదారు జారీ చేసిన చెక్కుకు సొమ్మున్నదని, చెల్లించబడుతుందని బాంకు ధ్రువపరచిన చెక్కు
**certified copies** ధ్రువపరచిన నకళ్లు/ ప్రతులు
**certified extracts** ధ్రువపరచిన మూల భాగాలు
**certified in writing** రాతపూర్వకంగా ధ్రువపరచిన
**certified purchaser** ధ్రువపరచిన కొనుగోలుదారు
**certifying officer** ధ్రువీకరణాధికారి
**certifying surgeon** ధ్రువీకరణ సర్జను
**certiorari (writ)** సెర్షియోరరి, పెద్ద కోర్టు ఉత్తరువు (రిట్ సం॥) (రికార్డు పంపవలసిందని ఆదేశించే రిట్టు): కింది అధికారులను, ట్రిబ్యునళ్లను తమ వద్ద జరిగిన దావాల రికార్డులను తనకు పంప వలసిందిగా హైకోర్టుగాని, సుప్రీంకోర్టు గాని పంపే ఉత్తరువు, అవి చేసిన తీర్పులను పరిశీలించిన తరవాత ఇచ్చే ఉత్తరువు
**cess** సెస్, రుసుం, పన్ను
**cessation** విరమణ
**cessation of act** చర్య సమాప్తి
**cessation of approval** ఆమోదం సమాప్తి
**cessation of force** బలప్రయోగ సమాప్తి
**cessation of hostilities** యుద్ధ విరమణ
**cessation of membership** సభ్యత్వ విరమణ
**cessation of motion** తీర్మాన విరమణ
**cessation of profession** వృత్తి సమాప్తి
**cessation or termination** ఆగిపోవటం లేదా సమాప్తి కావటం
**cessation of work** పని ఆగిపోవటం
**cess charges** రుసుం ఖర్చులు
**cesser** 1. సమాప్తి 2. బాధ్యతా నివృత్తి (గడువు సం॥)

**cesser of infirmity** దుర్బలత్వం అంతం కావటం
**cesser of operation** అమలు సమాప్తి
**cesser of patent** ప్రత్యేక హక్కు/ పేటెంట్ సమాప్తి
**cess fund** రుసుం నిధి
**cession 1.** ఇచ్చివేయటం **2.** వదులుకోవటం
**cess on houses** ఇండ్ల పన్ను
**cesspit** మురికిగొయ్యి
**cestui que trust** ట్రస్టు లాభశాలి: ట్రస్టు వల్ల లాభం పొందే వ్యక్తి
**chain 1.** గొలుసు, సర్వే గొలుసు **2.** సంకెల **3.** పరంపర, శ్రేణి
**chainman** గొలుసుధారి: సర్వేగొలుసు పట్టే వ్యక్తి
**chain of circumstances** పరిస్థితుల పరంపర
**chain of commands** ఆజ్ఞల పరంపర
**chain of title** హక్కుమూల పరంపర
**chain reaction** ప్రతిక్రియ పరంపర
**chain stores** విక్రయశాలల శ్రేణి, భాండార శ్రేణి
**chair 1.** అధ్యక్షస్థానం **2.** పీఠం, కుర్చీ
**chairmanship 1.** అధ్యక్షత **2.** అధ్యక్షపదవి **3.** పీఠాధిపత్యం
**challan of remittance into treasury** ట్రెజరీలో జమకట్టిన చాలాన్
**challenge n.** సవాలు, ఆక్షేపణ **v.** సవాలు చేయు
**challenged** సవాలు చేసిన, ఆక్షేపించిన
**challenged vote** సవాలు వోటు
**challenge of jury** జ్యూరీకి అభ్యంతరం: జ్యూరీ ఏర్పాటుకు, ప్రమాణ స్వీకరణానికి అక్షేపణ **an objection made to the swearing in and impanelling of the jury**
**challenge propter affectum** బంధుత్వ కారణంగా అభ్యంతరం: జ్యూరీ సభ్యులలో ఒకరు కక్షిదారులో ఒకరికి బంధువులో కావడం చేత **(on account of the relationship of the juror to one of the parties)**
**challenge to the favour** పక్షపాతంపై సవాలు: పక్షపాతంతో ప్రవర్తిస్తుందనే ఆక్షేపణ
**challenge to the panel** జాబితాకు ఆక్షేపణ: జూరర్ల పట్టికకు ఆక్షేపణ
**challenge validity** చెల్లుబడిని సవాలు చేయు
**chamber 1.** చేంబరు, సదనం, గది **2.** మండలి
**chamber business** చేంబరు వ్యవహారం: న్యాయాధిపతి కోర్టు వెలుపల నిర్వహించే న్యాయ వ్యవహారం **all business done out of the court by the judge**
**chamber of commerce** వాణిజ్య మండలి
**chamber of guardians** సంరక్షక మండలి
**chambers of the judge** న్యాయాధిపతి సదనం/ గది
**champertor** చాంపర్టర్, వ్యాజ్యాస్తి బేరగాడు: వ్యాజ్యాస్తిలో వాటా కుదుర్చుకొని సొంత ఖర్చులతో వాజ్యం నడిపే వ్యక్తి
**champertous** వ్యాజాస్తి బేరపు (వ్యాజ్యాస్తిలో పాలుపొందే)
**champerty** చాంపర్టీ, వ్యాజ్యాస్తి బేరం: వ్యాజ్య ఆస్తిలో వంతుకేర్పాటు
**champerty maintenance** వ్యాజ్య నిర్వహణ, దావా మద్దతు
**champion 1.** జెట్టి, ఛాంపియను (ఆటల్లో), దక్షుడు (ఇతర రంగాల్లో) **2.** పరిరక్షకుడు
**chance** అవకాశం/ అదృష్టం/ దైవయోగం
**chancellor 1.** ఛాన్సలరు (కోర్టు) **2.** విశ్వవిద్యాలయాధ్యక్షుడు, కులపతి
**chance medley 1.** ఆకస్మిక కలహం **2.** ఉద్దేశించని హత్య: ఆకస్మిక కలహంలో కలహ కారకుని అనుకోకుండా హత్య చెయ్యడం
**chance profit** ఆకస్మిక లాభం
**chancery** ఛాన్సరీ: ఇంగ్లండులో విశేష న్యాయ ధర్మాలు నిర్ణయించే ప్రత్యేకాధికారం గల ఉన్నత న్యాయస్థానం
**chancery court** ఛాన్సరీ కోర్టు
**chancery jurisdiction** ఛాన్సరీ కోర్టు

అధికారపరిధి

**chance verdict** జ్యూరీల చీటీ తీర్పు. జ్యూరీ సభ్యుల ఛాన్సువర్డిక్ట్: వాదికి ప్రతివాది ఇచ్చుకోవలసిన సొమ్మును జ్యూరీ సభ్యులు వారివారికి తోచిన మొత్తంతో కలిపి దానిని జ్యూరీ సంఖ్య పెట్టి భాగించగా వచ్చిన మొత్తాన్నే తీర్పుగా అంగీకరించడం

**chance witness** యాదృచ్ఛిక సాక్షి

**change 1.** మార్పు. బదిలీ **2.** మారకం (చిల్లర)

**changed circumstances** మారిన పరిస్థితులు

**change hands** చేతులు మారు (ఆస్తి, అధికారం వగైరా)

**change in circumstances** పరిస్థితుల మార్పు

**change in constitution of firm** వ్యాపార సంస్థ సంఘటన రూపంలో మార్పు

**change in the rate of exchange** వినిమయ రేటులో మార్పు

**change in personnel** సిబ్బందిలో మార్పు

**change of citizenship** పౌరసత్వపు మార్పు

**change of domicile** నివాస స్థానం మార్పు: ఒక రాష్ట్ర పౌరుడు మరొక రాష్ట్ర పౌరునిగా మారే ఉద్దేశ్యంతో నివాసం మార్చుకోవటం

**change of incumbent of office** ఉద్యోగస్థుని మార్పు

**change of motion** కదలికలో/ చలనంలో మార్పు

**change of object** ధ్యేయంలో మార్పు

**change of shifts** వంతుల/షిఫ్టుల మార్పిడి

**change of title** హక్కులో మార్పు

**change of venue** స్థానం మార్పు (విచారణ స్థలం వగైరా), స్థలం మార్పు

**channel 1.** ఏరు **2.** దారి, మార్గం **3.** కాలువ

**channel of communication** వార్తా-రవాణాల మార్గం

**channel of correspondence** పత్ర వ్యవహార మార్గం

**channels of distribution** పంపిణీ మార్గాలు

**chaperon 1.** సంరక్షకురాలు, సహాయకురాలు (పెళ్లి సందర్భాలలో) **2.v.** సంరక్షించు

**chapter** అధ్యాయం (గ్రంథ సం॥)

**character 1.** ప్రవర్తన, లక్షణం, మాన్య ప్రతిపత్తి, శీలం **2.** నవలలో/నాటకంలో పాత్ర

**character and antecedents** నడత, పూర్వ ప్రవర్తన

**character assassination** వ్యక్తిత్వహననం

**character certificate** ప్రవర్తన ధ్రువ పత్రం

**characteristic** విశేష లక్షణం, **(adj.)** స్వాభావిక, ప్రత్యేక, విశిష్ట

**character, official** అధికార హోదా

**character roll** ప్రవర్తన పట్టిక

**characters employed** ఉపయోగించిన అక్షరాలు

**charge 1.** ఆరోపణ, అభియోగం, నింద **2.** పదవీ బాధ్యత, కార్యవిధి **3.** కిరాయి, ఖర్చు (వాహనాల వగైరా) **4.** దట్టింపు (విద్యుచ్ఛక్తి, మందు) **5.** ఛార్జి (లాఠీఛార్జి) **6.** అధీనం, సంరక్షణ బాధ్యత **7.** తాకట్టు, తనఖా **8.** విధింపు (జరిమానా వగైరా)

**chargeable** విధించదగిన, ఆరోపించదగిన

**chargeable distance** విధించదగిన దూరం (ఖర్చుల సం॥)

**chargeable interest** విధించదగిన వడ్డీ

**chargeable period** విధించదగిన కాలం

**chargeable profit** విధించదగిన లాభం

**chargeable with stamp duty** స్టాంపు రుసుంతో విధించదగిన

**charge allowance** ఛార్జిభత్యం, పదవీ భత్యం: అదనపు బాధ్యత వహించినందుకు ఇచ్చే భత్యం

**charge a property** ఆస్తి తాకట్టు

**charge at law** కోర్టు ఖర్చుల పట్టికలో పద్దు (అటార్నీ సం॥)

**charge book** ఛార్జి పుస్తకం, కార్యవిధుల రిజిష్టరు

**charge certificate** కార్యవిధుల ధ్రువ పత్రం

**charge created** తాకట్టు/ తనఖా పెట్టిన
**charged 1.** విధించిన, నేరం మోపిన **2.** దట్టించిన వగైరా
**charge d' affaires** కార్యదూత
**charge d' affaires (ad interim)** కార్య దూత (తాత్కాలిక)
**charged expenditure** భరించిన/ విధించిన ఖర్చు
**charged officer** నిందిత అధికారి
**charged on the consolidated fund of India** భారత సంచిత నిధిపై విధించిన
**charged rate** విధించిన రేటు
**charged to revenue account** రెవెన్యూ ఖాతా నుంచి ఇవ్వదగిన
**charged with 1.** విధించి ఉన్న **2.** ఆరోపించి ఉన్న
**charged with dereliction of duty** కార్యవిధులు ఉపేక్షించినట్లు ఆరోపించిన
**charged with liability** జవాబుదారీ ఆరోపించిన
**charged with notice** నోటీసుతో విధించిన/ ఆరోపించిన
**charge erroneous** తప్పుడు ఆరోపణ
**charge for service** సేవా ఖర్చు
**charge handed over** పదవీ బాధ్యత అప్పగించటమైంది
**charge holder** అధీన హక్కుదారు/ తాకట్టు హక్కుదారు
**charge imperfect** అసంపూర్ణ ఆరోపణ
**charge in with alternative** ప్రత్యామ్నాయ ఆరోపణ చేయు
**charge of a personal character** వ్యక్తిగత గుణాల ఆరోపణ
**charge of like nature** అటువంటి స్వభావం గల విధింపు
**charge of impersonation** మరోవ్యక్తిగా వ్యవహరించిన ఆరోపణ
**charge of income-tax** ఆదాయం పన్ను విధింపు
**charge of insubordination** అవిధేయతపై ఆరోపణ
**charge of office** పదవీ బాధ్యత
**charge of tax** పన్ను విధింపు
**charge of wealth-tax** సంపద పన్ను విధింపు
**charge on a property** ఆస్తిపై తాకట్టు
**charge on the immovable property** స్థిరాస్తిపై తాకట్టు/ తనఖా
**charge report** కార్యవిధి నివేదిక
**charges** భారాలు, ఛార్జీలు, ఖర్చులు
**charge-sheet** నేరారోపణ పత్రం, అభియోగ పత్రం, ఛార్జిషీటు
**charge to secure the discharge** విమోచనం పొందటానికి ఛార్జీ
**charge upon immovable property** స్థిరాస్తిపై తాకట్టు
**charge with liability** చెల్లింపు బాధ్యతతో ఉన్న ఛార్జీ
**charge with notice** నోటీసుతో ఆరోపించు
**charge with two or more heads** రెండుగాని అంతకన్న ఎక్కువగాని పద్దుల కింద పెట్టు
**charging department** ఛార్జింగ్ శాఖ
**charging lien** ఛార్జింగ్ లీన్: **1.** కక్షిదారు సొమ్ముపైన అటార్నీ లీను హక్కు **2.** నిర్దిష్ట ఋణస్థుని వాటా సొమ్ము మీద జప్తు
**charging order** తాకట్టు ఉత్తరువు: బాకీదారు ధనాన్నిగాని, వస్తువులనుగాని ఋణ తీర్మానం నిమిత్తం ఛార్జీ చెయ్యటానికి ఋణదాత డిక్రీ హోల్డరు న్యాయస్థానం నుంచి పొందిన ఆర్డరు
**charging section** పన్ను విధింపు విషయమై చట్టంలో ఉన్న పరిచ్ఛేదం
**charging system** ఛార్జింగ్ పద్ధతి
**charging the interest of such partner** అటువంటి భాగస్థుని ప్రయోజనం మీద భారం వెయ్యటం
**charitable** ధర్మదాన, ధర్మాదాయ
**charitable allowance** ధర్మదాన బత్తెం
**charitable and religious endowments** ధర్మదాన, దేవాదాయ మాన్యాలు
**charitable and religious purpose**

ధర్మాదాన ధార్మిక ప్రయోజనం
**charitable company** ధర్మదాన సంఘం
**charitable endowments** ధర్మాదాయాలు, ధర్మదాన మాన్యాలు
**charitable institution** ధర్మ సంస్థ, ధర్మాదాయ సంస్థ, ధర్మదాన సంస్థ
**charitable purpose** ధర్మదాన ప్రయోజనం
**charitable trust** ధర్మదాన నిధి/ సంస్థ
**charitable uses** ధర్మదాన ఉపయోగాలు
**charity** దానధర్మం, ధర్మదానం, ధర్మాధికారం
**charity commission** ధర్మాధికార / ధర్మదాన కమీషన్
**charity commissioner** ధర్మాధికార/ ధర్మదాన కమీషనర్
**charity property** ధర్మదాన ఆస్తి
**charity school** ధర్మ పాఠశాల
**chart** 1. వివరణ పటం 2. కాలమ్‌వారీ పట్టిక/ చార్టు
**charter** 1. పట్టా, ఛార్టరు, అధికార పట్టా 2. అధికార నియమావళి 3. ఆజ్ఞాపత్రం, అధికార పత్రం
**charter Act** అధికారం పత్ర చట్టం / ఛార్టర్ ఆక్ట్
**chartered** పట్టాపొందిన, అధికార సహిత
**chartered company** అధికృత కంపెనీ
**chartered plane** అద్దె విమానం
**chartered ship** కిరాయి ఓడ
**chartered vessel** కిరాయి నావ
**chartered voyage** కిరాయిపై విదేశ ప్రయాణం
**charterer** కిరాయిదారు, కౌలుదారు (ఓడ, విమానాలు)
**chartering** ఓడ కిరాయికి తీసుకోవడం
**charter of oath** ప్రమాణ పత్రం
**charter of the company** కంపెనీ అధికార పత్రం (నియమావళి)
**charter party** ఓడ కిరాయి పత్రం: ఓడ యజమాని ఒక వర్తకుడికి సరుకుగాని ఓడగాని అద్దెకిచ్చిరాసే పత్రం
**charter party clause** ఓడ కిరాయి షరతు
**chase n.** 1. వెంటాడడం 2. వేటభూమి: వేటకు ఏర్పాటు చేయబడిన వనం 3. అచ్చు చట్రం **v.** 4. వెంటాడు
**chase the case** కేసు ప్రగతిపై ధ్యాసపెట్టు
**chaste** పవిత్రమైన, నిష్కళంక
**chastity** పవిత్రత, సచ్ఛీలం
**chastize** శిక్షించు: పుత్రుని, శిష్యుని, శిక్షణార్థిని శిక్షించటం వంటిది
**chat n.** మాటామంతి **v.** కబుర్లు చెప్పు
**chattel interest** అనుభోగ హితం: కొన్నేండ్లు భూమిని అనుభవించే హక్కు
**chattel mortgage** చరాస్తి కుదువ
**chattel or valuable security** చరాస్తి లేదా విలువగల పత్రాలు
**chattels** చరాస్తి
**chaud medley** ఆవేశంతో చేసిన హత్య
**chauffeur of staff** సిబ్బంది కారు డ్రైవరు
**cheap** చౌక, అల్ప
**cheap money** చౌకధనం, తక్కువ వడ్డీ ధనం
**cheap money policy** చౌకధన విధానం
**cheap popularity** చౌకబారు ప్రచారం/ ప్రసిద్ధి
**cheap power** చౌక విద్యుచ్ఛక్తి
**cheat n.** వంచకుడు **v.** వంచించు
**cheating** వంచన
**cheating by personation** మారువేషంతో వంచన
**check n.** తనిఖీ, సరిచూచు **v.** తనిఖీచేయు, ఆటంకపరచు
**check and give remarks** తనిఖీ చేసి రిమార్కులు ఇచ్చు
**check and put up** సరిచూసి రాసి పంపండి
**checked and found correct** తనిఖీ అయింది, సరిగానే ఉంది
**check enumeration** తనిఖీ గణన
**checker** తనిఖీదారు
**checking of personal registers**

వ్యక్తిగత రిజిష్టర్‌ల తనిఖీ
**checking of voters list** వోటర్ల జాబితా తనిఖీ
**check measurement** కొలతల తనిఖీ
**check measurer** కొలత తనిఖీదారు
**check period** తనిఖీ కాలం
**check point** చెక్‌పోస్టు, పరీక్షాస్థలం
**check post** తనిఖీ చౌకి, చెక్‌పోస్టు
**check register** తనిఖీ రిజిస్టరు
**checks** నిరోధాలు, అదుపులు
**checks and balances** అదుపులూ అన్వయాలూ
**check weight** తనిఖీ తూకం
**chemical examination** రసాయన పరీక్ష/ పరిశీలన
**chemical fertilizer** రసాయన ఎరువు
**chemical industry** రసాయన పరిశ్రమ
**chemical manure** రసాయన ఎరువు
**chemical operation** రసాయన క్రియ/ చర్య
**chemical process** రసాయన ప్రక్రియ
**chemicals** రసాయనాలు
**chemical substances** రసాయన పదార్థాలు
**chemical wood** రసాయన దారువు: రసాయన క్రియ పొందిన కర్ర
**chemico-legal examination** రసాయన న్యాయపరీక్ష
**chemist 1.** రసాయన శాస్త్రవేత్త **2.** రసాయనాల వ్యాపారి
**cheque** చెక్కు (బ్యాంకు సం॥)
**cheque book** చెక్కు పుస్తకం
**cheque, crossed** క్రాస్ చేసిన చెక్కు: బ్యాంకు అకౌంట్ ద్వారా మాత్రమే మార్చుకో గలిగే చెక్కు
**cheque crossed specially** ప్రత్యేక క్రాసు చెక్కు: పేర్కొన్న బ్యాంకు ద్వారా మార్చుకోగలిగే చెక్కు
**cheque is realised** చెక్కు డబ్బు వసూలైంది
**cheque issued** జారీ చేసిన చెక్కు
**cheque, mutilated** చిరిగిన చెక్కు/ చెడిపోయిన చెక్కు
**cheque payable to order** ఆర్డరు ప్రకారం చెల్లించే చెక్కు
**cheque received** అందిన చెక్కు
**cheque recovery** చెక్కు వసూలు
**cheques pending collection** వసూలుకు పంపవలసిన చెక్కులు
**chest disease** రొమ్ము / ఛాతి జబ్బు
**chest money** గల్లా పెట్టె డబ్బు
**chide** చీవాట్లు పెట్టు, మందలించు
**chief n.** ప్రముఖుడు, ముఖ్యాధికారి **adj.** ముఖ్య, ప్రధాన
**chief adviser** ముఖ్య సలహాదారు
**chief auditor** ముఖ్యగణకుడు/ ఆడిటర్
**chief buyer** ముఖ్య కొనుగోలుదారు
**chief court** ముఖ్య న్యాయస్థానం
**chief examiner** ముఖ్య పరీక్షాధికారి
**chief executive (administration)** ముఖ్య నిర్వాహణాధికారి (పరిపాలన), ప్రధాన కార్య నిర్వాహకుడు
**chief of personnel** సిబ్బంది ముఖ్యాధికారి
**chief protocol 1.** ముఖ్య శిష్టాచారం, ఛీఫ్ ప్రోటోకాల్ **2.** శిష్టాచార ముఖ్యుడు
**chief whip** ప్రధాన సచేతకుడు/ ఛీఫ్‌విప్
**child-birth** శిశుజననం
**child care centre** శిశు సంరక్షణ కేంద్రం
**child death** శిశు మరణం
**child en ventre sa mere** గర్భస్థ శిశువు: చట్టప్రకారం గర్భస్థ శిశువుకు కూడా వారసత్వ హక్కులు సంప్రాప్తమవుతాయి, అంటే శిశువు జన్మించినట్లే లెక్క
**child guidance clinic** మార్గదర్శక శిశుచికిత్సా కేంద్రం
**child labour** బాలశ్రామికత్వం/ శ్రామికుడు
**child marriage** బాల్య వివాహం
**child of immature understanding** పరిపక్వంకాని అవగాహనగల శిశువు
**child mortality rate** శిశు మరణాల రేటు

**child stealing** శిశు అపహరణ
**children by adoption** దత్తు సంతానం
**children education allowance** బాలల విద్యకు భత్యం, పిల్లల విద్యాభత్యం
**children of the wife** భార్య సంతానం
**children's court** బాలల న్యాయస్థానం
**children's home** బాలల సదనం
**children's hospital** పిల్లల ఆసుపత్రి
**children's museum** పిల్లల వస్తు ప్రదర్శన శాల
**child welfare programme** శిశు సంక్షేమ కార్యక్రమం
**child welfare centre** శిశు సంక్షేమ కేంద్రం
**chiminage** రహదారి పన్ను
**chinaware** పింగాణి పాత్రలు
**chirographum** స్వహస్త లిఖితం
**chirography** 1. లేఖనకళ, దస్తూరి 2. సాముద్రికం
**chit funds** చిట్‌ఫండ్‌లు
**choice** ఎంపిక, అభీష్టం
**choke** ఊపిరి ఆడకుండా చేయు, ఉక్కిరి బిక్కిరి చేయు
**choose** ఎంపిక చేసుకొను, ఎన్నుకొను, ఏరుకొను
**chopper (chopping) industry** ఛేదన పనిముట్ల పరిశ్రమ
**choppers** 1. ఛేదన పనిముట్లు 2. ఛేదకులు
**chose** 1. వస్తువు 2. సొంత వస్తువు
**chose in action** వ్యాజ్య సంపాదితం: వ్యాజ్యంతో పొందే వస్తువు లేదా హక్కు
**chose in possession** స్వాధీన వస్తువు
**chose jugee** పరిష్కృతమైన విషయం, a matter that has been settled
**chose local** స్థానిక వస్తువు: ఒక స్థలంతో ముడిపడ్డ వస్తువు
**chosen** ఎంపిక చేసుకోబడిన
**chosen by lot** చీట్లు వేసి నిర్ణయించిన
**chrome tanning** క్రోం పదును చేసేపని
**chronic** దీర్ఘకాలిక దీర్ఘకాలంగా కరువు బాధగల జిల్లా
**chronic disease** దీర్ఘకాలిక రోగం
**chroniclers** కైఫీయతుకారులు: సంఘటనలను కాలక్రమంగా నమోదుచేసేవారు
**chronicles** కైఫీయతులు
**chronic unemployment** దీర్ఘకాలిక నిరుద్యోగం
**chronogram** 1. కాలసూచి (యంత్రం) 2. సంఖ్యా సంకేతం
**chronograph** కాలలేఖిని
**chronological** కాలానుక్రమ
**chronological filing** కాలానుక్రమంగా ఫైలు చెయ్యటం
**chronological gap** కాలానుక్రమం ఎడం
**chronological index** కాలక్రమ సూచి
**chronological order** కాలానుక్రమం
**chronology** 1. కాలానుక్రమం, కాల పరిగణన 2. కాలగణనశాస్త్రం
**cinematograph** 1. సినిమాటోగ్రాఫ్ a motion picture projector 2. చలన చిత్ర కెమెరా: a camera for taking motion pictures
**cinematography** సినిమాటోగ్రఫీ, చలన చిత్రకళ
**cipher** 1. సున్న, శూన్యం 2. గూఢలేఖనం, సాంకేతిక లిపి
**cipher code** గూఢ లేఖన సంకేతం
**cipher telegram** గూఢ లేఖన తంతి
**circa** రమారమి
**circle** చక్రం, వృత్తం, వలయం, మండలం, పరిధి, సర్కిల్
**circle of accounts** ఖాతాల పరిధి/ మండలం
**circle office** సర్కిల్ కార్యాలయం
**circuit** 1. సంచార వలయం 2. పర్యటన పరిధి
**circuit court** సర్క్యూట్ న్యాయస్థానం
**circuit house** సంచారక / సర్క్యూట్ గృహం: సంచారక ఉద్యోగుల విశ్రాంతిగృహం
**circuitous litigation** డొంకతిరుగుడు

**comply** అనుగుణంగా ఉండు
**complying with instructions** ఆదేశాలు పాటించడం / నిర్వర్తించటం
**comply with** పాటించు / అనుపాలించు
**comply with the order** ఉత్తరువును పాటించు / అనుపాలించు
**comply with the requirements** అవసరాలను పూరించండి
**component** అంగం, భాగం, సంఘటకం
**compose** రచించు, కూర్చు
**composed of** కలిగి ఉన్న, సంఘటితమై ఉన్న
**compose mentis** స్వస్థచిత్తత
**composite** అవిభక్త, కలిసిఉన్న, మిశ్ర, సంయుక్త, సమష్టి
**composite culture** సమ్మిశ్ర సంస్కృతి
**composite demand** సమష్టి డిమాండు
**composite family** అవిభక్త కుటుంబం
**composite register** సమష్టి రిజిస్టరు
**composition** 1. రచన 2. పరిష్కారపు ఏర్పాటు 3. సంయోగం, సమ్మిశ్రణం, నిర్మాణం, కూర్పు
**composition deed** ఋణ విమోచన/ పరిష్కార దస్తావేజు
**composition for duty** సుంకానికి పరిష్కారం
**composition of arbitral authority** మధ్యవర్తి ప్రాధికారం ఏర్పాటు
**composition of offences** నేరాల సమ్మిశ్రణం
**composition of the Assembly** విధాన సభ ఏర్పాటు/ నిర్మాణం
**composition of the House** శాసన / విధానసభా నిర్మాణం
**composition or consolidation of duties** సుంకాల పరిష్కారం లేదా ఏకీకరణ
**composition with creditors** బాకీదారులతో ఉమ్మడి ఋణ పరిష్కారం చేసుకోవటం
**compound** రాజీ చేసుకొను (న్యాయ సం॥)
**compound a case** కేసు రాజీ చేసుకొను
**compoundable offence** రాజీకి వీలున్న నేరం
**compound a felony or offence** తగని రాజీపడు, అపరాధానికి రాజీపడు: నేరం నుంచి విముక్తి చెందడానికి తగని రాజీపడు
**compound duties** సుంకాలను విధించు
**compounded lands** అన్ని బాపతుల/ తరహాల సుంకాల కింద మొత్తంగా పన్ను విధించబడిన భూములు
**compound fracture** ఎముకలు అనేక భాగాలుగా విరగటం
**compounding creditor** పరిష్కారం చేసుకొనే ఋణదాత
**compounding fee** అభియోగ ప్రత్యామ్నాయ రుసుం, నివృత్తి రుసుం, జరిమానా
**compounding felony or offence** నేర విముక్తికి తగని రాజీపడటం, నేరం మాఫీ చేసుకోవటం
**compounding of offences** ఫిర్యాదీ - నేరస్తుల రాజీ, నేరాలను పరిష్కారం చేసుకోవడం
**compounding with creditor** బాకీదారులతో ఉమ్మడి ఋణ పరిష్కారం చేసుకోవటం
**compound interest** చక్రవడ్డీ : వడ్డీమీద వడ్డీ
**compound offence** మిశ్రనేరం: అనేకాపరాధాలు కలిసిన నేరం
**comprehensive** సమగ్రమైన
**comprehensive data** సమగ్ర భోగట్టా/ దత్తాంశాలు
**comprehensive insurance** సమగ్ర భీమా
**comprehensive plan** సమగ్ర ప్రణాళిక
**comprehensive programme** సమగ్ర కార్యక్రమం
**comprehensive questionnaire** సమగ్రమైన ప్రశ్నావళి
**comprehensive report** సమగ్రమైన నివేదిక
**compress** అదుము, కుదించు, సంకోచింప

చేయు
**compressor** కంప్రెసర్, కుదించేది, సంకోచకం
**comprise** కూడుకొని ఉండు, ఇమిడి ఉండు
**comprised** పొందుపరిచిన, చేరిఉన్న
**comprised in** -లో కూడుకొని ఉన్న
**compromise** రాజీ, సమాధానం, పరిష్కారం, తీర్మానం
**compromise agreement to refer to arbitration** మధ్యవర్తి పరిష్కారం కోసం రాజీ ఏర్పాటు (కరారు)
**compromise of suit** దావా రాజీ / పరిష్కారం
**compromise petition** రాజీ దరఖాస్తు / అర్జీ
**compromise resolution** రాజీ తీర్మానం
**compulsorily acquired** నిర్బంధంగా ఆర్జించిన
**compulsory** నిర్బంధ, తప్పనిసరి, అనివార్య
**compulsory acquisition** నిర్బంధ ఆర్జన / సేకరణ
**compulsory appearance** నిర్బంధ హాజరు, తప్పనిసరిగా హాజరు కావటం
**compulsory arbitration** నిర్బంధ మధ్యవర్తిత్వం
**compulsory deposit** నిర్బంధ డిపాజిట్టు: ప్రావిడెంట్ ఫండ్ చట్టం కింద భీమా కిస్తీకి తప్ప గడువుకాలం వరకు తీయకుండా నిల్వ ఉంచే నిక్షేపం
**compulsory dissolution** నిర్బంధ రద్దు
**compulsory education** నిర్బంధ విద్య
**compulsory grant** నిర్బంధ గ్రాంటు/ అనుదానం
**compulsory liquidation** నిర్బంధ పరిసమాప్తి
**compulsory notification of vacancies** (ఉద్యోగ) ఖాళీల నిర్బంధ ప్రకటన
**compulsory policy** నిర్బంధ భీమా పట్టా/ పాలసీ
**compulsory referendum** నిర్బంధ ప్రజా నిర్ణయ సేకరణ
**compulsory retirement** నిర్బంధ పదవీ విరమణ
**compulsory savings** నిర్బంధ పొదుపు
**compulsory service** నిర్బంధ సేవ
**compulsory voting** నిర్బంధ వోటు విధానం
**compulsory winding up** నిర్బంధ ముగింపు / సమాపనం
**computation** గణనం, లెక్కింపు
**computation of additional wages** అదనపు వేతనాల లెక్కింపు
**computation of advance tax** అడ్వాన్సు పన్ను లెక్కింపు
**computation of court fees** కోర్టు రుసుముల లెక్కింపు
**computation of demands** అభ్యర్థనల గణనం, డిమాండుల గణన
**computation of net profits** నికర లాభాల లెక్కింపు / గణన
**computation of net wealth** నికర సంపద లెక్కింపు
**computation of period of limitation** పరిమితి అవధి లెక్కింపు
**computation of time** కాలం లెక్కింపు, కాలగణన
**computation of total income** మొత్తం ఆదాయం లెక్కింపు
**computation report** గణన నివేదిక
**computer** కంప్యూటర్, గణన యంత్రం
**conceal** దాచు, గూఢంగా ఉంచు, మరుగుపరచు
**concealed fraud** కప్పిపుచ్చిన మోసం
**conceal evidence** సాక్ష్యాన్ని దాచు
**conceal identity** ఆనవాలు దాచు
**concealing design to commit offence** నేరం చెయ్యటానికి రహస్య పన్నాగం
**concealment of birth** పుట్టుకను కప్పిపుచ్చటం
**concealment of fact** వాస్తవం కప్పిపుచ్చటం / దాచి ఉంచటం
**concealment of income** ఆదాయం కప్పి పుచ్చటం

**concede** ఒప్పుకొను
**conceivable** ఊహించదగిన, ఊహ్యమైన
**concentrate** 1. కేంద్రీకరించు, ఏకాగ్రం చేయు, 2. సారకృతం, గాఢ
**concentration camp** యుద్ధ ఖైదీల శిబిరం
**concentration of armed forces** సాయుధ బలాల కేంద్రీకరణ / ఏకీకరణ/ మోహరింపు
**concentration of authority** అధికార కేంద్రీకరణ
**concentration of control** నియంత్రణాధికార/ కంట్రోల్ కేంద్రీకరణ
**concentration of industries** పరిశ్రముల కేంద్రీకరణ
**concentric** ఏక కేంద్రక
**concept / conception** భావన
**concern** 1. సంబంధం, 2. వ్యాపార సంస్థ
**concerned with the procedure** కార్య విధానానికి సంబంధించిన
**concerned with the proceeding** (విచారణ) విషయానికి సంబంధించిన
**concert** మేళనం, సంఘటిత, ఏకగ్రీవ
**concerted effort** సంఘటిత కృషి
**concerted refusal** ఏకగ్రీవ నిరాకరణ
**concert the offence** అపరాధం చేయటానికి కలిసి పన్నాగం వేయు
**concession** 1. రాయితీ, 2.తగ్గింపు
**concessional period** రాయితీ గడువు
**concessional rate** రాయితీ రేటు, తగ్గింపు రేటు
**concessional ticket** రాయితీ టికెట్టు
**conciliate** సమాధాన పరుచు, పొందిక చేయు, రాజీ చేయు
**conciliation** రాజీ, సమాధానం
**conciliation board** రాజీ మండలి
**conciliation committee** రాజీ సంఘం : రాజీ కుదిర్చే సంఘం
**conciliation officer** రాజీ అధికారి
**conciliation proceedings** రాజీ వ్యవహారాలు/ కార్యవర్తనలు
**conciliator** రాజీ సంధాత : రాజీ కుదిర్చే వ్యక్తి
**conciliatory negotiations** రాజీ సంప్రదింపులు
**concise form** సంగ్రహ రూపం
**concisely** సంక్షేపంగా
**concise particulars** సంగ్రహ / సంక్షిప్త వివరాలు
**concise statement** సంక్షేప కథనం
**conclave** గూఢ / రహస్యసభ, ఏకాంత సమావేశం
**conclude** 1. ముగించు, ఉపసంహారం చేయు, సమాప్తి అవు, 2. సంధి చేసుకొను (as conclude a treaty) 3. నిశ్చయించు, తేల్చు, పూర్తిచేయు
**conclude upon** ఉపసంహరించు, నిశ్చయించు
**concluding para** ముగింపు పేరా
**conclusion** 1. ఉపసంహారం 2. నిష్కర్ష: నిశ్చయించి చెప్పిన అభిప్రాయం; తేల్చిన అభిప్రాయం 3. తీర్మానం
**conclusion of the debate** చర్చ ముగింపు
**conclusion of the enquiry** విచారణ సమాప్తి
**conclusion of the investigation** దర్యాప్తు సమాప్తి
**conclusion of trial** విచారణ ముగింపు
**conclusions of the conference** మహాసభ తీర్మానాలు / నిర్ణయాలు
**conclusive** 1. నిర్ధాయక, నిర్ణయించే, 2. నమ్మకం కలిగించే
**conclusive and final evidence** నిర్ధాయకమూ ఆఖరూ అయిన సాక్ష్యం
**conclusive and final evidence of the liability** బాధ్యతను నిర్ణయించే ఆఖరి సాక్ష్యం
**conclusive evidence** నిర్ధాయక సాక్ష్యం
**conclusive evidence of fact** జరిగిన విషయానికి సంబంధించిన నిర్ధాయక సాక్ష్యం
**conclusively** నిర్ధాయకంగా **decisively**

**conclusively determined** దృఢంగా నిశ్చయించబడిన
**conclusive proof** నిశ్చాయకమైన రుజువు
**concocted evidence** కల్పిత సాక్ష్యం, కూట / సృష్టించిన సాక్ష్యం
**concomitant** సహవర్తి, కూడా వచ్చేది
**concord and discord** సుసంగత, విసంగత
**concordant** అనుసరించి ఉండే, అన్వయించే, ఏకీభవించే, ఒద్దిక గల
**concrete** స్థూల, యథార్థ, వాస్తవిక, మూర్త, ప్రత్యక్ష
**concrete case** ప్రత్యక్ష ఉదాహరణ
**concrete example** ప్రత్యక్ష ఉదాహరణ / రుజువు చెయ్యగల ఉదాహరణ, రూఢి ఉదాహరణ
**concrete proposal** యథార్థ ప్రతిపాదన, నిర్దిష్ట ప్రతిపాదన
**concubine** ఉంపుడుకత్తె
**concur** ఏకీభవించు, సమ్మతించు
**concur in a judgement** తీర్పు విషయంలో ఏకీభవించటం
**concurrence** సమ్మతి
**concurrence for the creation of the following posts is requested** దిగువ పేర్కొన్న పదవుల కల్పనకు సమ్మతి కోరడమైంది
**cuncurrence for the extension of the following posts is requested** ఈ దిగువ పదవుల పొడిగింపుకు సమ్మతి కోరడమైంది
**concurrence has been obtained** సమ్మతి పొందడమైంది
**concurrence of a majority** అధిక సంఖ్యాకుల ఏకీభావం, మెజారిటీ సమ్మతి
**concurrence of a majority of the jury** జూరీ సభ్యుల్లో అధిక సంఖ్యాకుల ఏకీభావం, జూరీలో మెజారిటీ ఏకీభావం
**concurrence of the competent authority** సమర్థ అధికార సమ్మతి
**concurrent 1.** ఉభయ సామాన్య **2.** ఉభయ సమ్మతి **3.** ఏకకాలిక
**concurrent audit** ఏకకాలిక ఆడిట్
**concurrent finding** ఏకనిర్ణయం
**concurrent jurisdiction** ఉభయ సామాన్య అధికారపరిధి
**concurrent legislative list** ఉభయ సామాన్య శాసనాధికార పట్టిక (రాజ్యాంగ సం॥)
**concurrent list** ఉమ్మడి జాబితా, ఉభయ సామాన్య పట్టిక, ఉభయ సామాన్య శాసనాధికార పట్టిక (రాజ్యాంగ సం॥)
**concurrent powers** ఉభయ సామాన్యాధికారాలు
**concurrent remedy** ఏకకాలంలో పొందదగిన పరిహారం
**concurrent sentences** ఏకకాలిక శిక్షలు: ఏకకాలంలో అనుభవించ వలసిన శిక్షలు
**concurrent subjects** ఉమ్మడి విషయాలు, ఉభయ సామాన్య విషయాలు (సంవిధాన సం॥)
**concurrent will** ఉమ్మడి వీలునామా, ఉభయ సామాన్య వీలునామా
**concurring vote** సమ్మతి వోటు
**concussion** దెబ్బ, ఘట్టనం
**condemned 1.** నిందిత, **2.** దండిత, మరణ దండన విధించబడిన, **3.** తోసి పుచ్చబడిన, గర్హితమైన
**condemned article** నిష్ప్రయోజక వస్తువు
**condemned cell** మరణ దండితుల ఖైదు గది
**condemned criminal** దండిత అపరాధి (మరణ దండన, జీవిత ఖైదు సం॥)
**condemned goods** పనికిరాని సరుకులు, తోసివుచ్చిన సరుకులు
**condemned person** దండిత వ్యక్తి
**condemned stock** తోసివుచ్చిన స్టాక్ (సరుకు)
**condensation 1.** ఘనీకరణ, **2.** క్లుప్తీకరణ
**condenser** కండెన్సర్, ఘనీకరణ యంత్రం
**condign** (శిక్ష సం॥) ఉచిత, యోగ్య, తగిన, చాలినంత
**condition n. 1** షరతు, నిబంధన, నియమం,

2. పరిస్థితి, దశ v.1. షరతు పెట్టు 3. స్థితిలో పెట్టు

**conditional acceptance** షరతుపై అంగీకారం

**conditional advance note** 1. షరతుపై ఇచ్చిన అడ్వాన్సు పత్రం 2. జీతం అడ్వాన్సు చీటి (నావిక సం॥)

**conditional attachment** షరతు పూర్వక జప్తు

**conditional bail** షరతుపై జామీను, నిబంధనపై జామీను

**conditional bond** షరతు బాండు

**conditional contract** షరతు పూర్వక కాంట్రాక్టు / కరారు

**conditional discharge** షరతుపై విడుదల

**conditional grant** షరతుపూర్వక గ్రాంటు/ అనుదానం

**conditional guarantee** షరతు పూర్వక పూచీ / గ్యారంటీ

**conditional legacy** షరతు పూర్వక వీలునామా (ఆస్తి సం॥)

**conditional legislation** షరతుపూర్వక శాసన నిర్మాణం

**conditional order** షరతులతో కూడిన ఉత్తరువు

**conditional promise** షరతు పూర్వక వాగ్దానం

**conditional promotion** షరతు పూర్వక ప్రమోషను / వృద్ధి (ఉత్తీర్ణత, పదవీవృద్ధి)

**conditional release** షరతుపై విడుదల

**conditional sale** షరతుపై అమ్మకం

**condition and contract of sale** అమ్మకపు షరతు, ఒప్పందం

**condition and limitation** షరతు, పరిమితి

**condition and warranty** షరతు, పూచీ: పూచీకి భంగం కలిగితే నష్టపరిహారం పొందవచ్చు, కాంట్రాక్టునే రద్దు పరచవచ్చు

**condition for approval** ఆమోదానికి షరతు

**conditioning** వాతావరణ స్థితికి అలవాటు చెయ్యటం

**condition of eligibility** యోగ్యత షరతు

**condition of enrolment** పేరు నమోదు షరతు

**condition of previous publication** పూర్వ ప్రచురణ షరతు

**condition of re-entry** తిరిగి చేరటానికి / పునః ప్రవేశానికి షరతు

**condition of service** 1. సర్వీసు పరిస్థితి, 2. సర్వీసు షరతు

**condition of mind** మనఃస్థితి

**condition of the bailment** బెయిల్మెంటు షరతు

**condition of the bond** బాండు షరతు

**condition or limitation is void** షరతు లేదా పరిమితి చెల్లదు

**condition precedent** పూర్వవర్తి షరతు, ముందే నిర్వర్తించవలసిన షరతు

**condition prevailing** వర్తమాన పరిస్థితి

**condition report** పరిస్థితి నివేదిక

**condition restraining alienation** అన్యాక్రాంతాన్ని నిరోధించే షరతు

**conditions** 1. పరిస్థితులు, 2. షరతులు

**conditions and formalities** షరతులూ లాంఛనాలూ

**conditions expressed** వ్యక్తంచేసిన షరతులు

**conditions governing** ఆదేశించే షరతులు

**conditions implied** అంతర్నిహిత షరతులు

**conditions imposed** విధించిన షరతులు

**conditions of admissibility** అంగీకరించడానికి నిబంధనలు

**conditions of admissibility to cut motions** కోత ప్రతిపాదనల అంగీకరణకు నిబంధనలు, కోత ప్రతిపాదన ఆమోద యోగ్యతకు నిబంధనలు

**conditions of contract** కాంట్రాక్టు షరతులు

**conditions of employment** ఉద్యోగ

షరతులు
**conditions of labour** కార్మిక పరిస్థితులు
**conditions of service** ఉద్యోగ / సర్వీసు షరతులు
**conditions prescribed** నిర్ణీత షరతులు
**conditions, subsequent** తరవాతి షరతులు
**conditions super added** అధికంగా చేర్చిన షరతులు
**condolence** సంతాపం
**condonation** క్షమాపణ, మాఫీ
**condonation of deficiency of attendance** హాజరీ లోటును క్షమించటం
**condoner** క్షమించే వ్యక్తి
**condone the delay** ఆలస్యాన్ని మన్నించు, జాప్యం మాఫీచేయు
**conduce** సహాయకారి అవు
**conducive** ఉపయోగపడే, సహకారి అయ్యే
**conducive to the public good** ప్రజా సంక్షేమానికి ఉపయుక్తమయిన
**conduct** n. 1. ప్రవర్తన, చర్య, నడవడి v. 2. నిర్వహించు, నడుపు, దారిచూపు
**conduct an audit of receipts** రాబడుల ఆడిట్ నిర్వహించు
**conduct and affairs of bankrupt** దివాలాదారు ప్రవర్తన, వ్యవహారాలు
**conduct and behaviour** నడవడి, ప్రవర్తన
**conduct and discipline** ప్రవర్తన, క్రమశిక్షణ
**conduct an enquiry** దర్యాప్తు జరుపు/ చేయించు
**conduct certificate** ప్రవర్తన ధ్రువపత్రం
**conducted tour** నిర్వర్తిత యాత్ర
**conducting a prosecution** అభియోగం నడపడం
**conducting elections** ఎన్నికల నిర్వహణ, ఎన్నికలు జరపటం
**conducting of audit** ఆడిట్ నిర్వహణ
**conducting the sale** అమ్మకం జరపడం
**conduct is questionable** నడవడి ప్రశ్నించదగ్గది
**conduct meeting** సమావేశం జరుపు / నిర్వహించు
**conduct money** సాక్షి ఖర్చులు
**conduct of business** 1. కార్య నిర్వహణ, 2. వ్యాపార నిర్వహణ, 3. కార్యక్రమ నిర్వహణ
**conduct of elections** ఎన్నికలు నిర్వహించడం / జరపడం
**conduct of examinations** పరీక్షల నిర్వహణ
**conduct of public business** ప్రభుత్వ/ ప్రజా వ్యవహారాలను నిర్వహించడం
**conduct of the parties** 1. కక్షిదారుల ప్రవర్తన 2. పార్టీల ప్రవర్తన
**conduct of the plaintiff** వాది నడవడి
**conduct of the suit** దావా నడపడం
**conductor** 1. కండక్టరు, నిర్వాహకుడు, 2. వాహకం
**conduct register** ప్రవర్తన రిజిస్టరు
**conductress** 1. మహిళా కండక్టరు 2. ఉపచారిక, 3. సహాయిని
**conduct rules** ప్రవర్తన నియమావళి
**conduct sheet** ప్రవర్తన పత్రం
**conducts himself with dignity** హుందాగా నిర్వహిస్తాడు
**conduct the search in person** స్వయంగా సోదా జరుపు
**conduct unbecoming the character of an officer** అధికారికి తగని ప్రవర్తన
**confederacy** 1. కుట్ర, దురుద్దేశంతో సంధి, 2. రాజ్యాల కూటమి
**confederate** 1. సంధిబద్ధమైన రాజ్యం / దేశం / సభ్యుడు, 2. సహాపరాధి
**confederation** సంధిబద్ధం (రాజ్యం, సమితి సం॥) కూటమి, సమ్మేళన రాజ్యం
**confer** 1. ప్రసాదించు, అర్పించు, ప్రదానం చేయు, ప్రదత్తం చేయు, 2. సంప్రదించు, 3. సమాలోచించు
**confer degree** పట్ట ప్రదానం, పట్టా ఇవ్వటం

**conference** 1. సభ, మహాసభ, సమావేశం, సమ్మేళనం 2. సమాలోచనం, సమాలోచన మహాసభ

**conference hall** సభామందిరం

**conferment of honorary degree** గౌరవపట్టా ప్రదానం

**confer power** అధికార ప్రదానం చేయు, అధికారమిచ్చు

**conferred by charter** చార్టరు ద్వారా ప్రదత్తం చేయడమైంది

**conferred by this part** ఈ భాగంవల్ల కలిగిన

**conferring** ప్రదానం చెయ్యటం

**conferring the power** అధికార ప్రదానం

**confer with** – తో సంప్రదించు

**confess** తప్పు ఒప్పుకొను

**confession** 1. నేరం ఒప్పుకోలు, 2. ఒప్పుదల, ఒప్పుకోలు

**confession and avoidance** ఒప్పుకుంటూనే తప్పుకోవటం (వాది వాద సం॥)

**confess judgement** తీర్పు ఒప్పుకొను: ఒక వ్యక్తి ఇంకొకరికి ఇవ్వవలసిన మొత్తానికి బాకీ అంగీకరించి, ఆ మొత్తాన్ని న్యాయస్థానం తీర్పులో ఉదాహరించడానికి ఒప్పుకోవటం

**confessor** 1. నేరం ఒప్పుకొన్న వ్యక్తి, 2. పాప విమోచన మతాధికారి (క్రైస్తవ సం॥)

**confidant** అంతరంగికుడు

**confidence** నమ్మకం

**confidence limits** విశ్వాస పరిమితులు

**confidence of the people** ప్రజావిశ్వాసం

**confidence, want of** విశ్వాసరాహిత్యం, నమ్మకం లేమి

**confident n.1.** అంతరంగికుడు, **adj. 2.** విశ్వసనీయ

**confidential assistant** అంతరంగిక సహాయకుడు

**confidential box** రహస్య పేటిక

**confidential character roll** ప్రవర్తన / స్వభావ రహస్య పట్టిక

**confidential clerk** అంతరంగిక గుమాస్తా

**confidential communication** రహస్య సమాచారం

**confidential documents** రహస్య దస్తావేజులు

**confidential enquiry** రహస్య విచారణ

**confidential file** రహస్య ఫైలు

**confidential information** రహస్య సమాచారం

**confidential papers** రహస్య పత్రాలు

**confidential record**రహస్య రికార్డు

**confidential report** రహస్య నివేదిక, అంతరంగిక నివేదిక

**confidential sheets** రహస్య పత్రాలు

**configuration** అమరిక, భూపరిస్థితి, ఆకృతి

**confine n.** సరిహద్దు భూమి, మేర, హద్దు, పరిమితం **v.** హద్దులో ఉంచు

**confined to consideration** పరిశీలనకు మాత్రమే పరిమితమైన

**confined to discussion** చర్చకే పరిమితమైన, కేవలం చర్చించదగిన

**confined to office** కార్యాలయానికి మాత్రమే పరిమితమైన

**confinement** 1. నిర్బంధం, 2. గర్భధారణ, 3.పరిమితం

**confinement in a civil jail** సివిల్ జైలులో నిర్బంధం

**confinement in a military prison** మిలిటరీ జైలులో నిర్బంధం

**confinement in the quarter guard** క్వార్టర్ గార్డ్‌లో నిర్బంధం

**confinement into quarters, lines or camps** క్వార్టర్లలోగాని లైన్లలోగాని శిబిరాల్లో గాని నిర్బంధం

**confinement to the camp** శిబిరంలో నిర్బంధం

**confirm** 1. దృఢపరచు, 2. బలపరుచు, 3. స్థిరపరచు, స్థాపించు

**confirmation** దృఢీకరణ, స్థిరీకరణ, ఖాయపరచటం

**confirmation in the grade** శ్రేణిలో

స్థిరీకరణ, గ్రేడులో ఖాయపరచడం

**confirmation letter** స్థిరీకరణ లేఖ

**confirmation of a government servant** ప్రభుత్వ ఉద్యోగిని ఖాయ పరచడం

**confirmation of sale** అమ్మకాన్ని ఖాయ పరచటం

**confirmation order** స్థిరీకరణ ఉత్తరువు

**confirmed credit** స్థిరపరచిన పరపతి

**confirmed endorsement** ఖాయపరచిన పీటీరాత

**confirmed report** ఖాయమైన నివేదిక

**confirm the transfer** బదిలీని ఖాయ పరచు

**confiscable** జప్తు చేయదగిన, వశపరుచు కోదగిన, విర్పాటు కాదగిన

**confiscate** వశపరుచుకొను, ఆయత్తం చేసు కొను

**confiscated amount** జప్తు అయిన మొత్తం / సొమ్ము

**confiscated material** స్వాధీనపరచుకొన్న సరుకు, జప్తు చేసిన సరుకు

**confiscation** జప్తు, ప్రభుత్వ పరం చేయటం, స్వాధీన పరచుకోటం

**confiscator** వశపరచుకొనే వ్యక్తి

**confiscatory order** వశపరచుకొనే ఉత్తర్వు

**conflict** పరస్పర సంఘర్షణ / విరోధం

**conflict in distribution** పంపిణీలో సంఘర్షణ

**conflicting reports** పరస్పర విరుద్ధ నివేదికలు

**conflict in the decision** నిర్ణయంలో వైరుధ్యం

**conflict of interests** ప్రయోజనాల సంఘర్షణ

**conflict of law** న్యాయ / శాసన విరుద్ధత

**conflict of laws** శాసనాల పరస్పర విరుద్ధత (**Private International Law**)

**conformably to such judgement** అలాంటి తీర్పుకు అనురూపంగా

**conformation** 1. కట్టుబడి ఉండటం, 2. అనుసరించటం, 3. అనురూపణం

**conformatory order** కట్టుబాటు సంబంధ / అనురూపణాత్మక ఉత్తరువు

**conformist** ధర్మానువర్తి, కట్టుబాటుదారు

**conformity** 1. అనురూపత, 2. కట్టు బాటు, 3. అనుబద్ధం

**conformity with, in** –(తో) అనురూపంగా

**conform to standard specifications** ప్రామాణిక / స్థాయీకరించిన వివరణలను అనుసరించు

**confront** ఎదుర్కొను, ఎదుటబెట్టు

**confused in dealing with complex matters** సంకీర్ణ విషయాలలో వ్యవహ రించేప్పుడు గందరగోళపడిన

**confusion** 1. గందరగోళం, 2. కలగలుపు, 3.కలగాపులగం

**confusion of goods** సరుకుల కలగలుపు

**confusion of rights** హక్కుల కలయిక: ఋణదాత, బాకీదారు ఈ ఇద్దరి హక్కులు ఒకరిలోనే కలిసి పోవడం, **union of debtor and creditor in the same person**

**congenital** పుట్టుకతో వచ్చిన, జన్మతః

**congenital idiocy** పుట్టుకతో వచ్చిన మాంద్యం

**congested** 1. ఇరుకైన, తొక్కిడి, 2. నెత్తురు గడ్డకట్టిన

**congested area** ఇరుకైన స్థలం / ప్రాంతం

**conglomerate** 1. ఉండగట్టు, పేరుకొను, 2.కూడగట్టు

**congratulations** అభినందనలు

**congratulatory message** అభినందన సందేశం

**congregate** చేరు, గుమిగూడు

**congregation** సమావేశం

**congress** 1. మహాసభ, 2. కాంగ్రెస్ : ఒక జాతీయ రాజకీయపక్షం

**congruence** పోలిక, అమరిక

**conjecture** 1. ఊహ, అనుమానం, 2. ఉజ్జా యింపు

**conjoints** 1.దంపతులు 2. ఆస్తిని సంయు

క్తంగా అనుభవించేవారు
**conjugal** దాంపత్య; వైవాహిక
**conjugal family** దాంపత్య మూలక కుటుంబం
**conjugal rights** దాంపత్య హక్కులు
**conjugate** 1. సంభోగించు. 2. సంయుక్త మవు
**conjuncture** కలయిక పరిస్థితి (దేశకాల సం॥), భిన్న పరిస్థితుల చేరిక, తరుణం
**conjurer** మాంత్రికుడు
**connecting reference** సంబంధ నిర్దేశం
**connection with, in** ఈ సందర్భంలో
**connect previous papers** ఇదివరకటి పత్రాలను జతపరచండి
**connect relevant papers** సంబంధిత పత్రాలను జతపరచండి
**connivance** కుమ్మక్కు, రహస్య సమ్మతి: తెలిసి ఉపేక్షించటం
**connive at** ఎరిగి ఉపేక్షించు
**consanguine family** సమరక్త కుటుంబం
**consanguineous kin** సమరక్త బంధువు
**consanguinity** సమరక్త సంబంధం
**consanguinity, colletaral** పార్శ్విక రక్త సంబంధం
**consanguinity, lineal** వంశపారంపర్య రక్తసంబంధం
**conscience** అంతరాత్మ, అంతర్బుద్ధి
**conscience, good** శుద్ధమైన అంతఃకరణ
**conscience money** పశ్చాత్తాపధనం : పన్ను ఎగవేసిన వ్యక్తి పశ్చాత్తాపం చెంది ప్రభుత్వానికి- పంపిన ధనం
**conscientious officer** మనస్సాక్షితో వ్యవహరించే అధికారి
**conscientiously** అంతరాత్మ సాక్షిగా
**conscious** చైతన్యంగల, స్పృహగల
**consciousness** స్పృహ, అంతర్వివేక శీలత
**conscript** నిర్బంధ సైనికుడు : సైన్యంలో బలవంతంగా చేర్చబడినవాడు
**conscription** నిర్బంధ సైనిక సేవ : నిర్బంధంగా సైన్యంలో చేర్చుకోవటం
**consecration** 1. పవిత్ర సమర్పణ 2. ముడుపు 3. అంకితం
**consecration ceremony** పవిత్ర సమర్పణోత్సవం, అభిషేకోత్సవం
**consecutive** తరువాయి, క్రమానుగత
**consecutive days** తరువాయి / క్రమానుగత రోజులు
**consecutive meetings** తరువాయి/ క్రమానుగత సమావేశాలు
**consecutive months** తరువాయి/ క్రమానుగత నెలలు
**consecutive sentence** క్రమానుగత శిక్ష
**consecutive serial numbers** క్రమానుగత వరస సంఖ్యలు
**consecutive terms** క్రమానుగత అవధులు/ షరతులు
**consensus** సర్వసమ్మతి, బహుజన సమ్మతి, సాధారణాభిప్రాయం
**consensus ad idem** ఒకే మాటకు ఒకే అర్థంపై అంగీకారం
**consensus facit jus** అంగీకారమే న్యాయమూలం, **consent makes law**
**consensus facit legem** అంగీకారమే శాసన ప్రభావం కలుగజేస్తుంది
**consent n.** సమ్మతి, **v.** సమ్మతించు
**consent and approbation** సమ్మతీ అనుమోదమూ
**consent decree** సమ్మతి డిక్రీ
**consent, free and voluntary** నిర్నిబంధంగా తనంత తాను సమ్మతించు
**consent in writing** రాతపూర్వక సమ్మతి
**consentire est facere** ఏదైనా ఒక విషయాన్ని సమ్మతించడం, దాన్ని చేసినట్లే అవుతుంది
**consent of the people** ప్రజాసమ్మతి
**consent of parties** కక్షిదారుల సమ్మతి, పార్టీల సమ్మతి
**consent of the House** విధానసభ సమ్మతి
**consent of the Speaker** సభాపతి సమ్మతి (విధానసభ సం॥)

**consequence** 1. పర్యవసానం, ఫలితం, పరిణామం, 2. అనుషంగిక, తరువాయి
**consequence of failure** విఫలత పర్యవసానం
**consequence of non attendance** గైర్‌హాజరు పర్యవసానం
**consequent change** పర్యవసానంగా వచ్చిన మార్పు
**consequent events** పర్యవసాన సంఘటనలు, తర్వాతి సంఘటనలు
**consequent failure of justice** పర్యవసానంగా సంభవించిన న్యాయ విఫలత
**consequential act** పర్యవసాన చర్య
**consequential alterations** ఫలితంగా వచ్చే మార్పులు
**consequential damage** పర్యవసానంగా వచ్చే నష్టహాని
**consequential legislation** అనుసరించి చేసే శాసనం
**consequential loss** ఫలితంగా కలిగే నష్టం
**consequential order** తరువాయి ఉత్తరువు
**consequential relief** పర్యవసాన సహాయం
**consequently it has been decided that** పర్యవసానంగా ఈ విధంగా నిర్ణయించడమైంది
**consequent to** పర్యవసానంగా
**conservancy** 1. పారిశుద్ధ్యం, సఫాయి, శుభ్రపరచటం
**conservation** సంరక్షణ, పరిరక్షణ (పురావస్తు, భూసార సం॥)
**conservation of forests** అటవీ సంరక్షణ
**conservatism** 1.మితవాదం, 2. సంప్రదాయవాదం
**conservative** 1. మిత, 2. సంప్రదాయ (వాది)
**conservative estimate** మిత అంచనా, తగ్గించి వేసిన అంచనా
**conserve** కాపాడుకొను, సంరక్షించు, సంరక్షించుకొను, నిలవచేసుకొను
**consider** పర్యాలోచించు, విచక్షించు, ఆలోచించు, భావించు, పరిశీలించు, విచారణచేయు
**considerable** విశేష, చెప్పుకోదగిన
**considerable assistance** యథోచిత సహాయం
**considerable economy** యథోచిత మితవ్యయం
**considerable experience** చెప్పుకోదగినంత అనుభవం
**considerable magnitude** చెప్పుకోదగినంత మోతాదు / పరిమాణం
**considerable scope for improvement** అభివృద్ధికి తగినంత ఆస్కారం
**considerable time** తగినంత సమయం
**considerably delayed cases** విశేషంగా జాప్యం అయిన కేసులు
**consider adequately** తగినంతగా పరిశీలించండి
**consideration** 1. విచక్షణ, ఆలోచన, పర్యాలోచన, విచారణ, పరిశీలన, 2. ప్రతిఫలం
**consideration and passing** పరిశీలన, ఆమోదం
**consideration, for** పరిశీలనకు
**consideration for guarantee** గ్యారంటీ కోసం ప్రతిఫలం
**consideration for motion** విచారణకై ప్రతిపాదన
**consideration for promise** వాగ్దాన ప్రతిఫలం : వాగ్దానం చేసిన వారి కోరిక ప్రకారం వాగ్దాన స్వీకర్త గాని ఇతర వ్యక్తిగాని దాని ననుసరించి ఒక పని చెయ్యటం లేదా చెయ్యకపోవడం
**consideration motion** చర్చా ప్రతిపాదన
**consideration of a bill** చిత్తు చట్టపు పరిశీలన (బిల్లు సం॥)
**consideration of a clause** ఖండం / క్లాజు పరిశీలన
**consideration of amendments** సవరణల పరిశీలన

**consideration of bills** బిత్తు చట్టాల పరిశీలన
**consideration of report** నివేదిక పరిశీలన
**consideration of services** సేవలకు ప్రతిఫలం
**consideration of the evidence** సాక్ష్య పరిగణన / పర్యాలోచన
**consideration of the sentence** శిక్షపై పరిశీలన
**consideration, paramount** సర్వోన్నత పరిశీలన
**consideration, transferee for** బదిలీ పొందిన వ్యక్తికి ప్రతిఫలం
**consideration, under** పరిశీలనలో / ఆలోచనలో ఉన్న
**consideration, valuable** విలువగల ప్రతిఫలం
**consider necessary** అవసరమనీ/ఆవశ్యకమనీ భావించండి
**consider the finding** నిర్ణయాన్ని / తీర్పును పరిశీలించు
**consign** 1. పంపు, రవాణా చేయు (రైల్వే సామానులు వగైరా) 2. స్వాధీన పరచు
**consigned to record room** రికార్డుల గదికి చేర్చిన
**consignee** పొందేవాడు, గ్రాహకుడు
**consignee's address** పొందే వ్యక్తి చిరునామా
**consignment** 1. రవాణా సరుకు 2. సరుకు అప్పగింత
**consignment inward** అంతర్ - రవాణా సరుకు
**consignment note** రవాణా పత్రం, రవాణా రసీదు: రైలు వగైరాలపై సరుకు రవాణాదారు రాసే పత్రం
**consignment outward** బహిర్-రవాణా సరుకు
**consignment received** పొందిన రవాణా సరుకు
**consignment sent out** బయటికి రవాణా చేసిన సరుకు
**consignment stock** రవాణా సరుకు నిలవ
**consignment traced** జాడ దొరికిన రవాణా సరుకు, ఆచూకీ అందిన రవాణా సరుకు
**consignment transactions** రవాణా సరుకు లావాదేవీలు (అప్పగింత సం॥)
**consignor** రవాణాదారు (సరుకు సం॥)
**consign to the records** రికార్డులకు పంపు
**consistency** సంగతత్వం, అనుగుణ్యత
**consistency of conduct** ప్రవర్తన సంగతత్వం
**consistent principle** సంగతసూత్రం / అనుగుణ్య సూత్రం
**consistent view** సంగతమైన అభిప్రాయం
**consistent with the provisions** ఉపనియమాలకు సంగతమైన
**consist of** కలిగిఉండు / తో కూడిన
**consolation** ఉపశమనం, ఓదార్పు
**consol certificate** కన్సోల్ ధ్రువపత్రం: ప్రభుత్వం వారి ఋణపత్రం, ప్రభుత్వం అప్పు తీసుకొని ఇచ్చే పత్రం
**consolidate** 1. ఏకీకరణ చేయు, ఏకత్ర పరచు, ఏకమొత్తం చేయు, సంచిత పరచు, 2. క్రోడీకరించు
**consolidated** ఏకీకృతం చేసిన
**consolidated accounts** ఏకీకృత ఖాతాలు
**consolidated Acts** క్రోడీకరించిన చట్టాలు
**consolidated annual accounts** ఏకీకృత వార్షిక ఖాతాలు / లెక్కలు
**consolidated annuities** ఏకీకృత వార్షికాలు
**consolidated balance sheet** ఏకీకృత ఆస్తి అప్పుల పట్టిక
**consolidated code** ఏకీకృత నిబంధనలు / స్మృతి
**consolidated fund** సంచిత నిధి
**consolidated fund of India** భారత ప్రభుత్వ సంచిత నిధి: ప్రభుత్వ ఋణ తీర్మానం నిమిత్తం నిలవ చేసే నిధి, భారతీయ సంచిత నిధి
**consolidated fund of the state** రాష్ట్ర

సంచిత నిధి

**consolidated loan** ఏకమొత్తపు ఋణం

**consolidated monthly accounts** ఏకీకృత నెలవారీ ఖాతాలు / లెక్కలు

**consolidated pay** ఏకమొత్తపు జీతం : కరువుభత్యం వగైరాలు లేకుండా నిర్ణయించబడిన జీతం

**consolidated pay bill** జీతాల ఏకీకృత బిల్లు / చెల్లింపు బిల్లు

**consolidated question** ఏకీకృత ప్రశ్న

**consolidated report** ఏకీకృత /క్రోడీకరించిన నివేదిక

**consolidated report may be furnished** క్రోడీకరించిన నివేదిక పంపవచ్చు

**consolidated revenue** ఏకీకృత రెవెన్యూ

**consolidated statement** ఏకీకృత వివరణ పత్రం, ఏకీకృత పట్టిక, ఏకీకృత వివరణ

**consolidate the enactments** చట్టాలు క్రోడీకరించు

**consolidation of actions** చర్యల / వ్యాజ్యాల ఏకీకరణ

**consolidation of appeals** అపీళ్ళ ఏకీకరణ

**consolidation of corporations** కార్పొరేషన్ల ఏకీకరణ

**consolidation officer** క్రోడీకరణ అధికారి (భూమి లెక్కలు, పద్దులు వగైరా)

**consolidation of holdings** పట్టా భూముల ఏకీకరణ, కమతాల ఏకీకరణ

**consolidation of proceedings** ప్రొసీడింగుల ఏకీకరణ (కోర్టు జారీలు)

**consolidation of shares** వాటాల ఏకీకరణ

**consolidation of suits** దావాల ఏకీకరణ: రెండుగానీ అంతకంటె ఎక్కువగానీ దావాలను అనుసంధానం చేయటం

**consolidation of titles** హక్కు మూలాల ఏకీకరణ, శీర్షికల ఏకీకరణ

**consols** కాన్సోల్స్ : ప్రభుత్వం వారి ఏకీకృత ఋణ పత్రాలు, **Government securities consolidated into a single stock**

**consonance** పొందిక, సామరస్యం

**consort** భార్య, భర్త / సహచారి, సహచారిణి

**consortium** కన్సోర్షియం, సహాయతా సంఘం : పెద్దకార్యానికి గానీ నిర్మాణానికి గానీ కొన్ని దేశాలుగానీ కంపెనీలుగానీ కలిసి ఒకటిగా కావడం

**conspectus** దిగ్దర్శనం, **general view of subject**, స్థూలాభిప్రాయం

**conspicuous** సువ్యక్త, తెలిసే, కనిపించే, ప్రముఖ, విశిష్ట

**conspicuously notified** స్పష్టంగా ప్రకటించిన / సూచించిన, ప్రముఖంగా ప్రకటించిన

**conspicuous part** వెంటనే కనిపించే భాగం

**conspicuous place** గుర్తించదగిన స్థలం

**conspiracy** కుట్ర, గూడుపుఠాణీ

**conspirator** కుట్రదారు

**conspire** కుట్రచేయు

**constable** కానిస్టేబుల్, పోలీసుజవాను

**constabulary** పోలీసుదళం / రక్షకభట వర్గం

**constancy** నిరంతరత, స్థిరత్వం, నిలకడ

**constant capital** స్థిరమూలధనం

**constant cost** స్థిరవ్యయం / ఖర్చు

**constant demand** స్థిరమైన గిరాకీ

**constant prices** నిలకడగా ఉండే ధరలు

**constant study** నిరంతర అధ్యయనం

**constant temperature** స్థిర ఉష్ణోగ్రత

**constant water supply** నిరంతర నీటి సరఫరా

**constituency** నియోజక వర్గం

**constituent** 1. సంఘటక భాగం, అంతర్గత భాగం, అవయవం 2. నియోజకుడు, నియోజకవర్గ సభ్యుడు, ప్రతినిధి

**Constituent Assembly** సంవిధాన సభ (రాజ్యాంగ నిర్మాణ సభ), రాజ్యాంగ పరిషత్తు

**Constituent Assembly of India** భారత రాజ్యాంగ పరిషత్తు, భారత సంవిధాన సభ

**constituent of a group** సమూహ అంత

ర్భాగం / సంఘటక భాగం
**constituent part** సంఘటక భాగం
**constituent power** సంవిధాయకాధికారం
**constitute 1.** సంఘటితం చేయు, ఏర్పాటు చేయు **2.** నియోగించు, ప్రతినిధిగా చేయు
**constituted a quorum** కోరం పూర్తి అయింది
**constituted attorney** నియమిత అటార్నీ
**constituted by law** చట్టబద్ధంగా ఏర్పాటు అయిన
**constituted by or under** – ద్వారా లేదా అధీనంలో సంఘటితమైన
**constituting a charge** విధింపు రూపంలో ఏర్పరచడం
**constitution 1.** రాజ్యాంగం, సంవిధానం, **2.**సంఘటనం, **3.** స్థాపన
**constitutional** సంవిధాన, రాజ్యాంగ
**constitutional agitation** రాజ్యాంగ సమ్మతమైన ఆందోళన
**constitutional amendment** రాజ్యాంగ సవరణ
**constitutional anomalies** రాజ్యాంగ దృష్ట్యా అసంగతాలు
**constitutional bench** రాజ్యాంగ పీఠం / రాజ్యాంగ ధర్మాసనం : రాజ్యాంగానికి సంబంధించిన వ్యాజ్యాలను విచారణ జరపటానికి ఏర్పడిన సుప్రీం కోర్టు న్యాయమూర్తుల పీఠం/ ధర్మాసనం
**constitutional breakdown** రాజ్యాంగ స్తంభన
**constitutional crisis** రాజ్యాంగపర సంక్షోభం
**constitutional deadlock** రాజ్యాంగ ప్రతిష్టంభన
**constitutional expert** రాజ్యాంగవేత్త
**constitutional function** రాజ్యాంగవిధి
**constitutional government** రాజ్యాంగ బద్ధ ప్రభుత్వం
**constitutionalism** రాజ్యాంగబద్ధత, సంవిధాన వాదం
**constitutional issue** రాజ్యాంగ సమస్య
**constitutionalist** రాజ్యాంగవాది
**constitutional law** రాజ్యాంగ న్యాయ శాస్త్రం: దేశ ప్రభుత్వ పద్ధతికి చెందినటు వంటిది
**constitutional liberty** రాజ్యాంగబద్ధ స్వేచ్ఛ
**constitutional machinery** రాజ్యాంగ యంత్రాంగం
**constitutional manual** సంవిధాన నియమ సంపుటి / దీపిక
**constitutional means** రాజ్యాంగ సమ్మతమైన మార్గాలు / సాధనోపాయాలు
**constitutional methods** రాజ్యాంగ బద్ధమైన పద్ధతులు
**constitutional position** రాజ్యాంగ రీత్యా ఉన్న స్థితి
**constitutional privileges** రాజ్యాంగబద్ధ ప్రత్యేకాధికారాలు
**constitutional provisions** రాజ్యాంగ ఉపబంధనలు
**constitutional reason** రాజ్యాంగ కారణం
**constitutional remedy** రాజ్యాంగ సమ్మత నివారణోపాయం, రాజ్యాంగబద్ధ ప్రత్యుపాయం
**constitutional rights** రాజ్యాంగ పర హక్కులు
**constitutional rule** రాజ్యాంగబద్ధమైన పాలన / నియమం
**constitutional safeguards** రాజ్యాంగ రక్షణలు
**constitutional status** రాజ్యాంగ ప్రతిపత్తి
**constitutional system** రాజ్యాంగబద్ధ పద్ధతి
**constitutional system of the federation** సమాఖ్య స్థాపన పద్ధతి
**constitutional validity** రాజ్యాంగ చట్టబద్ధత / న్యాయసమ్మతి, రాజ్యాంగరీత్యా చెల్లుబడి
**constitution of an authority 1.** అధికారం ఏర్పాటు **2.** అధికార వర్గ సంఘట్టనం
**constitution of business advisory**

committee కార్యక్రమ సలహా సంఘం నిర్మాణం
onstitution of committee కమిటీ ఏర్పాటు, సంఘ నిర్మాణం
onstitution of High court హైకోర్టు వ్యవస్థాపన, ఉన్నత న్యాయస్థాన స్థాపన
onstitution of India భారత సంవిధానం / రాజ్యాంగం
onstitution of pension పింఛను ఏర్పాటు
onstitution of property ఆస్తి ఏర్పర చటం
onstitution of select committee విశిష్ట సమితి నిర్మాణం
onstitution of the committee సంఘం ఏర్పాటు, సమితి నిర్మాణం
onstrain నిరోధించు, నిర్బంధించు
onstraint to illegal act న్యాయ విరుద్ధ మైన చర్య చేసేటట్లు నిర్బంధం
onstructio legis non facit injuriam శాసన అన్వయం ఎట్లాంటి నష్టం కలిగించదు
onstruction 1. నిర్మాణం, కట్టడం 2. రచన, 3. అన్వయం
construction and erection నిర్మాణం, స్థాపన
construction, court of వీలునామాలకు అన్వయం చెప్పి వర్తింపజేసే కోర్టు
construction division నిర్మాణ విభాగం
construction machinery నిర్మాణ యంత్రాలు
construction of a committee సంఘ నిర్మాణం, కమిటీ ఏర్పాటు
construction of buildings భవనాల నిర్మాణం
construction of document పత్ర / దస్తావేజు అర్థాన్వయం
construction of structure సంరచన నిర్మాణం
construction of will వీలునామా అర్థాన్వయం చేయటం
construction sub-division నిర్మాణ ఉపవిభాగం
construction work నిర్మాణపు పని
constructive 1. నిర్మాణాత్మక, నిర్మాణశీల, 2. సంభావిత, 3. రచనాత్మక
constructive annexation సంభావితానుబంధం : న్యాయశాస్త్ర ప్రకారం భూమిని చేరి ఉన్నట్లుండేది
constructive approach నిర్మాణాత్మక దృష్టి
constructive assent సంభావిత సమ్మతి / స్థిరీకరణ
constructive contempt సంభావిత ధిక్కారం (కోర్టు, శాసనసభ సం॥)
constructive conversion సంభావిత స్వాయత్తీకరణం : ఇతరుల ఆస్తిని సొంతం చేసుకొన్నట్లు భావించటం
constructive crime సంభావిత నేరం
constructive criticism నిర్మాణాత్మక విమర్శ
constructive delivery సంభావిత అప్పగింత : ఆస్తి నుంచి ప్రతివాదినీ కిరాయిదార్లనూ తొలగించకుండానే ఆస్తి వాది స్వాధీనమైనట్లు భావించడం
constructive discipline నిర్మాణాత్మక క్రమశిక్షణ
constructive escape సంభావిత పలాయనం : నియమితమైన దానికంటె మించిన స్వాతంత్ర్యాన్ని ఖైదీ పొందటం
constructive fraud సంభావిత వంచన: జరిగినట్లు భావించే మోసం
constructive loss సంభావిత నష్టం : భీమా కంపెనీకి ఓడ సరుకును వదలిపెట్టటమే మంచిదని తోచేటంత నష్టం (నావిక భీమా సం॥)
constructive malice సంభావిత మాత్సర్యం: పగ సాధించే ఉద్దేశం ఉన్నట్లుగా భావించటం
constructive notice సంభావిత నోటీసు: ఒక వ్యవహార విషయమై ప్రత్యక్షంగా నోటీసు లేకున్నా అది తెలిసి ఉన్నట్లే భావించటం

**constructive possession** సంభావిత స్వాధీనం: న్యాయశాస్త్రరీత్యా స్వాధీనంలో ఉన్నట్లుగా భావన

**constructive presence** సంభావిత సన్నిధి: ఒక వ్యక్తి ఇంకో వ్యక్తికి అత్యంత సన్నిహితంగా ఉండి హాజరై ఉన్న కారణంగా అతను కూడా అక్కడున్నట్లే భావించటం

**constructive programme** నిర్మాణాత్మక కార్యక్రమం

**constructive res judicata** సంభావిత పూర్వ నిర్ధారితం : పూర్వం నిర్ధారణమైన విషయం తిరగదోడరాదనే ధర్మశాస్త్ర సూత్రం

**constructive total loss** సంభావిత పూర్తి నష్టం : నావిక భీమాతో ఓడను, సరుకును వదులుకొంటే నష్ట పరిహారపు పూర్తిమొత్తం పొందే వీలు ఉంటుంది.

**constructive trust** సంభావిత ట్రస్ట్/ ధర్మనిధి : ప్రయత్న పూర్వకంగా ఏర్పడక పోయినప్పటికీ న్యాయప్రవృత్తి ద్వారా ఏర్పడిన ట్రస్ట్

**constructive view, take a** నిర్మాణాత్మక దృష్టి ఉంచు / తో ఉండు

**constructive work** నిర్మాణాత్మక కృషి, నిర్మాణ కార్యక్రమం

**construe 1.** అర్థం చేసుకొను, అన్వయించు **2.** చట్ట నిబంధనల వర్తింపు పరిధి

**construed accordingly** ఆ ప్రకారంగా అర్థం చేసుకొన్న/ అన్వయించిన

**construed, shall be** ఆ విధంగా అర్థం చేసుకోవాలి

**consul** దౌత్యవేత్త (వాణిజ్య, జాతీయ సం॥)

**consular** దౌత్య సంబంధమైన

**consular agency** దౌత్య ఏజన్సీ

**consular agent** దౌత్య ఏజంటు

**consular attache** దౌత్య సహాయాధికారి

**consular certificate** దౌత్య ధ్రువపత్రం

**consular corps** వాణిజ్య దౌత్యవర్గం

**consular functions** దౌత్య సంబంధ కార్య విధులు

**consular officer** దౌత్యాధికారి

**consular representative** దౌత్య ప్రతిని

**consulate general** ప్రధానవాణిజ్య దూ

**consultancy services** సంప్రదింపు సేవ

**consultant** సంప్రదింపు నిపుణుడు

**consultation** సంప్రదింపు, సలహా

**consultation is necessary** సంప్రదింపు అవసరం

**consultation room** సంప్రదింపు గది

**consultative body** సంప్రదింపు సంఘం

**consultative committee** సంప్రదింపు మండలి / సంఘం

**consulting fee** సంప్రదింపు రుసుం

**consulting hours** సంప్రదింపు వేళలు

**consumable stores** వినియోగ సరుకుల దుకాణం

**consume** వినియోగించు, అనుభవించు, వాడుకొను

**consumed or destroyed** వినియోగించిన లేదా నష్టపరిచిన

**consumer** వాడకందారు, వినియోగదారు

**consumer credit** వినియోగదారు పరపతి

**consumer expenditure** వినియోగదారు వ్యయం

**consumer goods** నిత్యావసర వస్తువులు, వినియోగ సరుకులు

**consumer industries** వినియోగ వస్తు పరిశ్రమలు, నిత్యావసర వస్తు పరిశ్రమలు

**consumer market** వినియోగదారు మార్కెట్

**consumer price index** వినియోగ ధరల సూచీ

**consumer price index number** వినియోగ ధరల సూచీ సంఖ్య

**consumer promotion** వినియోగదారు ప్రోత్సాహనం

**consumer resistance** వినియోగదారు ప్రతిఘటన

**consumers' cooperative society** వినియోగదార్ల సహకార సంఘం

**consumer's interest** వినియోగదారు ప్రయోజనం

**consumers' surplus** వినియోగదారుల మిగులు
**consuming centre** వినియోగ కేంద్రం
**consuming price** వాడకం ధర
**consummate** పూర్తి, సంపూర్ణ
**consummate skill** సంపూర్ణ నైపుణ్యం
**consummation of marriage** శోభనం
**consumption** 1. వినియోగం, వాడకం, సేవించడం, 2. క్షయ
**consumption capital** వినియోగ మూలధనం
**consumption expenditure** వినియోగ వ్యయం
**consumption goods** వాడకం సరుకులు
**consumption has increased** వినియోగం పెరిగింది
**consumption investment** వినియోగ పెట్టుబడి
**consumption loans** వినియోగ ఋణాలు
**consumption schedule** వినియోగ పట్టిక
**consumption standard** వినియోగ ప్రమాణం
**contact** సంపర్కం, స్పర్శ, పరిచయం
**contact the informer** సమాచార దాతను కలుసుకొను
**contagion** అంటు, సంసర్గం
**contagious disease** అంటువ్యాధి
**contain any allegation of fact** వాస్తవానికి సంబంధించిన ఏ ఆరోపణ అయినా కలిగి ఉండు
**contained** అంతర్భూతమైన, చేరిన, ఇముడ్చుకొన్న
**contamination** మాలిన్యం, అంటు, కల్మషం, కాలుష్యం
**contemn** ధిక్కరించు
**contemner** న్యాయస్థాన ధిక్కరణ చేసిన వ్యక్తి
**contemplated** ఉద్దేశించిన, భావించిన
**contemplated action** ఉద్దేశపూరిత చర్య
**contemplated or probable breach of trust** ఉద్దేశించిన లేదా సంభావ్యమైన విశ్వాసభంగం
**contemplation** 1. ఆలోచన, ధ్యానం, చింతనం, 2. ఉద్దేశం
**contemplation of bankruptcy** దివాలా తీసే ఆలోచన / ఉద్దేశం
**contemplation of death, in** మరణం సమీపించిందని భావించి
**contemporaneous agreement** సమకాలీన ఒప్పందం
**contemporaries** సమకాలికులు, సమకాలీనులు
**contemporary** సమకాలిక
**contemporary exposition** సమకాలిక అభివర్ణన / వ్యాఖ్యానం / సమకాల వివరణ
**contempt** ధిక్కారం, తృణీకారం
**contempt, civil** సివిల్ ధిక్కారం
**contempt, criminal** క్రిమినల్ ధిక్కారం
**contempt, direct** ప్రత్యక్ష ధిక్కారం
**contempt in the immediate view and presence of the court** కోర్టు సమక్ష ధిక్కారం (కోర్టు ఎదుట), ప్రత్యక్ష ధిక్కారం
**contempt of court** కోర్టు ధిక్కరణ, న్యాయస్థాన ధిక్కారం
**contempt of Parliament** పార్లమెంటు ధిక్కారం
**contempt, to be in** ధిక్కార దోషగ్రస్తుడై ఉండు
**contend** వాదించు, పోటీపడు
**content** 1. అంశం, 2. విషయం, వస్తువు
**contention** వివాదాంశం, పోటీవాదం, విశ్వాసం
**contention, bone of** వివాదాంశం
**contention is not correct** వాదం సరయినది కాదు
**contention is untenable** వాదం సమర్థనీయం కాదు
**contentious suit** వివాదగ్రస్త వ్యాజ్యం
**contents of book** పుస్తకంలోని అంశాలు
**contents of bond** బాండులోని విషయాలు
**contents of charges** ఆరోపణల / ఛార్జీలలోని విషయాలు

**contents of documents** దస్తావేజుల్లో / పత్రాల్లో ఉన్న విషయాలు

**contents of memorandum** జ్ఞాపన పత్రంలోని విషయాలు

**contents of paper** పత్రంలోని విషయాలు

**contents of proclamation** ప్రకటన లోని విషయాలు/ అంశాలు

**contents received and entered on page No....** పంపిన వస్తువులు అందాయి, పుటసంఖ్య .... లో నమోదయ్యాయి

**contents unknown** లోనివి తెలియవు: లోపల ఏమున్నదో తెలియదు అనే సూచన. లోపలి సరుకును గురించి బాధ్యత వహించకుండా ప్యాకేజీని ఉన్నదున్నట్లు చేరుస్తామని సూచన

**contest n. 1.** పోటీ, ప్రతివాదం **v.2.** ప్రతివాదం చేయు, పోటీపడు / చేయు

**contestant** పోటీదారు

**contestant candidate** పోటీ అభ్యర్థి

**contested election** పోటీ ఎన్నిక

**contesting candidate** పోటీ చేస్తున్న అభ్యర్థి

**contesting the petition** పిటిషన్‌కు ప్రతివాదం చేయడం

**context** సందర్భం

**contiguity** చేరిక, స్థల సాన్నిహిత్యం

**contiguous** అనుకొన్న, చేరికలో ఉన్న

**continental shelf of India** భారతదేశ మహాద్వీప విధానం

**continental system** ఖండస్థాయి విధానం

**contingencies** ఆగంతుక వ్యయాలు

**contingency** యాదృచ్ఛిక స్థితి, ఆకస్మికత, ఆగంతుక, అనుకోని

**contingency fund** ఆకస్మిక ఖర్చుల నిధి, ఆగంతుక నిధి: అనుకోని ఖర్చులకై ఉంచిన నిధి

**contingency may arise** ఆకస్మికత ఉత్పన్నం కావచ్చు

**contingency staff** కంటింజెన్సీ సిబ్బంది

**contingent** ఆగంతుక, ఆకస్మిక

**contingent account** కంటింజెంట్ ఖాతా

**contingent and prospective liabilities** కంటింజెంట్, భావి బాధ్యతలు; యాదృచ్ఛిక భావి దాయిత్వాలు/ ఋణ బాధ్యతలు

**contingent beneficial interest** కంటింజెంట్ లాభసాటి ప్రయోజనం, యాదృచ్ఛిక లాభసాటి ప్రయోజనం

**contingent bill** ఆకస్మిక బిల్లు

**contingent charge** కంటింజెంట్ ఛార్జి, ఆకస్మిక కార్యవిధి

**contingent charges** ఆకస్మిక ఖర్చులు

**contingent claim** ఆగంతుక క్లెయిం

**contingent contract** ఆగంతుక కాంట్రాక్టు

**contingent debt** ఆగంతుక ఋణం

**contingent demand** కంటింజెంట్ డిమాండు : బాకీ వగైరాలు ఇవ్వమని తగదా చేయడం, అటువంటి సందర్భం రావచ్చు, రాకపోవచ్చు

**contingent expenditure** కంటింజెంట్ ఖర్చు : తాత్కాలిక ఖర్చు ఆకస్మికంగా ఏర్పడేది

**contingent functions** ఆగంతుక విధులు

**contingent interest** కంటింజెంట్ ప్రయోజనం

**contingent judgement** సమాశ్రిత నిర్ణయం / తీర్పు

**contingent legacy** ఆగంతుక వీలునామా ఆస్తి

**contingent liability** కంటింజెంట్ ఋణ బాధ్యత : ఒక సంఘటన జరగడం లేదా జరగకపోవడాన్ని ఆధారం చేసుకొని సొమ్ము ఇవ్వవలసి వస్తుందా ఇవ్వనక్కర లేదా అనే విషయం

**contingent nature** ఆకస్మిక / కంటింజెంట్ స్వభావం

**contingent notice** ఆకస్మికంగా ఏర్పడే స్వభావం, ఆగంతుక నోటీసు

**contingent on impossible events** అసంభవనీయ సంఘటనలపై సమాశ్రితమైన

**contingent register** ఆకస్మిక ఖర్చుల

రిజిస్టర్
**contingent remainder** ఆగంతుక అవశేష హక్కు సంక్రమణం
**contingent right** కంటింజెంట్ హక్కు
**contingent transaction** కంటింజెంట్ లావాదేవీ
**continuance in force** అమలులో ఉండు / కొనసాగు
**continuance of attachment** జప్తు అమలులో ఉండటం
**continuance of office** పదవిలో కొనసాగడం
**continuance of right** హక్కులో ఉండటం / కొనసాగటం
**continuance of the contract** కాంట్రాక్టు కొనసాగటం
**continuation sheet** తరువాయి పత్రం
**continue** కొనసాగించు
**continue arrest** అరెస్టు కొనసాగించండి
**continue attach** జప్తు కొనసాగించండి
**continue breach** కొనసాగుతున్న ఉల్లంఘన
**continued** 1. తరవాయి 2. తరవాతి పుటలో
**continued concentration** నిరంతర ఏకాగ్రత
**continued from** – నుంచి కొనసాగుతున్న, – తరవాయి నుంచి
**continued on page** –పుటలో కొనసాగిన / కొనసాగింది
**continue in force** అమలులో ఉండు
**continue in office** పదవిలో కొనసాగు
**continue in possession** స్వాధీనంలోఉండు
**continue in service** సేవ/ సర్వీసులో ఉండు
**continues to be recognized** గుర్తింపులో ఉంది
**continue to fail** అవిచ్ఛిన్నంగా విఫలం కావటం
**continue to function** పనిచేస్తూ ఉన్న
**continuing breach** కొనసాగుతున్న (కరారు) భంగం / ఉల్లంఘన
**continuing candidate** ఎన్నిక ఫలితం నిర్ధారణ కాని / తేలని అభ్యర్థి
**continuing contravention** నిరంతర ఉల్లంఘన
**continuing default** కొనసాగుతున్న ఉపేక్ష
**continuing failure** అవిచ్ఛిన్నంగా సాగుతున్న వైఫల్యం
**continuing guarantee** నిరంతర గ్యారంటీ / హామీ, అవిచ్ఛిన్న గ్యారంటీ / హామీ
**continuing offence** నిరంతర నేరం, కొనసాగుతున్న అపరాధం
**continuing tort** కొనసాగుతున్న టార్ట్ / అపరాధం
**continuing trustee** కొనసాగుతున్న ధర్మకర్త
**continuity** అవిచ్ఛిన్నత, నిర్విరామత, నిరంతరత, పరంపరత, కొనసాగటం, నిలకడ, కొనసాగింపు
**continuity of service** ఉద్యోగంలో కొనసాగటం
**continuous** కొనసాగే, నిరంతర
**continuous adverse use** ఎప్పుడూ ప్రతికూలంగానే ఉపయోగించు
**continuous audit** నిరంతర లెక్కల తనిఖీ
**continuous crime** నిరంతర నేరం
**continuous duty** నిరంతర కర్తవ్యం / విధి
**continuous easement** నిరంతర అనుభోగ హక్కు / ఈజ్‌మెంట్
**continuous halt** నిరంతర విరామం
**continuous line of communication** వార్తా – రవాణాలు కొనసాగే మార్గం
**continuous possession** నిరంతర స్వాధీనం
**continuous practice** అవిచ్ఛిన్న సాధన, కొనసాగుతున్న అభ్యాసం, నిరంతర అభ్యాసం
**continuous service** నిరంతర సేవ / సర్వీసు
**continuous stock taking** నిరంతరంగా సరుకు నిలవ తెల్సుకుంటూ ఉండటం
**continuous superintendence** కొనసాగు

తున్న అధీక్షణ, నిరంతర అధీక్షణ

**contour bunding** వాలుగట్లు వేయడం

**contour line** ఆకార రేఖ

**contoured map** ఎత్తుపల్లాల పటం, సమోన్నతాల మానచిత్రం

**contra** విరుద్ధమైన, వ్యతిరేకమైన

**contra adjustment accounts** సర్దుబాటు ఎదురు ఖాతాలు

**contra balances** విరుద్ధ / ఎదురు నిల్వలు

**contraband** 1. నిషిద్ధ సరుకు, 2. దొంగ చాటు సరుకు

**contraband goods** నిషిద్ధ వస్తువులు

**contraband of war** నిషిద్ధ యుద్ధసామగ్రి: యుద్ధం చేసే దేశాలకు అలీన దేశాల నుంచి పంపే నిషిద్ధ వస్తువులు

**contraband trade** నిషిద్ధ వ్యాపారం : నిషిద్ధ వస్తువుల వ్యాపారం, దొంగచాటు వర్తకం

**contract n.** కాంట్రాక్టు, కరారు, ఒప్పందం, ఒడంబడిక, **V.** ఒప్పందం చేసుకొను, కరారు చేసుకొను

**contract account** కాంట్రాక్టు ఖాతా, ఒప్పందపు ఖాతా

**contract carriage** కాంట్రాక్టు వాహనం

**contract certificate** ఒప్పంద / కాంట్రాక్టు ధ్రువపత్రం

**contract, contingent** సమాశ్రిత కరారు/ కాంట్రాక్టు

**contract cost** ఒప్పందపు ధర / ఖర్చు

**contract deed** ఒప్పందపు దస్తావేజు

**contract document** ఒప్పందపు / కరారు దస్తావేజు

**contract, express** అభివ్యక్త కాంట్రాక్టు

**contract for deferred annuity** వాయిదా పడిన వార్షిక చెల్లింపు ఒప్పందం

**contract for hire** బాడుగ ఒప్పందం : బాడుగ కోసం చేసుకొన్న ఒప్పందం

**contract, implied** అంతర్నిహిత / గర్భిత కాంట్రాక్టు

**contract in good-faith** సద్భావ పూర్వక కరారు / ఒప్పందం

**contracting out** ఒప్పందం ద్వారా వదులుకోవటం

**contracting party** కాంట్రాక్టుదారు / ఒప్పందందారు, ఒప్పంద పక్షం

**contracting state** ఒడంబడిక చేసుకొన్న రాజ్యం / దేశం

**contract in restraint of trade** వ్యాపార నిరోధక ఒప్పందం

**contract insurance** భీమా ఒప్పందం

**contract in writing** రాత పూర్వక కాంట్రాక్టు

**contract labourer** కరారు కూలీ, గుత్తకూలీ

**contract marriage** ఒప్పంద వివాహం

**contract may be terminated** ఒప్పందాన్ని పరిసమాప్తం చెయ్యవచ్చు

**contract note** ఒప్పందపు నోట్

**contract of carriage** రవాణా ఒప్పందం / కాంట్రాక్టు

**contract of guarantee** పూచీ ఒప్పందం / కరారు

**contract of indemnity** నష్టపూర్తి ఒప్పందం

**contract of management** నిర్వహణ ఒప్పందం / కరారు

**contract of marriage** పెళ్ళి ఒప్పందం

**contract of sale** అమ్మకపు ఒప్పందం, అమ్మకపు కరారు

**contract of service** సర్వీసు / సేవ ఒప్పందం

**contractor** కాంట్రాక్టరు, గుత్తాదారు

**contract period** ఒప్పందం గడువు

**contract price** కరారు ధర / ఒప్పందం ధర

**contract purchases** ఒప్పందపు కొనుగోళ్ళు

**contract rate** ఒప్పంద / కాంట్రాక్టు రేటు

**contract rent** కాంట్రాక్టు అద్దె

**contract supply system** ఒప్పందం సరఫరా పద్ధతి

**contractual liability** కాంట్రాక్టు నష్ట

భరణ బాధ్యత

**contractual obligation** కాంట్రాక్టు ధర్మ బాధ్యత

**contractual rights** కాంట్రాక్టు హక్కులు

**contractual wage** కాంట్రాక్టు వేతనం, కాంట్రాక్టు కూలీ

**contradict** ప్రతివాదించు / ఖండించు

**contradiction** ఖండన, పరస్పర విరుద్ధం / ప్రతివాదం

**contradictory statement** విరుద్ధ కథనం

**contra entry** ఎదురు నమోదు, ఎదురు పద్దు

**contrary n.** విరుద్ధం **adj.** ప్రతికూల **adv.** విరుద్ధంగా

**contrary intention** ప్రతికూల ఉద్దేశం, విరుద్ధమైన ఉద్దేశం

**contrary to law** శాసన విరుద్ధమైన

**contrast n. 1.** వ్యత్యాసం **v. 2.** వ్యత్యాసం చూపు

**contravene** ఉల్లంఘించు, వ్యతిరేకించు, ప్రతికూలించు

**contravenes the provision of** నిబంధనను ఉల్లంఘిస్తున్నది

**contravening equity 1.** ధర్మ నియమాల ఉల్లంఘన, **2.** పరస్పర విరుద్ధమైన ధర్మ సూత్రాలు

**contravention** విరుద్ధత, ఉల్లంఘన

**contravention of, in** (కి) విరుద్ధంగా

**contravention of provision of law** శాసన నిబంధనల ఉల్లంఘన

**contravention of rules** నియమోల్లంఘన

**contribute** చెల్లించు, అందించు, భాగంగా ఇచ్చు

**contribute largely** భూరి విరాళం ఇచ్చు, పెద్దమొత్తంలో సహాయం చేయు

**contributing institution** విరాళమిచ్చే సంస్థ

**contribution** అంశదానం, అంశదాయం, సహాయం, వాటా, విరాళం, వాటావిరాళం, వంతుపైకం, భాగదేయం

**contribution certificate** భాగదేయ ధ్రువపత్రం

**contribution for leave** సెలవు బాపతు వాటా : సెలవు నిమిత్తం చెల్లించే వాటా

**contribution for leave and pension** సెలవు పింఛను కోసం అంశదాయం

**contributory** అంశదాయి, వంతువారీ, సహాయకారి

**contributory factor** సహాయకారకం

**contributory health scheme** వాటా విరాళ ఆరోగ్య పథకం: వాటా విరాళంపై రూపొందించిన ఆరోగ్య పథకం

**contributory health service** వాటా విరాళ ఆరోగ్య సేవ / సర్వీసు

**contributory negligence** దోహదం చేసే నిర్లక్ష్యం

**contributory provident fund** వాటా భవిష్య నిధి : యాజమాన్యం వాటా ఇచ్చే ప్రావిడెంట్ ఫండు

**control 1.** నియంత్రణ, అదుపు, కంట్రోలు, అజమాయిషీ **2.** నిర్ధాయకం,

**control chart** నియంత్రణ చార్టు, కంట్రోల్ చార్టు

**controlled area** నియంత్రిత ప్రాంతం

**controlled business** నియంత్రిత కార్యక్రమం, నియంత్రిత వ్యాపారం

**controlled credit** నియంత్రిత పరపతి

**controlled distribution** నియంత్రిత పంపిణీ

**controlled economy** నియంత్రిత ఆర్థిక వ్యవస్థ

**controlled expenditure** నియంత్రించిన / నియతం చేసిన ఖర్చు, అదుపు చేసిన ఖర్చు, నియంత్రిత వ్యయం

**controlled industry** నియంత్రిత పరిశ్రమ

**controlled observation** నియంత్రిత పరిశీలన

**controlled price** నియంత్రిత ధర

**controlled rate** కంట్రోలు రేటు / నియంత్రిత రేటు

**controller** కంట్రోలరు, నియంత్రణాధికారి,

**date of exit** వెళ్లే తేది / నిర్గమన తేది
**date of expiry of warranty period** పూచీ గడువు ముగింపు తేదీ
**date of institution of a suit** దావా వేసిన తేదీ
**date of issue** జారీ చేసే తేదీ
**date of judgement** తీర్పు తేదీ
**date of manufacture** తయారీ తేదీ, ఉత్పత్తి తేదీ
**date of maturity** పరిణత తేదీ, చెల్లుబడి తేదీ
**date of occurrence** సంఘటన తేదీ
**date of order** ఉత్తరువు తేదీ
**date of payment** చెల్లింపు తేదీ
**date of posting** పోస్టు చేసిన తేదీ
**date of presentation** దాఖలు చేసిన తేదీ, సమర్పించే తేదీ
**date of publication of notice** ప్రకటనను ప్రచురించిన తేదీ
**date of realization** ప్రాప్తి తేదీ, వసూలు తేదీ
**date of release** విడుదల తేదీ, ప్రచురించిన తేదీ
**date of relief** విడుదల తేదీ, విముక్తి తేదీ
**date of return** తిరిగి వచ్చిన / వాపసు తేది
**date of renewal** నవీకరణ తేదీ
**date of stamp** ముద్ర తేదీ
**date of the next following** సరిగ్గా తరవాతి తేదీ
**date of the pass may be extended** అనుమతిపత్రం / పాస్ తేదీని పొడిగించవచ్చు
**date of the record** రికార్డు తేదీ, లేఖన తేదీ
**date stamp** తేదీ ముద్ర : తేదీలు వేసే ముద్ర
**dating** తేదీ నిర్ణయించటం / రాయటం
**day after date** తేదీ తర్వాతి దినం
**day after sight** చూపిన మర్నాడు, దర్శనానంతర దినం
**day break** తెల్లవారే / పొద్దుపొడువు సమయం
**day duty** పగటి డ్యూటీ
**day following** తరవాతి రోజు, మరునటి రోజు
**day journal** రోజువారీ చిట్టా, రోజునాంచా, రోజునామా
**day labourer** రోజువారీ / పగటి కూలీ
**day of reckoning** లెక్క ఫైసలా చేసే రోజు
**day of trial** విచారణ దినం
**day scholor** పగటి విద్యార్థి
**day shift** పగటి షిఫ్టు, పగటి మార్పిడి (కార్మిక సం॥)
**day shift and night shift** పగటి షిఫ్టు, రాత్రి షిఫ్టు
**day to day administrative work** రోజువారీ పరిపాలన విధి / పని
**days in bank** (కోర్టు) హాజరు దినాలు : సమనుల తరవాత హాజరు కావలసిన దినాలు, **days set by law or appearance in a suit**
**daysman** పరిష్కర్త, పంచాయితీదారు, **arbiter**
**days of grace** ఉదార దినాలు
**day specified for payment** చెల్లింపు నిర్ణయతేదీ
**day to day administration** రోజువారీ పరిపాలన
**day to day expenditure** రోజువారీ ఖర్చు
**day to day work** రోజువారీ పని
**dead account** అమలులో లేని ఖాతా
**dead card** నిరుపయోగమైన కార్డు
**dead frieght** ఖాళీ రుసుం : ఓడలో ఖాళీ స్థలానికి విధిగా చెల్లించవలసిన రుసుం
**dead head** ఉచిత ప్రయాణికుడు : ఛార్జీ చెల్లించనవసరంలేని ప్రయాణికుడు
**dead lane** అనగొంది, మూత సందు
**dead letter** 1. అమలులో లేని శాసనం (న్యాయ సం॥), 2. అడ్రసు సరిగాలేని

జాబు
**dead letter office** అడ్రసు సరిగాలేని జాబుల కార్యాలయం, డెడ్ లెటర్ ఆఫీసు: చిరునామా దొరకని ఉత్తరాల కార్యాలయం
**dead line** ఆఖరి గడువు
**dead load** అతి భారం, కస్తీ ఖర్చి, మోయ లేని భారం
**dead lock** ప్రతిష్టంభన
**dead loss** పూర్తి నష్టం
**deadly poison** మారణ విషం
**deadly weapon** మారణ ఆయుధం
**dead matter** గతించిన విషయం
**dead point** 1. తుది బిందువు, 2. తుది స్థానం
**dead rent** స్థిర అద్దె : ఆదాయంతో సంబంధం లేకుండా నిశ్చయించబడిన అద్దె
**dead security** అమలులో లేని పూచీ
**dead slow** అతి నిదానంగా, అతి మెల్లగా
**dead stock** నిరుపయోగ సరుకు
**dead weight** 1. ఉత్పాదక హీనభారం, 2. నిశ్చలభారం, అతిభారం
**deaf, dumb, and blind** చెవిటి, మూగ, గుడ్డి
**deaf-mute** చెవిటి – మూగ
**deal** n. వ్యవహారం, v. వ్యవహరించు
**dealer** 1. వ్యవహర్త, 2. వ్యాపారి, వర్తకుడు
**dealer in wood** కలప వర్తకుడు
**dealer's licence** అమ్మకందార్ల లైసెన్సు
**dealing assistant** వ్యవహరించే సహాయ కుడు
**dealing between the parties** పార్టీల / కక్షిదారుల మధ్య వ్యవహారం
**dealing effectively** ప్రభావవంతంగా వ్యవ హరించడం
**dealing in any manner** ఏ పద్ధతిలో నైనా వ్యవహరించటం
**dealing in futures** సట్టా వ్యాపారం
**dealing in money** డబ్బు వ్యాపారం
**dealing officer** సంబంధిత అధికారి
**dealing, person** వ్యవహారం నడిపే వ్యక్తి, వ్యవహరించే వ్యక్తి
**dealing with such applications** ఈ విధమైన దరఖాస్తులను పరిశీలిస్తూ
**dealing with the bank** బ్యాంకుతో వ్యవ హరించటం
**dealing with the matters** వ్యవహార విషయాలను చూడటం
**dealing with the situation** పరిస్థితిని ఎదుర్కోవడం
**deal specifically** నిర్దిష్టంగా వ్యవహరించు
**dealt with according to law** చట్టాను సారంగా వర్తించిన
**dealt within the report** నివేదికలో చర్చించిన
**dealt with the same** దానినే పరిశీలించడ మయింది
**deal with appeal** అపీలు విషయంలో వ్యవహరించు
**deal with emergencies** అత్యవసర ఘటనలు ఎదుర్కొను
**deal with property** ఆస్తి విషయంలో వ్యవహరించు
**deal with the costs of petitions** అర్జీల ఖర్చుల విషయంలో వ్యవహరించు
**dear** 1. ప్రియమైన, 2. విలువ హెచ్చిన
**dear money policy** విలువ హెచ్చిన ద్రవ్యవిధానం, దుర్లభ ద్రవ్యవిధానం
**dearness allowance** కరువు భత్యం (అధిక ధరలు కారణంగా)
**dearth** లోటు, కొరత
**death anniversary** వర్ధంతి, సాంవత్సరికం
**deathbed declaration** మరణ శయ్యపై వాఙ్మూలం
**death certificate** మరణ ధ్రువపత్రం
**death claim** మరణ క్లెయిం
**death - cum - retirement gratuity** మరణ–ఉద్యోగ విరమణ ఉదారభృతి
**death duty** మరణ సుంకం (ఎస్టేట్ డ్యూటీ చట్టం)
**death penalty** మరణ శిక్ష
**death, presumption of** చనిపోయినట్లు

పురోభావన (7 సం॥ కాలంపాటు గైర్ హాజరైనట్లయితే)

**death rate** మరణ రేటు

**death report** మరణ నివేదిక

**death roll** మరణించిన వారి / మృతుల జాబితా

**death sentence** మరణ శిక్ష

**deathsman** సంహారణోద్యోగి, శిరచ్ఛేదనోద్యోగి, **executioner**, తలారి

**death toll** మృతుల సంఖ్య

**death warrant** మరణ ఉత్తరువు

**debacle** విధ్వంసం, పతనం

**debar** డిబార్, ప్రతిబంధించు, నిషేధించు (హక్కు వగైరా), తొలగించు

**debarment** ప్రతిబంధకం, తొలగింపు (హక్కు సం॥)

**debarred** ప్రతిబంధిత, నిషేధించిన, వివర్జిత (అనర్హత విషయంలో)

**debarred from admission** ప్రవేశం నిషేధించిన, ప్రవేశానికి నిషిద్ధమైన

**debarred from bidding** వేలం పాటకు నిషేధించిన / తొలగించిన

**debarred from service** ఉద్యోగం నుంచి తొలగించిన

**debarred of right** హక్కు నుంచి నిషేధించిన / వివర్జితమైన

**debase 1.** స్థాయి తగ్గిన గుణం / విలువ / యోగ్యత, **2.** కేటి, కల్తీ (నాణెం, లోహం సం॥)

**debased coin** కేటి నాణెం : విలువ లేని నాణెం

**debatable matter 1.** వివాదాస్పదమైన అంశం, **2.** చర్చనీయాంశం

**debate n.** చర్చ **v.** చర్చించు

**debauch n.** భ్రష్టుడు, జారుడు **v.** భ్రష్టునిచేయు, శీలం హరించు

**debenture** డిబెంచరు, ఋణపత్రం, (ప్రభుత్వం లేదా కంపెనీ మొ॥ జారీ చేసే అప్పు పత్రం)

**debenture bond** డిబెంచరు బాండు

**debenture capital** డిబెంచరు మూలధనం

**debenture holder** డిబెంచరుదారు

**debenture interest** డిబెంచరు వడ్డీ

**debenture loan** డిబెంచరు ఋణం

**debenture redemption fund** డిబెంచరు విమోచన నిధి

**debentures issued at par** సమ విలువతో జారీచేసిన డిబెంచర్లు

**debentures issued at premium** ప్రీమియమ్‌తో జారీచేసిన డిబెంచర్లు

**debenture stock** డిబెంచరు స్టాకు / విల్వ

**debet esse finis litium** దావాలకు అంతు అంటూ ఉండి తీరాలి

**debility** దౌర్బల్యం, బలహీనత

**debit n.** ఖర్చు, బాకీ **v.** ఖర్చు రాయు

**debitable** ఖర్చుకు రాయదగిన, డెబిట్ చేయదగిన

**debitable to the leave account** సెలవు ఖాతాకు ఖర్చు రాయదగిన

**debit account** ఖర్చు ఖాతా

**debit advice** ఖర్చు సూచన

**debit against** – కింద ఖర్చు రాయు

**debit as per contra** ఎదుటివైపు చూపిన ప్రకారం ఖర్చు

**debit balance** డెబిట్ నిలవ, ఖర్చు నిలవ

**debited to the head** –పద్దుకు ఖర్చు

**debit entry** ఖర్చు పద్దు, డెబిట్ పద్దు

**debit note** డెబిట్ నోట్, నష్టపరిహార పత్రం (చెడిపోయిన సరుకు సం॥)

**debit of leave** సెలవు ఖాతాలో ఖర్చు

**debitrix** ఋణగ్రస్తురాలు, **female debtor**

**debt** అప్పు, ఋణం

**debt capital** ఋణ మూలధనం

**debt charges** ఋణ భారాలు

**debt conversion** అప్పుమార్పిడి

**debt, funded** సంచిత / నిధీకృత ఋణం

**debt head abstract** అప్పు పద్దుల సారాంశం

**debt heads** అప్పుపద్దులు

**debt incurred for immoral purposes** అనైతిక ప్రయోజనాలకు చేసిన

అప్పు
debt not bearing interest వడ్డీ లేని అప్పు
debt note బాకీ నోట్ / పత్రం
debt of honour గౌరవ ఋణం : చట్ట రీత్యా వసూలు చేయవీలులేనిది, జూదాలు మొ॥ సందర్భాలలో ఇచ్చేది
debt of record తీర్చవలసిన ఋణం
debtor బాకీదారు, ఋణగ్రస్తుడు
debtor is readjudged insolvent బాకీదారు మరోసారి దివాలా తీర్పు పొందాడు
debt or liability అప్పు లేదా చెల్లింపు బాధ్యత
debtor's discharge ఋణగ్రహీత విముక్తి
debtor's ledger బాకీదార్ల ఆవర్జా
debt outstanding తీర్చవలసిన అప్పు
debt redemption scheme ఋణ విమోచన పథకం
debts and costs అప్పులూ ఖర్చులూ
debts and liabilities అప్పులూ చెల్లింపు బాధ్యతలూ
debt secured పూచీఉన్న అప్పు
debt secured by mortgage తనఖా ఋణం, తాకట్టు అప్పు
debt service ఋణ సదుపాయ సేవ
debt settlement board ఋణ పరిష్కార మండలి
debts incurred for joint family సమష్టి కుటుంబం కోసం చేసిన అప్పు/ ఋణం
decade దశాబ్ది
decadent క్షీణించిన
decamp 1. పారిపోవు 2. శిబిరం ఎత్తివేయు
decapitation శిరచ్ఛేదనం
decease n. మరణం, v. మరణించు
deceased మృతుడు, మరణించిన
deceased ancestor మరణించిన పూర్వీకుడు
deceased debtor మరణించిన ఋణగ్రహీత / ఋణగ్రస్తుడు
deceased partner మరణించిన భాగస్వామి
deceased person మరణించిన వ్యక్తి
deceit కపటం, మోసం, దగా
deceitful means కపటోపాయం
decency సభ్యత, మర్యాద, ఔచిత్యం
decennial దశవార్షిక
decennial census దశవార్షిక జనాభా లెక్క
decent సభ్య, సముచిత, యోగ్య
decentralization వికేంద్రీకరణ
decentralization of industries పరిశ్రమల వికేంద్రీకరణ
decentralized economy వికేంద్రీకృత ఆర్థిక వ్యవస్థ
decentralized item వికేంద్రీకరించిన అంశం
decent standard of life సముచిత జీవన ప్రమాణం, సముచిత జీవన స్థాయి
deception మోసం, దగా, వంచన
deceptive practices మోసపు వ్యవహారాలు
decide a case on its merits కేసు యోగ్యతను బట్టి నిర్ణయించు
decidedly the best నిశ్చయాత్మకంగా ఉత్తమమైనది
decided on high level ఉన్నతస్థాయిలో నిర్ణయించిన
decide on merits యోగ్యతలను బట్టి నిర్ణయించు
decide the suit forthwith తక్షణమే వ్యాజ్యం పరిష్కరించు
deciding vote నిర్ణాయక వోటు, నిర్ణయించే వోటు
deciduous forests ఆకురాలే అడవులు
decimal coinage దశాంశ నాణాల పద్ధతి
decimal system దశాంశ పద్ధతి
decipher గూఢలిపి పఠనం, గూఢార్థ విశదీకరణ
decision authority నిర్ణయాధికారం / అధికారి
decision contrary to law చట్ట విరుద్ధమైన నిర్ణయం

**decision is awaited** నిర్ణయం కోసం నిరీక్షిస్తున్నారు
**decision, leading** ఉదాహరణ యోగ్యమైన నిర్ణయం, అగ్రనిర్ణయం
**decision making body** నిర్ణాయక వర్గం / సంస్థ / మండలి
**decision of court** న్యాయస్థానం తీర్పు
**decision of doubts** సందేహాలపై నిశ్చయం
**decision of the House** సభా నిర్ణయం (శాసనసభ సం॥)
**decision of secret sitting** రహస్య సమావేశ నిర్ణయం
**decision on a point of law** న్యాయాంశం పై నిర్ణయం
**decision upon merits** యోగ్యతనను సరించి నిర్ణయం
**decisive** నిర్ధారక, నిర్ణాయక
**decisive answer** కచ్చితమైన/ నిశ్చితమైన జవాబు
**decisive oath** నిర్ణయ ప్రమాణం: ఎదుటి వాని ప్రమాణం మీద వాదం విడిచిపెట్టుకొనే సందర్భం
**decisive proof** నిర్ణాయక రుజువు
**decisive role** నిర్ణాయక పాత్ర
**decisive victory** నిర్ణాయక విజయం
**deck** డెక్, నౌకాతలం, ఓడ పడిచెక్క **floor like platform of a ship**
**deck cargo** పడిచెక్క సరుకు : డెక్కు మీదికి తీసుకువెళ్ళే సరుకు
**deck crew** (ఓడ) కళాసీ(లు), నౌకాచోదక బృందం
**deck passenger** డెక్ ప్రయాణికుడు, డెక్ తరగతి ప్రయాణికుడు
**declarant** వెల్లడికర్త, వాఙ్మూలకర్త
**declaration** వాఙ్మూలం, వెల్లడి, ప్రకటన
**declaration, dying** మరణ వాఙ్మూలం
**declaration form** ప్రకటన పత్రం/ నమూనా
**declaration of acceptance of office** పదవీ స్వీకార ప్రకటన
**declaration of allegiance** విశ్వాసబద్ధ ప్రకటన
**declaration of any trust** ఏదైనా ధర్మ నిధి/ ట్రస్టు ప్రకటన
**declaration of dividends** డివిడెండ్ల ప్రకటన : కంపెనీ లాభాంశ ప్రకటన
**declaration of emergency** అత్యవసర పరిస్థితి ప్రకటన
**declaration of fidelity and secrecy** విశ్వసనీయత, గోప్యతల ప్రకటన
**declaration of forfeiture** జప్తు ప్రకటన
**declaration of insolvency** దివాలా ప్రకటన
**declaration of opinion** అభిప్రాయ ప్రకటన
**declaration of public policy** ప్రభుత్వ విధాన ప్రకటన
**declaration of results** ఫలితాల ప్రకటన
**declaration of rights** హక్కుల ప్రకటన
**declaration of shares** వాటాల ప్రకటన
**declaration of survey** సర్వే ప్రకటన
**declaration of title** హక్కుమూలం ప్రకటన
**declaration of trust** ట్రస్టు ప్రకటన
**declaration on a point of law** న్యాయాంశంపై ప్రకటన
**declaration on oath** ప్రమాణం పై ప్రకటన
**declaration, statutory** శాసనబద్ధ ప్రకటన
**declaration suit** హక్కు నిర్ణయ దావా
**declaratory** ప్రకటించే, ప్రకటనాత్మక, వివరణాత్మక
**declaratory decree** ప్రకటనాత్మక డిక్రీ: ఏమి చేయవలసిందీ చెప్పకుండా కేవలం ఒకే దావాలోని కక్షిదారుల హక్కులను మాత్రమే ప్రకటించే డిక్రీ / న్యాయస్థానపు తీర్పు
**declaratory judgement** ప్రకటనాత్మక తీర్పు
**declaratory law** వివరణాత్మక శాసనం

**declaratory part of a decree** డిక్రీ లోని ప్రకటనాత్మక భాగం : కక్షిదారుల హక్కులను మాత్రం వివరించే తీర్పు భాగం
**declaratory statute** వివరణాత్మక శాసనం
**declaratory suit** హక్కు ప్రకటన దావా
**declared** ప్రకటితమైన, ప్రకటించిన
**declared by the Govt.** ప్రభుత్వం ప్రకటించిన
**declared dividend** ప్రకటించిన డివిడెండ్ / లాభాంశం
**declared eligible for college course** కళాశాల చదువుకు అర్హత పొందినట్లు ప్రకటించడమైంది
**declared evaluation** ప్రకటిత మూల్యాంకనం
**declared goods** ప్రకటించిన సరుకులు
**declared holiday** ప్రకటిత సెలవు
**declared null and void** చెల్లనట్లు, రద్దయినట్లు ప్రకటించిన
**declared policy** ప్రకటిత విధానం, రూఢి విధానం
**declared provisions** ప్రకటితమైన నిబంధనలు/ పొందుబాట్లు
**declare on oath** ప్రమాణ పూర్వకంగా ప్రకటించు
**declare the confidence** విశ్వాసం ప్రకటించు
**declare the law** శాసనం వెల్లడించు, శాసనాన్ని స్పష్టపరుచు
**declassify** వర్గభ్రష్టం చేయు, వర్గం నుంచి తొలగించు
**decline** నిరాకరించు
**declining industry** క్షీణిస్తున్న పరిశ్రమ
**decline to produce a document** దస్తావేజు దాఖలు చెయ్యడానికి నిరాకరించు
**decode** గూఢలిపి వెల్లడిచేయు
**decontrol** కంట్రోలు తొలగింపు
**decontrolled food stuffs** కంట్రోలు ఎత్తివేసిన ఆహార వస్తువులు

**decoration** 1. అలంకారం, 2. గౌరవ చిహ్నం
**decorum** ఔచిత్యం, మర్యాద
**decorum, lack of** ఔచిత్యం/ మర్యాద లేకపోవడం
**decorum of the House** సభామర్యాద సభఔచిత్యం (శాసనసభ సం॥)
**decrease n.1.** తగ్గింపు **v. 2** తగ్గించు
**decrease in demand** గిరాకీ తగ్గుదల
**decrease is due to** —— కారణం తగ్గుదల
**decreasing cost** తగ్గుదల ధర
**decree n. 1** డిక్రీ, తీర్పు, నిర్ణయం, judg ement **2.** ఆజ్ఞ **3.** శాసనం **4.** విధాన **v. 5.** తీర్పు ఇచ్చు
**decree, absolute** పూర్తి డిక్రీ
**decree absolvitor** ప్రతివాది అనుకూ డిక్రీ
**decree against a debtor** ఋణగ్రస్తు ప్రతికూలంగా డిక్రీ
**decree, appellate** అపిలేట్ డిక్రీ
**decree condemnator** వాది అనుకు డిక్రీ, ఫిర్యాది అనుకూల డిక్రీ
**decree, dative** వ్యవహర్త నియామక డి వీలునామాలో పేర్కొనబడని వ్యక్తిని వ హర్తగా ప్రకటించే డిక్రీ
**decree for damages** నష్టపరిహార డి
**decree foreclosure** విమోచన హ కోల్పోవటానికి డిక్రీ
**decree for ejectment** బేదఖలు చ డిక్రీ (స్వాధీనం కోసం తీసుకొనే డి
**decree for maintenance** భరణ డిక్రీ, పోషణభత్యం డిక్రీ
**decree for money** డబ్బు చెల్లింపు క డిక్రీ
**decree for money against seve persons** చాలామందిపై డబ్బు చెల్లి కోసం డిక్రీ
**decree for payment of money** డ చెల్లింపు డిక్రీ
**decree for rendition of acco**

లెక్కల సమర్పణ డిక్రీ

**decree for rent** అద్దె చెల్లింపు కోసం డిక్రీ, బాడుగ చెల్లింపు డిక్రీ

**decree for restitution of conjugal rights** దాంపత్య హక్కుల పునఃస్థాపన కోసం డిక్రీ

**decree for sale** విక్రయం కోసం డిక్రీ

**decree holder** డిక్రీదారు, డిక్రీ హోల్డరు: డిక్రీ పొందిన వ్యక్తి

**decree in absence** గైర్‌హాజరు పై ఇచ్చే డిక్రీ, **a default judgement**

**decree-in-appeal** డిక్రీపై అపీలు

**decree nisi** డిక్రీ నిసి, సాపేక్ష డిక్రీ, ప్రారంభిక డిక్రీ : నిర్ణీత డిక్రీ కాలంలో వేరే విధంగా పరిష్కారం కాకపోతే అమలు లోకి వచ్చే డిక్రీ (ఉదా : విడాకుల తీర్పు)

**decree of court** న్యాయస్థాన డిక్రీ

**decree of nullity** చెల్లదని డిక్రీ : ఒక సంఘటన (ఉదా : వివాహం జరగలేదని ప్రకటించే డిక్రీ)

**decree of the first court** మొదటి కోర్టు డిక్రీ : మొదటి న్యాయస్థానం వారు ఇచ్చిన డిక్రీ

**decree shall agree with the judgement** డిక్రీ తీర్పుకు అనుగుణంగా ఉంటుంది

**decree writer** డిక్రీ లేఖరి

**decretal amount** డిక్రీ రుసుం

**decretal order** డిక్రీ ఉత్తరువు

**dedication** అంకితం, సమర్పణ

**deduce** నిరూపణ చేయు, **infer by logical process**

**deducing title** హక్కుమూలం. నిరూపణ చెయ్యడం : ఎవరి నుంచి హక్కు మూలం కలిగిందో నిరూపించడం

**deducted from the salary** జీతం నుంచి మినహాయించిన

**deducted wages** మినహాయించిన / తగ్గించిన వేతనాలు

**deduct entry** తగ్గింపు పద్దు, తగ్గింపు నమోదు

**deduction** మినహాయింపు, తీసివేత, తగ్గింపు, కోత

**deduction at --- percent** ---శాతం వద్ద మినహాయింపు

**deduction at source** ఆధారం నుంచి తగ్గింపు / కోత

**deduction from salaries** జీతాల నుంచి మినహాయింపు

**deduction of tax at source** ఆధారం నుంచి పన్ను కోత

**deduction order** తగ్గింపు ఉత్తరువు

**deductive method** నిగమన పద్ధతి / తగ్గింపు పద్ధతి / మినహాయింపు పద్ధతి

**deduct refunds** ముదరా చెల్లింపులను తగ్గించు, వాపస్ చెల్లింపులను తగ్గించు

**deed** దస్తావేజు

**deed in blank** అసంపూర్ణ దస్తావేజు

**deed of agency** ఏజన్సీ దస్తావేజు

**deed of arrangement** ఏర్పాటు దస్తావేజు: దివాలాదారు తన ఆస్తిని ట్రస్టుకు అప్పగించి బాకీదారులకు దానిని పంచే ఏర్పాటు చెయ్యడం

**deed of assignment** అప్పగింత దస్తావేజు, అసైన్‌మెంటు దస్తావేజు

**deed of counterpart** ఎదురు దస్తావేజు/ మారు దస్తావేజు

**deed of covenant** ఒప్పందపు దస్తావేజు

**deed of further charge** తదుపరి ఛార్జి పత్రం / దస్తావేజు

**deed of gift** దాన దస్తావేజు, దానపత్రం

**deed of inspectorship** తనిఖీ దస్తావేజు: బాకీదారు వ్యాపారం ఋణదాతల ప్రతినిధుల (తనిఖీ/ పర్యవేక్షణ) కింద జరగాలని రాసుకొన్న ఒప్పందపత్రం

**deed of lease** కౌలు దస్తావేజు

**deed of mortgage** తాకట్టు దస్తావేజు, తనఖా దస్తావేజు

**deed of partnership** భాగహక్కు దస్తావేజు

**deed of sale** విక్రయ దస్తావేజు

**deed of settlement** పరిష్కార దస్తావేజు: ఆస్తిలో ఎవరికెంత భాగం చెందాలో వివరించే

దస్తావేజు
**deed of trust** ట్రస్టు దస్తావేజు
**deed poll** ఏకపక్ష దస్తావేజు, **deed of one part or executed by one party only**
**deed will or other written instrument** దస్తావేజు వీలునామా లేదా ఇతర వైన లిఖిత పత్రం
**deem** భావించు, నిశ్చయించు
**deemed, shall be** భావించబడుతుంది
**deemed special** విశేషమని భావించిన
**deemed to accrue** ప్రాప్తిస్తుందని భావించిన
**deemed to be continuing in force** అమలులో ఉన్నట్లు పరిగణించిన
**deemed to be vested** నియుక్తమైనట్లు భావించిన, ఇచ్చినట్లు / అపాదించినట్లు భావించిన
**deemed to have adopted it** దాన్ని స్వీకరించినట్లుగా భావించడమయింది
**deemed to have been dissolved / received** రద్దయిపోయినట్లు భావించటమయింది / ప్రాప్తమైనట్లు భావించడమైంది
**deemed to have been incurred** భరించినట్లుగా భావించడమైంది
**deem necessary** అవసరమని భావించు
**deep impression** గాఢముద్ర / ప్రభావం
**deep sorrow** ప్రగాఢ సంతాపం
**deep study** లోతు పరిశీలన, గంభీర అధ్యయనం
**defaced coin** చెరిగిన నాణెం
**de facto** వస్తుతః, వాస్తవానికి, వాస్తవంగా
**de facto director** వాస్తవ సంచాలకుడు
**de facto government** వాస్తవ ప్రభుత్వం
**de facto guardian** వాస్తవ సంరక్షకుడు
**de facto judge** వాస్తవిక న్యాయాధికారి, వస్తుతః న్యాయాధిపతి
**defalcation 1.** ద్రవ్యాపహరణ, **2.** దుర్వినియోగం.
**defalcation and losses** ద్రవ్యాపహరణా నష్టాలూ
**defalcator 1.** దుర్వినియోగదారు **2.** ద్రవ్య అపహర్త
**defamation** పరువునష్టం
**defamation case** పరువునష్టం దావా
**defamatory libel** పరువునష్టపు రాత
**defamatory statements** అపఖ్యాతి హేతువయిన కథనం, పరువునష్టం కలిగించే కథనం
**defamatory words** పరువునష్టపు మాటలు
**defame** అపకీర్తి, పరువు నష్టపరుచు
**default 1.**లోపం, తప్పు, **2.** అశ్రద్ధ, ఉపేక్ష, **3.** గైరుహాజరు: కోర్టుకు హాజరు కాక పోవడం
**default book** చెల్లింపు కాని పద్దుపుస్తకం
**defaulter 1.** ఉపేక్షకుడు, **2.**గైరు హాజరు దారు, అతిక్రమణదారు, కోర్టుకు సమను చేసినా రానివాడు, **3.** బకాయిదారు
**defaulting proprietor** ఉపేక్షించే యజమాని
**default in payment** చెల్లింపులో ఉపేక్ష
**default in payment of fine** జరిమానా చెల్లింపులో ఉపేక్ష
**default of, in** లోపం వల్ల, ఉపేక్ష వల్ల
**default of payment** చెల్లింపు ఉపేక్ష
**default of the lessee** కౌలుదారు ఉపేక్ష, అద్దె చెల్లింపుదారు ఉపేక్ష
**default was excusable** లోపం క్షమించ దగ్గది
**defeasance** విఫలకారకం: ఒక దస్తావేజును గాని దానిలోని షరతులను గాని విఫలం చేసే మరో దస్తావేజు వగైరా (షరతువంటి దానిని విఫలం / పరిహరింప చెయ్యడం)
**defeasible right** విఫలం కాదగిన హక్కు
**defeasible title** విఫలం కాగల హక్కు మూలం
**defeated** వీగిపోయిన, ఓడిపోయిన
**defeat the ends of justice** న్యాయ ప్రయోజనం విఫలం చేయు
**defeat the object of law** న్యాయోద్దేశం విఫలం చేయు
**defeat the provision** ఉపబంధనను

విఫలం చేయు
**defection** ఫిరాయింపు (పార్టీ సం॥)
**defective** లోపభూయిష్ఠ
**defective budgetting** లోపభూయిష్ఠ బడ్జెటు తయారీ
**defective delivery** లోప భూయిష్ఠమైన అప్పగింత
**defective plan** లోపభూయిష్ఠమైన ప్రణాళిక
**defective title** లోపభూయిష్ఠమైన హక్కు
**defect, latent** అంతర్గత / నిగూఢలోపం
**defect of jurisdiction** అధికారపరిధి లోపం
**defect of title** హక్కు లోపం
**defector** ఫిరాయింపుదారు
**defect or irregularity not to vitiate proceedings** లోపంతో గానీ క్రమ రాహిత్య కారణంగా గానీ కార్యవర్తనలకు చెడు కలిగించకూడదు
**defence 1.** రక్షణ / రక్షణదళ (సైనిక సం॥) **2.** ప్రతివాదం (న్యాయ. సం॥), ఉత్తరవాదం
**defence budget** రక్షణదళ బడ్జెట్
**defence committee** రక్షణ సంఘం, రక్షణ సమితి
**defence committee of the cabinet** మంత్రివర్గ రక్షణ మండలి
**defence expenditure** రక్షణ వ్యయం
**defence force** రక్షణదళం / బలగం
**defence fund** రక్షణదళ నిధి
**defence in bar** అడ్డు ప్రతివాదన, వాద నిరోధక ప్రతివాదం
**defence inspection organization** రక్షణ శాఖ తనిఖీ సంస్థ
**defence of India ordinance and rules** భారత రక్షణ అధ్యాదేశం / ఆర్డినెన్స్, నియమావళి
**defence of oneself** ఆత్మరక్షణ, **self defence**
**defence organization** రక్షణశాఖ వ్యవస్థ
**defence production** రక్షణ సామగ్రి ఉత్పత్తి
**defence provident fund** రక్షణశాఖ భవిష్యనిధి
**defence regulations** రక్షణశాఖ నిబంధనలు
**defence services** రక్షణ సేవలు (ఉద్యోగ శాఖలు)
**defence services staff college** రక్షణ సేవా / సర్వీసుల సిబ్బంది కళాశాల
**defence to an action** దావాకు ప్రతివాదం: వాదాన్ని ఖండించే ప్రతివాదం
**defence to a suit** దావాకు ప్రతివాదం
**defence witness** ప్రతివాది సాక్షి
**defend 1.**రక్షించుకొను **2.** ప్రతివాదం చేయు **3.** సమర్థించుకొను
**defendant** ప్రతివాది : సమాధానం చెప్పడానికి పిలువబడే కక్షిదారు
**defendant shall not be liable to arrest** ప్రతివాది అరెస్టు చెయ్యదగినవాడు కాదు
**defendant's statement** ప్రతివాది వివరణ / వాఙ్మూలం
**defend the action** దావాను సమర్థించు, చర్యను సమర్థించు
**defer** వాయిదావేయు
**deferred** వాయిదా వేసిన / ఆపి ఉంచిన
**deferred annuity** వాయిదా పడిన వార్షిక చెల్లింపు : సంవత్సరమయిన తర్వాత మరొక తేదీకి వాయిదా పడిన వార్షికం
**deferred benefit** వాయిదా పడిన ప్రయోజనం / లాభం
**deferred bonus** వాయిదా పడిన బోనసు
**deferred demand** వాయిదా పడిన అభ్యర్థన
**deferred dividend** వాయిదా పడిన లాభాంశం / డివిడెండ్ / వాటా లాభం
**deferred life annuity** వాయిదా పడిన జీవిత వార్షిక చెల్లింపు
**deferred maintenance** వాయిదా పడిన పోషణ ఖర్చులు / భరణం / మనోవర్తి
**deferred payment** వాయిదా పడిన చెల్లింపు
**deferred rebate** వాయిదా పడిన రిబేటు

**deferred revenue expenditure** వాయిదా పడిన రెవెన్యూ ఖర్చు
**defiance** ధిక్కారం, తృణీకారం
**defiance of law** చట్ట ధిక్కారం
**defiant attitude** ధిక్కార ప్రవృత్తి
**deficiency** వెలితి, లోటు, కొరత, అసంపూర్ణత, న్యూనత
**deficiency account** లోటు ఖాతా
**deficiency bills** లోటు బిల్లులు
**deficiency in stock** నిలవ లోటు
**deficiency of assets** ఆస్తుల కొరత
**deficiency of capital** మూలధనం లోటు
**deficiency of service** సేవలో / ఉద్యోగంలో కొరత
**deficiency of values** విలువల న్యూనత
**deficient diet** పుష్టి లేని ఆహారం
**deficit** లోటు
**deficit areas** లోటు ప్రాంతాలు
**deficit budget** లోటు బడ్జెటు
**deficit budget policy** లోటు బడ్జెటు విధానం
**deficit court fee** కోర్టు రుసుం లోటు: న్యాయస్థానానికి చెల్లించవలసిన సొమ్ములో లోటు
**deficit economy** లోటు ఆర్థిక వ్యవస్థ, ఆర్థిక వ్యవస్థ లోటు
**deficit financing** లోటు ఆర్థిక సహాయం
**deficit on revenue account** రెవిన్యూ ఖాతాలో లోటు
**deficit pockets** లోటు భాగాలు
**defile** అపవిత్రం చేయు, పాడుచేయు, కలుషితం చేయు
**defile any place of worship** దేవాలయాన్ని / ప్రార్థనాలయాన్ని అపవిత్రం చేయు
**defilement** కలుషితం, కాలుష్యం
**define** నిర్వచించు
**defined channel** 1. నిర్దిష్ట మార్గం 2. నిర్దిష్ట కాలవ
**define the scope** పరిధి నిర్ణయించు
**definite** నిశ్చితమైన, నిష్కర్ష అయిన, కచ్చితమైన
**definite and certain** నిశ్చితమూ రూఢీ
**definite answer** స్పష్టమైన జవాబు
**definite basis** కచ్చితమైన ఆధారం
**definite demand** కచ్చితమైన డిమాండు/ అభ్యర్థన
**definite information** కచ్చితమైన సమాచారం
**definite matter** కచ్చితమైన విషయం
**definite period** నిశ్చిత కాలావధి
**definite proportion** కచ్చితమైన దామాషా
**definite term** నిశ్చిత గడువు / అవధి
**definition** నిర్వచనం
**definitive judgement** నిశ్చయాత్మకమైన తీర్పు: వివాదాన్ని నిష్కర్షగా (అసందిగ్ధంగా, స్పష్టంగా) నిర్ణయించే తీర్పు
**deflation** ద్రవ్యోల్బణం తగ్గించటం
**deflationary gap** ద్రవ్యోల్బణ సంకోచ విరామం
**deflationary period** ద్రవ్యోల్బణ తగ్గింపు కాలం
**deflation of currency** చలామణి తగ్గించడం (కరెన్సీ సం॥)
**deflationist** ప్రతిద్రవ్యోల్బణవాది, ద్రవ్య సంకోచకవాది
**defloration** 1. శోభన కార్యం 2. కన్యాత్వ భంగం
**deforce** బలవంతపు ఆక్రమణ చేయు : బలవంతంగా (భూమి మొ॥) ఆక్రమించు
**deforest** అడవుల / అటవీ నిర్మూలన
**deform** రూపం చెరుపు, విరూపం చేయు
**deformation** విరూపత
**defossion** 1. సజీవ దహన శిక్ష 2. సజీవ సమాధి శిక్ష
**defraud** 1. మోసం, 2. మోసపు అపహరణ
**defraudation** ఎగవేత వంచన : మోసంతో పన్నులు ఎగవేయటం
**defrayable** ఖర్చు భరించదగిన, (ఖర్చులు

రా) భరించబడదగు, అదాకు సరిపడిన
**y expenses** ఖర్చులు భరించు / పుచ్చు
**ict** క్రియాశూన్యం, అమలులోలేని
**ict company** క్రియాశూన్య కంపెనీ: పారం చాలించిన కంపెనీ
**ict partnership** అమలులో లేని గహక్కు : నిలిచిపోయిన భాగస్వామ్యం
ధిక్కరించు
**a bar** నిషేధం ధిక్కరించు
**eration** క్షీణించటం, తగ్గటం
**dation** శ్రేణి తగ్గింపు, దర్జా తగ్గింపు
**e** 1. డిగ్రీ / విశ్వవిద్యాలయ పట్టా, లమానం, 3. అంతస్తు, తరం, అంతరం, , స్థాయి, 4. వంశవృక్షంలోని శాఖ
**e holder** పట్టభద్రుడు
**e of ascent** పూర్వ వంశాంతరాలు
**e of care and diligence** శ్రద్ధా రూకతల స్థాయి
**e of control** నియంత్రణ స్థాయి
**e of descent** తరవాతి తరాలు
**e of discretion** వివేచన స్థాయి
**e of kinship** బంధుత్వస్థాయి
**e of latitude** అక్షాంశ శ్రేణి/ డిగ్రీ
**e of longitude** రేఖాంశ శ్రేణి/డిగ్రీ
**e of prohibited relationship** ద్ధ సంబంధతరం (వివాహ సం॥)
**e of relationship** బంధుత్వ స్తు/ స్థాయి
**e of risk** నష్టసూచిస్థాయి
**e of urgency** అత్యవసర స్థాయి, రు స్థాయి
**sive** తగ్గిపోవు, అవరోహణ, అధోగామి
**sive tax** తగ్గిపోయే పన్ను
**e** న్యాయతః
**e communi** సాధారణ న్యాయం రం
**e guardian** న్యాయప్రకార సంరక్ష
**e officer** న్యాయప్రకార అధికారి

**de jure recognition** న్యాయతః గుర్తింపు
**delay n. 1.** జాప్యం, తాత్సారం, **v. 2.** జాప్యం చేయు, తాత్సారం చేయు
**delay causes much difficulty in the compilation of** ఆలస్యం కారణంగా ---- సంకలనంలో అనేక ఇబ్బందులు వస్తాయి
**delay defeats equity** జాప్యం వల్ల న్యాయం నిష్ఫలమౌతుంది
**delayed beyond the period prescribed** కాలపరిధి కంటే ఎక్కువ ఆలస్యం జరిగింది
**delayed proposal** ఆలస్య ప్రతిపాదన
**delayed refunds** ఆలస్య వాపసులు (డబ్బు తిరిగి చెల్లింపు సం॥)
**delayed tender** జాప్యమైన టెండరు
**delayed wages** ఆలస్య జీతాలు
**delay in answering** సమాధానం ఇవ్వటంలో ఆలస్యం
**delay in disposal** పరిష్కారంలో ఆలస్యం
**delaying tactics** జాప్యయుక్తులు
**delaying the execution** అమలులో జాప్యం
**delay in returning the file is regretted** ఫైలు వాపసు చేయడంలో ఆలస్య మైనందుకు విచారిస్తున్నాం
**delay in submission of the case is regretted** కేసు ఆలస్యంగా సమర్పించినందుకు విచారిస్తున్నాం
**delay in the payment of pay** జీతం చెల్లింపులో ఆలస్యం
**delay is regretted** జాప్యానికి చింతిస్తున్నాం
**delay should be avoided** ఆలస్యం పరిహరించాలి, ఆలస్యం కాకుండా చూడాలి
**delay was unavoidable** ఆలస్యం అనివార్యమైంది
**del credere** ప్రత్యేక విశ్వాసంగల, పూచీ ఇచ్చే
**del credere agent** పూచీ ఏజంటు, డెల్ క్రెడెరె ఏజంటు : సరుకుల మన్నికకు పూచీ ఇచ్చే ఏజంటు

**delegate** n. 1. ప్రతినిధి, డెలిగేటు v.2. ప్రతినిధిగా పంపు, ప్రాతినిధ్యం ఇచ్చు, నియోగించు
**delegated authority** ప్రాతినిధ్య అధికారి
**delegated legislation** ప్రాతినిధ్య శాసన నిర్మాణాధికారం
**delegated power** దత్తాధికారం, ప్రాతినిధ్యాధికారం
**delegate his office** తన అధికారాన్ని ప్రదానం చేయు
**delegation** 1. ప్రతినిధి వర్గం 2. ప్రాతినిధ్యం, 3. దత్తత, ప్రదానం, అప్పగింత
**delegation of authority** అధికారం అప్పగింత
**delegation of financial authority** ఆర్థిక అధికారం అప్పగింత
**delegation of financial powers** ఆర్థిక పరమైన అధికారాల ప్రదానం
**delegation of power** అధికారం అప్పగింత
**delegation of responsibility** బాధ్యత అప్పగింత
**delegation rules** ప్రాతినిధ్య నియమావళి
**delete** తొలగించు
**deleterious** హానికరమైన (శారీరక / నైతిక సం )
**deleterious constituent** హానికరమైన అంగం/భాగం/అంశం
**deleterious substance** హానికర పదార్థం
**delete the following lines** కింది పంక్తులు తొలగించాలి
**deliberate** 1. బుద్ధిపూర్వకంగా చేయు, 2. సమాలోచించు
**deliberate and malicious intention** బుద్ధిపూర్వకమూ దురుద్దేశమూ
**deliberate conviction** 1. బుద్ధిపూర్వక దోషారోపణ, 2. స్థిరమైన విశ్వాసం
**deliberate killing** బుద్ధిపూర్వక వధ
**deliberation and premeditation** సమాలోచనా పూర్వాలోచనా, బుద్ధిపూర్వకంగా సమాలోచన
**deliberative body** వివేచన సంఘం
**delicate** సున్నితమైన, నాజూకైన
**delicate situation** సున్నితమైన పరిస్థితి
**delict** శాసన విరుద్ధం, నేరం (సివిల్ సం॥)
**delimit** హద్దులేర్పరుచు
**delimitation** పరిమితి నిర్ణయం, సీమా నిర్ణయం, హద్దుల నిర్ణయం
**delimitation of constituencies** నియోజక వర్గాల హద్దుల నిర్ణయం, నియోజక వర్గాల విభజన
**delimitation order** పరిమితి/ హద్దు నిర్ణయ ఉత్తరువు
**delineate** రేఖాచిత్రణ చేయు: చిత్రం చేత గానీ వర్ణన చేతగానీ ఆకార ప్రదర్శన చేయడానికి చిత్రించు
**delinked file** విడదీసిన ఫైలు
**delinked, file has been** ఫైలు వేరు చెయ్యడమైంది
**delinquency** 1. కర్తవ్య ఉపేక్ష, 2. అపచారం
**delinquent** 1. కర్తవ్య ఉపేక్షకుడు : కర్తవ్య నిర్వహణలో పాలుమాలినవాడు, 2. అపచారి
**deliver** 1. అప్పగించు, బట్వాడా చేయు, 2. ప్రసవించు, 3. విడుచు, విమోచనం చేయు, 4. ఇచ్చు
**deliverable state** అందించడానికి వీలైన స్థితి
**deliver a judgement** తీర్పు ఇచ్చు
**deliver a speech** ఉపన్యసించు
**delivered at siding** సైడింగ్ వద్ద అప్పగించడమైంది
**deliverer** 1. బట్వాడాదారు, 2. రక్షకుడు, విమోచకుడు
**deliver up certificate** ధ్రువపత్రం ఇచ్చు
**deliver up licence** లైసెన్సు ఇచ్చు
**delivery** 1. అప్పగింత, బట్వాడా 2. ప్రసవం 3. విమోచనం
**delivery bond** అప్పగింత పూచీ పత్రం, డెలివరీ బాండు: వస్తువులను నిర్ణీత సమయానికిగాని షరతులతోగాని అప్పగించడానికి రాసుకొన్న పత్రం
**delivery book** బట్వాడా పుస్తకం, తపాలా

పుస్తకం

**delivery makes the deed speak** దస్తావేజును అప్పగించగానే అది అమలు లోతుంది

**delivery note** అప్పగింత నోట్

**delivery of a part** పాక్షిక అప్పగింత

**delivery of goods** సరుకుల అప్పగింత

**delivery of possession** కబ్జా ఇవ్వడం, స్వాధీనం చేయడం

**delivery of tangible immovable property** ప్రత్యక్ష స్థిరాస్తి అప్పగింత

**delivery order** అప్పగింత ఉత్తర్వు: వస్తువులు స్వాధీనం చేయడానికి ఆజ్ఞ

**delivery receipt** అప్పగింత రసీదు

**delivery register** అప్పగింత పుస్తకం

**delivery which is essential to a pledge** తాకట్టు / తనఖాకు ఆవశ్యకమైన అప్పగింత

**deluge** జలప్రళయం, వెల్లువ

**delusion** భ్రాంతి

**demagogue** ప్రజాందోళన ప్రేరకుడు: ప్రజలలో ఉద్రేకం కలిగించే వక్త

**demand** 1. డిమాండు, అభ్యర్థన, కోరిక 2. గిరాకీ 3. డిమాండు చేయు, అభ్యర్థించు, కోరు

**demand and collection clerk** డిమాండు, వసూలు గుమాస్తా

**demand an explanation** సంజాయిషీ కోరు / అడుగు

**demand bill** డిమాండు బిల్లు

**demand deposit** డిమాండు డిపాజిట్, డిమాండు జమ: బాంకులో కరెంట్ అకౌంటులో వేసే డబ్బు జమ

**demand draft** డిమాండు డ్రాఫ్ట్, అభ్యర్థన డ్రాఫ్ట్: అడిగిన వెంటనే చెల్లించే వినిమయ డ్రాఫ్టు

**demand for grants** గ్రాంట్లకోసం అభ్యర్థన

**demand for money** ద్రవ్యం కోసం అభ్యర్థన

**demand for payment** చెల్లింపుకోసం డిమాండు / అభ్యర్థన

**demand for poll** ఎన్నికలకు డిమాండు/ అభ్యర్థన

**demand is inescapable** అభ్యర్థన అనివార్యమైనది

**demand letter** అభ్యర్థన పత్రం

**demand loan** అడిగినప్పుడు చెల్లించవలసిన ఋణం

**demand, payable on** అభ్యర్థనపై చెల్లించదగిన

**demand price** గిరాకీధర

**demand register** అభ్యర్థన పుస్తకం

**demandress** వాదిని (స్త్రీ), **female plaintiff**

**demand schedule** గిరాకీ అనుసూచి, డిమాండు షెడ్యూలు

**demand security** జామీను డిమాండు

**demands for grants** గ్రాంట్లకు అభ్యర్థనలు (శాసనసభ సం॥)

**demarcate** హద్దులు నిర్ణయించు

**demarcation line** హద్దురేఖ

**demarcator** హద్దు నిర్ణేత

**demeanour of witness** సాక్షి వైఖరి

**dementi** ఖండన, పుకారును అధికారపూర్వకంగా ఖండించడం **formal denial**

**demerit** అవగుణం

**demesne** 1. వ్యక్తిగత భూసంపద, సొంత కమతం: తనదిగా స్వాధీనంలో ఉన్న స్థిరాస్తి, 2. భూసంపద

**demi** అర్ధ, సగం

**de minimis non curat lex** క్షుద్ర విషయాలను న్యాయశాస్త్రం పట్టించుకోదు

**demi-official** అర్ధాధికారిక, **D.O** (డి.ఒ.)

**demi-official correspondence** అర్ధాధికార ఉత్తర ప్రత్యుత్తరాలు

**demi-official letter** డి.ఒ.లేఖ, అర్ధాధికార లేఖ

**demise** 1. దీర్ఘకాల కౌలు "లీజు" **(a grant by lease)**, 2. మరణం

**demobilization** సైన్య నియోజనం

**democracy** ప్రజాస్వామ్యం

**democrat** ప్రజాస్వామ్యవాది

**democratic constitution** ప్రజాస్వామిక సంవిధానం / రాజ్యాంగం
**democratic decentralization** ప్రజాస్వామిక వికేంద్రీకరణ
**democratic government** ప్రజాస్వామిక ప్రభుత్వం
**democratic leadership** ప్రజాస్వామిక నాయకత్వం
**democratic methods** ప్రజాస్వామిక పద్ధతులు
**democratic planning** ప్రజాస్వామిక ప్రణాళికారచన
**democratic principle** ప్రజాస్వామిక సూత్రం
**democratic republic** ప్రజాస్వామిక గణతంత్రం / రిపబ్లిక్
**democratic set up** ప్రజాస్వామిక వ్యవస్థ
**democratic socialism** ప్రజాస్వామిక సామ్యవాదం / సమాజవాదం
**democratic welfare state** ప్రజాస్వామిక శ్రేయోరాజ్యం
**demographic** జనాభా సంబంధ
**demographic study** జనాభా అధ్యయనం
**demographic survey** జనాభా సర్వే
**demolition** నిర్మూలనం, కూలగొట్టడం, పడగొట్టడం
**demolition order** కూలగొట్టడానికి ఉత్తరువు
**demonetization** చలామణీ విలువ తగ్గింపు (ద్రవ్య సం॥)
**demonstration** ప్రత్యక్ష నిరూపణ / ప్రదర్శన
**demonstration centre** ప్రదర్శన కేంద్రం
**demonstration room** ప్రదర్శన గది
**demonstrative evidence** ప్రత్యక్ష నిరూపణాత్మక సాక్ష్యం
**demonstrator** ప్రదర్శకుడు, ప్రత్యక్ష నిరూపకుడు, డెమాన్‌స్ట్రేటర్
**demoralization** నీతిభ్రష్టత
**demote** హోదా తగ్గించు, పదవి తగ్గించు
**demoted person** పదావనతి పొందిన వ్యక్తి, పదవిలో అవనతి పొందిన వ్యక్తి
**demotion** హోదా తగ్గింపు, పదవి తగ్గింపు: కింది పదవికి దించటం
**demur** **1.** ఆలస్యం చేయు, **2.** ఆక్షేపించు, **3.** శంకించు, **4.** ప్రతిబంధించు
**demurrage** ఆలస్య పన్ను, డిమరేజి, విలంబనశుల్కం : సరుకు నిర్ణీత కాలంలో డెలివరీ తీసుకోనందుకు ఇచ్చుకొనే దండగ సొమ్ము
**demurrer** **1.** ఆక్షేపణదారు, వాదాంశాన్ని ఆక్షేపించే వ్యక్తి, **2.** ఆక్షేపణ
**denationalization** జాతీయీకరణ రద్దు
**denatured** సహజగుణం తొలగించిన
**denatured or mutilated form** వికృత పరిచిన లేదా విరూపం చేసిన
**denial** నిరాకరణ
**denial of execution** అమలు నిరాకరణ
**denial of execution of document** దస్తావేజు రాసి ఇవ్వటానికి నిరాకరణ
**denial of justice** తీర్పు నిరాకరణ
**denial of legality** న్యాయత్వ నిరాకరణ
**denial of rights** హక్కుల నిరాకరణ
**denization** పౌరసత్వ ప్రదానం : విదేశీయుణ్ణి దేశవాసిగా చేసి పౌరహక్కులు ఇవ్వటం
**denizen** పౌరసత్వం పొందిన వ్యక్తి
**denomination** నామవర్గీకరణ, రకం
**denominational institution** ఒక సంప్రదాయ శాఖకు చెందిన సంస్థ
**denominational value** నామవర్గీకరణ చేసిన విలువ
**denote** సూచించు, నిర్దేశించు
**denotified tribe** విముక్త జాతి / తెగ
**denoting court fee** కోర్టు రుసుం సూచించటం
**denounce** నిరసించు, నిందించు, తప్పు లెన్ను, దూషించు
**de novo** సరికొత్త
**de novo trial** సరికొత్త విచారణ
**densely populated area** జనసాంద్రత ఎక్కువగా ఉన్న ప్రాంతం

**density of population** జనాభా సాంద్రత
**denudation** అనావృతం చేయు
**deny** నిరాకరించు
**deny the knowledge of** —విషయం తెలియదని చెప్పు
**de office** పదవిని పురస్కరించుకొని
**departed glory** గడచిన వైభవం
**depart from the place** స్థానం నుంచి విడిపోవు
**department** శాఖ / విభాగం
**departmental accounts** శాఖాపరమైన లెక్కలు
**departmental action** శాఖాపరమైనచర్య
**departmental action is in progress** శాఖాపరమైన చర్య చురుకుగా జరుగుతున్నది
**departmental administration** విభాగ పాలన / శాఖ పరిపాలన
**departmental benevolent fund** విభాగ ఉపకార నిధి / హితకారనిధి
**departmental budget** శాఖాపర బడ్జెట్
**departmental charges** విభాగపు ఖర్చులు, శాఖాపరమైన ఖర్చులు
**departmental conference** శాఖా పరమైన సమావేశం
**departmental contract** శాఖాపర ఒప్పందం / కాంట్రాక్ట్
**departmental control** శాఖ నియంత్రణ / అదుపు
**departmental enquiry** శాఖ / విభాగ పరమైన విచారణ
**departmental examination** శాఖా పరీక్ష
**departmental head** విభాగాధ్యక్షుడు/ శాఖాధిపతి
**departmental inspection** శాఖాపర తనిఖీ
**departmental management** శాఖా నిర్వహణ / విభాగ నిర్వహణ
**departmental manager** శాఖ నిర్వాహకుడు / మేనేజరు
**departmental meeting** శాఖాపరమైన సమావేశం
**departmental order** విభాగపు ఉత్తరువు, శాఖీయ ఉత్తరువు
**departmental organization** విభాగ వ్యవస్థ / శాఖావ్యవస్థ
**departmental penalty** శాఖాపరమైన జరిమానా
**departmental permission** శాఖాపరమైన అనుమతి
**departmental promotion** శాఖీయ ప్రమోషన్ / పదోన్నతి
**departmental promotion committee** విభాగ పదోన్నతి సంఘం, శాఖీయ పదోన్నతి సంఘం
**departmental regulation** శాఖాపర నిబంధన
**departmental statement** శాఖాపరమైన వివరణ
**departmental store** డిపార్టుమెంటల్‌స్టోరు, వివిధ వస్తువులు దొరికే దుకాణం
**department may please see for comments** వ్యాఖ్యలను శాఖ చూడాలి/ అనుసరించాలి
**department may see the preceding note with reference to their query** వారి ప్రశ్న నిర్దేశం ప్రకారం శాఖ వారు వెనకటి నోటును పరిశీలించవచ్చు
**department will be advised accordingly** తదనుగుణంగా శాఖకు సలహా ఇవ్వబడుతుంది
**departure** బయలు దేరటం, పోకడ
**departure time** బయలుదేరే సమయం
**dependable** నమ్మదగిన
**dependant / dependent** పోషితుడు, ఆశ్రితుడు, అధీనుడు
**dependency** 1. అధీనత, 2. అధీన / ఆశ్రిత రాజ్యం
**dependent contract / covenant** ఆధారిత కరారు / అధీన ఒప్పందం
**dependent member** పోషిత సభ్యుడు
**dependent relations** ఆధార పడిన/

ఆశ్రిత బంధువులు
**dependent relative revocation** పరిస్థితికి అధీనమైన ఉపసంహరణ: కొత్త వీలునామాను అంగీకరించడం, పాత వీలునామా ధ్వంసమైన పరిస్థితుల కఠినమై ఉంటుంది అనే సందర్భంలో
**dependent territory** అధీన ప్రదేశం
**depending upon the circumstances of each case** ప్రతి ఒక్క కేసు పరిస్థితుల ఆధారంగా
**depict** చిత్రించు / వర్ణించు
**depletion** తరుగు, క్షీణత, ఖాళీ, నిశ్శేషం
**deplorable** శోచనీయ / గర్హించదగిన
**deplore** గర్హించు, నిందించు
**deploy** వ్యూహాలుగా ఏర్పరుచు
**deployed defence** సైనిక వ్యూహం, సేనా ముఖ విస్తరణ / పాడుగు చాలు నుంచి అడ్డుచాలుకు సైన్యం విస్తరించటం / ఏర్పరచటం
**deponent** వాఙ్మూలందారు, సాక్షి
**depopulation** నిర్జనీకరణ
**deport** 1. దేశ బహిష్కరణ చేయు 2. ప్రవాసానికి పంపు
**deportee** దేశ బహిష్కృతుడు
**deportment** వైఖరి, ప్రవర్తన
**depose** 1. వాఙ్మూలం ఇచ్చు 2. పదవీభ్రష్టుని చేయు
**depose to the facts of the case** కేసు వాస్తవాలకు వాఙ్మూలం ఇచ్చు
**deposit n.** 1. డిపాజిట్, ధరావతు, **v.** 2. నిక్షేపం, జమ
**deposit account** డిపాజిట్ ఖాతా, నిక్షేప ఖాతా
**deposit accounts of subscribers** చందాదారుల డిపాజిట్ లెక్క / నిక్షేప ఖాతా
**deposit account system** డిపాజిట్ ఖాతా పద్ధతి
**deposit at call reciept** కోరిన వెంటనే వాపసు చెల్లించే డిపాజిట్
**deposit bill** డిపాజిట్ బిల్లు, నిక్షేప బిల్లు
**deposit book** జమ పుస్తకం
**deposit certificate** డిపాజిట్ ధ్రువపత్రం
**deposited amount** జమ చేసిన మొత్తం
**deposited in record room** రికార్డు గదిలో నిలవ ఉంచిన
**deposit in court** కోర్టులో డిపాజిట్‌చేయు
**deposition** 1. ప్రమాణ పూర్వక వాఙ్మూలం, 2. పదవీచ్యుతి
**deposit money** ధరావతు పైకం
**deposit of costs** ఖర్చులు డిపాజిట్ చేయు
**deposit of documents** దస్తావేజులు డిపాజిట్ చేయు
**deposit of stolen property** దొంగ ఆస్తి నిల్వ
**deposit of title deeds** హక్కు పత్రాలు డిపాజిట్ చేయు
**deposit of wills** వీలునామాల డిపాజిట్
**depositor** జమ ఖాతాదారు / నిక్షేపదారు
**depository** డిపాజిట్ స్థానం, జమస్థానం
**deposit reciept** డిపాజిట్ రసీదు, జమ చేసిన రసీదు
**deposit reserves** 1. జమ రిజర్వులు, 2. నిక్షేప నిధులు
**deposit slip** జమస్లిప్పు / చీటీ
**deposit warrant** డిపాజిట్ వారంటు, కుదువ వస్తువుల రసీదు : ఋణదాత అప్పుకోసం హామీగా పుచ్చుకొన్న వస్తువుల తాలూకు రసీదు
**depot** గిడ్డంగి, డిపో
**depot contractor** డిపో గుత్తాదారు / కాంట్రాక్టరు
**depravity** 1. భ్రష్టత, 2. దుష్టత
**depreciable assets** తరిగే ఆస్తులు
**depreciate** విలువ తగ్గించు ( నాణెం వగైరా)
**depreciation** తరుగుదల (విలువ వగైరా)
**depreciation account** తరుగు లెక్క / పద్దు: వస్తువులూ లేదా యంత్రాలూ వాడకం వల్ల విలువ తగ్గడం (దాని సం॥)
**depreciation allowance** తరుగుదల భత్యం

**depreciation charge** తరుగుదల ఖర్చు
**depreciation fund** తరుగుదల నిధి
**depreciation in the value** విలువలో తరుగుదల
**depreciation of currency** కరెన్సీ / చలామణి విలువ తరుగుదల
**depreciation of fixed assets** స్థిరాస్తుల తరుగుదల
**depreciation rate** తరుగుదల రేటు
**depreciation shall be admissible** తరుగుదలను అనుమతిస్తారు
**depredation** దోపిడి, కొల్ల
**depressed** దళిత, అణచబడిన
**depressed castes** దళిత కులాలు
**depressed classes** బడుగు వర్గాలు / దళిత వర్గాలు
**depressed economy** మందకొడి ఆర్థిక వ్యవస్థ
**depressed market** మందకొడి మార్కెటు
**depressed state of mind** మానసిక వ్యాకులత / అధైర్య స్థితి
**depression** 1. మాంద్యం ( ఆర్థిక సం॥) 2. వాయుగుండం, 3. దమనం, అణచటం
**depression of trade** వర్తక మాంద్యం
**deprivation** లేకుండా చేయటం / రిక్త పరచటం
**deprivation of appointment** నియామకం రిక్తపరచడం / తొలగించడం / ఖాళీ చేయడం
**deprivation of property** ఆస్తి లేకుండా చేయడం
**deprive** లేకుండా చేయు, రిక్త పరుచు, హరించు
**deprived of a right** హక్కును రిక్త పరిచిన
**deprive of life** ప్రాణం తీయు
**depth** 1. లోతు, 2. గంభీరత
**deputation** 1. ఉపనియామకం, డిప్యూటేషను, 2. ప్రతినిధి వర్గం
**deputation allowance** ఉపనియామక బత్తెం, డిప్యూటేషన్ బత్తెం
**deputationist** ఉపనియుక్తుడు
**deputation of citizens** పౌరుల ప్రతినిధ్యం, పౌర ప్రతినిధి వర్గం
**deputation pay** ఉపనియుక్త వేతనం
**depute** 1. ఉపనియుక్తం చేయు, 2. ప్రతినిధిగా పంపు
**depute an officer to investigate** దర్యాప్తు అధికారిని నియుక్త పరచు
**deputy** డిప్యూటీ, ఉప, ఉపనియుక్తుడు
**derailment** పట్టాలుతప్పడం (రైలు సం॥)
**deranged** క్రమం తప్పిన
**derate** రేటు తగ్గించు
**derationed** రేషనింగు తొలగించిన
**derationed area** రేషనింగు తొలగించిన ప్రాంతం
**derelict** పరిత్యజించినది, విడిచిపెట్టినది, పరిత్యక్తం
**dereliction of duty** విధిని వదలివేయటం, కర్తవ్యాన్ని ఉపేక్షించటం
**derelict vessel** పరిత్యక్త నౌక, విడిచిపెట్టిన నావ
**de rigori juris** కచ్చితమైన శాసనం ప్రకారం
**derision** అపహాస్యం, ఎగతాళి
**derivation** వ్యుత్పత్తి, నిష్పాదన
**derivative interest** నిష్పాదక/వ్యుత్పన్న ప్రయోజనం
**derivative mortgage** అనుబంధ తాకట్టు, రెండో తనఖా, **sub-mortgage**
**derivatives of coal** బొగ్గు ఉత్పాదనలు
**derive** 1.పొందు, సాధించు 2. శబ్ద వ్యుత్పత్తి చెప్పు
**derived** 1. ఉత్పన్నమైన 2. నిర్ణయించిన
**derived title** పొందిన హక్కుమూలం, సాధించిన హక్కుమూలం
**derive interest** ప్రయోజనం పొందడం
**derive of title** హక్కును పొందడం
**derive profit** లాభం పొందు
**derive revenue** రెవెన్యూ / ఆదాయం పొందు
**deriving benefit** పొందే లాభం

**derogate** 1. న్యూనపరచు, 2. అపయశస్సు కలిగించు 3. తగ్గించు
**derogate from the powers of** అధికారం తగ్గించు
**derogate from provision of any local law** ఏ స్థానిక చట్టంలోని నిబంధన నుంచి అయినా తగ్గించు
**derogation** తగ్గించటం (గౌరవం వగైరా)
**derogatory** అవమానకర, అప్రతిష్ఠాకర
**derogatory statement** అవమానకరమైన కథనం / ప్రకటన
**derrick** డెరిక్, బరువులు ఎత్తే చిన్న యంత్రం
**descend** 1. వంశపారంపర్య సంక్రమింపు, 2.అవరోహణం
**descendant** 1. వంశస్థుడు, సంతతివాడు, 2. ఉత్తరాధికారి
**descendant, lineal** వంశపరంపరాగతుడు, పరంపరాగత వంశస్థుడు
**descending order** అవరోహణక్రమం
**descent** 1.అవరోహణ 2. సంతతి, వంశానుక్రమం, వారసత్వం
**descent and distribution** వారసత్వమూ పంపకమూ
**descent, collateral** పార్శ్విక సంతతి
**descent, lineal** వంశానుక్రమం
**description** వివరణ, వర్ణన
**description of cargo** రవాణా సరుకు వివరణ
**description of contents** 1. సరుకుల వివరణ, 2. విషయ వివరణ
**description of finds** లభ్య వస్తువుల వివరణ : దొరికిన వస్తువుల వివరణ
**descriptive catalogue** వివరణాత్మక పట్టిక
**descriptive financial statement** వివరణాత్మక ఆర్థిక నివేదిక
**descriptive rolls** వివరణాత్మక పట్టికలు
**descriptive statistics** వివరణాత్మక గణాంకాలు
**descriptive term / word** వివరణాత్మక పదం
**desert** n. 1. ఎడారి v. 2. త్యజించు
**deserted** 1. విడిచిపెట్టిన, త్యజించిన, 2. పాడుబడిన, నిర్జనమైన
**deserted site** నిర్జనమైన ప్రాంతం
**desertion from duty** కర్తవ్యాన్ని వదిలి వెళ్ళడం
**desertion of active service** క్రియాత్మక సేవ మానటం / పరిత్యాగం
**deserving** అర్హమైన
**deserving person** అర్హుడు, అర్హమైన వ్యక్తి
**deserves every encouragement** ప్రతి ప్రోత్సాహకానికీ యోగ్యుడే
**desiccate** నిర్జలీకరించు, నీరు తీసివేయు
**desiccated milk** నీరులేని పాలు, నిర్జల క్షీరం
**design** n. 1. డిజైను, రూపరచన, నమూనా, కల్పన 2. పన్నుగడ, 3. ఉద్దేశం 4. విన్యాసం v. 5. పథకం వేయు, ఉద్దేశించు, నమూనా వేయు
**designate** 1. హోదా నిర్దేశ, నామోద్దిష్ట, 2. నియుక్తుడైన, పదవి చేపట్టనున్న 3.నియుక్తపరచు
**designated purchaser** నియుక్తుడైన కొనుగోలుదారు
**designated trade** నామనియుక్త వ్యాపారం
**designation** హోదా, పదవి, పదవిపేరు
**design to commit cognizable offence** విచారణయోగ్య నేరం చేయటానికి పన్నాగం
**designedly** ఉద్దేశపూర్వకంగా
**designer** నమూనా రచయిత / లేఖరి
**design of experiment** ప్రయోగ రూపరచన
**desirable** అపేక్షణీయ, వాంఛనీయ
**desire** n. కోరిక, వాంఛ, అపేక్ష v.వాంఛించు, అపేక్షించు
**desired result** కోరిన ఫలితం
**desires to be heard** వినాలని అపేక్షిస్తున్న (విచారణ సం॥)
**desirous of raising** ఉత్పన్నం చేయగోరే
**desist** విరమించు

**desolate** నిర్మానుష్యం చేయు
**de son tort** తన తప్పువల్ల
**despatch n. 1.** డిస్పాచ్, బట్వాడా **v. 1.** డిస్పాచ్ చేయు, పంపు **2.** చంపు
**despatch, all convenient** పూర్తి సౌకర్యం గల బట్వాడా
**despatch book** డిస్పాచ్ పుస్తకం
**despatch by post** తపాలా ద్వారా పంపు
**despatching** పంపటం, బట్వాడా చెయ్యటం
**despatching instructions** డిస్పాచ్ సూచనలు / అనుదేశాలు
**despatching of food grains** ఆహార ధాన్యాలు పంపడం
**despatching section** డిస్పాచింగ్ / బట్వాడా విభాగం
**despatch memo** డిస్పాచ్ మెమో
**despatch register** డిస్పాచ్ / బట్వాడా రిజిస్టరు
**despatch seal** డిస్పాచ్ ముద్ర
**despatch stamp** డిస్పాచ్ స్టాంపు / మొహరు
**desperado 1.** దుస్సాహసి **2.** ఆకతాయి
**desperate** నిరాశాపూర్వక, అసాధ్య, తెగించిన
**desperate and dangerous character** ప్రాణానికి తెగించిన ప్రమాదకర వ్యక్తి
**desperate attempt** దుస్సాహసయత్నం
**desperate desease** దుస్సాధ్యరోగం
**despotism** నిరంకుశత్వం, నిరంకుశ ప్రభుత్వం
**destination** గమ్యం, చేరవలసిన చోటు
**destination of export** ఎగుమతి గమ్య స్థానం
**destine** పూర్వమే నిర్దిష్టపరచు
**destiny** దైవం / విధి
**destitute** అనాథ
**destitute of property** ఆస్తిహీనుడు
**destitutes home** అనాథ శరణాలయం
**destroy evidence** సాక్ష్యం నష్టపరచు
**destruction certificate** ధ్వంస ధ్రువ పత్రం
**destruction of document** దస్తావేజు ధ్వంసం చేయడం
**destruction of old records** పాత రికార్డులు ధ్వంసం చేయడం
**destructive activities** విధ్వంసక చర్యలు
**destructive insects and pests** వినాశకర కీటకాలు, చీడలు
**destructive matter** నాశకరమైన పదార్థం
**destructuralization** నిర్మాణ విచ్ఛిన్నకరణం
**detach** విడదీయు, విసంధానం చేయు
**detached service** విడదీసిన సర్వీసు / సేవ
**detached view** నిర్లిప్త దృక్పథం
**detached village** విడదీసిన గ్రామం
**detachment 1.**నిర్లిప్తత **2.** జట్టు **3.** విడదీసిన భాగం
**detail n. 1.** తఖ్సీలు, వివరణ **v. 2** పనికి కేటాయించు, వివరించు
**detailed account 1.** తఖ్సీలు ఖాతా **2.** వివరణ సహిత కథనం
**detailed analysis** సవివర విశ్లేషణ
**detailed budget estimates** సవివరమైన బడ్జెటు అంచనాలు
**detailed contingent bill** సవివర ఆగంతుక బిల్లు
**detailed estimate** తఖ్సీలు అంచనా
**detailed head of account** సవివరమైన మద్దు / పద్దు
**detailed heads** తఖ్సీలు పద్దులు / శీర్షికలు
**detailed inspection** తఖ్సీలు తనిఖీ, సవివర తనిఖీ
**detailed report** తఖ్సీలు నివేదిక, సవివర నివేదిక
**detailed rules** సవివర నియమావళి
**detailed rules of procedure** కార్య విధానపు సవివర నియమావళి
**detailed statement** తఖ్సీలు కథనం
**detain 1.** ఆపిపెట్టు **2.** నిర్బంధించు **3.** నిరోధించు

**detained in prison** జైలులో నిర్బంధించిన
**detained in safe custody** సురక్షిత నిర్బంధంలో ఉంచిన
**detain for interrogation** ప్రశ్నించటానికి నిర్బంధించు/ నిరోధించు
**detaining officer** నిర్బంధించే అధికారి
**detain money** డబ్బు ఆపిపెట్టు
**detain without warrant** వారంటు లేకుండా నిర్బంధించు
**detect** ఆచూకీ తీయు
**detection** శోధన, ఆచూకీ, ఆరా
**detection of crime** నేరశోధన
**detective** నేరశోధకుడు
**detective police** డిటెక్టివ్/ నేరశోధక పోలీసు
**detector** డిటెక్టర్, ఆచూకీ సాధనం, శోధన సాధనం
**detention** నిర్బంధం, ఆపివేయడం
**detention cell** నిర్బంధగది
**detention in transit** రవాణాలో / ప్రయాణంలో నిర్బంధం
**detention of goods** సరుకుల నిర్బంధం
**detention order** నిర్బంధ ఉత్తరువు
**detention, preventive** నివారక నిర్బంధం
**detenu / detenue** డిటెన్యూ, బందీ
**deter** భయంచూపి నివారించు
**deteriorate** క్షీణించు
**deteriorated** క్షీణించిన
**deteriorating situation** క్షీణ పరిస్థితి
**deterioration** క్షీణత
**deterioration and depreciation** క్షీణత, విలువ తరుగుదల
**deterioration of capital** మూలధన క్షీణత
**deterioration of currency** చలామణి క్షీణత
**deterioration of industries** పరిశ్రమల క్షీణత
**determinable** నిర్ధారించదగిన
**determinate** 1. నిరారిత, రూఢ 2. పరిమిత
**determinate authority** నిర్ణాయక అధికారి / అధికారం
**determination** 1. నిర్ధారణ (న్యాయం వగైరా) 2. సమాప్తి (భూస్వామ్య హక్కు వగైరా)
**determination by retirement** పింఛనుతో సమాప్తి / నిర్ధారణ
**determination of attachment** జప్తు నిర్ధారణ / ముగింపు
**determination of charges** ఆరోపణ నిర్ధారణ
**determination of conditions of service** సర్వీసు షరతుల నిర్ధారణ
**determination of date** తేదీ / కాల నిర్ణయం
**determination of goal** లక్ష్య నిర్ణయం/ నిర్ధారణ
**determination of lease** కౌలు నిర్ధారణ
**determination of policy** విధాన నిర్ణయం
**determination of priority** అగ్ర ప్రాధాన్య నిర్ధారణ
**determination of procedure** కార్య పద్ధతి నిర్ధారణ
**determination of programme** కార్యక్రమ నిర్ణయం / నిర్ధారణ
**determination of progress** ప్రగతి నిర్ణయం / నిర్ధారణ
**determination of question** ప్రశ్న నిర్ధారణ
**determination of right** హక్కు నిర్ధారణ
**determination of site** స్థల నిర్ధారణ
**determination of suit** దావా నిర్ధారణ
**determination of the court** న్యాయస్థాన నిర్ణయం / నిర్ధారణ
**determine by lots** చీట్లు వేసి నిర్ధారించు
**determined action** నిర్ధారిత చర్య
**determined by ballot** బ్యాలటు ద్వారా నిర్ణయించిన / నిర్ధారించిన
**determine the appeal** అపీలు నిర్ణయించు
**determine the objection** ఆక్షేపణ నిర్ధారణ చేయు

**determine with the leave of court** కోర్టు అనుమతితో ముగించు / నిర్ధారించు
**determining the jurisdiction** అధికార పరిధిని నిర్ణయం చేయుటం
**deterrant punishment** కఠిన శిక్ష
**detinue** విడుదల దావా : నిరోధిత చర వస్తువుల విడుదల కోసం వేసే దావా
**detonator** పేలుడు సాధనం, పేలుడు వస్తువు
**detract** 1.గౌరవలోపం చేయు, 2.అపకర్షణ చేయు
**detriment** హాని
**detrimental** నష్టకరమైన / హానికరమైన
**detrimental to the public interest** ప్రజా ప్రయోజనానికి హానికరమైన
**detriment to the public service** ప్రజాసేవకు హానికరం
**detrimental to the security** భద్రతకు హానికరమైన
**deuterogamy** 1. విధవా వివాహం, 2. విధుర వివాహం, remarriage after a spouse's death
**devaluation** విలువ తగ్గింపు, ద్రవ్యోల్బణం
**devastate** సర్వనాశనం చేయు
**devastation** 1. సర్వనాశనం, 2. మృతుని ఆస్తిని వ్యవహర్త పాడుచెయ్యటం
**develop** అభివృద్ధిచేయు
**developed countries** అభివృద్ధి చెందిన దేశాలు
**developing countries** వర్ధమాన దేశాలు, అభివృద్ధి చెందుతున్న దేశాలు
**development** అభివృద్ధి, వికాసం
**development agency** అభివృద్ధి సంస్థ
**development allowance** అభివృద్ధి భత్యం
**developmental activities** అభివృద్ధి కార్యక్రమాలు
**development block** అభివృద్ధి సమితి/ బ్లాకు
**development board** అభివృద్ధి మండలి
**development centres** అభివృద్ధి కేంద్రాలు
**development charge** అభివృద్ధి ఖర్చు/ విధింపు
**development committee** అభివృద్ధి సంఘం / సమితి
**development costs** అభివృద్ధి వ్యయాలు
**development council** అభివృద్ధి మండలి
**development expenses** అభివృద్ధి ఖర్చులు
**development plan** అభివృద్ధి ప్రణాళిక
**development programme** అభివృద్ధి కార్యక్రమం
**development projects** అభివృద్ధి ప్రాజెక్టులు
**development rebate** అభివృద్ధి రిబేట్
**development scheme** అభివృద్ధి పథకం
**development strategy** అభివృద్ధి వ్యూహం
**deviate** మార్గాపసరణం చేయు / దారితొలగు
**deviation** మార్గాంతరణం, అపసరణం
**device** 1. యుక్తి, 2.నమూనా 3. సాధనం
**devil's advocate** కుతర్కవాది
**devisable** వీలునామా ద్వారా ఇవ్వదగిన, విభాజనీయ
**devise** n. 1. సంక్రమింపు భాగం, వసీయతు భాగం: సంక్రమింపజేసే వీలునామా భాగం v. 1. కల్పన చేయు 2. వసీయతు కలిగించు: వీలునామా ద్వారా సంక్రమింపజేయు
**devisee** సంక్రమింపుదారు, వసీయతుదారు: వీలునామా గ్రహీత
**deviser** వీలునామా దాత
**devoid** రహిత, విహీన
**devolution** సంక్రమింపు (పారంపరికంగా)
**devolution of joint liabilities** సమష్టి బాధ్యతల సంక్రమింపు
**devolution of property** ఆస్తి సంక్రమింపు
**devolution of tenancy rights** కౌలుదారీ హక్కుల సంక్రమింపు
**devolution rules** సంక్రమింపు నియమాలు (ఆస్తి సం॥)

**devolve** సంక్రమించు, ప్రాప్తించు
**devolve upon the reversioners** శేష హక్కు దారులకు సంక్రమించు
**devolving by inheritance** వారసత్వం ద్వారా సంక్రమించడం
**devote** వినియోగించు, నిష్ఠవహించు, సమర్పించు, శ్రద్ధచేయు
**devoted to work** కార్యనిష్ఠగల
**devotee** 1.నిష్ఠాపరుడు 2.భక్తుడు
**devotion** 1.నిష్ఠ. 2. భక్తి, శ్రద్ధ
**devotion to duty** కర్తవ్యనిష్ఠ
**devour** 1. కబళించు, 2. వ్యర్థంచేయు (వస్తువు మొ॥)
**devout** 1. మతనిష్ఠగల, పవిత్రమైన 2. హృదయ పూర్వక
**dexterity** హస్తకౌశలం
**DH / DHr (Decree Holder)** డిక్రీదారు
**DHr value** డిక్రీదారు మదింపు : డిక్రీదారు అంచనా వేసిన విలువ
**diagnosis** 1. రోగనిదానం (నిర్ధారణ) 2. సమస్య నిర్ధారణ
**diamond jubilee** వజ్రోత్సవం : ఒక సంస్థ అరవై సంవత్సరాలు నిండినప్పుడు చేసు కొనే ఉత్సవం
**diarchy** ద్వంద్వ ప్రభుత్వం
**diarise** దినచర్య రాయు, డైరీ రాయు
**diary** దినచర్య పుస్తకం, డైరీ
**dictate** 1. ఆదేశించు 2. చెప్పిరాయించు
**dictation** డిక్టేషన్/ఉక్తలేఖనం, వినురాత
**dictator** నియంత
**dictatorial** నియంతృత్వ, నిరంకుశ
**dictatorship** నియంతృత్వం, నిరంకుశత్వం
**dictatorship of the proletariat** శ్రామిక నియంతృత్వం
**dictionary** నిఘంటువు
**dictum** సూక్తి : దీనికి తీర్పుకు ఉన్నంత బలం ఉండదు (తీర్పుకు ఉపయోగించినప్పుడు దాన్ని **obiter dicta** అంటారు)
**die by the hand of justice** మరణశిక్ష పడు
**die intestate** వీలునామా రాయకుండా మరణించు
**dies fasti** వ్యాపారదినాలు, **business days**
**dies non** పనిచెయ్యని దినం **(non judicial day)**
**diet** 1. నియమితాహారం, పథ్యం 2. రాజకీయ ప్రతినిధి సభ (జపాన్)
**diet allowance** ఆహార బత్తెం / భత్యం
**die without heirs** వారసులు లేకుండా మరణించు
**die without issue** నిస్సంతుగా మరణించు
**differ** భేదించు, భిన్నంగా ఉండు
**difference** భేదం, వ్యత్యాసం
**difference in books of account** ఖాతా పుస్తకాల్లో వ్యత్యాసం
**difference in judicial opinion** న్యాయాభిప్రాయంలో వ్యత్యాసం
**difference of opinion** అభిప్రాయభేదం
**difference of procedure** కార్యపద్ధతిలో వ్యత్యాసం
**difference of sex** లింగభేదం, స్త్రీ పురుష భేదం
**different** విభిన్న, ఇతర, అన్య
**differential cost** వ్యత్యాసధర
**differential duty** భేదాత్మక సుంకం
**differential pricing** భేదాత్మక ధరల నిర్ణయం
**differential scale** భేదాత్మక శ్రేణి
**differential surplus** వైవిధ్యంవల్ల వచ్చిన మిగులు
**differential tax** భేదాత్మకమైన పన్ను
**differential voting** భేదాత్మక వోటింగ్
**differentiation** భేదపరచటం
**different order** 1. భిన్నక్రమం, 2.భిన్న ఉత్తర్వు
**different sources of income** వివిధ ఆదాయ మార్గాలు
**different water rate** వివిధ రకాల నీటి తీరువ

**difficult and extraordinary case** కష్టమైన, అసాధారణ కేసు / దావా
**difficult to achieve** కష్టసాధ్యం
**difficult to resist** ప్రతిఘటించడం కష్టం
**difficult to subdue** అణచటం కష్టం
**difficult to surmount** అధిగమించటం కష్టం
**difficult to understand** అవగాహనకు కష్టం
**diffidence** ఆత్మసంకోచం, బిడియం
**diffusion** వ్యాప్తి, విసరణం
**diffusion theory of taxation** పన్ను విధింపు విసరణ సిద్ధాంతం
**digamy** మాన్యతగల రెండో పెండ్లి (మొదటి భార్య మరణించిన సందర్భంలో)
**digest n. 1.** సంగ్రహం (పుస్తక రూపంలో) **v.2.** జీర్ణమవు
**digit 1.** సంఖ్యాస్థానం **2.** అంకె
**dignified** హుందాగల, గౌరవంగల
**dignified manner** గౌరవప్రదమైన విధం
**dignitary** మాన్య అధికారి
**dignity** హుందాతనం / మాన్యత
**digress** విషయాంతరం చేయు
**dilapidation** జీర్ణావస్థ
**dilatation** విస్తృతీకరణం
**dilate upon** విస్తరణం చేయు
**dilatoriness** కాలయాపనం
**dilatory defence** కాలయాపన ప్రతివాదం
**dilatory motion** కాలయాపన ప్రతిపాదన/ విలంబన తీర్మానం
**dilatory plea** కాలయాపన వాదం
**dilatory tactics** కాలయాపన యుక్తులు
**dilemma** సందిగ్ధావస్థ
**diligence** జాగరూకత
**diligence and good faith** శ్రద్ధ, సద్భావం
**diligently perform duty** జాగరూకంగా విధి నిర్వహించు
**diligent search** శ్రద్ధా పూర్వక అన్వేషణ
**dilution** పలచన చేయటం, సజలీకరణం
**dimension** పరిమాణం / కొలత
**diminish** తగ్గించు, తగ్గు, క్రమక్షీణం చేయు
**diminishing cost** క్రమక్షీణ మూల్యం
**diminishing productivity** క్రమక్షీణత ఉత్పాదకత
**diminishing returns** క్రమ క్షీణ ప్రతిఫలాలు
**diminishing utility** క్రమక్షీణ ప్రయోజనం
**diminish or prejudice any rights** ఏ హక్కులనైనా తగ్గించు లేదా భంగం కలిగించు
**diminution** క్రమక్షీణత, తగ్గుదల
**diminution of liability** బాధ్యత తగ్గింపు
**diminution of profit** లాభక్షీణత
**diminutive** స్వల్ప, లఘు
**diploma** డిప్లొమా, అర్హతపట్టా
**diplomacy** దౌత్యనీతి, దౌత్యవిధానం
**diplomat** దూత, దౌత్యనీతివేత్త
**diplomatic** దౌత్యసంబంధ
**diplomatic agent** దౌత్యప్రతినిధి
**diplomatic consular** దౌత్య వాణిజ్య ప్రతినిధి
**diplomatic corps** దౌత్య దళం
**diplomatic functions** దౌత్య అధికార విధులు
**diplomatic immunity** దౌత్య అధికార ఉన్ముక్తి / మినహాయింపు
**diplomatic mission** దౌత్య శిష్టమండలి
**diplomatic observers** దౌత్య పరిశీలకులు
**diplomatic pressure** దౌత్య సంబంధమైన ఒత్తిడి
**diplomatic privileges** దౌత్య విశేష హక్కులు
**diplomatic protection** దౌత్య సంరక్షణ
**diplomatic recognition** దౌత్య విషయక గుర్తింపు
**diplomatic relations** దౌత్య సంబంధాలు
**diplomatic representative** దౌత్య ప్రతినిధి

**diplomatic service** దౌత్య వ్యవహారాల సేవ / శాఖ
**diplomatic staff** దౌత్య సిబ్బంది
**dire consequences** ఘోర పరిణామాలు
**direct** adj. 1.ప్రత్యక్ష, ముఖాముఖి, సరాసరి v. 2. ఆదేశించు, నిర్దేశించు, చూపు
**direct action** ప్రత్యక్ష చర్య
**direct affinity** ప్రత్యక్ష సంబంధం
**direct ancestry** ప్రత్యక్ష పూర్విక వారసత్వం
**direct approach** ప్రత్యక్ష మార్గం / చేరిక
**direct attack** ప్రత్యక్ష దాడి
**direct burden** ప్రత్యక్ష భారం
**direct cause** ప్రత్యక్ష కారణం
**direct competition** ముఖాముఖి/ప్రత్యక్ష పోటీ
**direct contempt** ప్రత్యక్ష ధిక్కారం
**direct control** ప్రత్యక్ష నియంత్రణ / నిర్వాయకం
**direct cost** ప్రత్యక్ష వ్యయం
**direct demand** ప్రత్యక్ష డిమాండు / అభ్యర్థన
**direct democracy** ప్రత్యక్ష ప్రజాస్వామ్యం
**direct democratic devices** ప్రత్యక్ష ప్రజాస్వామిక పద్ధతులు
**direct demonstration** 1. ప్రత్యక్ష ప్రదర్శన 2. ప్రత్యక్ష నిరూపణ
**directed by this Act** ఈ చట్టం ద్వారా ఆదేశింపబడిన
**directed to join** చేరవలసినదిగా ఆదేశించటమైంది
**directed to invite a reference to the correspondence resting with the letter** లేఖకు సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాల నిర్దేశాన్ని కోరవలసిందిగా ఆదేశించటమైంది
**direct election** ప్రత్యక్ష ఎన్నిక
**direct enquiry** ప్రత్యక్ష విచారణ / దర్యాప్తు
**direct estimation** ప్రత్యక్ష అంచనా
**direct evidence** ప్రత్యక్ష సాక్ష్యం
**direct examination** ప్రత్యక్ష పరిశీలన/ పరీక్ష
**direct financing** ప్రత్యక్షంగా నిధులు సమకూర్చటం
**direct grant** ప్రత్యక్ష ఆర్థిక సహాయం/ గ్రాంటు / అనుదానం
**direct income** ప్రత్యక్ష ఆదాయం
**directing staff** నిర్దేశక ఉద్యోగులు
**direct inquiry** ప్రత్యక్ష విచారణ
**direct inspection** ప్రత్యక్ష తనిఖీ
**direct interest** ప్రత్యక్ష ప్రయోజనం
**direct investment** ప్రత్యక్ష పెట్టుబడి
**direction** 1. ఆదేశం 2. నిర్దేశం 3. దిక్కు
**direction and control of election commission** ఎన్నికల కమీషను నిర్దేశం, నియంత్రణ
**directive** ఆదేశం, ఆదేశక
**directive principles** ఆదేశక / నిర్దేశక సూత్రాలు
**direct liability** ప్రత్యక్ష ఉత్తరదాయిత్వం / బాధ్యత
**direct legislation** ప్రత్యక్ష శాసనం
**direct loss** ప్రత్యక్ష నష్టం
**directly and substantially in issue** ప్రత్యక్షం గాను, వాస్తవంగాను వివాదాస్పదమైన
**directly employed** నేరుగా నియమించిన/ నియమితులైన
**direct method** ప్రత్యక్ష పద్ధతి
**direct natural cause** ప్రత్యక్ష సహజ కారణం
**direct nomination** ప్రత్యక్ష నామనిర్దేశం (నామినేషన్)
**director** సంచాలకుడు, డైరెక్టరు
**directorship** డైరెక్టర్ పదవి, నిర్దేశకత్వం, సంచాలకత్వం
**directory** దర్శిని / డైరెక్టరీ
**directory and mandatory** ఆదేశాత్మకం, బద్ధాత్మకం
**directory enactment** ఆదేశాత్మక శాసనం
**direct payment** ప్రత్యక్ష చెల్లింపు

**direct proof** ప్రత్యక్ష రుజువు
**direct proportion** ప్రత్యక్షానుపాతం
**direct proximate cause** అత్యంత / ప్రత్యక్ష సన్నిహిత కారణం
**direct recruitment** ప్రత్యక్ష నియామకం
**direct tax** ప్రత్యక్ష పన్ను
**direct taxation** ప్రత్యక్ష పన్ను విధింపు
**direct testimony** ప్రత్యక్ష సాక్ష్యం/ప్రమాణం
**direct trade dealings** ప్రత్యక్ష వ్యాపార వ్యవహారాలు
**direct vote** ప్రత్యక్ష వోటు
**dire necessity** అత్యావశ్యకత
**disability** అంగవైకల్యం, అసమర్థతలోపం, అశక్తత
**disability benefits** సామర్థ్య లోప ప్రయోజనాలు
**disability insurance** అంగవైకల్య భీమా
**disability to sue** దావా వేయడానికి అనర్హత
**disabled worker** వికలాంగ కార్మికుడు
**disablement 1.** అంగహీనత, **2.** హక్కు నాశనం, **3.** అశక్తత
**disablement due to accident** ప్రమాదం వల్ల అశక్తత
**disabling statute** హక్కులను పరిమితం చేసే శాసనం
**disaccord** అనంగీకారం, అసమ్మతి
**disadvantage** అననుకూలత
**disagree** అంగీకరించకపోవు, అనంగీకారం తెలుపు
**disagreement** అసమ్మతి, అనంగీకారం
**disallow** నిరాకరించు, తోసిపుచ్చు
**disallow objection** ఆక్షేపణ తోసిపుచ్చు/నిరాకరించు
**disappearance of evidence** సాక్ష్యం కనబడకుండా పోవటం
**disappointment** ఆశాభంగం
**disapprobation** అనంగీకారం
**disapproval** అననుమోదం, అనామోదం
**disarm** నిరాయుధునిగా చేయు
**disarmament** నిరాయుధీకరణ
**disarm compaign** నిరాయుధీకరణ ఉద్యమం
**disaster** విపత్తు
**disaster relief plan** విపత్తు సహాయక ప్రణాళిక
**disaster relief works** విపత్తు సహాయక పనులు
**disavow** తనకు సంబంధంలేదని వక్కాణించు
**disband** (సైన్యం) రద్దుచేయు
**disbelief** అపనమ్మకం
**disburse** పంపిణీచేయు, బట్వాడాచేయు
**disbursement of loans** ఋణాల పంపిణీ
**disbursement of pay** జీతం బట్వాడా
**disbursing authority** బట్వాడా అధికారి/అధికారం
**disbursing officer** బట్వాడా అధికారి
**discard** తీసివేయు, విసర్జించు
**discharge 1.** విడుదల చేయు / విముక్తి చేయు / తొలగు **2.** నిర్వర్తించు, అమలు పరచు
**discharge a decree** డిక్రీ అమలుపరుచు
**discharge a rule** ఉత్తర్వును రద్దుచేయు
**discharge by breach of contract** కరారు భంగం వల్ల విడుదల / విముక్తి
**discharge by operation of law** శాసన మూలక విడుదల
**discharge by payment** చెల్లింపుతో విడుదల
**discharge certificate** విడుదల ధ్రువ పత్రం
**discharged bankrupt** విముక్త దివాలాదారు
**discharged bill** విడుదల అయిన బిల్లు, తీర్చివేసిన బిల్లు
**discharged debtor** విముక్త ఋణగ్రస్తుడు
**discharge duty** కర్తవ్య నిర్వహణ
**discharged from obligation** బాధ్యత నుంచి విముక్తి

**discharged from service** ఉద్యోగంనుంచి తొలగిన
**discharged insolvent** విముక్తి పొందిన దివాలాదారు
**discharge from custody** సంరక్షణ నుంచి విడుదల చేయు
**discharge of a contract** కరారు / కాంట్రాక్టు పూర్తి చేయు
**discharge of arrears** బకాయీల విడుదల
**discharge of debt** బాకీనుంచి విడుదల
**discharge of duty** కర్తవ్య నిర్వహణ
**discharge of instrument** పత్రం/ దస్తావేజు విముక్తి, దస్తావేజు విడుదల
**discharge of loan** అప్పు చెల్లింపు
**discharge of person apprehended** పట్టుకొన్న వ్యక్తిని విడిచిపెట్టడం
**discharge of prisoners** ఖైదీల విడుదల
**discharge of professional duty** వృత్తి సంబంధమైన కర్తవ్య నిర్వహణ
**discharge of public function** ప్రజా కార్యవిధుల నిర్వహణ
**discharge of the liability** చెల్లింపు బాధ్యత నుంచి విడుదల
**discharge slip** విడుదల చీటి
**disciplinary** క్రమశిక్షణ సంబంధ
**disciplinary action** క్రమశిక్షణ చర్య
**disciplinary lay off** లే ఆఫ్ క్రమశిక్షణ
**disciplinary measure** క్రమశిక్షణ చర్య
**disciplinary powers** క్రమశిక్షణాధికారాలు
**disciplinary proceedings** క్రమశిక్షణ కార్యవ్యవహారాలు
**discipline** క్రమశిక్షణ
**disclaim** పరిత్యజించు (హక్కు వగైరా)
**disclaimed property** దావాలో త్యజించిన ఆస్తి
**disclaimer** హక్కు తిరస్కారం : కౌలుదారు భూస్వామి హక్కును తిరస్కరించడాన్ని అంటారు. పదవీ బాధ్యతలు స్వీకరించటానికి తిరస్కృతి
**disclaimer of lease holds** కౌలు భూములు వదులుకోటం
**disclaim responsibility** (హక్కు) పరిత్యాగం/ వదులుకున్న బాధ్యత
**disclose** ప్రకటించు, వెల్లడించు
**disclosure of decisions** నిర్ణయాల వెల్లడి
**disclosure of facts** వాస్తవాల వెల్లడి
**disclosure of information** సమాచారం వెల్లడించటం
**disclosure of official secrets** అధికార రహస్యాలు వెల్లడించటం
**discomfiture** పరాభవం, భంగం
**discomfort** అసౌకర్యం
**discommon** సాధారణ హక్కు తీసివేయు **to deprive of a right of common**
**disconnect** వేరుచేయు, డిస్కనెక్ట్ చేయు
**disconnection** వేర్పాటు, డిస్కనెక్షన్
**discontent** అసంతృప్తి
**discontinuance** విరమణ, మానివేయటం, నిలుపుదల, కొనసాగించక పోవటం
**discontinue** కొనసాగించకపోవు
**discontinuous easement** ఆగిపోయిన అనుభోగ హక్కు
**discord 1.** అనైక్యత **2.** అపస్వరం
**discordant** ప్రతికూల, విషమ
**discount 1.** ముదరా, వట్టం, తగ్గింపు **2. v.** విలువ తగ్గించు, తగ్గించి ఇచ్చు
**discount order** తగ్గింపు ఉత్తర్వు
**discount rate** ముదరా (వట్టం) రేటు, తగ్గింపు రేటు
**discount sale** వెల తగ్గింపు అమ్మకం
**discount value** తగ్గింపు విలువ, వట్టం విలువ
**discourage** నిరుత్సాహపరచు, అధైర్యపరచు
**discourtesy** అమర్యాద
**discover 1.** శోధించు, కనిపెట్టు **2.** దర్శించు **3.** ప్రకటించు (దస్తావేజు సం॥)
**discovered to be void** చెల్లదని కనిపెట్టిన
**discovert 1.** అవివాహిత **2.** విధవరాలు

**discovery** ఆవిష్కరణ, పరిశోధన
**discovery and inspection** కనిపెట్టడం, తనిఖీ
**discovery by interrogatories** విచారణ ప్రశ్నల ద్వారా కనుక్కోవటం
**discovery claim** ప్రకటన హక్కు (దస్తావేజుల సం॥), ఆవిష్కరణ హక్కు
**discovery of documents** దస్తావేజులు కనిపెట్టటం
**discovery of evidence** సాక్ష్య శోధన
**discredit** n. 1. అపఖ్యాతి, అవిశ్వాసం v. 2. అపఖ్యాతి పాలు చేయు, నమ్మకపోవు
**discreet** వివేకం గల
**discreet enquiry** వివేకంతో కూడిన విచారణ
**discrepancy** 1. వ్యత్యాసం, తేడా 2. అవకతవక
**discrepancy may be reconciled** అవకతవకలు సరిచేయవచ్చు
**discretion** వివేచన, స్వేచ్ఛా నిర్ణయం
**discretionary audit** వివేచనాత్మక ఆడిట్ /లెక్కల తనిఖీ
**discretionary grant** వివేచనాత్మక గ్రాంటు / అనుదానం
**discretionary order** వివేచనాత్మక ఉత్తరువు
**discretionary power** వివేచనాధికారం
**discretionary trust** వివేచనాత్మక ట్రస్టు
**discretion, degree of** వివేచన స్థాయి
**discretion, judicial** న్యాయ వివేచన
**discretion of court** కోర్టు వివేచన
**discriminate** విచక్షణ చేయు, భేద భావం చూపు, వివక్ష చూపు
**discriminate against** విచక్షణ చూపు
**discriminating prices** విచక్షణాత్మక ధరలు
**discrimination** విచక్షణ/పక్షపాతం/విభేదం
**discussion** చర్చ, సమాలోచనం
**discussion for short duration** స్వల్పకాలిక చర్చ
**discussion of address** ప్రసంగంపై చర్చ
**discussion of budget** బడ్జెటుపై చర్చ
**discussion of principle of bill** బిల్లు చట్టం మూలసూత్రం గురించి చర్చ
**diseconomies** నష్టదాయకాలు
**disembargo** ఆంక్షతొలగింపు (ఓడ సం॥)
**disembark** ఓడ నుంచి దించు / దిగు / దిగుమతి చేయు
**disentangle** చిక్కు విడదీయు
**disentitle** హక్కు తొలగించు
**disfavour** ప్రతికూలం, అయిష్టం
**disfigure** రూపం చెరుచు
**disfranchise** వోటు హక్కు తొలగించు
**disgraceful conduct** అవమానకర ప్రవర్తన
**disguise** ప్రచ్ఛన్నత, మారువేషం
**disguised unemployment** ప్రచ్ఛన్న నిరుద్యోగిత
**disharmony** సామరస్య రాహిత్యం
**disherison** వారసత్వం తొలగింపు
**dishonest** 1. నిజాయితీ లేని 2. కపటం గల, కపట బుద్ధి
**dishonest concealment** కపటంతో దాచి పెట్టటం
**dishonestly making false claim** కపటబుద్ధితో తప్పుడు క్లెయిమ్ చేయటం
**dishonestly receiving stolen property** దొంగ సొమ్మును కపట బుద్ధితో తీసుకోటం
**dishonest misappropriation of property** ఆస్తిని లోపాయకారీతనంతో దుర్వినియోగం చెయ్యటం
**dishonest removal** కపటంతో తొలగింపు
**dishonesty** నిజాయితీ లోటు, కపటం
**dishonour** 1. నిరాకరణ (చెక్కులు వగైరా) 2. అమర్యాద, అనాదరణ
**dishonour by non-acceptance** అంగీకరించకుండా/స్వీకరించకుండా నిరాకరించు
**dishonoured cheque** నిరాకరించిన చెక్కు
**dishonour of bill of exchange** వినిమయ పత్రం నిరాకరణ
**disincarcerate** ఖైదు నుంచి విడుదల చేయు

**disinclination** అనిష్టత
**disincorporate** కంపెనీ రద్దుపరచు
**disinfect** క్రిమిసంహారం చేయు
**disinfection** అంటువ్యాధి నివారణ
**disinfestation** అంటువ్యాధి క్రిమిసంహరణ
**disinheritance** వారసత్వం తొలగింపు
**disintegration** విచ్ఛేదనం
**disinterested** నిరాసక్త, నిష్పక్షపాత
**disinterested judge** నిష్పక్షపాత న్యాయమూర్తి
**dislocation** స్థానభ్రంశం/అస్తవ్యస్తం
**dislocation of work** పని అస్తవ్యస్తం
**dislodge** స్థానచ్యుతి చేయు
**disloyalty** అవిశ్వాస తత్పరత
**dismantle** పడగొట్టు, ధ్వంసం చేయు
**dismiss** 1. బర్తరఫు చేయు; తొలగించు 2. కొట్టి వేయు (దావా వగైరా)
**dismissal** బర్తరఫు, తొలగింపు, కొట్టివేయటం
**dismissal compensation** బర్తరఫు పరిహారం
**dismissal from service** ఉద్యోగం నుంచి తొలగింపు
**dismissal of action** దావా కొట్టివేత
**dismissal of default** ఉపేక్ష చేసినందుకు తొలగింపు
**dismissal of suit** దావా కొట్టి వెయ్యటం
**dismissal order** బర్తరఫు / తొలగింపు ఉత్తర్వు
**dismissal pay** బర్తరఫు వేతనం
**dismissal report** బర్తరఫు నివేదిక
**dismissed exparte** ఏకపక్షంగా కొట్టివెయ్యటం
**dismiss with costs** (కేసు) తొలగించండి, ఖర్చులు వసూలు చేయండి (కోర్టు సం॥)
**dismortgage** తాకట్టు విడిపించు
**disnomy** 1. అవ్యవస్థ, క్రమరాహిత్యం 2. దోషంతో కూడిన శాసనం (bad legislation)
**disobedience** అవిధేయత
**disorder** 1. అవ్యవస్థ, క్రమరహితం 2. అశాంతి, శాంతిభంగం
**disorderly conduct** క్రమరహిత ప్రవర్తన
**disorderly manner** క్రమరహిత విధానం
**disorganization** వ్యవస్థలేని, అవ్యవస్థ
**disown** తనది కాదను, స్వకీయం వదలుకొను
**disparity** అసమానత, హెచ్చుతగ్గులు
**dispassionate** 1. ఉద్రేకరహిత 2. నిష్పక్షపాత
**dispauper** దివాలాదారు దావా హక్కు తీసివేయు
**dispel** 1.తొలగించు (అపోహ వగైరా) 2. చెదరగొట్టు
**dispensary** ఔషధాలయం
**dispensation** 1. వితరణం, పంచటం 2. బాధ్యత మినహాయింపు 3. నిర్వహణ
**dispense** బాధ్యత నుంచి తొలగించు, సిద్ధం చేయు, తొలగించు
**dispense with** వర్జించకుండా చేయు, విడుదల చేయు
**dispense with service** పని నుంచి విరమింపజేయు
**dispersal** చెదరగొట్టటం, వెదజల్లటం, వ్యాప్తి
**displace** స్థానాంతరం చేయు, తొలగించు, ఉద్వాసన చెప్పు
**displaced creditor** ఉద్వాసిత ఋణదాత
**displaced debtor** ఉద్వాసిత ఋణగ్రహీత
**displaced insurer** నిర్వాసిత భీమాదారు
**displaced personnel** ఉద్వాసిత ఉద్యోగులు / సిబ్బంది
**displaced persons** నిర్వాసితులు
**display** ప్రదర్శించు, చూపించు
**display-advertisement** ప్రదర్శన-ప్రకటన
**display drive** ప్రదర్శనోద్యమం
**displeasure** అసంతుష్టి, అయిష్టత
**disposal** 1. వినియోగం 2. పరిష్కారం, ఫైసలా 3. అమ్మకం
**disposal by confiscation** జప్తుతో పరిష్కారం
**disposal by destruction** నిర్మూలనతో పరిష్కారం

**disposal file** పరిష్కారం చేసే ఫైలు/ పరిష్కారం చెయ్యవలసిన ఫైలు

**disposal income** పరిష్కార అనంతర ఆదాయం: ప్రత్యక్ష పన్నులు చెల్లించగా మిగిలిన ఆదాయం

**disposal list** పరిష్కరణ పట్టీ, పరిష్కార జాబితా

**disposal number** పరిష్కార సంఖ్య

**disposal number system** పరిష్కార సంఖ్యా పద్ధతి

**disposal of a case** దావా పరిష్కారం

**disposal of amendments** సవరణల పరిష్కారం

**disposal of an object** వస్తువును వదిలించుకోవటం

**disposal of audit objections** ఆడిట్ ఆక్షేపణల పరిష్కారం

**disposal of business** వ్యవహార పరిష్కారం

**disposal of case** దావా పరిష్కారం, కేసు పరిష్కారం

**disposal of demand** అభ్యర్థన పరిష్కారం

**disposal of file** ఫైలు పూర్తి చేయటం/ రాసి పంపటం

**disposal of property** n. ఆస్తి పరిష్కారం v. ఆస్తి పరిష్కారం చేయటం/అమ్మి వేయటం

**disposal of stolen property** దొంగ సొత్తు పరిష్కారం

**disposal register** పరిష్కరణ పుస్తకం/ రిజిస్టర్

**disposal slip** పరిష్కార చీటి

**disposal to be expedited** పరిష్కారాన్ని వేగిరపరచటం

**dispose** 1. పరిష్కరించు 2. మనోవైఖరి చూపు

**dispose off** 1. పరిష్కరించు, 2. అమ్మి వేయు

**disposing mind** ఇచ్చే వైఖరి (ఆస్తి వగైరా)

**disposing of audit objections** ఆడిట్ ఆక్షేపణల పరిష్కారం

**disposition** 1. పంపకపు పథకం 2. మనోవైఖరి

**disposition of property** ఆస్తి పంపకపు పథకం

**dispossess** కబ్జా తొలగించు, బేదఖలు చేయు

**dispossession** బేదఖలు కబ్జా/ స్వాధీనం వదులుకోవడం

**dispossession otherwise than in due course of law** న్యాయ సమ్మతంగా కాకుండా స్వాధీనం తొలగించటం

**disproof of charges** ఆరోపణలను నిరూపించకపోవటం

**disproof of title** హక్కును నిరూపించకపోవటం

**disproportion** అనుపాతరాహిత్యం, దామాషా లోపం: ఉండవలసిన దానికన్న ఎక్కువగాని తక్కువగాని ఉండటం

**disproportionate** విషమ, అసమ, నమపాళ్ళలో లేని

**disprove** కాదని రుజువు పరుచు

**disproved** నిజం కాదని రుజువైంది: ఒక సంగతి జరిగి ఉండదని తెలిపే పరిస్థితుల సాక్ష్యం పొంది, కోర్టు ఆవిధంగా నిర్ణయించటం

**disputable** వివాదాస్పద

**disputable presumption** వివాదాస్పద పురోభావన

**dispute** n. 1. తగాదా, వివాదం v. 2. వివాదం చేయు

**disputed amount** వివాదగ్రస్త మొత్తం

**disputed debt** వివాదగ్రస్త ఋణం

**disputed point** వివాదాంశం

**disputed proof** వివాదగ్రస్త రుజువు

**disputed territory** వివాదగ్రస్త భూభాగం

**dispute, matter in** వివాదంలో వడ్డ విషయం

**dispute on facts** వాస్తవాలపై వివాదం

**disputes arising out of** - నుంచి తలెత్తిన వివాదాలు

**disputes as to immovable property** స్థిరాస్తి సంబంధమైన తగాదాలు/వివాదాలు

**disputes relating to waters** జల సంబంధ వివాదాలు
**disputes the claim** క్లెయింను వివాదంలో పడవేస్తుంది
**disputing parties** వివాద పక్షాలు
**disqualification** అనర్హత
**disqualification for interest** స్వ ప్రయోజనం వల్ల అనర్హత: ఈ అనర్హత శాసనం ద్వారా విధించ బడుతుంది
**disqualified** అనర్హం చేయబడిన, అనర్హ మయిన
**disqualify** అనర్హం చేయు
**disregard n. 1.** అనాదరణ, ఉపేక్ష **v. 2.** ఉపేక్ష చేయు, త్రోసిరాజను
**disregarding the facts** వాస్తవాలను త్రోసిరాజను
**disrespect** అగౌరవం
**disrepute** అపకీర్తి
**disreservation 1.** ప్రత్యేకింపు నుంచి తొలగింపు **2.** అటవీ ప్రాంతం నుంచి వేరు చెయ్యటం
**disrespectful behaviour** అమర్యాదకర ప్రవర్తన
**disruption** అంతరాయం, భంగం
**dissatisfaction** అసంతృప్తి
**dis-seisin** హక్కుదారును తప్పించడం
**dissemination** వ్యాప్తి, ప్రసరణం
**dissemination of information** సమా చార ప్రసరణం
**dissent n.** భిన్నాభిప్రాయం **v.** భిన్నాభి ప్రాయం ప్రకటించు
**dissenting judgement** భిన్నాభిప్రాయంతో తీర్పు
**dissenting minutes** భిన్నాభిప్రాయ కార్య వివరణలు
**dissenting opinion** భిన్నాభిప్రాయం
**dissenting voice** భిన్నాభిప్రాయ స్వరం
**dissenting vote** ప్రతికూలవోటు
**dissent note** భిన్నాభిప్రాయ నోట్
**dissident** అసమ్మతిదారు
**dissimilar** పోలికలేని, అసదృశమైన
**dissimulation** నిజం/ అభిప్రాయం దాచడం, భావగోపనం
**dissipation of assets** ఆస్తుల దుర్వ్యయం
**dissipation of energy** శక్తి దుర్వ్యయం
**dissociation** అసంబంధం, విడిపోవటం
**dissolution** రద్దు, విఘటన
**dissolution of House** సభను రద్దు చెయ్యటం (శాసనసభ సం॥)
**dissolution of legislature** విధాన మండలి రద్దు
**dissolution of marriage** వివాహం రద్దు: విడాకుల డిక్రీ ద్వారా హిందూ వివాహాన్ని విఘటనం చేయవచ్చు
**dissolution of partnership at will** భాగహక్కు ఐచ్ఛికంగా రద్దు, భాగస్వామ్య ఐచ్ఛిక రద్దు
**dissolve 1.** రద్దుచేయు **2.** కరిగిపోవు, విలీన మవు
**dissuade** నివారించు, నిరుత్సాహపరచు
**dissuade from disclosing fact** వాస్తవాన్ని వెల్లడించకుండా నిరుత్సాహ పరచు
**dissymmetry** అసౌష్ఠవం, వైషమ్యం
**distant heirs** దూరవారసులు
**distend** సాగదీయు
**distillation** బట్టీ
**distilled alcoholic liquor** బట్టీ పట్టిన ఆల్కహాలు/ సారాద్రవం
**distiller** సారా బట్టీదారు
**distillery** సారా బట్టీ
**distinct claim** ప్రత్యేక క్లెయిమ్/హక్కు
**distinct consideration** ప్రత్యేక వివేచన
**distinct designation** ప్రత్యేక హోదా
**distinction 1.** ప్రత్యేకత, విశిష్టత **2.** బిరుదు
**distinction, adverse** ప్రతికూల ప్రత్యేకత
**distinction, in 1.**-లో ప్రత్యేకత **2.**-విశిష్ట యోగ్యత
**distinct matter** సుస్పష్ట విషయం
**distinct offence** ప్రత్యేక అపరాధం
**distinct subject 1.** ప్రత్యేకమైన/విశిష్ట

మైన విషయం. 2. విభిన్నవాద విషయం (కోర్టు ఫీజు సం॥)

**distinguish** ప్రత్యేకించి చేయు/చూపు, వేరు పరచు

**distinguished guest** అతిథి ప్రముఖుడు

**distinguished jurist** సుప్రసిద్ధ న్యాయ శాస్త్రవేత్త

**distinguished service** విశిష్ట సేవ, ప్రముఖ సేవ

**distinguished visitors** ప్రముఖ సందర్శకులు

**distinguishing 1.** తీర్పుకుగల ఆధారాల నుంచి (ratio decidendi) వేరు చేసి చెప్పటం 2. వేరుపరచిన

**distort** వక్రంగా చెప్పటం

**distorted version** వక్రంగా చిత్రించిన కథనం, వక్రపాఠం

**distracted** అన్యథాపరిచిన, అన్యవర్తనగల

**distrain** బాకీ కింద పట్టుకొను, జప్తు చేయు

**distrained property** జప్తు చేసిన ఆస్తి

**distraining officer** జప్తు చేసే అధికారి

**distraint** జప్తు: బాకీ కింద పట్టుకోవటం

**distrain the movable property** చరాస్తిని జప్తు చేయు

**distress n.1.** జప్తు **v. 2.** జప్తు చేయు **3.** ఆపద

**distressed and destitutes** ఆర్తులూ అనాథలూ

**distress sales** ఆపద అమ్మకాలు

**distress selling** అయినకాడికి అమ్మటం

**distress warrant** జప్తు వారంటు

**distress wealth** జప్తులో ఉన్న సంపద

**distributaries** పిల్ల కాలవలు

**distribute** పంపిణీ చేయు

**distributees** భాగస్థులు (ఆస్తి వగైరా)

**distribution 1.** పంపిణీ **2.** విభజన, విస్తరణ

**distribution and control of waters** జలాల పంపిణీ నియంత్రణా

**distribution of assets** ఆస్తుల పంపిణీ

**distribution of dividends** లాభాంశాల పంపిణీ, డివిడెండ్ల పంపిణీ

**distribution of legislative powers** చట్ట నిర్మాణాధికారాల విభజన

**distribution of population** జనాభా విస్తరణ

**distribution of powers** అధికారాల విభజన

**distribution of revenue** పన్ను ఆదాయ/రెవెన్యూ పంపిణీ

**distribution of wealth** సంపత్తి విభజన

**distribution of work** పని విభజన

**distribution register** పంపిణీ రిజిస్టరు

**distribution rules** పంపిణీ నియమాలు

**distribution section** పంపిణీ విభాగం

**distributive share** మృతుని వాటా : వీలునామా లేకుండా మరణించిన వ్యక్తి ఆస్తిలో భాగం

**distributor** పంపిణీదారు

**district board** జిల్లా బోర్డు

**district court** జిల్లా కోర్టు

**district crime bureau** జిల్లా నేర (వ్యవహార) విభాగం

**district emergency committee** జిల్లా అత్యవసర సంఘం

**district enumeration** జిల్లా జనగణన

**district jail** జిల్లా జైలు

**district office** జిల్లా కార్యాలయం

**district office manual** జిల్లా కార్యాలయ నియమ సంపుటి

**district treasury** జిల్లా ట్రెజరీ/ ఖజానా

**district wise allotment** జిల్లా వారీ కేటాయింపు

**distrust** అపనమ్మకం, అవిశ్వాసం

**disturb** గందరగోళ పరచు, భంగపరచు, అల్లరిచేయు, చెదరగొట్టు, చిందర వందర చేయు

**disturbance** గందరగోళం, అశాంతి, అల్లరి

**disturbance of easement** అనుభోగ హక్కు భంగం

**disturbance of order** ఆజ్ఞా భంగం

**disturbance of peace** శాంతి భంగం

**disturbance of peace and order** శాంతిభద్రతల భంగం

**disturbance of public order** ప్రజా భద్రతకు భంగం

**disturbance of public peace** ప్రజా శాంతికి భంగం

**ditto** డిటో, అదే, పైనున్నదే

**diurnal** రోజువారీ, పగటి, నిత్య

**diurnal variation** పగటి తేడా (ఉష్ణోగ్రత సం॥)

**divergence** అపసరణం, వ్యత్యాసం

**diverse** వివిధ, భిన్నమైన

**diversified intensive agriculture** వివిధీకృత సాంద్ర వ్యవసాయం

**diversion 1.** మలుపు, మళ్ళింపు, మార్గం తప్పించటం **2.** విషయాంతరణం

**diversion channel** మార్గం మార్చిన ప్రవాహం

**diversion of income** ఆదాయం మళ్లింపు

**diversion to non-agricultural purpose** వ్యవసాయేతర ప్రయోజనాలకు మళ్లింపు

**diversion tunnel** మలుపు సొరంగం

**diversion weir** మత్తడి, అలుగులు మళ్ళించే కట్ట, మరోవైపు మళ్ళించే ఆనకట్ట

**diversity** భిన్నత్వం, వైవిధ్యం

**diversity of production** ఉత్పత్తి వైవిధ్యం

**divest / devest** లేకుండా చేయు, విహీనం చేయు

**divided responsibility** విభజించిన బాధ్యత

**dividend** డివిడెండు, లాభవాటా, లాభాంశం

**dividend equalization fund** లాభాల వాటా, డివిడెండు సమానీకరణ నిధి

**dividend free of tax** పన్నులేని డివిడెండు/లాభవాటా

**dividend less tax** పన్ను మినహా డివిడెండు

**dividend warrant** డివిడెండు వారంటు, లాభవాటా అధికారపత్రం

**dividing line** విభాజక రేఖ

**divine law** దైవశాసనం

**divining rod** జలసూచీదండం (భూగర్భ సం॥)

**divisible contract** విభజించదగిన కాంట్రాక్టు

**division** విభజన/విభాగం

**division bell** వోటు గంట: శాసనసభలో వోటు తీసుకోవటానికి ఉపయోగించే గంట

**Division Bench** డివిజన్ బెంచి, విభజన న్యాయపీఠం/స్థానం :ఇద్దరు న్యాయమూర్తులతో ఏర్పడ్డ న్యాయ పీఠం, పూర్తి బెంచికానిది

**division court** డివిజన్ న్యాయస్థానం

**division of functions** కార్యవిధుల విభజన

**division of labour** శ్రమ విభజన

**division of opinion** (న్యాయమూర్తుల) అభిప్రాయ భేదం

**division of power** అధికార విభజన

**division of responsibilities** బాధ్యతల విభజన

**divorce** విడాకులు

**divorcee** విడాకులు పొందిన వ్యక్తి

**divorce, judicial** కోర్టు ద్వారా విడాకులు

**divorce, legislative** శాసనరీత్యా విడాకులు

**divorce suit** విడాకుల దావా

**divulge** వెల్లడించు

**D.O. (Demi-Official)** డి.ఓ., అర్ధాధికార

**dock 1.** డాక్: ఓడలు నిలిచే స్థలం **2.** ఓడల మరమ్మతు స్థలం **3.** కోర్టుబోను

**dockage** రేవు సుంకం

**dock challan** డాక్ చలాను

**dock dues** రేవు బాకీలు

**docket n.1.** డాకెట్, విషయసూచి **v.** విషయసూచీకరణ చేయు **2.** అట్ట కాగితం, తీర్పులు నమోదు చేసే రిజిస్టరు

**docket form** సూచీ పత్రం

**docket sheets** డాకెట్ షీట్లు

**dock ware house** ఓడ సరుకుల గిడ్డంగి

**dock warrant** డాక్ వారంటు
**dock yard** డాక్‌యార్డ్, నౌకాంగణం/నౌకా నిర్మాణ కేంద్రం
**doctrine of bona vaccantia** బేవారసు ఆస్తి సిద్ధాంతం
**doctrine of conversion** మార్పిడి సిద్ధాంతం
**doctrine of cypres** యథా సమీప సిద్ధాంతం
**doctrine of ratification** అనుమోద సిద్ధాంతం
**doctrine of ultravires** అధికారాతీత సిద్ధాంతం
**document** 1. దస్తావేజు 2. అధికార పత్రం
**documentalist** దస్తావేజు లేఖరి
**documentary** దస్తావేజు/పత్రసంబంధమైన
**documentary credit** పత్రవిధాన పరపతి
**documentary evidence** పత్ర సాక్ష్యం: సాక్ష్యం కింద చూపే పత్రాలు, దస్తావేజు సాక్ష్యం, లిఖిత సాక్ష్యం, పత్రమూలక సాక్ష్యం
**documentary film** డాక్యుమెంటరీ చిత్రం
**documentary letter of credit** పరపతి దస్తావేజు లేఖ
**documentary proof** దస్తావేజు రుజువు
**documentation** డాక్యుమెంట్లు/ పత్రాలు సమకూర్చటం
**document of title** హక్కు మూలపత్రం
**document purporting to be a report** నివేదిక అనిపించుకొనే పత్రం
**document writer** దస్తావేజుల లేఖరి
**dodge** n.1. టలాయింపు, మోసం v.2. టలాయించు, మోసగించు
**dogma** 1. పిడివాదం 2. అంధవిశ్వాసం
**doli capax** నేరసమర్థుడు (వయస్సును బట్టి)
**doli incapax** నేరానికి అసమర్థుడు (వయస్సును బట్టి)
**dollar exchange** డాలర్ వినిమయం
**domain** 1. అధికార పరిధి 2. ఎస్టేటు
**domestic** 1. గృహసంబంధ 2. పెంపుడు 3. దేశీయ
**domestic animal** పెంపుడు జంతువు
**domesticate** మచ్చికచేయు
**domestic concern** 1. గృహ సంబంధం 2. దేశీయ వ్యాపార సంస్థ
**domestic menial** పరిచారకుడు
**domestic system** గృహ వ్యవస్థ
**domestic trade** దేశీయ వ్యాపారం
**domestic unemployment** దేశీయ నిరుద్యోగిత
**domicile** స్థిరనివాసం
**domicile by birth** జన్మతః స్థిరనివాసం
**domicile by operation of law** చట్ట రీత్యా స్థిరనివాసం
**domicile certificate** స్థిరనివాస ధ్రువ పత్రం
**domiciled alien** స్థిరనివాస విదేశీయుడు
**domiciled citizen** స్థిరనివాస పౌరుడు
**domicile of choice** ఐచ్ఛిక స్థిర నివాసం
**dominant** ప్రబల
**dominant economy** ప్రబల ఆర్థిక వ్యవస్థ
**dominant heritage** అనుభోగ హక్కు భూమి
**dominant owner** అనుభోగ హక్కుదారు
**dominant tenement** అనుభోగ స్థిరాస్తి
**dominant traits** ప్రబల లక్షణాలు
**dominate** ప్రబలంగా వ్యవహరించు, అధిగమించు
**dominion** డొమినియన్: అధినివేశం/ అధినివేశ రాజ్యం
**dominion legislature** అధినివేశ విధాన మండలి
**dominion of India** భారతదేశ అధినివేశం
**dominion status** అధినివేశ (రాజ్యాంగ) ప్రతిపత్తి
**donate** విరాళమిచ్చు, దానమిచ్చు
**donatio mortis causa** మరణశంక దానం
**donation** దానం, విరాళం
**donative charters** దాన విక్రయాది పత్రాలు
**donator** దాత, విరాళదాత
**donee** విరాళగ్రహీత, దానగ్రహీత

done in bad faith దురుద్దేశంతో చేసిన
done or intended to be done చేసిన లేదా చెయ్యడానికి ఉద్దేశించిన
donor దాత
do not register but return in original నమోదు చేయకుండా మూలం తిరిగి పంపండి
doom నాశనం, అంతం
dooms day ప్రళయదినం, కల్పాంతం
door keeper ద్వార పాలకుడు
dormant సుప్తమైన, క్రియారహిత, ఉపయోగరహిత
dormant balances స్తబ్దమైన నిల్వలు
dormant capital ఉపయోగ రహిత మూలధనం
dormant partner క్రియారహిత భాగస్వామి
dormitory 1 నిద్రాశాల, శయనాగారం 2. వసతి గృహం
dosage మోతాదు (మందు సం॥)
dossier వివరణ సంబంధి పత్రాలు
dot 1. n. చుక్క, బిందువు 2. v. భేదం సూచించు, చుక్కలు పెట్టు
dotage మనోదౌర్బల్యం
do the needful అవసరమైంది చెయ్యండి
double రెట్టింపు, జంట, జోడు, ద్వంద్వ
double account జంటఖాతా, జోడు ఖాతా
double column జంట కాలమ్‌లు, జోడు గళ్ళు
double costs రెట్టింపు ఖర్చులు
double covers జంటకవర్లు, కవరులోని కవరు
double crop 1. రెండు పంటలు 2. జంట పంటలు
double cross 1. మోసగించు, నయవంచన చేయు 2. విద్రోహం
double damage రెట్టింపు నష్టపరిహారం
double dealing కపట వర్తన/ వ్యవహారం
double decree రెండు డిక్రీలు
double decree cannot be regarded డబుల్ డిక్రీని పాటించలేం
double edged రెండు వైపులా పదునున్న, రెండు అంచులుగల
double endowment ద్వంద్వ ప్రయోజనాల ధర్మాదాయం
double entry జంటపద్దు/నమోదు
double entry system of book-keeping జంట నమోదు ఖాతా పద్ధతి
double fare రెట్టింపు ఛార్జి
double lock జంట తాళం
double lock register సురక్షితాగార రిజిస్టరు
double member constituency ద్విసభ్య నియోజకవర్గం
double payment రెండుసార్లు చెల్లింపు, రెట్టింపు చెల్లింపు
double standards ద్వంద్వ ప్రమాణాలు
double taxation ద్వంద్వ పన్ను విధానం: రెండు రకాల పన్ను విధింపు
double time త్వర కదనుపాదం, ద్రుతపాదం (సైనిక సం॥): **a time or step in marching which is the quickest next to run**
doubt సందేహం
doubtful సందిగ్ధ, సందేహాస్పద
doubtful cases సందేహాస్పదమైన కేసులు
doubtful debts సందేహాస్పద ఋణాలు
doubtful ownership సందేహాస్పదమైన యజమాని హక్కు, సందిగ్ధస్వామిత్వం
doubtful rights సందేహాస్పద హక్కులు
doubtful title సందేహాస్పద హక్కు మూలం
doubtless నిస్సందేహంగా, నిశ్శంకగా
dove of peace శాంతిదూత / కపోతం
down cast ఉదాసీన, నిరుత్సాహి, అట్టడుగున ఉన్న
down graded శ్రేణి దిగిన/తగ్గిన
downtrodden దళిత
downward దిగుముఖం, అధోముఖం
downward adjustment దిగుముఖం సర్దుబాటు
downward flow of authority దిగుముఖ్యమైన అధికారం

**downward trend** దిగుముఖ ధోరణి, అధోముఖ ధోరణి, తగ్గుముఖం పట్టిన ధోరణి

**downward trend of prices** ధరలు తగ్గేధోరణి

**do work with zeal** ఉత్సాహంతో పని చేయు

**dowry** వరకట్నం, వరదక్షిణ

**dowry prohibition** వరకట్న నిషేధం

**draft** ముసాయిదా, చిత్తునమూనా, చిత్తు ప్రతి, a sketch of work, an ou tline

**draft agreement** ముసాయిదా ఒప్పందం

**draft as amended** సవరించిన రీతిగా ముసాయిదా

**draft as amended is put up** సవరించిన రీతిగా ముసాయిదా సమర్పించడమైంది

**draft as directed** సూచించినట్లు ముసాయిదా రాయు

**draft bill** ముసాయిదా/చిత్తు బిల్లు

**draft bye-laws** ఉపనిబంధనావళి ముసాయిదా

**drafter** ముసాయిదా లేఖరి

**draft final report** అంతిమ నివేదిక ముసాయిదా రాయండి

**draft for approval** ఆమోదం కోసం పంపిన ముసాయిదా

**drafting and noting** ముసాయిదా రాయటం, నోట్ రాయటం

**drafting any agreement** ఏదైనా ఒప్పందానికి ముసాయిదా రాయటం

**drafting committee** ముసాయిదా రచనా సంఘం

**drafting the minutes** సమావేశ వివరణల ముసాయిదా రచన

**draft letter** ముసాయిదా లేఖ

**draft notes and comments** ముసాయిదా నోట్‌లు, వ్యాఖ్యలు

**draft outline** చిత్తు ముసాయిదా

**draft paper** ముసాయిదా పత్రం

**draft policy** ముసాయిదా పాలసీ/విధానం

**draft reply** ముసాయిదా జవాబు

**draft reply as suggested above** పైన సూచించిన విధంగా ముసాయిదా జవాబు రాయండి

**draft reply is put up for approval** ముసాయిదా జవాబు ఆమోదం కోసం సమర్పించడమైంది

**draft rules** ముసాయిదా నియమావళి

**draft scheme** ముసాయిదా పథకం

**draft sheet** ముసాయిదా పత్రం

**draft standing orders** స్థాయీ ఉత్తరువుల ముసాయిదా

**draft submitted** ముసాయిదా సమర్పించటమైంది

**drag** n.1. ఈడ్పు v.2. ఈడ్చు, తాత్సారం చేయు

**drain** n.1. మురుగు కాలువ v.2. ఉత్సారణ చేయు, (నీరు మొ.) ఖాళీచేయించు

**drainage** డ్రైనేజి, మురుగు నీటిపారుదల

**drainage basin** మురుగు పారుదల బేసిన్/ద్రోణి

**drainage of soil** భూమినుంచి నీరు తీసివేయటం

**drainage scheme** డ్రైనేజి పథకం, మురుగు పారుదల పథకం

**drain of bullion** రజత-స్వర్ణ / బులియన్ అపవాహం

**drain of wealth** ధనోత్సారణ, ప్రవాహంగా ధనం పోవడం

**dramatic performance** 1. ఆకస్మిక నిర్వహణ 2. నాటక ప్రదర్శనం

**drastic action** తీవ్ర చర్య

**drastic devaluation** తీవ్రంగా విలువ తగ్గింపు

**drastic measure** తీవ్ర చర్య

**drastic steps** తీవ్ర చర్యలు

**draught** 1. వాయు వీచిక 2. నౌకాయాన లోతు 3. ముసాయిదా రచన

**draughtsmanship** ముసాయిదా రచన నిపుణత, రచనా కౌశలం

**draw** n.1. ఎటూ తేలనిది, డ్రా v.2. లాగు, ఆకర్షించు 3. రాయు, గీయు, తీయు,

చిత్రీ
draw a bill బిల్లు రాయు
draw a cheque చెక్కు రాయు
draw attention దృష్టికి తెచ్చు
drawback 1. ఎగుమతి పన్ను / ముదరా 2. ప్రతిబంధకం
drawback claim ప్రతిబంధక క్లెయిం
drawbridge కదిలే వంతెన
drawee గ్రహీత (చెక్కు వగైరా)
drawee in case of need అవసర చెక్కు గ్రహీత
drawer డ్రాయర్, చెక్కు కర్త: చెక్కు రాసే వ్యక్తి
draw inference నిష్కర్షించు / అనుమితి చేయు
drawing 1. ఆహరణం / ఆదానం: డబ్బు ద్వారా పొందటం 2. రేఖా చిత్రం
drawing of lots చీట్లు తీయటం
drawings 1. డ్రాయింగ్స్, 2.సొంతవాడకాలు
drawing up of schemes పథకాలను రూపొందించటం
draw salary జీతం తీసుకొను
draw the alignment అనుగుణంగా చేయు
draw up a scheme పథకం తయారు చేయు
draw up charge ఆరోపణ రూపొందించు, frame charge
draw up the inquestio మరణ విచార ణాంశాలు తయారు చేయు
dredge తవ్వు
dredger తవ్వేడ, డ్రెడ్జర్
dress rehearsal పూర్తి వేషభాషలతో రిహార్సల్ / ఒద్దికలు దిద్దడం
dressing కట్టుకట్టడం
driage experiment ఆరుదల ప్రయోగం
dried milk పాలపొడి
drift కొట్టుకొని పోవు, జారు
drill 1. డ్రిల్లు, కవాతు, శిక్షణ 2. ఛిద్రం చేయు
drinking water well మంచినీటి బావి
drive n. చొరవ, ఉద్యమం v. ఉద్యమించు
dropped విడిచిపెట్టిన, విరమించిన, తీసి వేసిన
drought అనావృష్టి
drought area అనావృష్టి ప్రాంతం
drought forecast అనావృష్టి సూచన
drought fund అనావృష్టి నిధి
drought prone area అనావృష్టి పీడిత ప్రాంతం
drought relief అనావృష్టి సహాయం
drover 1. పశువుల కాపరి 2. పశువుల వ్యాపారి
drug addiction మత్తు మందుల వ్యసనం
drug control laboratory ఔషధ నియంత్రణ ప్రయోగశాల
druggist మందుల వ్యాపారి
drugs and narcotics మత్తుమందులు
drunkard తాగుబోతు
drunken తాగిన, మత్తెక్కిన
drunkenness మత్తు, నిషా
dry శుష్క, ఎండిన, పొడి
dry cultivation మెట్ట వ్యవసాయం
dry farming మెట్ట వ్యవసాయం, మెరక సేద్యం
dry mortgage వట్టి తాకట్టు: వ్యక్తి బాధ్యత లేని తాకట్టు / తనఖా
dry period వెట్ట, అనావృష్టి కాలం
dry promotion వట్టి/శుష్కపదోన్నతి: లాభంలేని పదోన్నతి
dry region శుష్క ప్రాంతం
dry rent వట్టి అద్దె: జప్తు హక్కు లేని అద్దె
dual ద్వంద్వ
dual supervision ద్వంద్వ పర్యవేక్షణ
dubious సందిగ్ధ, అస్పష్టమైన
duct నాళం, కాలవ
due n. బాకీ adj. తగిన, యుక్త
due case తగిన జాగ్రత్త
due constitution సముచిత సంఘటనం
due constitution of a House సభను

చట్టరీత్యా ఏర్పరచడం
**due course** కాలక్రమం
**due course of law** న్యాయ పద్ధతి ప్రకారం/ శాసనానుసారంగా
**due date** గడువు తేది
**due debt** రావలసిన బాకీ
**due diligence** తగిన శ్రద్ధ
**due discharge** తగిన నిర్వహణ
**due importance** తగిన ప్రాముఖ్యం
**duel** ద్వంద్వ యుద్ధం
**due notice** తగిన నోటీసు
**due performance of the decree** యుక్తమైన రీతిలో డిక్రీ అమలు
**due proceess of law** శాసనకార్య పద్ధతి, న్యాయకార్య పద్ధతి, యథోచిత న్యాయ ప్రక్రియ
**due regard** తగిన గౌరవం
**due to other reasons** ఇతర కారణాల వల్ల
**dull business** మందకొడి వ్యాపారం
**dull market** మందకొడి మార్కెట్
**dullness** మందకొడితనం, బుద్ధిమాంద్యం
**duly** యథాక్రమంగా, సరైన విధంగా, సక్రమంగా, సమగ్రంగా
**duly appointed pleader** సక్రమంగా నియుక్తుడైన వకీలు/ ప్లీడరు
**duly arrested** యథాక్రమంలో నిర్బంధింపబడిన
**duly attested** యథాక్రమంగా ధ్రువీకరించబడిన
**duly authorized** యథాక్రమంగా అధికారమీయబడిన
**duly authorized agent** యథాక్రమంగా అధికృతుడైన ఏజెంటు
**duly complied** విధిగా పాటించడమైంది
**duly constituted** తగిన రీతిగా ఏర్పరచిన
**duly convicted** యథాక్రమంలో శిక్షింపబడిన
**duly elected** యథాక్రమంగా ఎన్నికైన
**duly executed 1.** యథాక్రమంగా అమలు జరిగిన **2.** యథాక్రమంగా మరణ శిక్ష అమలు జరిగిన
**duly passed** సరిగా / యథాక్రమంగా అనుమతించిన
**duly promulgated** సక్రమంగా ప్రఖ్యాపనం చేసిన
**duly qualified** తగిన అర్హతలున్న
**duly served** చట్టరీత్యా అమలు చేయబడిన (సమనుల సం॥)
**duly solemnized** లాంఛనంగా జరిగిన
**duly stamped** తగిన స్టాంపులు అంటించిన
**duly sworn** యథాక్రమంగా ప్రమాణం చేసిన
**duly verified** యుక్తంగా సరిచూసిన
**dumb bidding** మూగవేలం పాట: పాట పాడకుండా ధర నిర్ణయం
**dummy** డమ్మీ, ప్రతిరూప, నామమాత్ర
**dummy candidate** నామమాత్ర అభ్యర్థి, డమ్మీ అభ్యర్థి
**dumping** కుక్కటం, ముంచెత్తటం, నింపటం
**dumping ground** నిలవచేసే చోటు
**dumping of goods** సరుకులతో ముంచెత్తడం
**dungeon** చీకటికొట్టు, నేలకొట్టు
**dupe n.1.** వంచకుడు **v.** వంచించు **2.** నకిలీ పాత్ర (సినిమా సం॥)
**duplicate** రెండో ప్రతి, జతప్రతి, ప్రతి, నకలు
**duplicate bill** బిల్లు రెండో ప్రతి
**duplicate copy** రెండో ప్రతి
**duplicate of a bill** బిల్లు జతప్రతి
**duplicate policy** నకలు పాలసీ (భీమా సం॥)
**duplicating machine** డూప్లికేటింగ్ యంత్రం, ప్రతుల యంత్రం, నకళ్లు తీసే యంత్రం
**duplicating paper** ప్రతుల కాగితం
**duplication 1.** ప్రతిరూపం **2.** నకలు పని
**duplication of charge** రెండుసార్లు తాకట్టు పెట్టడం

**duplication of effort** ఒకే పని రెండు సార్లు చెయ్యటం
**duplication of work** నకలుపని, చేసిందే చేయటం
**duplicator 1.** నకలు ప్రతుల యంత్రం **2.** నకలు రాయసకాడు
**durability** మన్నిక
**durable** మన్నికగల
**duration** గడువు, కాలావధి
**duration of sanction** మంజూరు కాలం/గడువు
**duration of the Assembly** విధానసభ కాలపరిమితి
**duress** నిర్బంధం, బలవంతం
**during coverture** భర్త అధీనంలో ఉన్న కాలంలో
**during good behaviour** సత్ప్రవర్తన కాలంలో
**during his tenure of office** ఆయన పదవీ కాలంలో/ హయాంలో
**during recess** విరామ కాలంలో
**during the continuance of trust** ట్రస్టు కొనసాగుతున్నంత కాలం
**during the course of discussion** చర్చ జరిగేటప్పుడు
**during the course of sitting** సమావేశ సమయంలో
**during the discussion** చర్చలు జరుగుతుండగా
**during the fact** ఘటన సమయంలో
**during the period** ఆ కాలావధిలో
**during the pleasure of the President** రాష్ట్రపతి ఇష్టకాలపర్యంతం
**during the sitting** సమావేశ కాలంలో
**during the suit** దావా కాలంలో / దావా పూర్తి అయ్యేంత వరకు
**during the term of office** పదవీ కాలంలో
**dusk-to-dawn curfew** రాత్రి అంతా కర్ఫ్యూ: సంధ్యవేళ నుంచి ఉషస్సు వరకు కర్ఫ్యూ
**Dutch auction** డచ్ వేలం: హెచ్చు ధరకు వేలం ప్రారంభించి క్రమంగా ధర దింపడం
**dutiable goods** సుంకం విధించదగిన సరుకులు
**duties and liabilities** విధులూ బాధ్యతలూ
**duties of office** పదవీ కర్తవ్యాలు
**duties of transport including export duties** ఎగుమతి సుంకాలతో కూడిన రవాణా సుంకాలు
**dutiful** విధి/కర్తవ్య పరాయణ
**duty 1.** విధి, కర్తవ్యం **2.** శుల్కం, సుంకం
**duty allowance** పనిబత్తా/భత్యం
**duty chart** డ్యూటీ చార్ట్, విధుల పట్టిక
**duty exemption** పన్ను మినహాయింపు
**duty free** సుంకం పడని / లేని
**duty of the committee** సమితి కర్తవ్యం, కమిటీ విధి
**duty room** డ్యూటీ గది
**dying declaration** మరణ వాఙ్మూలం
**dying intestate** వీలునామా లేకుండా మరణించటం
**dying without issue** నిస్సంతుగా మరణించటం
**dynamic** క్రియాశీల, గతిశీల
**dynamics** గతిశాస్త్రం
**dynamite** డైనమైట్, పేలుడు పదార్థం
**dynasty** రాజవంశం
**dysnomy/disnomy** లోపభూయిష్ఠ శాసనం

## E

**each** ప్రతి ఒక, ఒక్కొక్క
**each House of Parliament** పార్లమెంటు ప్రతిసభా
**each item of depreciable asset** తరిగే ఆస్తిలో ప్రతి ఒక్క అంశం
**each other** పరస్పర, ఒకరినొకరు
**each year of completed service** పూర్తయిన సర్వీసులో ప్రతి ఒక్క సంవత్సరం
**earlier assessment year** పూర్వపు పన్ను మదింపు సంవత్సరం
**earlier date** పూర్వ తేది

**earlier law** పూర్వ శాసనం
**earlier orders** పూర్వ ఉత్తర్వులు
**earlier transferee** పూర్వం బదిలీ అయిన/ పొందిన వ్యక్తి (ఉద్యోగం, ఆస్తి సం॥)
**earliest** 1. వీలైనంత త్వరలో 2. ముందటి, ప్రాచీన
**earliest opportunity** మొట్టమొదటి అవకాశం
**earliest possible** సాధ్యమైనంత త్వరగా, వీలైనంత వెంటనే
**early** 1. శీఘ్ర 2. ప్రాచీన, ముందటి
**early crop** తక్కువకాలం పంట
**early orders are solicited** త్వరలో ఉత్తర్వులు పంప ప్రార్థన
**early reply is solicited** త్వరితంగా సమాధానం రాయ ప్రార్థన
**earmarked** కేటాయించిన, ప్రత్యేకించిన
**earmarked funds** ప్రత్యేకించిన నిధులు
**earmarked revenue** ప్రత్యేకించిన రాబడి/ రెవెన్యూ
**earmarked taxes** ప్రత్యేకించిన పన్నులు
**earmarking** ప్రత్యేకింపు
**earn** ఆర్జించు, సంపాదించు
**earned income** ఆర్జితాదాయం
**earned increment** ఆర్థిక వేతన వృద్ధి
**earned leave** ఆర్జిత సెలవు
**earned surplus** ఆర్జిత మిగులు
**earnest** 1. బయానా 2. మనఃపూర్వక
**earnest effort** మనఃపూర్వక యత్నం
**earnest money** 1. బయానా సొమ్ము 2. ధరావతు సొమ్ము
**earnest money deposit** ధరావతు సొమ్ము డిపాజిట్, సంచకారం, బయానా పైకం
**earning** సంపాదన, ఆర్జన
**earning assets** ఆర్జనగల ఆస్తులు
**earning capacity** సంపాదన శక్తి
**earning dependents** సంపాదనగల ఆశ్రితులు (ఆధారితులు)
**earthen dam** మట్టి ఆనకట్ట
**earthing** భూసంపర్కణం, నేలకు కలపటం (విద్యుచ్ఛక్తి సం॥)
**earth moving machinery** మట్టి తవ్వే యంత్రాలు
**earthquake** భూకంపం
**earthquake shocks** భూకంప ఆఘాతాలు
**earth road** మట్టిరోడ్డు
**earth work** మట్టిపని
**easement** అనుభోగ హక్కు, ఈజ్‌మెంట్
**easement annexed thereto** తత్సంబంధ అనుభోగ హక్కు
**easement law** ఈజ్‌మెంట్ / అనుభోగ హక్కుల న్యాయశాస్త్రం
**easement of access** ప్రవేశ అనుభోగ హక్కు
**easement of necessity** 1. ఆవశ్యక హక్కు 2. తప్పనిసరి అనుభోగ హక్కు
**easement right** అనుభోగ హక్కు
**easily accessible** సులభంగా అందుబాటులో ఉండే
**easily available** సులువుగా దొరికే/ లభించే
**easy market** గిరాకీలేని మార్కెటు
**easy money** సులభద్రవ్యం
**easy reference** సులభ సంప్రదింపు
**easy terms** సులభ నిబంధనలు
**ebb** 1. సముద్రపు పోటు, క్షయం 2. తగ్గు
**ebullient** ఉద్రిక్త, పొంగే
**eccentricity** 1. వైపరీత్యం, తలతిక్కతనం 2. కేంద్రచ్యుతి: కేంద్రం నుంచి తప్పటం
**echelon** 1. అధికారస్థాయి, నాయకత్వస్థాయి, 2. శ్రేణీవ్యూహం (సైనిక సం॥)
**ecologist** పర్యావరణ శాస్త్రజ్ఞుడు
**economic** 1. ఆర్థిక 2. పొదుపు, మితవ్యయ, గిట్టుబాటు
**economic activity** ఆర్థిక కార్యకలాపం
**economic adjustment** ఆర్థిక సర్దుబాటు
**economic advantages** ఆర్థిక ప్రయోజనాలు
**economic affairs** ఆర్థిక వ్యవహారాలు

economic analysis ఆర్థిక విశ్లేషణ
economic and social council ఆర్థిక, సాంఘిక మండలి
economic and social planning ఆర్థిక, సాంఘిక ప్రణాళిక రచన
economic behaviour ఆర్థిక ప్రవర్తన
economic blockade ఆర్థిక దిగ్బంధం
economic boom ఆర్థిక విజృంభణ, హఠాత్ ఆర్థిక సమృద్ధి
economic boycott ఆర్థిక బహిష్కారం
economic breakdown ఆర్థిక విచ్ఛిత్తి
economic condition ఆర్థిక స్థితి
economic capacity ఆర్థిక సామర్థ్యం/క్షమత
economic classification of budget బడ్జెట్ ఆర్థిక వర్గీకరణం
economic collaboration ఆర్థిక సహయోగం
economic conflict ఆర్థిక సంఘర్షణ
economic countinuity ఆర్థిక అవిచ్ఛిన్నత
economic co-operation ఆర్థిక సహకారం
economic co-ordination unit ఆర్థిక సమన్వయ విభాగం
economic cost గిట్టుబాటు ధర
economic crisis ఆర్థిక సంక్షోభం
economic data ఆర్థిక దత్తాంశాలు
economic decision ఆర్థిక నిర్ణయం
economic depression ఆర్థిక మాంద్యం
economic disabilities ఆర్థిక అశక్తతలు
economic discrimination ఆర్థిక విచక్షణ
economic distress ఆర్థిక సంకటం
economic domination ఆర్థిక ప్రాబల్యం
economic dualism ఆర్థిక ద్వైవిధ్యం
economic efficiency ఆర్థిక దక్షత
economic effort ఆర్థిక యత్నం
economic embargo ఆర్థిక ఆంక్ష
economic enquiry ఆర్థిక విచారణ
economic entity ఆర్థిక అస్తిత్వం
economic environment ఆర్థిక పరిసరం
economic equality ఆర్థిక సమానత్వం
economic equilibrium ఆర్థిక సమతుల్యత
economic exploitation ఆర్థిక దోపిడి
economic factors ఆర్థిక కారకాలు
economic forecasting ఆర్థిక భవిష్య సూచన
economic freedom ఆర్థిక స్వాతంత్ర్యం
economic functions ఆర్థిక కార్యవిధులు
economic goods ఆర్థిక వస్తువులు
economic groups ఆర్థిక గణాలు
economic growth ఆర్థిక వృద్ధి
economic growth rate ఆర్థిక పెరుగుదల రేటు
economic harmony ఆర్థిక సామరస్యం
economic holding ఆర్థిక కమతం/గిట్టుబాటు కమతం
economic importance ఆర్థిక ప్రాముఖ్యం
economic incentives ఆర్థిక ప్రోత్సాహకాలు
economic insecurity ఆర్థికంగా అభద్రత
economic intelligence ఆర్థిక రహస్య సమాచారం
economic interest ఆర్థిక ఆసక్తి/ప్రయోజనం
economic level ఆర్థిక స్థాయి
economic liberty ఆర్థిక స్వేచ్ఛ
economic limits ఆర్థిక పరిమితులు
economic mismanagement ఆర్థిక అపనిర్వహణ
economic motive ఆర్థికోద్దేశం
economic necessity ఆర్థికావశ్యకత
economic organization ఆర్థిక వ్యవస్థ/వ్యవస్థాపన
economic overheads ఆర్థిక వ్యవస్థా వ్యయాలు
economic planning ఆర్థిక ప్రణాళిక రచన
economic policy ఆర్థిక విధానం
economic power ఆర్థిక శక్తి

**economic priorities** ఆర్థిక ప్రాధాన్యతలు
**economic progress made so far** ఆర్థికంగా ఇంతవరకు సాధించిన ప్రగతి
**economic provisions** ఆర్థిక ఏర్పాట్లు
**economic reconstruction** ఆర్థిక పునర్నిర్మాణం
**economic rehabilitation** ఆర్థిక పునరావాసం
**economic rent** గిట్టుబాటు కౌలు
**economic resources** ఆర్థిక వనరులు
**economic review** ఆర్థిక సమీక్ష
**economic revolution** ఆర్థిక విప్లవం
**economic security** ఆర్థిక భద్రత
**economic self-sufficiency** ఆర్థిక స్వయం సమృద్ధి
**economic stability** ఆర్థిక స్థిరత్వం
**economic stagnation** ఆర్థిక స్తబ్దత
**economic structure** ఆర్థిక స్వరూపం
**economic system** ఆర్థిక వ్యవస్థ
**economic trends** ఆర్థిక ధోరణులు
**economic uplift** ఆర్థిక ఉద్ధరణ
**economic value** ఆర్థిక విలువ
**economic wing** ఆర్థిక విభాగం
**economies** ఆదాలు
**economies of concentration** కేంద్రీకృత ఆదాలు, కూడలి వల్ల వచ్చే ఆదాలు
**economies of information** సమాచారపు ఆదాలు
**economies of specialisation** ప్రత్యేకీకరణపు ఆదాలు
**economy 1.** పొదుపు, మితవ్యయం **2.** ఆర్థిక వ్యవస్థ
**economy cut** పొదుపు కోసం కోత/మితవ్యయం కోసం కోత
**economy drive** ఖర్చు తగ్గింపు యత్నం
**economy measure** పొదుపు చర్య, మితవ్యయ చర్య
**economy of time** సమయం పొదుపు
**economy report** పొదుపు నివేదిక
**economy slip** పొదుపు చీటీ
**edible** తినదగిన, ఖాద్య
**edict** రాజశాసనం, ప్రభుత్వాజ్ఞాపత్రం
**edict of emancipation** విమోచన శాసనం
**edit** కూర్చు, ఎడిట్‌చేయు
**edited document** ఎడిట్ చేసిన దస్తావేజు
**edition** ముద్రణ, కూర్పు
**editorial 1. n.** సంపాదకీయం, **2. adj.** సంపాదక (సంబంధ)
**editorial comments** సంపాదకీయ వ్యాఖ్యలు
**editorial staff** సంపాదక సిబ్బంది
**educated unemployment** విద్యావంతుల నిరుద్యోగం
**educational** విద్యా/విద్యా సంబంధ/అధ్యాపన
**educational career** విద్యా వ్యాసంగం
**educational endowment** విద్యా ధర్మాదాయం
**educational exchange programme** విద్యా వినిమయ కార్యక్రమం
**educational guidance** విద్యాపరమైన సూచన (మార్గదర్శనం)
**educational institution** విద్యా సంస్థ
**educationally unqualified** విద్యార్హతలు లేని
**educational qualifications** విద్యార్హతలు
**educational plan** విద్యా ప్రణాళిక
**educational policy** విద్యా విధానం
**educational project** విద్యాపరమైన పరియోజన/ ప్రాజక్ట్
**educational reforms** విద్యాపరమైన సంస్కరణలు
**educational research** విద్యాపరమైన పరిశోధన
**educational standards** విద్యా ప్రమాణాలు
**educational survey** విద్యా సంబంధి సర్వే
**educational tour** విజ్ఞాన పర్యటన
**education grant** విద్యావిషయక గ్రాంటు/అనుదానం

**homogeneous** సజాతీయ
**homology** సమధర్మత, సమశ్రేణికత: నిర్మాణ పరిణామ సాదృశ్యం
**homosapiens** జాతిమానవులు
**honest** నిజాయతీగల, నిష్కపట, శుద్ధ
**honest belief** శుద్ధ నమ్మకం
**honest claim** నిజాయితీ అభ్యర్థన
**honest deal** నిష్కపట వ్యవహారం
**honest efforts, making** నిజాయితీగా ప్రయత్నం చెయ్యడం
**honest mistake of fact** నిజాయితీగా ఉన్నా వాస్తవ విషయంలో జరిగిన పొరపాటు
**honest opinion** నిష్కపట అభిప్రాయం
**honest person** నిజాయితీపరుడు
**honesty** నిజాయితీ
**honesty and faithfully** నిజాయితీగానూ విశ్వసనీయంగానూ
**honorarium** గౌరవ వేతనం
**honorary** గౌరవార్థ, గౌరవ, సన్మానార్థ
**honorary air aide-de-camp** గౌరవ విమాన అంగరక్షాధికారి
**honorary capacity** గౌరవ హోదా
**honorary citizenship** గౌరవ పౌరసత్వం
**honorary degree** గౌరవ పట్టా
**honorary member** గౌరవ సభ్యుడు
**honorary post** గౌరవపదవి
**honorary rank** గౌరవహోదా
**honoris causa** గౌరవార్థంగా, గౌరవ చిహ్నంగా
**honour a bill** బిల్లు/ హుండీ ఆదరించు
**honourable** గౌరవనీయ, మాన్యశ్రీ
**honourable member** గౌరవనీయ సభ్యుడు
**honourable relation** గౌరవ సంబంధం
**honourably acquitted** గౌరవంగా నేర విముక్తుడైన
**honourably bound** గౌరవబద్ధం
**honoured** గౌరవించిన, సన్మానించిన, ఆదరించిన
**honoured bill** ఆదరించిన బిల్లు / హుండీ
**honour, for** గౌరవార్థం
**honour, payment for** గౌరవార్థం చెల్లింపు
**hooligans** అల్లరిమూక
**hooliganism** దౌర్జన్యకాండ
**hopeful** ఆశాజనక, ఆశాపూర్వక
**hopeless** నిరాశాజనక
**hopelessly inefficient** పూర్తిగా అసమర్థమైన, బొత్తిగా సమర్థతలేని
**horizon** క్షితిజ సమాంతరం/ దిక్చక్రం
**horizontal digging** క్షితిజ సమాంతర త్రవ్వకం
**horizontal growth** క్షితిజ సమాంతరవృద్ధి
**horoscope** జాతకచక్రం
**horse artillery** అశ్విక ఫిరంగిదళం
**horse power** హార్స్ పవర్, అశ్వశక్తి
**horticultural development** ఉద్యానకృషి అభివృద్ధి, ఉద్యానాభివృద్ధి
**horticulture** ఉద్యానకృషి (శాస్త్రం)
**horticulture operation** తోటలు పెంచే పని, ఉద్యానకృషి నిర్వహణ
**horticulture produce** ఉద్యాన ఫలసాయం
**hospitality** ఆతిథ్యం
**hospitality committee** ఆతిథ్య సంఘం
**host 1.** గృహస్థు, ఆతిథ్యదాత **2.** సమూహం
**hostage** షరతు బంధితుడు: డబ్బు మొదలైన వాటికోసం బంధింపబడిన వ్యక్తి
**hostel** హాస్టలు: భోజన నివాస వసతిగృహం
**hostel committee** వసతిగృహ నిర్వాహక సంఘం
**hostel facility** హాస్టల్ సౌకర్యం
**hostel warden** హాస్టలు వార్డెను
**hostile** ప్రతికూల, శత్రు, విరోధ
**hostile act** ప్రతికూల చర్య/ శత్రుచర్య
**hostile activities** ప్రతికూల చర్యలు/ శత్రుచర్యలు
**hostile attack** శత్రుదాడి
**hostile nations** ప్రతికూల రాజ్యాలు/ శత్రురాజ్యాలు
**hostile possession** ప్రతికూల కబ్జా/ స్వాధీనం

**hostile witness** ప్రతికూల సాక్షి
**hotchpot 1.** పొత్తుల ఆస్తి, **2.** కలగూరగంప, మిశ్రం
**hot discussion** తీవ్ర చర్చ
**hot house** కాచగృహం, మొక్కలుపెంచే (కృత్రిమ) గృహం
**hours of attendance** హాజరు వేళలు
**hours of business** పనివేళలు, కార్యక్రమ సమయాలు
**hours of polling** పోలింగ్ జరిగే గంటలు/ సమయం
**hours of work** పనిగంటలు/ వేళలు
**house 1.** గృహం, నిలయం, సదనం, భవనం, ఆలయం **2.** సభ
**house accommodation** గృహవసతి
**house arrest** గృహనిర్బంధం
**house breaker** కన్నపుదొంగ
**house breaking** కన్నం వేయటం
**house building advance** గృహ నిర్మాణ అడ్వాన్సు
**house building loan** గృహనిర్మాణ ఋణం
**house building society** గృహనిర్మాణ సంఘం
**House Committee** సభావ్యవహారాల సంఘం ( శాసన సభ సం॥)
**house hold effects** గృహసామగ్రి, ఇంటి వస్తువులు
**household enterprises** గృహపరిశ్రమలు
**household expenditure** కుటుంబ ఖర్చు
**householder** గృహస్థు
**household furniture** ఇంటి ఫర్నిచర్
**household industry** గృహ పరిశ్రమ
**household servant** ఇంటి నౌకరు
**household work** గృహకార్యం
**housekeeper** గృహ/ నిలయవ్యవహర్త
**house management** గృహనిర్వహణ
**House of Commons** కామన్సు సభ: బ్రిటిష్ పార్లమెంట్ సభ
**house of correction 1.** సంస్కరణ నిలయం **2.** చెరసాల
**house of legislature** శాసన/ విధాన మండలి
**house of refuge** శరణాలయం (బాల నేరస్తులు వగైరా సం॥)
**House of Representatives** ప్రజా ప్రతినిధుల సభ
**House of the People** లోక్‌సభ
**house patient** (ఆస్పత్రిలో) చేరిన రోగి
**house plots** గృహ నిర్మాణ ప్లాటులు, నివేశన స్థలాలు
**house property** గృహ ఆస్తి
**house rent** ఇంటిఅద్దె/ కిరాయి
**house rent allowance** ఇంటిఅద్దె భత్యం
**house search** ఇంటి సోదా
**house site** ఇంటిస్థలం
**house tax** ఇంటిపన్ను
**house to be attached in default of payment** చెల్లించకపోతే ఇల్లు జప్తు అవుతుంది
**house to let** కిరాయికి ఇల్లు, అద్దెకు ఇల్లు
**house trespass** గృహ అక్రమ ప్రవేశం
**house wife** ఇల్లాలు, గృహిణి
**housing** గృహనిర్మాణం/ వసతికల్పన
**housing accommodation** గృహవసతి
**housing board** గృహనిర్మాణసంఘం, హౌసింగ్ బోర్డు
**housing loans** గృహనిర్మాణ ఋణాలు
**housing schemes** గృహనిర్మాణ పథకాలు
**housing subsidy** గృహనిర్మాణ ఆర్థిక సహాయం/ సబ్సిడి
**how the matter stands** విషయం ఏ స్థితిలో ఉన్నదీ
**huckster** వీధివ్యాపారి, కాలినడక వర్తకుడు
**hue and cry** కేకలూ అరుపులూ, కోలాహలం
**human body is not susceptible of appraisement** మానవ శరీరం విలవ కట్టడానికి వీలులేనిది
**human care** మానవ సంరక్షణ
**human conditions** మానవోచిత పరిస్థితులు
**human conduct** మానవ ప్రవర్తన

**human consumption** మానవేచిత వినియోగం
**humane** దయామయ, మానవోచిత
**humanitarian ground** మానవహిత కారణం
**humanities** మానవీయ శాస్త్రాలు
**humanity** మానవత, మానవ ప్రపంచం
**human labour** మానవ శ్రమ
**human law** మానవ ధర్మం
**human relations** మానవ సంబంధాలు
**human resources** మానవ వనరులు
**human sacrifice** నరబలి
**human society** మానవ సమాజం
**human welfare** మానవ సంక్షేమం
**humble** సవినయ
**humidity** ఆర్ద్రత, తేమ
**humiliate** చిన్నబుచ్చు
**humility** నమ్రత, అణకువ
**hundi** హుండీ, నిధి, బిల్లు
**hundi payable at sight** చూపగానే చెల్లించవలసిన బిల్లు
**hungerstrike** నిరాహారసమ్మె, నిరాహారదీక్ష
**hungry** ఆకలిగొన్న
**hunting** వేట, వేటాడడం
**hunting ground** వేటభూమి, మృగయా స్థలం
**huntsman** వేటగాడు, షికారి
**hurricane** గాలివాన
**hurt** n. 1. అపకారం, హాని, దెబ్బ v. 2. నొప్పించు
**husbandman** కర్షకుడు, వ్యవసాయదారు, రైతు
**husbandry** వ్యవసాయం, కృషి, సేద్యం
**hush-hush enquiry** రహస్య విచారణ, దొంగ/ నామమాత్ర విచారణ
**hush money** లంచం డబ్బు
**hybrid** n. 1. సంకరం adj. 2. సంకర
**hybridization** సంకరణం
**hybridization of seeds** బీజసంకరణం
**hybrid seeds** సంకరజాతి విత్తనాలు
**hybrid varieties** సంకర వంగడాలు
**hydrated** జలమిశ్ర, జలంతో కూడిన
**hydraulic brake** హైడ్రాలిక్ బ్రేకు
**hydraulic press** ద్రవ/ జలశక్తి చాలిత యంత్రం
**hydraulics** జలశక్తి శాస్త్రం
**hydraulics section** జలశక్తి విభాగం
**hydro-electric-cum-irrigation projects** జలవిద్యుత్ సహిత నీటి పారుదల ప్రాజెక్టులు
**hydro-electric generator** జలవిద్యుత్ ఉత్పాదకయంత్రం, జలవిద్యుత్ జనరేటర్
**hydro-electric power** జల విద్యుచ్ఛక్తి
**hydro-electric scheme** జలవిద్యుత్ పథకం
**hydro-electric works** జలవిద్యుత్ ఉత్పాదక నిర్మాణాలు
**hydrogenated oil** హైడ్రోజనేటెడ్/ఉదజనీకృత తైలం
**hydro geo-chemistry** భూగర్భజల రసాయనశాస్త్రం
**hydro geological survey** భూగర్భజల సర్వే
**hydro geologist** భూగర్భజల శాస్త్రవేత్త
**hydrogeology** భూగర్భజల శాస్త్రం
**hydrologist** జలశాస్త్రవేత్త
**hydro meteorological observation** జల-వాతావరణ పరిశీలన
**hydrometeorologist** జలవాతావరణ శాస్త్రవేత్త
**hydropathy** జలచికిత్స
**hydrophobia** జలభయం, పిచ్చికుక్క కాటు రోగం
**hygiene** ఆరోగ్యరక్షణ, ఆరోగ్యశాస్త్రం, పారిశుద్ధ్యం
**hygienic** ఆరోగ్యకర
**hygienic condition** ఆరోగ్యకరమైన స్థితి
**hygienic report** ఆరోగ్యపర నివేదిక
**hyjacking** దారిమళ్ళింపు (వాహన సం॥), హైజాకింగ్
**hyperbole** అతిశయోక్తి

**hypergamy** అనులోమ వివాహం: కింది కులంలోని స్త్రీకి పై కులం పురుషునితో జరిగిన వివాహం
**hypermetropia** దూరదృష్టి
**hyper sensitiveness** అతి సున్నితత్వం, అతిసంవేదన శీలత
**hypnotism** కనుకట్టు, సమ్మోహనవిద్య
**hypocrisy** కపట నటన
**hypogamy** ప్రతిలోమ వివాహం: పై కులంలోని స్త్రీకి కింది కులంలోని పురుషునితో జరిగిన వివాహం
**hypothec** తాకట్టు, తనఖా, కుదువ
**hypothecary action** తనఖా/ తాకట్టు దావా: తాకట్టు వస్తువును స్వాధీనం చేసుకోటానికి గాని అమ్మటానికి గాని వేసే దావా
**hypothecation** తనఖా / తాకట్టు
**hypothecation bond** తాకట్టు దస్తావేజు/ బంధపత్రం
**hypothecation deed** తాకట్టుపత్రం
**hypothecation letter** తనఖా/ తాకట్టులేఖ
**hypothecation of different assets** వివిధ ఆస్తుల తాకట్టు
**hypothesis** పరికల్పన
**hypothetical data** పరికల్పిత భోగట్టా/ దత్తాంశం
**hypothetical proposition** 1. ఊహాజనిత సమస్య 2. ఊహాజనిత ప్రతిపాదన
**hypothetical question** పరికల్పిత ప్రశ్న
**hypothetic economic law** పరికల్పిత ఆర్థికసూత్రం
**hysteria** మూర్ఛ, హిస్టీరియా
**hysterics** మూర్ఛ రోగులు

# I

**I.A.F. squadron** భారతీయ వైమానిక దళం, ఐ.ఎ.ఎఫ్. స్క్వాడ్రన్
**I agree with 'A' above** పై 'ఎ' తో నేను ఏకీభవిస్తాను
**I am to add** నేను ఇంకా తెలపవలసింది ఏమిటంటే
**I am to enquire** --ను వాకబు చెయ్యాలని కోరుతున్నాను
**I authorise you** మీకు అధికారం ఇస్తున్నాను
**I beg leave to introduce Bill No.----** ఈ నెంబరు బిల్లు ప్రవేశపెట్టటానికి నేను అనుమతి కోరుతున్నాను
**I beg to report** నేను నివేదించగోరుతున్నాను
**I beg to submit** మనవి చేస్తున్నాను, నివేదిస్తున్నాను
**ibidem / ibid** అందులోనే, అదేచోట, అక్కడే
**iconoclast** 1. విగ్రహాలు పగలగొట్టేవాడు, 2. పూర్వ విశ్వాస విరోధి
**iconography** విగ్రహ శిల్పశాస్త్రం, ప్రతిమా లక్షణం
**ideal** 1. భావం, (ఊహాచిత్రం) 2. ఊహ 3. అభిప్రాయం 4. భావన 5. ఆలోచన
**ideal** 1. ఆదర్శం/లక్ష్యం 2. నమూనా
**ideal average** ఆదర్శమైన సగటు
**idealistic** ఆదర్శవంత
**ideal justice** ఆదర్శ న్యాయనిర్ణయం
**ideal partnership** ఆదర్శ భాగస్వామ్యం
**ideal rate of exchange** ఆదర్శ మారకపు రేటు
**ideal tax** ఆదర్శమైన పన్ను
**ideal type** ఆదర్శమైన రకం/ తరహా
**ideal type method** ఆదర్శరూప పద్ధతి
**idem** అదే
**identical** ఒకేమాదిరి, తుల్యమైన, సమమైన, ఒకే రకమైన
**identical case** ఒకేమాదిరి కేసు / వ్యవహారం/ సందర్భం
**identical case in every particular** ప్రతి విషయంలోనూ సరిపోలిన కేసు/ సందర్భం
**identically equal** అన్నివిధాలా, సమమైన, సర్వసమమైన
**identical representation** సర్వసమ ప్రాతినిధ్యం
**identical scales of pay** సర్వసమ/ఒకే

మాదిరి వేతన శ్రేణులు

**identical time scale** సమాన కాలశ్రేణి, సమాన టైమ్‌స్కేలు, ఒకే మాదిరి కాలశ్రేణి

**identical with** తో పోలిన

**identification** ఆనవాలు, గుర్తు, రుజువు

**identification card** గుర్తుకార్డు, ఆనవాలు పత్రం / కార్డు

**identification marks** ఆనవాలు గుర్తులు

**identification number** గుర్తు సంఖ్య

**identification of persons and things** వ్యక్తుల, వస్తువుల గుర్తింపు

**identification of stolen articles** దొంగ వస్తువుల గుర్తింపు

**identification of the goods** సరుకుల గుర్తింపు

**identification parade** గుర్తు పరేడ్, గుర్తింపు (కోసం) ప్రదర్శన (నేర సం॥)

**identification report** గుర్తు నివేదిక

**identification slip** గుర్తు చీటి

**identify** గుర్తించు

**identifying witness** గుర్తించే సాక్షి

**identify oneself with** ఏకమని గుర్తించు

**identity 1.** ఆనవాలు, గుర్తు, రుజువు **2.** పోలిక, సామ్యం **3.** తాదాత్మ్యం

**identity card** గుర్తుకార్డు

**identity certificate** గుర్తు ధ్రువపత్రం

**identity form** గుర్తింపు పత్రం, గుర్తు నమూనా పత్రం

**identity of handwriting** చేతిరాత గుర్తింపు

**identity of informant** సమాచారదాత గుర్తింపు

**identity of the author** రచయితను గుర్తించటం

**identity of the partner** భాగస్వామిని గుర్తించటం

**identity slip 1.** గుర్తుచీటి **2.** రుజువు చీటి

**ideogram/ ideograph** భావ సంకేతం

**ideology** సిద్ధాంతం

**idiosyncrasy** విలక్షణత, నైజం, ప్రత్యేకత

**I disagree** నేను ఒప్పుకోడంలేదు / విభేదిస్తున్నాను

**idle and disorderly persons** సోమరితనమూ క్రమరహిత వర్తనాగల వ్యక్తులు

**idle capacity** ఉపయోగించని శక్తి

**idle money** ఉపయోగించని ధనం / నిష్క్రియాధనం

**idle time cost** వృథాకాలపు వ్యయం

**idol worship** విగ్రహారాధన

**if agreed to, he will be advised accordingly** (మీరు) ఒప్పుకొన్నట్లయితే ఆయనకు దాని ప్రకారంగా సూచించడం జరుగుతుంది

**if agreed to, papers will be filed** మీరు ఒప్పుకొన్నట్లయితే, పత్రాలు దాఖలు చేయడం జరుగుతుంది

**if any** ఏదైనా

**if a person applies** ఎవరైనా దరఖాస్తు పెట్టుకొంటే

**if approved, the employee will be advised accordingly** ఆమోదించినట్లయితే దాని ప్రకారం ఆ ఉద్యోగికి సూచించడం జరుగుతుంది

**if he should die** అతడు చనిపోతే

**if it be conceded** దాన్ని అంగీకరించినట్లైతే

**if it is otherwise in order** ఇతరవిధంగా అది సక్రమంగా ఉన్నట్లయితే

**if necessary** అవసరమయితే

**if no application has been made to set aside the award** అవార్డు (మధ్యవర్తి తీర్పు) రద్దుకై దరఖాస్తు పెట్టుకోనట్లయితే

**if possible** వీలయితే, సాధ్యమయితే

**if quorum is not available** కోరం సమకూరకపోయినట్లయితే

**if required** అవసరమయితే

**if satisfied after due enquiry** తగు విచారణ జరిగిన మీదట తృప్తి చెందినట్లయితే / విశ్వసించినట్లయితే

**if the state of work permits** పని దశను

ఐట్టి వీలున్నట్లయితే

**I fully agree with the office note** కార్యాలయ నోటుతో నేను పూర్తిగా ఏకీభవిస్తాను.

**I fully endorse the remark** ఆ రిమార్కును నేను పూర్తిగా సమర్థిస్తున్నాను.

**if you will kindly look into this** మీరు దయచేసి దీన్ని పరిశీలించినట్లయితే

**ignition** నిప్పు ముట్టించటం / రగల్చటం

**ignominy** అపకీర్తి, అప్రతిష్ఠ, అగౌరవం

**ignorance** అజ్ఞానం, తెలియకపోవటం

**ignorance of law** చట్టం తెలియకపోవటం

**ignorantia legis neminem excusat (ignorantia legis haud excusat; ignorantia legis non excusat)** చట్టనియమాల పరిజ్ఞానం లేదని చెప్పటం క్షమార్హం కాదు, శాసనం గురించి తెలియకపోవటం క్షంతవ్యం కాదు

**ignore** ఉపేక్షించు, అశ్రద్ధచేయు

**I have been directed to inform you** మీకు తెలపమని నన్ను ఆదేశించడం జరిగింది

**I have been directed to request you** మిమ్మల్ని కోరమని నన్ను ఆదేశించటం జరిగింది.

**I have known Shri ------- for the last ------- years** శ్రీ ---------- గారు గత ------- సంవత్సరాలుగా నాకు తెలుసు

**I have no instructions** నాకెలాంటి సూచనలూ / ఆదేశాలూ లేవు

**I have no knowledge** నాకు తెలియదు

**I have not yet received any reply from your end** మీ దగ్గరినుంచి నాకు ఇంతవరకు సమాధానమేమీ రాలేదు

**I have satisfied myself** నా మేరకు నేను తృప్తిపడ్డాను

**I have satisfied myself that the employee is not at fault** ఈ ఉద్యోగి తప్పు ఏమీలేదనే విషయంలో నాకు తృప్తి కలిగింది

**I have the honour to say** నేను గౌరవపురస్సరంగా మనవి చేసేది ----, --- సాదరంగా మనవి చేస్తున్నాను

**I have to thank you for assistance in this matter** ఈ విషయంలో మీరు చేసిన సహాయానికి మీకు ధన్యవాదాలు తెలుపు కోవలసి ఉంది

**ill adj. 1.** చెడు, చెడ్డ, తప్పు **2.** లోపంగల, అస్పష్టమైన **3.** అనారోగ్యమైన, అస్వస్థమైన **n 4.** దురదృష్టం, రోగం

**ill-advised** తప్పుడు సలహా పొందిన

**ill behaviour** చెడు ప్రవర్తన / దుష్ప్రవర్తన

**ill considered** అనాలోచిత, తప్పయిన

**illegal** చట్ట/న్యాయవిరుద్ధ(ం)

**illegal action** చట్టవిరుద్ధచర్య

**illegal assembly** చట్టవిరుద్ధ సమావేశం

**illegal association** చట్టవిరుద్ధ సంఘం / సంస్థ

**illegal charge** న్యాయవిరుద్ధమైన ఆరోపణ

**illegal conditions** న్యాయవిరుద్ధమైన షరతులు

**illegal conduct** న్యాయవిరుద్ధ ప్రవర్తన

**illegal consideration** న్యాయవిరుద్ధమైన ప్రతిఫలం

**illegal contact** అక్రమ సంబంధం

**illegal contract** చట్టవిరుద్ధ కరారు

**illegal dealing** చట్టవిరుద్ధ వ్యవహారం

**illegal entry** అక్రమ ప్రవేశం

**illegal evidence** అక్రమ సాక్ష్యం, న్యాయవిరుద్ధ సాక్ష్యం

**illegal gambling** అక్రమ జూదం

**illegal gratification** అక్రమ ప్రతిఫలం

**illegal income** అక్రమ ఆదాయం

**illegal interest** అక్రమ వడ్డీ

**illegality** న్యాయవిరుద్ధత, అక్రమం

**illegality of the strike** సమ్మె న్యాయవిరుద్ధత

**illegalize 1.** న్యాయవిరుద్ధమని ప్రకటించు **2.** అక్రమపరచు

**illegally** న్యాయవిరుద్ధంగా, చట్టవిరుద్ధంగా

**illegal means** అక్రమ సాధనోపాయాలు,

అక్రమ మార్గాలు, వక్రమార్గాలు
**illegal methods** అక్రమ పద్ధతులు
**illegal objections** చట్టవిరుద్ధ ఆక్షేపణలు
**illegal obstruction** చట్టవిరుద్ధమైన అడ్డంకి
**illegal omission** అక్రమమైన తొలగింపు
**illegal payment** అక్రమమైన చెల్లింపు
**illegal possession** అక్రమ స్వాధీనం
**illegal practice** చట్టవిరుద్ధమైన ఆచరణ/ ప్రాక్టీసు / వృత్తిసాధన
**illegal purpose** అక్రమ ఉద్దేశం
**illegal strike** చట్టవిరుద్ధమైన సమ్మె
**illegal trade** అక్రమ వ్యాపారం
**illegal transactions** అక్రమ లావాదేవీలు
**illegible** అస్పష్టమైన, అర్థంకాని
**illegible characters** అర్థంకాని అక్షరాలు, జిలుగురాత అక్షరాలు
**illegible writing** అస్పష్టమైన రాత
**illegitimate** నిషిద్ధ, దొంగచాటు, న్యాయ విరుద్ధ, జారజ
**illegitimacy** అక్రమ సంబంధం
**illegitimate action** న్యాయవిరుద్ధమైన చర్య / వ్యవహారం
**illegitimate children** అక్రమ సంతానం
**ill feeling** శత్రుభావం, వైమనస్యం
**ill-gotten** అక్రమార్జితం
**ill-gotten money** అక్రమార్జితధనం, అక్రమంగా సంపాదించిన డబ్బు
**illicit** శాసన విరుద్ధ, అక్రమ, దొంగచాటు
**illicit arrack** దొంగసారా
**illicit cohabitation** అక్రమ సంపర్కం/ సహచర్యం
**illicit connection** అక్రమ సంబంధం
**illicit contact** అక్రమ సంబంధం
**illicit cultivation** దొంగసేద్యం
**illicit distillery** దొంగసారాబట్టీ
**illicit emigration** అక్రమ వలస
**illicit intercourse** అక్రమ సంభోగం/ సంపర్కం
**illiteracy** నిరక్షరాస్యత
**illiterate voter** చదువురాని వోటరు
**ill judged** తప్పు అంచనా వేయబడిన
**ill-mannered** మర్యాద లేని
**illogical** హేతు విరుద్ధమైన
**illogical reasoning** కుతర్కం
**ill tempered** చెడుప్రకృతిగల
**ill-treat** అమర్యాదచేయు, నిరాదరించు
**ill treatment** అవమానం, అమర్యాద
**illumination** దీపనం, ప్రకాశం, వెలుగు
**illuminated map** దీప్తపటం
**ill-use n. 1.** దురుపయోగం **v. 2.** చెడ్డగా వాడుకొను
**illusion** భ్రమ, భ్రాంతి, మాయ
**illusory** భ్రాంతికర / ఆభాస
**illusory appointment** ఆభాస నియామకం
**illusory promise** ఆభాస వాగ్దానం
**illustrated** సచిత్ర
**illustration 1.** వివరణ, ఉదాహరణ **2.** చిత్రం, బొమ్మ.
**illustrative election** ఉదాహరణాత్మక ఎన్నిక
**illustrative list** వివరణాత్మక పట్టిక
**illustrious** ప్రఖ్యాత, ప్రముఖ, విశిష్ట
**ill-will** దురభిప్రాయం
**image 1.** ప్రభావముద్ర, ఛాయాముద్ర **2.** విగ్రహం **3.** ప్రతిబింబం **4.** ఊహాచిత్రం
**imaginary** ఊహాత్మక
**imaginary damages** ఊహించిన నష్ట పరిహారాలు / నష్టాలు
**imaginary number** ఊహాత్మక సంఖ్య
**imagination** కల్పన, ఊహాశక్తి
**imagine** ఊహించు
**imbalance** అసమతౌల్యం
**imbecile 1.** బలహీన, దుర్బలమైన **2.** బుద్ధిహీనుడు
**imbibe** గ్రహించు, జీర్ణించుకొను (భావం మొ॥ వాటిని)
**imbroglio** చిక్కు / క్లిష్ట పరిస్థితి
**imitation butter** నకిలీ వెన్న, కృత్రిమ

వెన్న

**imitation jewellery** నకిలీ నగలు (గిల్టు నగలు)

**immaterial** అప్రధానమైన, ప్రాముఖ్యం లేని

**immaterial allegation** అప్రధాన ఆరోపణ, సాక్ష్యంలేని ఆరోపణ

**immaterial issue** అప్రధానమైన అంశం

**immaterial matter** క్లెయిమ్‌కు ఉపయోగించని / అక్కరలేని విషయం

**immature 1.** అపరిణత, అపరిపక్వ **2.** యుక్తవయస్సు రాని

**immeasurable** అపరిమిత

**immediate 1.** తక్షణ, అవ్యవహిత **2.** సన్నిహిత, సమీప

**immediate action** తక్షణ చర్య

**immediate annuity** తరవాయి వార్షికం

**immediate approach** అతిసమీప మార్గం

**immediate boss** సమీప పైఅధికారి

**immediate cause** సన్నిహిత కారణం

**immediate compliance** తక్షణ పాటింపు

**immediate danger** తక్షణ ప్రమాదం

**immediate delivery** తక్షణ బట్వాడా

**immediate descent** తరవాయి వంశక్రమం (నేరుగా తరవాతి తరం)

**immediate despatch** తక్షణ డిస్పాచ్: వెంటనే పంపటం కోసం

**immediate disposal** తక్షణ పరిష్కారం

**immediate employer** సమీప యజమాని/ నియామకుడు

**immediate eviction** వెంటనే ఖాళీ చేయించటం

**immediate execution** తక్షణ అమలు

**immediate family** సన్నిహిత కుటుంబం

**immediate gain** తక్షణ లాభం

**immediately after** వెనువెంటనే

**immediately before commencement** ప్రారంభానికి సరిగ్గా ముందు

**immediately before the appointed day** నిర్ణీత దినానికి సరిగ్గా ముందు

**immediately below, court** సరిగ్గా కింది న్యాయస్థానం

**immediately following** వెనువెంట వచ్చే

**immediately on passing** ఆమోదం పొందిన వెంటనే

**immediately preceding** తక్షణ పూర్వ

**immediately preceding year** సరిగ్గా పూర్వపు సంవత్సరం

**immediately subordinate** సరిగ్గా కింది ఉద్యోగి

**immediately succeeding** సరిగ్గా తరవాత వచ్చే

**immediate measure** తక్షణ చర్య

**immediate needs** తక్షణ అవసరాలు

**immediate notice** తక్షణ నోటీసు

**immediate objective** సన్నిహిత లక్ష్యం

**immediate officer** పై అధికారి, సమీప అధికారి

**immediate payment** తక్షణ చెల్లింపు

**immediate possession** తక్షణ స్వాధీనం

**immediate pressure of, in the** ప్రత్యక్ష ఒత్తిడి వల్ల

**immediate prevention** తక్షణ నివారణ

**immediate reference** తక్షణ సంప్రదింపు/ నిర్దేశం

**immediate slip** తక్షణ చీటీ

**immediate superior** సమీప పైఅధికారి

**immediate telegram** తక్షణ తంతి, సత్వర తంతి

**immemorial** అనాది, స్మృతికందని

**immemorial usage** అనాది వాడుక

**immense** అపరిమిత, అపార, అమిత

**immigrant** వలసదారు

**immigrant population** వలసదారుల జనాభా

**immigration** వలస, ప్రవాసం

**immigration rules** వలస నియమాలు

**imminent danger** ఆసన్న ప్రమాదం

**immobile** స్థిరమైన, కదలని

**immodesty** అసౌమ్యం, అవినయం

**immoral act** అవినీతి కార్యం/ చర్య
**immoral behaviour** అవినీతి ప్రవర్తన
**immoral contract** అవినీతికరమైన కరారు/ ఒప్పందం
**immorality** 1. అవినీతి/దుర్నీతి, 2. వ్యభిచారం, నీతిబాహ్య జీవనం / జీవితం
**immoral life** అవినీతి జీవితం
**immoral or unlawful purpose** అవినీతికరమైన లేదా చట్టవిరుద్ధమైన ప్రయోజనం
**immoral to public policy** ప్రభుత్వ విధానానికి / ప్రజావిధానానికి విరుద్ధం
**immoral traffic** వ్యభిచార వ్యవహారం, అవినీతి వ్యవహారం
**immortal** అమర, శాశ్వత
**immovable** స్థిర, కదలని
**immovable assets** స్థిర ఆస్తిపాస్తులు, స్థిరాస్తులు
**immovable property** స్థిరాస్తి
**immune** 1. అభయ(ం) 2. వినాయింపు
**immune belt** 1. అభయప్రదేశం, వినాయింపు ప్రదేశం
**immune from criminal process** నేర ప్రక్రియ నుంచి రక్షితమైన
**immunity** 1. అభయం, రక్షణ 2. వినాయింపు 3. విముక్తి
**immunity from fear** భయ విముక్తి
**immunity from suits and legal process** దావాలు, న్యాయప్రక్రియ నుంచి వినాయింపు
**immunity from tax / taxation** పన్ను వినాయింపు
**immutable** మార్పు చెందని, మారని
**impact** 1. ప్రభావం 2. సంఘట్టనం
**impact of tax** పన్ను విధింపు ప్రభావం
**impair** బలహీనపరుచు, చెడగొట్టు, విలువ తగ్గించు
**impair the investment** పెట్టుబడి విలువ తగ్గించు
**impair the obligations of contract** కాంట్రాక్టు ధర్మబాధ్యతలను చెడగొట్టు
**impale** కొరతవేయు, కొయ్యపై దిగవేయు
**impanel** పట్టికలో చేర్చు
**impart** అబ్బించు, నేర్పు, నేర్పు కలిగించు
**impartial** నిష్పాక్షిక
**impartial enquiry** నిష్పక్షపాత విచారణ
**impartial judgement** నిష్పక్షపాత తీర్పు
**impartial treatment** నిష్పక్షపాత వ్యవహరణ / ఆదరణ
**impartial trial** నిష్పక్షపాతమైన విచారణ
**impartibility and inalienability** విభాగానికి అన్యాక్రాంతానికి వీలులేని స్థితి, అవిభాజ్యమూ అనన్యాక్రాంతమూ
**impartible** అవిభాజ్యమైన
**impartible estate** విభజనకు వీలుకాని ఎస్టేటు
**impartible property** విభజనకు వీలుకాని ఆస్తి
**impart instruction** శిక్షణఇచ్చు, బోధించు
**impassable** దాటలేని, అలంఘ్యమైన
**impatient** అసహన
**impawn** తాకట్టుపెట్టు, కుదువపెట్టు
**impeaching credit of witness** సాక్షి నిజాయితీని గురించి దోషం ఆరోపించటం
**impeachment** మహాభియోగం, అభిశంసన, దోషారోపణం
**impeachment motion** అభిశంసన/మహాభియోగ తీర్మానం
**impeachment of witness** సాక్షిపై దోషారోపణ
**impede any person** ఏ వ్యక్తినయినా ఆటంకపరచు
**impediment** ఆటంకం, ప్రతిబంధకం, సంకటం, అవరోధం
**impediments in law** శాసనిక అశక్తతలు (మైనరు అవటం, జైలులో ఉండటం, విదేశాల్లో ఉండటం)
**impending** ఆసన్నంగా/ సిద్ధంగా ఉన్న
**impenetrable** చొరశక్యంకాని, ప్రవేశానికి వీలులేని
**imperative** 1. ఆజ్ఞాపూర్వక 2. అనివార్య
**imperceptibility** అగోచరత

**imperfect** అసంపూర్ణ
**imperfect (erroneous) charge** తప్పుడు ఆరోపణ
**imperfect in form** దోషయుక్తంగా ఉంది, అసంపూర్ణ రూపంలో ఉంది
**imperfect manner** దోషపూరితమైన రీతి
**imperfect market** అసంపూర్ణమైన మార్కెట్
**imperfect obligations** అసంపూర్ణ ధర్మ బాధ్యతలు
**imperfect ownership** అసంపూర్ణ యాజమాన్యం
**imperfect partition** అసంపూర్ణ విభజన
**imperfect state** అసంపూర్ణ దశ, అసంపూర్ణావస్థ
**imperfect title** అసంపూర్ణ హక్కు మూలం
**imperfect trust** అసంపూర్ణ ట్రస్టు /ధర్మ నిధి
**imperishable** నశించని
**imperium** సంపూర్ణాధికారం, సైనికాధికారం, కార్యనిర్వాహక అధికార లక్షణం
**impermeable** చొరశక్యంకాని, వ్యాపింప శక్యంకాని
**impersonal** వ్యక్తిగతంకాని
**impersonal account** వ్యక్తిగతం కాని ఖాతా
**impersonal ledger** వ్యక్తిగతంకాని ఆవర్జా
**impersonation** ప్రతిరూప ప్రవర్తన, మరో వ్యక్తిగా వ్యవహరించటం, మారు మనిషిగా చలామణి అవడం / నటించడం
**impertinence 1.** అమర్యాద **2.** అసంబద్ధత
**impervious** చొరశక్యంకాని, దుర్గమమైన
**impetus** ప్రేరణ, ప్రోత్సాహం
**impiety** ధర్మరాహిత్యం, అధార్మికత
**impinge** కొట్టుకొను, తాకు, ఢీకొను, అతిక్రమించు
**implead** దావావేయు, అభియోగం తెచ్చు, ప్రాసిక్యూట్ చేయు
**impleader** దావా తెచ్చేవాడు, ప్రాసిక్యూట్ చేసేవాడు
**implead petitioner** ఫిర్యాదిని కూడా అభియోగంలో చేర్చు
**implement** **n. 1.** సాధనం, పనిముట్టు, పరికరం **v. 2.** అమలుపరచు
**implementation** అమలుపరచడం/ అమలు
**implementation cell** అమలుపరిచే విభాగం / కక్ష్య
**implementation officer** అమలుపరిచే అధికారి
**implementation of rules** నియమాలు అమలుపరచడం
**implementing of decisions** నిర్ణయాల అమలు, నిర్ణయాలు అమలుపరచటం
**implementing of treaties and agreements** ఒడంబడికల – సంధుల అమలు
**implementing the agreement** ఒప్పందం అమలుపరచడం
**implicate** (లో)సూచన చేయు, వివక్షించు, సంబంధం కలగజేయు, ఆపాదించు, ఇమిడి ఉండు, ఇరికించు
**implication 1.** సూచన, ఆపద **2.** అంతర్నిహితం, ఇమిడిక, నిహితార్థం
**implication of law** శాసన అంతర్నిహితం/ అంతరార్థం
**implied** అంతర్నిహిత, ఆపాదిత, సూచించిన, సూచనగా ఉన్న, గర్భిత, లోసూచనగల, ఇమిడి ఉన్న
**implied abrogation** అంతర్నిహిత రద్దు (చట్ట సం॥)
**implied acceptance** అంతర్నిహిత అంగీకారం
**implied agreement** అంతర్నిహిత అంగీకారం
**implied assumpsit** అంతర్నిహిత ఒప్పందం
**implied authority** అంతర్నిహిత అధికారం/ అధికారి
**implied conditions** అంతర్నిహిత షరతులు
**implied confession** అతర్నిహిత/ సూచన ప్రాయంగా ఉన్న నేర అంగీకరణ

**implied consent** అంతర్నిహిత సమ్మతి
**implied contract** అంతర్నిహిత కాంట్రాక్టు / కరారు (సదృశ, సంభావిత కరారు)
**implied covenant** అంతర్నిహిత ఒప్పందం
**implied dedication** అంతర్నిహిత సమర్పణం : యజమాని తన సంపత్తిని ప్రజలకు వదలివేయడం వల్ల శాసనం పురోభావన చేసిన సమర్పణ
**implied easement** అంతర్నిహిత అనుభోగ హక్కు
**implied invitation** అంతర్నిహిత ఆహ్వానం
**impliedly** ఇమిడి ఉండేటట్లు, అంతర్నిహితంగా, సూచనప్రాయంగా, గర్భితంగా
**implied malice** అంతర్నిహిత దుర్భావం
**implied notice** అంతర్నిహిత నోటీసు
**implied or quasi contract** గర్భిత లేదా సదృశ ఒప్పందం
**implied permission** ఇమిడి ఉన్న అనుమతి
**implied powers** గర్భిత / సూచిత అధికారాలు, అంతర్నిహిత అధికారాలు
**implied promise** అంతర్నిహిత వాగ్దానం
**implied ratification** అంతర్నిహిత అనుమోదం
**implied repeal** అంతర్నిహిత రద్దు
**implied revocation** అంతర్నిహిత ప్రతిసంహరణ
**implied terms** అంతర్నిహిత షరతులు
**implied trust** అంతర్నిహిత ధర్మనిధి/ట్రస్టు
**implied undertaking as to title** హక్కు విషయంలో నిహితమైన పూచీ
**implied waiver** అంతర్నిహిత పరిత్యాగం
**implied warranty** అంతర్నిహిత పూచీ
**imply** 1. సూచించు 2. నిబిడీకృతమవు
**import** n. 1. దిగుమతి v. 2. దిగుమతి చేసుకొను
**important call** ముఖ్యమైన పిలుపు
**important functions** ముఖ్యమైన విధులు / కార్యవిధులు
**important items** ముఖ్యాంశాలు
**important land mark** ప్రధాన ఘట్టం
**import duty** దిగుమతి సుంకం
**importer** దిగుమతిదారు
**importing country** దిగుమతి చేసుకొనే దేశం
**import licence** దిగుమతి లైసెన్సు
**import policy** దిగుమతి విధానం
**import quota** దిగుమతి కోటా
**import restriction** దిగుమతి ప్రతిబంధకం
**import substitution** దిగుమతికి బదులు/ప్రత్యామ్నాయం
**import trade** దిగుమతి వర్తకం
**import trade control policy** దిగుమతి వర్తకపు నియంత్రణ విధానం
**impose fine** జుర్మానా /జరిమానా విధించు
**impose restrictions** ప్రతిబంధకాలు/ పరిమితులు విధించు
**impose tax** పన్ను విధించు
**imposition** విధింపు, ఆరోపణ
**imposition of death sentence** మరణ శిక్ష విధింపు
**imposition of duties** సుంకాల విధింపు
**imposition of penalty** జరిమానా విధింపు
**imposition of tax** పన్ను విధింపు
**impossibility of the event** సంఘటన అసంభవత
**impost** విధింపు (సుంకం, పన్ను వగైరా)
**imposter** వంచకుడు, మోసగాడు (మరొక వ్యక్తి రూపంలో)
**impotency** 1. అశక్తత, అసమర్థత 2. నపుంసకత్వం
**impound** 1. బందెల పెట్టు, చట్టరీత్యా వశపరచుకొను, బంధించు 2. భద్రపరుచు
**impound a document** దస్తావేజును న్యాయస్థానంలో భద్రపరుచు
**impounding of instruments** పత్రాలు భద్రపరచటం (దస్తావేజు వగైరా)

**impounding of money** ద్రవ్యం వశపరుచుకోవడం

**impracticable** ఆచరణసాధ్యంకాని

**impracticable suggestion** ఆచరణ సాధ్యంకాని సూచన

**impractical** ఆచరణకు / వ్యవహారానికి వీలులేని

**imprecation 1.** శాపం **2.** అభిశంసనం

**imprecatory verses** శాపోక్తులు

**impregnation 1.**అంతస్థం చేయటం **2.** పూరించటం, నింపు

**imprescriptible rights** నిర్ణీతం వల్ల సంక్రమించని హక్కులు, **rights unattainable by prescription**

**impressed court fee stamps** ముద్ర కొట్టిన కోర్టు రుసుం స్టాంపులు

**impression 1.** అభిప్రాయం **2.**ప్రభావం, **3.** గుర్తు, ముద్ర, ముద్రణ

**impressionable age** ప్రభావంలో పడే వయసు

**impression, false** తప్పుడు అభిప్రాయం

**impression, first** ప్రథమ ప్రభావం/ముద్ర

**impressment** ప్రభుత్వాధీనం చేసుకోటం : ప్రజల ఉపయోగం కోసం వశపరుచుకోవటం

**imprest** అడ్వాన్సు డబ్బు, ఇంప్రెస్టు

**imprest account** ఇంప్రెస్ట్ అకౌంటు/ఖాతా

**imprest cash** అడ్వాన్సు నగదు / రొక్కం

**imprest cash books** అడ్వాన్సు నగదు పుస్తకం

**imprest money** అడ్వాన్సు డబ్బు

**imprest systems of petty cash** చిల్లర నగదు బాబతు / అడ్వాన్సు పద్ధతి

**imprimatur** ముద్రణ అనుమతిపత్రం, అచ్చు లైసెన్సు

**imprimis** ప్రప్రథమంగా, మొట్టమొదట

**imprint** ముద్రణ, ప్రచురణ

**imprisonment** ఖైదు, కారాగారశిక్ష, జైలుశిక్ష

**imprisonment for life** యావజ్జీవ కారాగార శిక్ష

**imprisonment in default of payment of fine** జరిమానా చెల్లించకపోవడం వల్ల ఖైదు

**imprisonment till the rising of court** కోర్టు ముగిసేవరకు ఖైదు

**improbability** అసంభావ్యత

**improbable** అసంభావ్య

**improper** తగని, అనుచిత

**improper acceptance** అనుచితమైన స్వీకారం / అంగీకారం

**improper action** తగని చర్య

**improper admission of evidence** సాక్ష్యం తగని రీతిగా / అనుచితంగా అంగీకరించటం

**improper conduct** తగని నడవడి / వర్తన

**improper description** అనుచితవర్ణన / వ్యాఖ్య

**improper employment** అనుచిత ఉద్యోగం / నియామకం

**improper language** అనుచిత భాష

**improper performance** అపనిర్వహణ, అనుచితంగా చేయడం

**improper rejection of evidence** సాక్ష్యాన్ని తగని రీతిగా / అనుచితంగా తోసిపుచ్చడం

**improper way** అనుచిత మార్గం

**improve 1.** మెరుగుపరుచు, వృద్ధిచేయు **2.** బాగుపరచు **3.** కోలుకొను

**improved draft** మెరుగుపరిచిన ముసాయిదా

**impropriety** కానిపని, అనౌచిత్యం, తగని పని

**improved seeds** మేలిరకం విత్తనాలు

**improvement** వృద్ధి, బాగు, పెంపు

**improvement is gratifying** అభివృద్ధి తృప్తికరంగా ఉంది

**improvement of stock** పశుగణాభివృద్ధి

**improvement trust** అభివృద్ధి ట్రస్టు / ధర్మనిధి

**improve the standard** ప్రమాణాన్ని మెరుగుపరచు / పరచండి

**improvidence** 1. దూరదృష్టి లేకుండటం 2. పొదుపు లేకుండటం
**improvised arrangement** పని నడిపే ఏర్పాటు
**improvisation** పని నడిపించటం, వ్యవస్థీకరించటం (తాత్కాలికంగా)
**impugned** ప్రతివాదించిన, ఆక్షేపించిన, సవాలు చేసిన called in question
**impulse** 1. ప్రేరణ 2. ఆవేగం
**impulsive nature** ఉద్రేక స్వభావం
**impune** శిక్ష నుంచి మినహాయించు
**impure milk** కల్తీపాలు
**impurity** కల్తీ, మలినం
**imputation** ఆరోపణ, మోపటం, నిందారోపణం, ఆపాదించటం
**impute** ఆరోపించు, మోపు
**imputed cost** ఆపాదించిన వ్యయం
**in abeyance** అనిర్ణీత స్థితిలో (పరిస్థితుల వల్ల తాత్కాలికంగా)
**inability** అశక్తత
**inability to agree** అంగీకరించలేకపోవడం, అంగీకరించడానికి అశక్తత
**inability to pay** (అప్పులు)తీర్చలేకపోవడం
**in a body** ఏకమొత్తం
**in a body corporate** నిగమనికాయంలో
**in a boundary** సరిహద్దులో
**inaccessible** అందుబాటులో లేని, అసాధ్య, అలభ్య
**in accordance with** అనుసరించి, అనుగుణంగా, ప్రకారంగా
**in accordance with circumstances** పరిస్థితులననుసరించి
**in accordance with law** శాసనాన్ని అనుసరించి, న్యాయానుసారంగా
**in accordance with the form** నమూనా ననుసరించి
**in accordance with the instructions** సూచనల ప్రకారం
**in accordance with prescribed the channels** నిర్ణీత / విహిత మార్గాల అనుసారంగా
**in accordance with the provision made in that behalf** ఈ విషయమై చేసిన ఏర్పాటులను అనుసరించి
**in accordance with the provision in that behalf contained in** ఆ విషయమై అందులో ఉన్న నిబంధన ననుసరించి
**in accordance with the requirements** అవసరాలను బట్టి / అనుసరించి
**in accordance with the rules** నియమావళికి అనుగుణంగా
**inaccuracy** సరిగా / ఖచ్చితంగా లేకుండటం
**inaccurate figures** తప్పుడు అంకెలు
**inaccurate particulars** తప్పుడు వివరాలు
**in acknowledging receipt of** అందినట్లు తెలియజేస్తూ
**in action** అమలులో / ఆచరణలో / పనిలో
**inactive** స్తబ్ధ, క్రియారహిత, చలనంలేని
**in addition there to** అంతేకాకుండా
**in addition to** అంతేకాకుండా, అదనంగా
**in addition to the amount mentioned** పైన తెలిపిన మొత్తానికి అదనంగా
**inadequacy of consideration** ప్రతిఫలం చాలినంత లేకుండటం
**inadequate** చాలని, సరిపోని
**inadequate attention** శ్రద్ధ తగినంతగా లేకపోవడం
**inadequate consideration** చాలని ప్రతిఫలం
**inadequate funds** చాలని నిధులు
**inadequate nutrition** చాలని పోషకాహారం
**in a disorderly manner** క్రమవిరుద్ధ రీతిలో
**inadmissible** అనుమతించదగని, అగ్రాహ్య
**inadmissible claim** ఒప్పుకోదగని క్లెయిమ్
**inadmissible evidence** అనుమతించదగని సాక్ష్యం
**in advance** ముందుగా
**in advance of calls** పిలుపుకు పూర్వమే:

దాఖలు చేసుకొమ్మని లిఖిత పూర్వకంగా సూచన రాక ముందే

**inadvertence** ఏమరుపాటు అలక్ష్యం, అజాగ్రత్త, అశ్రద్ధ

**inadvertently overlooked** ఏమరుపాటున విడిచిపెట్టబడింది / విడిచిపెట్టిన, పొరపాటున వదిలి వేయబడింది / వదిలి వేసిన

**inadvertently received** ఏమరుపాటుగా తీసుకొన్న

**inadvertently spoil** పొరపాటుగా చెడగొట్టు

**in aid** సహాయార్థం, సహాయంగా

**in aid of** సహాయార్థం

**inalienable** అన్యాక్రాంతానికి తగని

**in allocating** కేటాయించటంలో

**in all respects** అన్ని విధాలా

**in ambiguo** సందేహంలో

**in amplification of** విస్తరిస్తూ

**in an exemplary manner** ఆదర్శమైన రీతిలో

**in an existing vacancy** ఉన్న ఖాళీలో

**in an honorary capacity** గౌరవ పదవిగా, గౌరవ హోదాలో

**inanimate** నిర్జీవ, జడ

**in another form** మరో రూపంలో

**in anticipation** ఆశిస్తూ, ప్రత్యాశిస్తూ, ముందు జరుగుతుందనే ఆశతో/ ఊహతో

**in anticipation of insolvency** దివాలాను ముందుగా ఊహించుకొని

**in anticipation of orders** ఉత్తరువులు రాగలవని ఆశిస్తూ

**in anticipation of your approval** మీ ఆమోదాన్ని ఆశిస్తూ

**in a number of cases** అనేక సందర్భాలలో

**in a nutshell** టూకీగా, సంక్షిప్తంగా

**in any case** ఏది ఎట్లాగయినా, ఏమైనా

**in any cause or matter** ఏ వ్యాజ్యంలో నైనా, ఏ విషయంలోనైనా

**in any event** ఏ స్థితిలోనయినా, ప్రతి సందర్భం లోనూ

**in any form** ఏ రూపంలోనైనా

**in any head of account** ఏ పద్దు / ఖాతా శీర్షిక కిందనయినా

**in any manner** ఏ విధంగానయినా, ఏ తీరుగానయినా

**in any material point** ఏ ముఖ్యాంశం లోనయినా

**in any other case** ఏ ఇతర సందర్భంలో అయినా

**in any particular case** ఏ ప్రత్యేక విషయం / వ్యాజ్యం లోనైనా

**in any proceedings under this Act** ఈ చట్టం కింద ప్రొసీడింగుల్లో ఏవైనా

**in any reference** ఏ నిర్దేశంలోనైనా

**in any respect** ఏ విధంగానయినా

**in any special case** ఏ ప్రత్యేక విషయంలోనైనా / వ్యాజ్యంలో నైనా

**in any suit** ఏ దావాలోనైనా

**inapplicable** వర్తించని

**inappreciable** లెక్కకురాని, గణనీయం కాని, అతిస్వల్ప

**inappropriate** తగని, అసమంజస

**in a provisionally substantive capacity** తాత్కాలికంగా ఖాయమైన హోదాలో

**in a raw state** పూర్తికాని దశలో, అపరిపక్వ దశలో

**in arms** 1. సాయుధంగా, ఆయుధాలతో 2. బకాయిపడిన

**in a routine manner** మామూలు రీతిలో

**in a round about way** డొంకతిరుగుడుగా

**inarticulate** వ్యక్తంకాని, మూగ అయిన

**in articulo mortis** మరణ సమయంలో

**in as full and ample manner** పూర్తిగానూ విస్తృతంగానూ

**in as much as** చేతనైనంత, అయినంత

**in association with -** తో కలిసి

**in a state of intoxication** మైకంలో, నిషాస్థితిలో, మత్తులో

**in a summary way** సంక్షిప్త రూపంలో, సంక్షిప్తంగా

**in a tort, ratification is equivalent**

to authority సివిలు నేరాలలో(టార్ట్) అనుమోదం ప్రమాణానికి సమానమై ఉంటుంది
**inattentiveness** అశ్రద్ధ
**inauguration** ప్రారంభం
**inauguration ceremony** ప్రారంభోత్సవం
**in bad books** కోపదృష్టిలో / దురభిప్రాయంలో
**in bad faith** దురుద్దేశంతో, దుర్భావంతో
**in black and white** లిఖిత రూపంలో, లిఖితంగా
**in bond** నిర్బంధంలో ఉన్న
**inborn** జన్మసిద్ధమైన
**in breach of contract** కరారుకు భంగం కలిగిస్తూ, కాంట్రాక్టును భంగపరుస్తూ
**in breach of his official duties** తన అధికార విధులు ఉల్లంఘిస్తూ
**in broad outline** స్థూలంగా
**in camera** రహస్యంగా
**incapability** అసమర్థత
**incapable of acting** పనిచేయడంలో / నిర్వహణలో అసమర్థమైన
**incapable of giving evidence** సాక్ష్యం ఇవ్వటానికి అసమర్థమైన, సాక్ష్యమివ్వటంలో అసమర్థమైన
**incapacity** అసమర్థత
**incapacity or disqualification** అసమర్థత లేదా అనర్హత
**in capita** తలసరి, తల ఒక్కింటికి
**in case** ఒకవేళ
**in case it shall appear** ఒకవేళ అది కనబడినట్లైతే
**in case of difference** అభిప్రాయభేదం వచ్చినప్పుడు
**in case of doubt** సందేహం కలిగినట్లైతే
**in case of failure** విఫలమైనప్పుడు
**in case of need** అవసరమైనప్పుడు
**in case of urgency** అత్యవసర పరిస్థితిలో/ సందర్భంలో
**in cash or kind** నగదు రూపంలోగానీ వస్తురూపంలోగానీ
**incendiary** 1.తగలబెట్టడం, దహనకాండ 2. తగలబెట్టేవాడు (లూటీలో)
**incendiary bomb** దహించే బాంబు
**incendiary shell** మందుకూరిన బాంబు, మందుగుండు
**incentive** ప్రోత్సాహక(ం)
**incentive awards** ప్రోత్సాహక బహుమతులు
**incentive bonus** ప్రోత్సాహక బోనసు
**incentive plan** ప్రోత్సాహక ప్రణాళిక
**incentive scheme** ప్రోత్సాహక పథకం
**incentive wage** ప్రోత్సాహక వేతనం
**inception** తొలిదశ, ప్రారంభం
**in certain cases** కొన్ని సందర్భాలలో
**incest** వావివరసలు తప్పిన లైంగిక సంబంధం : దగ్గరి రక్త బంధువులతో లైంగిక సంబంధం
**in-charge** ఇన్-ఛార్జ్, అధికారంలో
**in-charge officer** ఇన్‌ఛార్జ్ అధికారి / ఆఫీసరు
**inchoate** ఇప్పుడే మొదలైన, అసంపూర్ణ, స్థిరపడని, అస్థిర
**inchoate instrument** అసంపూర్ణ పత్రం
**incidence** 1. సంఘటనం 2. పాతం, భారం పడటం
**incidence of tax** పన్నుల భారం
**incident** సంఘటనం, ఒకానొక విషయంతో
**incidental** 1. సంబంధి, ఆకస్మిక, ఆనుషంగిక 2. పరిణామం సంభవించే
**incidental and supplemental matters** ఆకస్మిక, అనుపూరక విషయాలు
**incidental charges** పై ఖర్చులు
**incidental damages** సంభవించే నష్టాలు
**incidental expenditure** సంభవించే ఖర్చు
**incidentally** పరిణామంగా, సంఘటనాత్మకంగా, ప్రసంగవశాత్తు, మాటామాటా, ఆకస్మికంగా
**incidentally it may be observed that** ప్రసంగవశాత్తు చెప్పేదేమిటంటే
**incidental or consequential orders** అనుషంగిక లేదా పర్యవసాన ఉత్తర్వులు
**incidental order** అనుషంగిక ఉత్తరువు

**incidental proceedings** అనుషంగిక ప్రొసీడింగులు
**incidental work** సంబంధి పని
**in circulation** సర్క్యులేషన్‌లో
**incited mob** రెచ్చిపోయిన మూక
**incitement** పురిగొల్పటం, రెచ్చగొట్టటం, ప్రేరేపణ
**inciter** రెచ్చగొట్టేవాడు, ప్రేరేపకుడు
**inclination** వంపు, వాలు, మొగ్గుదల, మొగ్గు
**includes** చేరి ఉండు
**inclusion** చేర్చటం
**inclusive of** కలిసి
**incognito** గుప్త(ం), మారువేషంలో ఉన్న
**incoherent** అసంబద్ధ
**in collaboration** సహయోగంతో, సహకారంతో
**in combination with** -తోపాటు
**income** ఆదాయం, రాబడి
**income and expenditure A/c** ఆదాయ వ్యయాల ఖాతా
**income and expenses** ఆదాయమూ ఖర్చులూ, జమాఖర్చులు
**income chargeable tax** పన్ను విధించదగ్గ ఆదాయం
**income certificate** ఆదాయ ధ్రువపత్రం
**income debenture** ఆదాయపు డిబెంచరు
**income distribution** ఆదాయ పంపిణీ
**income earned** గడించిన ఆదాయం
**income group** ఆదాయవర్గం
**income level** ఆదాయ స్థాయి
**incomes received in advance** ముందుగా వచ్చిన ఆదాయాలు
**incomes on sale** అమ్మకం మీద రాబడులు
**income statement** ఆదాయపట్టిక / వివరణిక
**income tax** ఆదాయం పన్ను
**income tax assessee** ఆదాయంపన్ను చెల్లింపుదారు
**income tax clearance certificate** ఆదాయం పన్ను బేబాకీ ధ్రువపత్రం
**income tax payer** ఆదాయంపన్ను చెల్లింపుదారు
**incoming reminders** వచ్చే జ్ఞాపికలు
**incoming returns** వచ్చే వివరణికలు
**incoming telegram** వచ్చే తంతి/ టెలిగ్రా
**incompatible** పొసగని (ఒకదానితో ఒకటి), అసంగతమైన, విరుద్ధమైన
**incompatibility** అసంగతం
**incompetence** అసమర్థత, సామర్థ్యహీనత
**incompetent and lazy** అసమర్థ, సోమరి
**incompetent hands** అసమర్థులు
**incomplete** పూర్తికాని, అసంపూర్ణ(మైన)
**incomplete bill** పూర్తికాని బిల్లు
**incomplete work** అసంపూర్తి పని
**in compliance with** పాటిస్తూ, అనుపాలిస్తూ
**in compliance with your memorandum No.** నెం. ..... గల మీ మెమోరాండమ్‌ను పాటిస్తూ
**incomprehensible** అగోచరమైన
**in computing** లెక్కపెట్టటంలో
**inconclusive** అనిశ్చిత, నిర్ణయంకాని
**inconclusive debate** అసంపూర్ణ చర్చ
**inconclusive proof** అనిశ్చయాత్మకమైన రుజువు
**in confirmation of** ఖాయంచేస్తూ, స్థిరీకరణ చేస్తూ
**in conformity with rules** నియమాలకు అనురూపంగా / సరిపడేటట్లుగా
**incongruous** అసంబద్ధమైన
**in connection with** సంబంధించి, సందర్భంలో
**in connection with other facts** ఇతర విషయాలకు సంబంధించి
**in consequence of** ఫలితంగా, పరిణామంగా
**in consideration of** పురస్కరించుకొని, దృష్ట్యా
**inconsistency** పొసుగుదల లేకపోవటం, అసంబద్ధత, అసంగతి
**inconsistent** అసంబద్ధ, విరుద్ధ, తగని,

పొసగని, అసంగత

**inconsistent with orders** ఉత్తరువులకు అసంగతంగా

**in consonance with** మిళితమవుతూ, సమరసంగా

**inconspicuous** స్పష్టంగా కనబడని

**in consultation with** సలహాతో, సంప్రదింపుతో

**in contemplation of death** మరణం సమీపించిందని భావించి

**in comtemplation of insolvency** దివాలా తీసే ఉద్దేశంతో

**incontestable** వాదాతీతమైన

**incontinence** నిగ్రహం లేకుండటం

**in continuation of my letter** నా లేఖకు తరవాయిగా

**in contravention of** తద్విరుద్ధంగా, విరుద్ధంగా

**incontrovertible** ప్రతివాదానికి వీలులేని

**inconvenience** అసౌకర్యం, ఇబ్బంది

**inconvertible** మార్చడానికి వీలులేని

**incorporate 1.** కలుపు, కూర్చు, చేర్చు **2.** చట్టబద్ధ సంఘంగా ఏర్పడు / నమోదు చేయు

**incorporated company** నమోదైన కంపెనీ, నిగమనమైన కంపెనీ

**incorporated in the draft** ముసాయిదాలో చేర్చిన

**incorporation** నమోదు / చేర్పు, నిగమనం

**incorporeal** ప్రత్యక్షంగాని, కనబడని, అమూర్త/ అశరీర

**incorporeal property** అమూర్తమైన ఆస్తి, అప్రత్యక్ష సంపత్తి

**incorrect** సరిగాని

**incorrectly granted** పొరపాటున గ్రాంట్ అయిన(ది)

**incorrectly stated** తప్పుగా చెప్పిన(ది)

**incorrect report** తప్పుడు నివేదిక

**incorrect totalling** తప్పుడు కూడిక

**incorrect view** తప్పుడు దృష్టి / అభిప్రాయం

**in correspondence with** ఉత్తర ప్రత్యుత్తరాలతో

**incorrigible** బాగుపరచటానికి వీలులేని

**incorruptible** లంచగొండికాని, చెడగొట్టరాని, క్షీణించని, నశించని

**in course of** క్రమంగా

**in course of business** వ్యాపార సరళిలో, వ్యవహార క్రమంలో

**in course of checking** సరిచూసేటప్పుడు

**in course of time** కాలక్రమాన

**increase 1.** వృద్ధి, పెంపు **2.** హెచ్చించు, పెరుగు

**increase and decrease** హెచ్చుతగ్గులు, వృద్ధిక్షయాలు

**increase of capital** మూలధనం పెరుగుదల

**increasing demand** పెరుగుతున్న గిరాకీ / డిమాండు

**increasing tendency** పెరిగే ధోరణి

**increasing utility** పెరుగుతున్న ప్రయోజనం

**incredible** నమ్మటానికి వీలులేని

**increment** వృద్ధి, ఇంక్రిమెంటు

**incremental income** వృద్ధి మీద వచ్చే ఆదాయం

**incremental production** వృద్ధి చెందే ఉత్పత్తి

**increment certificate** వేతనవృద్ధి ధ్రువపత్రం

**increment in sub-grade granted** సబ్-గ్రేడ్‌లో వేతన వృద్ధి మంజూరు అయింది

**increment stopped** వేతన వృద్ధి నిలిపివేయడం జరిగింది

**incriminate** నేరంలో ఇరికించు, నేరం మోపు

**incrimination** నేరారోపణ

**incriminatory nature** నేరారోపణ చేసే స్వభావం

**incubation period** పొదిగేకాలం, నిద్రాణ దశ

**inculcate** బోధించు
**inculpable** నేరంకాని, దోషంకాని
**inculpate** నేరం మోపు, నిందించు
**inculpatory** నేరం కిందికి వచ్చే, నేరస్తునిగా చేసే
**incumbent** ఉద్యోగి
**incumbent of an office** పదవిలో ఉన్న వ్యక్తి
**incumbent, original** పదవిలో ఉన్న అసలు వ్యక్తి
**incumber, to** (ఋణాది)తాకట్టు భారంలో ఉంచు, భారం మోపు, భారగ్రస్తం చేయు
**incumbrance** (ఋణాది) తాకట్టు భారం
**incumbrancer** తాకట్టుదారు: తాకట్టు పెట్టుకొన్న వ్యక్తి, భారగ్రహీత
**incur** భరించు, వహించు, పడు (నింద, శిక్ష మొ॥వి)
**incurable** నయం కావటానికి వీలులేని/ చికిత్సా యోగ్యం కాని
**incuria** న్యాయస్థానంలో
**incurium** పూర్వ తీర్పు తెలియక తీర్పు ఇవ్వటం
**incurred 1.** భరించిన, భరింపబడిన; వహించబడిన, **2.** చేయబడిన, కలిగిన, జరిగిన
**incurred penalty** భరించిన జరిమానా
**incurring of expenditure** ఖర్చు చేయటం / భరించటం
**in dealing with that case, it may also be taken into consideration** ఆ కేసులో వ్యవహరించేటప్పుడు దీన్ని కూడా పరిశీలించవచ్చు
**indebtedness** ఋణగ్రస్తత : ఋణపడటం
**indecent conduct** అసభ్య ప్రవర్తన
**indecisive** నిర్ణయం కాని, అనిశ్చిత, అనిర్ణీత
**indecorous** మర్యాదలేని, అయుక్తమయిన
**in default of** లోపించిన / చేయని పక్షంలో
**in default of agreement** ఒప్పందం అమలుకాని పక్షంలో
**in default of appearance** హాజరు కానట్లయితే
**in default of bail** పూచీ (బెయిలు) ఇవ్వని పక్షంలో
**in default of payment** చెల్లించనప్పుడు, చెల్లించని పక్షంలో
**indefeasible** రద్దు చేయటానికి వీలుకాని, పోగొట్టుకోడానికి వీలుకాని
**in defence of** సమర్థిస్తూ
**indefinite 1.** నిరవధిక, అనిశ్చిత, **2.** అనిర్ణీత
**indefinite expression** అనిశ్చితమైన మాట / వ్యక్తీకరణ
**indefinitely** నిరవధికంగా
**indefinite payment** అనిశ్చితమైన చెల్లింపు
**indefinite period / time** అనిశ్చిత కాలం
**indelible ink** చెరిగిపోని సిరా
**indelicate** మొరటు
**indemnification** నష్టపూర్తి చేయటం, నష్ట పరిహార ద్రవ్యం ఇవ్వటం
**indemnifier** నష్టపరిహారకర్త
**indemnify** నష్టపరిహారం చేయు
**indemnitee** నష్టపరిహారం పొందే వ్యక్తి
**indemnitor** నష్టపరిహారం ఇచ్చే వ్యక్తి
**indemnity** నష్టపరిహారం, నష్టపూర్తి
**indemnity and guarantee** నష్ట పరిహారమూ పూచీ
**indemnity bond** నష్టపరిహార హామీపత్రం
**indemnity certificate** నష్టపరిహార ధ్రువ పత్రం
**indemnity, contract of** నష్టపరిహారపు కరారు
**indemnity to administrative bodies** పరిపాలక సంస్థలకు నష్టపరిహారం
**indent** కావలసిన వస్తువుల పట్టీ, ఇండెంటు
**indent business** ఇండెంటు వ్యాపారం
**indented** తెప్పించిన, పంపమని ఆదేశించిన
**indent houses** ఇండెంటు సంస్థలు
**indent item** ఇండెంటు వస్తువు / అంశం
**indentor** తెప్పించిన వ్యక్తి, పంపమని కోరిన వ్యక్తి
**indentor's instructions** ఇండెంటుదారు సూచనలు

**indent register** ఇండెంట్ పుస్తకం
**indent slip** ఇండెంట్ చీటి
**indent transfer memo** ఇండెంటు బదిలీ మెమో
**indenture** ఒడంబడిక పత్రం, ఒప్పంద పత్రం
**indentured labour** ఒప్పంద కార్మికుడు
**independent agency** స్వతంత్ర సంస్థ / ఏజెన్సీ
**independent audit** స్వతంత్ర ఆడిట్
**independent candidate** స్వతంత్ర అభ్యర్థి
**independent charge** స్వతంత్ర కార్య భారం, స్వతంత్ర బాధ్యత
**independent dealing** స్వతంత్రంగా వ్యవహరించడం
**independent discretion** స్వయం వివేచన
**independent evidence** స్వతంత్ర సాక్ష్యం, నిష్పక్షపాత సాక్ష్యం
**independent judiciary** స్వతంత్ర న్యాయ నిర్ణయవర్గం
**independent note** ప్రత్యేక గమనిక / నోట్
**independent opinion** స్వతంత్రాభిప్రాయం
**independent regulatory commissions** స్వతంత్రత గల నియంత్రక సంఘాలు
**independent status** స్వతంత్ర ప్రతిపత్తి
**independent transfer** స్వతంత్రమైన బదిలీ
**in derogation of** నష్టపరచు, తగ్గించు (గౌరవం, మర్యాద సం॥)
**in descending order** అవరోహణ క్రమంలో
**in descriptive form** వర్ణనాత్మక రూపంలో
**indestructibility** నాశనంకాని స్థితి
**in detail** వివరాలతో, వివరంగా
**indeterminable** నిర్ధారణ యోగ్యంకాని
**indeterminate** నిర్ణయంకాని, అనిర్ధారిత, అనిశ్చిత
**in determining any question** ఏ ప్రశ్న నయినా నిర్ధారించడానికి
**index** సూచి / సూచిక
**index card** సూచికార్డు
**indexer** సూచిక
**indexing** సూచీక్రమం
**indexing of correspondence** పత్ర వ్యవహార సూచీక్రమం
**index map** సూచీ పటం, ఇండెక్స్ పటం
**index number** సూచీ సంఖ్య
**index number, cost of living** జీవన వ్యయ సూచీ సంఖ్య
**index number of industrial production** పారిశ్రామికోత్పత్తి సూచీ సంఖ్య
**index number of prices** ధరల సూచీ సంఖ్య
**index of members** సభ్యులు సూచీ
**index of retail prices** చిల్లర ధరల సూచీ సంఖ్య
**index register** సూచీ రిజిస్టర్
**index sheet** సూచీపత్రం
**index slip** సూచిక చీటి
**index title** సూచిక శీర్షిక
**index to correction slips** సవరణ చీటీల సూచీ
**index value** సూచీ విలువ
**Indian hemp** గంజాయి
**Indian Administrative Service** భారతీయ పరిపాలక సేవ / సర్వీసు
**Indian Air force** భారతీయ వైమానిక దళం
**Indian Civil Services Manual** భారతీయ సివిల్ సర్వీసుల నియమావళి
**Indian defence force** భారతీయ రక్షణ దళం
**Indianism** భారతీయత
**Indianization** భారతీయాకరణం, భారతీయం చేయటం
**Indian monopoly houses** భారతీయ గుత్తాధికార సంస్థలు
**Indian penal code** భారత శిక్షాస్మృతి
**Indian standards Institution** భారతీయ ప్రమాణాల సంస్థ

**Indian Union** భారత యూనియన్
**Indian war memorial** భారతీయ యుద్ధ స్మారక చిహ్నం
**indicating the reasons** కారణాలు సూచించటం
**indication** సూచన
**indicator** సూచకం
**indices** సూచీ పట్టికలు
**indict** నేరం మోపు (కోర్టు వల్ల) : అపరాధ సన్నివేశాలు మోపటం
**indictee** నేరం మోపబడిన వ్యక్తి
**indictment** నేరం మోపటం : ఆరోపణను రాతపూర్వకంగా చేయటం
**indifference** పట్టనట్లు ఉండటం, ఉదాసీనత / నిర్లిప్తత / అలక్ష్యం
**indifferent analysis** ఉదాసీన విశ్లేషణ : అలక్ష్యంతో చేసిన విశ్లేషణ
**indifferent attitude** నిర్లిప్త / ఉదాసీన వైఖరి
**indifferent demands** నిష్ప్రయోజనమైన కోరికలు/అభ్యర్థనలు
**indigence** నిర్ధనత / పేదరికం
**indigenous** దేశీయ
**indigenous banking** దేశీయ బ్యాంకింగ్
**indigenous law** దేశీయ శాసనం / చట్టం
**indigenous production** దేశీయ ఉత్పాదన
**indigent** నిర్ధన, బీద
**indigent circumstances** నిర్ధన స్థితులు
**indignity** అమాన్యత / అమర్యాద
**indirect** పరోక్ష, అప్రత్యక్ష
**indirect adverse consequences** పరోక్ష ప్రతికూల పరిణామాలు
**indirect charges 1.** పరోక్ష ఖర్చులు **2.** పరోక్ష ఆరోపణలు
**indirect confession** పరోక్ష దోష స్వీకారం: పరోక్షంగా దోషం ఒప్పుకోవడం
**indirect contempt** పరోక్ష ధిక్కరణ
**indirect control** పరోక్ష నియంత్రణ
**indirect democracy** పరోక్ష ప్రజాస్వామ్యం
**indirect election** పరోక్ష ఎన్నిక
**indirect enqsiry** పరోక్ష విచారణ
**indirect evidence (circumstantial evidence) 1.** పరోక్ష సాక్ష్యం **2.** సంబంధి సాక్ష్యం : సంబంధించిన సాక్ష్యం
**in direct furtherance of** ప్రత్యక్ష ప్రోద్బలంగా
**indirect income** పరోక్ష ఆదాయం
**indirect labour** పరోక్ష శ్రమ
**indirect parity** పరోక్ష సమానత
**indirect receipts** పరోక్ష రాబడులు
**indirect recruitment** పరోక్ష భర్తీ పద్ధతి, పరోక్ష భర్తీ
**indirect rule** పరోక్ష నియమం (పరిపాలన వగైరాలు, సందర్భాన్ని బట్టి)
**indirect tax** పరోక్ష పన్ను
**indirect taxation** పరోక్ష పన్ను విధింపు
**indirect verification** పరోక్షంగా సరి చూడడం
**indiscipline 1.** క్రమశిక్షణ రాహిత్యం **2.** క్రమశిక్షణ ఉల్లంఘనం
**indiscriminately** విచక్షణ లేకుండా
**in disorderly fashion** అస్తవ్యస్తంగా
**indispensable** తప్పనిసరి అయిన, అనివార్య
**indispensable for existence** అస్తిత్వం కోసం పరిహరించరాని
**indisposition 1.** అస్వస్థత **2.** అయిష్టత
**indisputable** నిర్వివాదమైన
**indistinct** అస్పష్ట
**in distress** సంకటంలో
**individual** వ్యక్తి, వైయక్తిక, సొంత, వ్యక్తిగత, వ్యక్తిపర
**individual account** వ్యక్తిగత ఖాతా
**individual benefit** వ్యక్తిగత లాభం
**individual case** వ్యక్తిపరమైన / ప్రత్యేక కేసు
**individual cases will be decided on merits** ప్రతికేసునూ దాని యోగ్యతను బట్టి నిర్ణయించడం జరుగుతుంది
**individual demand schedule** వ్యక్తిగత

invalid election చెల్లని ఎన్నిక
invalidity అసమర్థత, చెల్లకపోవటం
invalidity and old age pensions అశక్తతకూ వృద్ధాప్యానికీ పింఛనులు
invalid pension అశక్తత పింఛను
inveiglement ప్రలోభం / బుజ్జగించి చేసే మోసం, ఆశపెట్టి ఆకర్షించు
inventions promotion board నూతన కల్పనల ప్రోత్సాహక బోర్డు
inventor కనిపెట్టిన వ్యక్తి, స్రష్ట, ఆవిష్కర్త
inventory జాబితా : పీలునామా ధ్రువపత్రం ఇవ్వడానికి పూర్వం ఆస్తుల జాబితా తయారుచేయాలి
inventory of furniture ఫర్నిచరు పట్టిక
inventory of the property ఆస్తిపట్టిక
inverse order తలకిందు వరస
inverse proportion విలోమానుపాతం
inverse ratio విలోమ నిష్పత్తి
invert తలకిందుచేయు
invest పెట్టుబడి
invested capital పెట్టుబడి పెట్టిన మూలధనం
investigate ఆరాతీయు, దర్యాప్తుచేయు
investigation దర్యాప్తు, విచారణ, అన్వేషణ, కూపీ
investigation committee దర్యాప్తు సంఘం
investigation of the case కేసు దర్యాప్తు
investigation, preliminary ప్రాథమిక దర్యాప్తు
investigator దర్యాప్తుదారు/పరిశీలకుడు / అన్వేషకుడు
investment పెట్టుబడి
investment account పెట్టుబడి ఖాతా
investment adviser పెట్టుబడి సలహాదారు
investment banks పెట్టుబడి బ్యాంకులు
investment company పెట్టుబడి కంపెనీ (షేర్లు, స్టాక్ నం॥)
investment credit పెట్టుబడి పరపతి
investment decisions పెట్టుబడి నిర్ణయాలు
investment fluctuation fund పెట్టుబడి హెచ్చుతగ్గుల నిధి
investment ledger పెట్టుబడి ఆవర్జా
investment loans పెట్టుబడి అప్పులు
investment market పెట్టుబడి మార్కెట్
investment of cash balance నగదు నిల్వల పెట్టుబడి
investment of reserves రిజర్వు నిధుల పెట్టుబడి
investment policy పెట్టుబడి విధానం
investment promoters పెట్టుబడి ప్రమోటర్లు / ప్రోత్సాహకదార్లు
investment value పెట్టుబడి విలువ
investor పెట్టుబడిదారు
investor's market పెట్టుబడిదారు మార్కెట్
investors of the company కంపెనీ పెట్టుబడిదార్లు
invidious discrimination ద్వేషంతో కూడిన విచక్షణ
in view of circumstances stated above పైన చెప్పిన పరిస్థితుల దృష్ట్యా
in view of that ఆ దృష్ట్యా
in view of the changed policy మారిన విధానం దృష్ట్యా
in view of the urgency అవసరం దృష్ట్యా
invigilate నిఘా ఉంచు / పర్యవేక్షించు
invigilator నిఘాదారు / పర్యవేక్షకుడు
invigorate బలం కలగజేయు
invincible అజేయమైన
inviolable మీరరాని, చెరపశక్యం కాని
in virtue of ఆధారంగా
invisibility అదృశ్యత
invisible exports కానరాని/అదృశ్య ఎగుమతులు
invisible imports కానరాని/అదృశ్య దిగుమతులు
invitation card ఆహ్వాన పత్రిక
invitation is accepted ఆహ్వానం స్వీక

రించడమైంది
**invitation of tender** టెండర్ పిలుపు
**invite attention** దృష్టికి తెచ్చు
**invite particular attention** ప్రత్యేకంగా దృష్టికి తీసుకొని వచ్చు
**invite quotations** కొటేషన్లు కోరు
**I invite your attention to this important fact** ముఖ్యమైన ఈ వాస్తవాన్ని/ అంశాన్ని మీ దృష్టికి తెస్తున్నాను
**invito beneficium non datur** ప్రయోజనం పొందడానికి ఇష్టపడని వ్యక్తికి అది ఇవ్వడం జరగదు; అంటే ప్రయోజనాన్ని అందుకోవలసిందిగా ఎవరినీ బలవంతపెట్ట కూడదు
**in vogue** వాడుకలో ఉన్న
**invoice book** ఇన్వాయిస్ పుస్తకం, సరకుల పట్టీ పుస్తకం
**in violation of** అతిక్రమించి
**involuntary** అనైచ్ఛిక, స్వచ్ఛందం కాని
**involuntary loss** అనైచ్ఛిక నష్టం, ఉద్దేశ పూర్వకం కాని నష్టం
**involuntary savings** అనైచ్ఛిక పొదుపులు
**involuntary unemployment** అనైచ్ఛిక నిరుద్యోగిత
**involve** ప్రమేయపరచు, చిక్కుకొను
**involve a risk to the life** ప్రాణానికి ముప్పుతెచ్చు / వచ్చు
**involves any connection** ఏ విధమైన సంబంధమైనా ఉన్న
**involving question of policy** విధానానికి ప్రమేయమైన ప్రశ్న
**invulnerable** అభేద్యమైన
**inward** ఇన్వర్డ్, అంతర్ రవాణా, ఆగమన
**inward clerk** ఇన్వర్డ్ గుమాస్తా
**inward correspondence** ఆగమన ఉత్తర ప్రత్యుత్తరాలు
**inward freight** ఆగమన/ రాకడ రవాణా రుసుం
**inward register** అంతర్ రవాణా రిజిస్టరు: వచ్చే పత్రాలను నమోదు చేసే రిజిస్టరు
**inward returns** నమోదుకు వచ్చే వివరణికలు
**inwards entry** వచ్చే పత్రాల నమోదు
**inward way bill** అంతర్ రవాణా దారి బిల్లు
**in whom powers are vested** ఎవరిలో అధికారాలు నిహితమై ఉన్నాయో
**in witness whereof** అందుకు సాక్ష్యంగా
**in writing** రాతమూలకంగా, లిఖిత పూర్వకంగా
**in writing under his hand, order** స్వహస్తంతో రాసిన ఉత్తరువు
**I owe you** నేను నీకు ఋణపడి ఉన్నాను
**I proceed exparte** ఏకపక్షీయంగా పురోగమిస్తాను
**ipso facto** ఆ విషయం వల్లనే / ఆ చర్య వల్లనే
**ipso jure** చట్టం అమలు కారణంగా / శాసనం వర్తించటంవల్ల
**I regret to inform** తెలపడానికి విచారిస్తున్నాను
**I reiterate my former comments** వెనకటి వ్యాఖ్యలను పునరుద్ఘాటిస్తున్నాను
**iron safe** ఇనపపెట్టె
**irrational** హేతువిరుద్ధ
**irrecoverable** తిరిగి రాబట్టలేని
**irrecoverable amount** వసూలు సాధ్యం కాని మొత్తం
**irredeemable** విడిపించలేని / తీర్చలేని
**irredeemable preference shares** విడిపించడానికి వీలుకాని ప్రాధాన్యపు వాటాలు
**irrefutable** ఖండించడానికి వీలుకాని, కాదనలేని
**irregular** క్రమరహిత, అక్రమ
**irregular action** క్రమవిరుద్ధ చర్య
**irregular credits** 1.క్రమరహిత జమలు, నియమ రహిత జమలు
**irregular employment** క్రమరహిత ఉద్యోగం
**irregularity** అవకతవక, క్రమరాహిత్యం
**irregularity of procedure** కార్యవిధాన

క్రమరాహిత్యం
**irregular pattas** అక్రమ /విరుద్ధ పట్టాలు
**irregular payment** క్రమరహితమైన చెల్లింపు
**irregular proceedings** క్రమవిరుద్ధ కార్య వ్యవహారాలు
**irrelevance** అసందర్భం, అసంగతం
**irrelevant** అంశానికి సంబంధంలేని, అసంగతమైన, అసందర్భ
**irrelevant matter** అసంగత విషయం
**irrelevant to the issue** సమస్యకు / అంశానికి సంబంధం కాని
**irreparable 1.** పూరింపశక్యంకాని **2.** సరిదిద్దడానికి శక్యంకాని
**irresistible** నిరోధించడానికి వీలుకాని, తిరుగులేని, నిగ్రహించలేని
**irrespective of** నిమిత్తంలేకుండా, లక్ష్యపెట్టకుండా, లెక్కచేయకుండా
**irrespective of fact** ఇది ఇలా ఉన్నప్పటికీ
**irrespective of their nature and contents** వాటి స్వభావంతోనూ అంశాలతోనూ నిమిత్తం లేకుండా
**irrespective of the value** విలువ సంగతి అలా ఉంచి
**irrespective of whether or not** అయినా కాకపోయినా
**irresponsible** బాధ్యతలేని, బాధ్యతా రహిత
**irresponsible person** బాధ్యతా రహితుడు/ బాధ్యతలేని వ్యక్తి
**irresponsible words** బాధ్యత రహితమైన/ బాధ్యతలేని మాటలు
**irrevocable** రద్దు చేయడానికి వీలులేని / ఉపసంహరణకు వీలులేని
**irrevocable credit** రద్దుకు వీలుకాని పరపతి
**irrevocable decision** రద్దుకు వీలులేని నిర్ణయం
**irrigated land** నీటిపారుదల భూమి
**irrigation** నీటిపారుదల
**irrigation cess** నీటి తీరువా
**irrigation facilities** నీటిపారుదల సౌకర్యాలు
**irrigation potential** నీటిపారుదల సమర్థత / సంభావ్యత / వనరు
**irritable temper** చిరచిర్లాడే స్వభావం
**I see no reason to interfere** జోక్యం చేసుకోడానికి కారణమేదీ కనిపించడంలేదు
**is hereby informed** ఇందుమూలంగా తెలియజేయటమైంది
**is in the process of finalisation** తుది రూపం ఇవ్వడం జరుగుతున్నది
**is not likely to materialise** నెరవేరేటట్లుగా లేదు
**is not permited by the rules** నియమాలు అనుమతించవు
**is not practicable** ఆచరణ సాధ్యంకాదు
**is not reasonably practicable** సమంజసమైన అమలుకు వీలుకాదు
**is not traceable** దొరకలేదు, కనిపించలేదు
**isolated document** విడి దస్తావేజు, వేరుగా ఉన్న దస్తావేజు
**isolation** విడిగా ఉంచటం
**I solicit your orders** మీ ఉత్తరువులు కోరుతున్నాను
**is punishable under rule -** నియమం ప్రకారం శిక్షార్హమైనది
**is referred to -**కి నిర్దేశించడమైంది
**is requested to peruse the note** నోట్/ గమనిక శ్రద్ధగా పరిశీలించ వలసిందిగా కోరడమైంది / కోరుతున్నాను
**is reverted to his substantive post** అతని స్థిర పదవిలోకి వెనక్కి పంపడమైంది
**is self-explanatory** స్వయం వివరణాత్మకమైన
**is set aside 1.** పక్కకు పెట్టడమైంది, **2.** రద్దు చెయ్యడమైంది
**is subject to** లోబడి
**issue n. 1.** వాదాంశం, అంశం, తగాదా, వివాదం, సమస్య, **2.** సంతానం **3.** (ప్రచురణ) సంచిక **v. 4.** జారీచేయు
**issue a certificate of registration**

రిజిస్ట్రేషన్ ధ్రువపత్రం జారీచేయు
**issue an order** ఉత్తరువు జారీచేయు
**issue a precept** ఆదేశపత్రం జారీ చేయు
**issue as amended** సవరించినట్లుగా జారీ చెయ్యండి
**issue as modified** మార్పు చేసినట్లుగా జారీ చెయ్యండి
**issue as recommended** సిఫారసు ప్రకారం జారీ చేయండి
**issue as redrafted** తిరగ రాసిన ప్రకారం జారీచేయు
**issue at premium** ప్రీమియంతో జారీచేసిన
**issue a warrant** వారంటు జారీ చెయ్యండి
**issue a warrant under his hand** ఆయన సంతకంతో వారంటు జారీచేయు
**issue branch** జారీ శాఖ / విభాగం
**issue by registered post** రిజిస్టర్ పోస్టు ద్వారా పంపు
**issue call for tenders** టెండర్ల కోసం పిలుపు జారీ చేయు / పిలుచు
**issue capital** జారీ మూలధనం
**issued at discount** తగ్గింపు ధరతో జారీ చెయ్యటమైంది
**issued at par** సమమూల్యానికి జారీ చేసిన
**issued capital** జారీ చేసిన మూలధనం
**issued certificate** జారీచేసిన ధ్రువపత్రం
**issue dairy** జారీ వివరాల డైరీ
**issue department** జారీ విభాగం
**issued, licence** లైసెన్సు జారీ అయింది
**issued on** -తేదీన జారీ అయింది
**issue immediate reminder** తక్షణమే జ్ఞాపకలేఖ (రిమైండర్) జారీ చెయ్యండి
**issuing authority** జారీ చేసే అధికారి / అధికారం
**issuing concern** జారీ చేసే సంస్థ
**issuing officer** జారీ చేసే అధికారి
**issueless** నిస్సంతు
**issue note** పంపేనోట్
**issue notice** నోటీసు పంపండి
**issue of bonds** బాండ్ల జారీ
**issue of cheque** చెక్కుజారీ/ రాసిఇవ్వడం
**issue of debenture** డిబెంచరు జారీ
**issue of demand draft** డిమాండ్ డ్రాఫ్ట్ జారీ
**issue of fact** వాస్తవికాంశం
**issue of law** న్యాయశాస్త్రాంశం
**issue of money** డబ్బు విడుదల చేయటం
**issue of orders** ఉత్తరువులజారీ
**issue of passes** ప్రవేశపత్రాల / పాస్‌ల జారీ
**issue of permit** అనుమతి పత్రం జారీ
**issue of process** (కోర్టు) వ్యవహారపత్రాల జారీ, (కోర్టు) సమన్లు జారీ
**issue of store** సామాను ఇవ్వడం
**issue of telegram** తంతి పంపడం
**issue of this is authorized** దీని జారీకి అధికారం ఇవ్వటమైంది
**issue of valuable securities** విలువైన సెక్యూరిటీల జారీ
**issue of void marriage** చెల్లని వివాహ సంతానం
**issue orders** ఉత్తరువులు జారీ చేయు
**issue price** జారీ / విడుదల ధర
**issue reminder (I.R.)** జ్ఞాపక లేఖ జారీ చేయండి
**issue reminder urgently** త్వరగా జ్ఞాపిక జారీ చెయ్యండి
**issues agreed upon** అంగీకారం పొందిన వివాదాలు
**issues are settled** వివాదాంశాలు పరిష్కారమయ్యాయి
**issues have been framed** వివాదాంశాలు రూపొందించటమైంది
**issues of law** న్యాయ వివాదాంశాలు
**issues of the case** కేసు వివాదాంశాలు
**issue telegraphic instructions** తంతి ద్వారా ఆదేశాలు జారీ చెయ్యండి
**issue to-day** ఈ రోజే జారీ చెయ్యండి
**issue voucher** వోచరు జారీ చెయ్యండి / ఇవ్వండి
**issue warning** హెచ్చరిక ఇవ్వండి /

చెయ్యండి
issue wireless message వైర్‌లెస్ సందేశం పంపండి
is without jurisdiction అధికారపరిధి లేకుండా ఉన్నది
it appears that - లా కన్పిస్తున్నది
it could be visualised దాన్ని ఊహించ వచ్చు
item 1. అంశం 2. పద్దు
item by item ఒక్కొక్కటిగా, అంశం వారీగా
item in suspense అనామతు (ఖాతాలోని) పద్దు / అంశం
item of business కార్యక్రమ అంశం
item of expenditure . ఖర్చు అంశం / వ్యయాంశం
item on agenda అజెండాలో ఉన్న అంశం
item to be discussed చర్చనీయాంశం
item wise ఒక్కొక్కటిగా, అంశంవారీగా
it extends to the whole of India భారతదేశమంతటికీ ఇది వర్తిస్తుంది
it gives us pleasure to inform you — అని మీకు తెలపడానికి సంతోషిస్తున్నాం
it has been brought to my notice నా దృష్టికి తేవడం జరిగింది
it has been discovered— అని కనుక్కోడం జరిగింది
it has been noticed that — అని గమనించడమైంది
it has one redeeming feature దానికి విముక్తి లక్షణం ఒకటి ఉంది
it has since been decided అది అట్లా నిశ్చయించటమైంది కాబట్టి
itinerant court సంచార న్యాయసభ
itinerant traders సంచార వర్తకులు
itinerary సంచారం, పర్యటన
it is a matter of regret అది విచారకరమైన విషయం
it is an open secret that - అన్నది బహిరంగ రహస్యం
it is awaiting trial విచారణకు రానున్నది
it is conceded అనుమతించటమైంది
it is defective -లోపం గలది
it is desirable అభిలషణీయమైనది
it is expected ఆశించడమైంది
it is expedient అది యుక్తం
it is felt that అని భావించడమైంది
it is fit case for appeal అపీలుకు తగ్గ కేసు
it is for consideration పరిశీలించే నిమిత్తం
it is for orders ఉత్తరువులకోసం
it is further requested - అని కూడా కోరడమైంది
it is hereby agreed ఇందుమూలంగా అంగీకరించటమైంది
it is hereby enacted as follows ఇందుమూలంగా కింది విధంగా చట్టం చెయ్యటమైంది
it is highly objectionable ఇది చాలా అభ్యంతరకరమైనది
it is irregular and cannot be covered by any stretch of interpretation of the rules ఇది క్రమ విరుద్ధమైనదే కాక నియమాల వ్యాఖ్య ఎట్లా చేసినప్పటికీ దానికి లోబడనిది
it is my submission —నేను నివేదించేది ఏమిటంటే
it is natural that — అన్నది సహజం
it is not applicable అది వర్తించదు
it is not feasible అది సాధ్యమైనది కాదు / సంభవనీయమైనది కాదు
it is notified for general information సాధారణ సమాచారం కోసం ప్రకటించడమైంది
it is obligatory ఇది అనివార్యం /తప్పని సరిగా చెయ్యవలసింది
it is obvious — అన్నది స్పష్టం
it is possible that— అన్నది సంభవం
it is presumed that — అని భావించడమైంది
it is regretted that అన్నది విచారకరమైన విషయం
it is reiterated అని పునరుద్ఘాటించడమైంది
it is respectfully submitted సగౌరవం

గా నివేదించడమైంది

**it is understood —** అని తెలిసింది

**it is unreasonable to insist on the –** కోసం పట్టుబట్టడం సబబు కాదు

**it is within the powers** అధికారాలకు లోబడి ఉన్నది

**it leaves no margin** దానిలో అవకాశం లేదు

**it makes a great difference** చాలా వ్యత్యాసం ఉంటుంది

**it may also be mentioned** అని కూడా చెప్పవచ్చు

**it may be pointed out that** అని తెలపవచ్చు

**it may further be added** ఇంకా చేర్చ వలసి ఉంది

**it means** అంటే

**it met under the chairmanship of –** గారి అధ్యక్షతన సమావేశం జరిగింది

**it requires prior approval** దీనికి పూర్వామోదం కావాలి

**it seems** అని తోస్తున్నది

**it shall be lawful** అది న్యాయసమ్మతం అవుతుంది

**it shall come into force at once** తక్షణమే ఇది అమలులోకి వస్తుంది

**it shall suffice** అది (అంతవరకు) చాలు

**it should be obtained by personal contact** స్వయంగా కలుసుకొని పొందాలి

**it shall have effect as far as it can have effect** అది ఎంతమేర ప్రభావం చూపగలదో అంతమేర ప్రభావం దానికి ఉండవలసిందే

**its issue is authorized** దాన్ని జారీ చెయ్యటానికి అధికారం పొందటమైంది

**it was held** అని నిశ్చయించడమైంది

**it will be appreciated if** అయితే ముదావహంగా ఉంటుంది

**it will be construed** ఇది అని అనుకో వలసి ఉంటుంది

**it will be greatly appreciated if the requisite information is expedited** కోరిన సమాచారం త్వరగా పంపినట్లయితే ఎంతో హర్షిస్తాం

**it will be highly appreciated** ఎంతో ప్రశంసనీయంగా ఉంటుంది

**it will facilitate** సౌకర్యం కలిగిస్తుంది

**it would be noticed** అని గమనించడ మవుతుంది

**it would depend upon –** మీద ఆధార పడుతుంది

**I undertake** నేను బాధ్యత వహిస్తాను

**I wish to inform you that** అని మీకు తెలపాలనుకొంటున్నాను

**I would like to see** నేను చూడాలను కొంటున్నాను

# J

**jactitation** అసత్య కథనం

**jactitation of marriage** పెళ్ళికి సంబంధించిన అసత్యకథనం (వ్యాజ్యకారణం)

**jail administration** జైళ్ళ పరిపాలన / నిర్వహణ

**jail bird** జైలుపక్షి; తరచుగా జైలుకు వెళ్ళేవాడు

**jail corps** జైలుదళం

**jail in which the punishment was undergone** శిక్ష అనుభవించిన కారాగారం / జైలు

**jail manual** జైలు నియమసంపుటి

**jail manufacturer** జైలు ఉత్పత్తిదారు

**jailor** జైలరు, జైలు అధికారి

**jails and convict settlements** జైళ్ళు – నేరస్తుల ప్రవాసాలు

**jail warder** జైలు వార్డరు / అధికారి

**jam v.** నిలిపి వేయు, ఒత్తు, అణచివేయు, (రేడియో కార్యక్రమాలు) వినిపించకుండా చేయు

**J.D./J.Dr. advocate** ప్రతివాది తరఫు న్యాయవాది

**J.D. /J.Dr. judgement debtor** తీర్పు పొందిన బాకీదారు, ప్రతివాది

**J.Dr. Value** ప్రతివాది వేసిన విలువ.

ప్రతివాది మదింపు
**jeopardise** ఇరుకున పెట్టు, సంకట పెట్టు, ఇబ్బంది పెట్టు, మోసగించు
**jeopardy** 1.అపాయం, ఆపద, 2. ఆరోపణ చెయ్యబడిన స్థితి
**jet aircraft** జెట్ విమానం
**jet fighter** యుద్ధ విమానం
**jet propelled** జెట్‌తో నడిచే
**jetty** జెట్టీ, రేవుకట్ట, చిన్నవారధి
**Job** వృత్తిపని, ఉద్యోగం
**jobber** 1. చిల్లర పనివాడు, దళారి 2. టోకు వర్తకుడు 3. అవినీతిపరుడు
**job card** వృత్తిపనికార్డు
**job ceiling** ఉద్యోగ పరిమితి
**job chart** వృత్తిపనిపట్టిక
**job classification** పని / ఉద్యోగ వర్గీకరణ
**job description** ఉద్యోగ వివరణ
**job evaluation** పని మదింపు / ఉద్యోగాల మూల్యాంకనం
**job grading** ఉద్యోగాల శ్రేణీకరణం
**job instructions** ఉద్యోగ సూచనలు
**job opportunity** ఉద్యోగ అవకాశం
**job oriented** ఉద్యోగ ప్రాముఖ్యంగల
**job requirements** పని / ఉద్యోగ ఆవశ్యకతలు
**job rotation** పని మార్పిడి పద్ధతి
**job security** ఉద్యోగ భద్రత
**job specification** ఉద్యోగ నిర్దిష్టత
**job-wise labour** పనివారీ శ్రమ
**job work** వృత్తిపని, వృత్తి వ్యాసంగం, చిల్లర పని
**join** చేరు, చేర్చు, జోడించు, సంయోజించు
**joinder** కక్షిదారుగాచేర్చడం **(joining of parties as plaintiff or defendants in a suit or action)**
**joinder in action** దావాలో రెంటిని చేర్చడం, జోడింపు దావా
**joinder in issue** వివాదాంశ అంగీకారం : ఎదుటి పక్షం వాదాన్ని అంగీకరించటం
**joinder of causes of action** వ్యాజ్య కారణాల జోడింపు
**joinder of charges** ఆరోపణల జోడింపు / సంయోజన
**joinder of issues** వివాదాంశాల నిర్ణయానికి అంగీకారం
**joinder of parties** కక్షిదారుల జోడింపు / సంయోజనం
**joinder of plaintiffs** వాదుల జోడింపు / సంయోజనం
**joinder of trustees** ధర్మకర్తల సంయోజన
**join hands** చేతులు కలుపు, కలిసి పనిచేయు
**joining date** చేరిక తేదీ, చేరిన తేది
**joining period** చేరిక వ్యవధి
**joining report** చేరిక నివేదిక (పదవిలో)
**joining time** (పదవిలో) చేరటానికి వ్యవధి, చేరికకు వ్యవధి
**joining time allowance** పదవిలో చేరే వ్యవధికి భత్యం, (విధులలో) చేరే కాలపు భత్యం
**joining time pay** (విధులలో) చేరే కాలపు జీతం
**joint** సంయుక్త, సమష్టి, ఉమ్మడి
**joint account** ఉమ్మడి ఖాతా
**joint agreement** ఉమ్మడి ఒప్పందం
**joint and several** సమష్టిగానూ వ్యష్టిగానూ
**joint and several liability** సమష్టిగాను, వ్యష్టిగానూ చెల్లింపు బాధ్యత
**joint and several responsibilities** ఉమ్మడిగానూ వ్యష్టిగానూ చెల్లింపు బాధ్యతలు
**joint annuity** సమష్టి వార్షికం
**joint application** ఉమ్మడి / సమష్టి దరఖాస్తు
**joint appointment** ఉమ్మడి నియామకం (ఆస్తి సం॥)
**joint attestation** సంయుక్త ధ్రువీకరణ సంతకం
**joint bank account** ఉమ్మడి / సంయుక్త బాంకు ఖాతా

**joint business** ఉమ్మడి వ్యాపారం
**joint cadre** సంయుక్త శ్రేణి
**joint capital** ఉమ్మడి మూలధనం
**joint causes of action** సంయుక్త వ్యాజ్య కారణాలపై చర్య
**joint claimants** సంయుక్త క్లెయిమ్‌దారులు
**joint committee** సంయుక్త సంఘం
**joint concurrence** సంయుక్త సమ్మతి
**joint conference** సంయుక్త సమావేశాలు
**joint consultation** సంయుక్త సంప్రదింపు
**joint consultative committee** సంయుక్త సంప్రదింపుల సంఘం
**joint consultative machinery** సంయుక్త సంప్రదింపుల యంత్రాంగం
**joint contract** ఉమ్మడి కాంట్రాక్టు / కరారు
**joint control** సంయుక్త నియంత్రణ
**joint council** సంయుక్త మండలి
**joint creditors** ఉమ్మడి ఋణదాతలు (ఒకే అప్పు ఇచ్చినవారు)
**joint cultivation** ఉమ్మడి వ్యవసాయం
**joint debtors** ఉమ్మడి ఋణగ్రస్తులు
**joint declaration** సమష్టి ప్రకటన
**joint decree** ఉమ్మడి డిక్రీ
**joint decree holder** ఉమ్మడి డిక్రీదారు
**joint demand** సంయుక్త అభ్యర్థన
**joint electorate** సంయుక్త నియోజక వర్గం
**joint enquiry** ఉమ్మడి విచారణ
**joint executors** ఉమ్మడి (వీలునామా) అమలుదారులు
**joint family** ఉమ్మడి కుటుంబం, సమష్టి కుటుంబం
**joint family property** ఉమ్మడి కుటుంబ ఆస్తి
**joint family system** ఉమ్మడి కుటుంబ వ్యవస్థ / పద్ధతి
**joint farming** 1. ఉమ్మడి సేద్యం 2. సమష్టి వ్యవసాయం
**joint fund** ఉమ్మడి నిధి
**joint gift** ఉమ్మడి బహుమతి
**joint heir** సహవారసుడు
**joint holder** ఉమ్మడి హక్కుదారు
**joint holding** ఉమ్మడి కమతం
**joint indictment** ఉమ్మడి నేరారోపణ (ఇద్దరు లేదా అంతకంటె ఎక్కువ అపరాధులపై)
**joint liability** సమష్టి చెల్లింపు బాధ్యత
**joint life policy** సమష్టి జీవిత భీమా పట్టా
**joint list** ఉమ్మడి పట్టిక /జాబితా
**jointly** సమష్టిగా, సంయుక్తంగా, ఉమ్మడిగా
**jointly and equally** ఉమ్మడిగానూ సమానంగానూ
**jointly and severally** ఉమ్మడిగానూ విడివిడిగానూ, సమష్టిగానూ వ్యష్టిగానూ
**jointly and severally bound** ఉమ్మడిగానూ విడివిడిగానూ బద్ధులయి ఉన్న
**jointly and severally liable** ఉమ్మడిగానూ విడివిడిగానూ/ సమష్టిగానూ వ్యష్టిగానూ బాధ్యులయి ఉన్న
**jointly concerned** ఉమ్మడిగా సంబంధించిన
**jointly interested** ఉమ్మడిగా ప్రయోజనం గల/ ఆసక్తిగల
**jointly owe** ఉమ్మడిగా ఋణపడు
**jointly owned** ఉమ్మడి యాజమాన్యంగల
**jointly tried** ఉమ్మడిగా విచారణకు గురి అయిన
**joint management council** సంయుక్త యాజమాన్య మండలి
**joint meeting** సంయుక్త సమావేశం
**joint ownership** ఉమ్మడి / సమష్టి యాజమాన్యం
**joint parliamentary committee** సంయుక్త పార్లమెంటరీ సంఘం
**joint parties** ఉమ్మడి పక్షాలు
**joint patta** ఉమ్మడి పట్టా
**joint possession** సమష్టి / ఉమ్మడి స్వాధీనం
**joint production committee** సమష్టి ఉత్పత్తి సంఘం
**joint products** సంయుక్త ఉత్పాదితాలు/ ఉత్పత్తులు

**joint promises** సమష్టి వాగ్దానాలు
**joint promisor** సమష్టి వాగ్దాత
**joint promissory note** సమష్టి ప్రోనోటు
**joint property** సమష్టి / ఉమ్మడి ఆస్తి
**joint recruitment** సంయుక్తంగా భర్తీ చెయ్యడం
**joint representation** 1. సమష్టి ప్రాతినిధ్యం 2. సమష్టి నివేదన / విజ్ఞాపన
**joint resolution** సమష్టి తీర్మానం
**joint responsibility** ఉమ్మడి బాధ్యత
**joint select committee** సంయుక్త పరిశీలక సంఘం, సంయుక్త విశిష్ట సమితి
**joint session** సంయుక్త సమావేశం
**joint - several promissory note** ఉమ్మడి-విడి ప్రోనోటు / ఋణపత్రం
**joint sitting** సంయుక్త సమావేశం
**joint sittings of the legislature** శాసన సభల సంయుక్త సమావేశాలు
**joint staff council** సంయుక్త సిబ్బంది మండలి
**joint statement** సంయుక్త ప్రకటన, సంయుక్త నివేదన
**joint stock companies** ఉమ్మడి వాటా కంపెనీలు
**joint supply** ఉమ్మడి సరఫరా
**joint surprise check** హఠాత్తుగా చేసే ఉమ్మడి తనిఖీ
**joint tenants** ఉమ్మడి కౌలుదార్లు
**joint trial** సంయుక్త విచారణ
**joint trustees** సంయుక్త ట్రస్టీలు/ ధర్మకర్తలు
**joint undivided estate** సమష్టి అవిభక్త ఎస్టేటు
**jointure** భార్య ఆస్తి : మరణానంతరం భార్య అనుభవానికి వదిలిన ఆస్తి
**joint venture** ఉమ్మడి సమారంభం, జాయింట్ వెంచర్
**joint venture investment account** ఉమ్మడి సమారంభ /జాయింట్ వెంచర్ పెట్టుబడి ఖాతా
**joint will** సంయుక్త వీలునామా
**journal** పత్రిక, జర్నలు
**journal entry** జర్నలు నమోదు
**journalism** పత్రికా రచన, జర్నలిజమ్
**journalist** పత్రికా రచయిత, పాత్రికేయుడు
**journal of parliament** పార్లమెంటు పత్రిక / జర్నలు
**journal of proceedings** కార్యవ్యవహారాల జర్నలు
**journey on tour** పర్యాటనపై ప్రయాణం
**journey on transfer** బదిలీ పై ప్రయాణం
**journey, unauthorised** అనుమతిలేని ప్రయాణం
**jubilee** ఉత్సవం
**judge n.** 1. న్యాయాధిపతి, న్యాయాధీశుడు, జడ్జి, తీర్పు చెప్పే వ్యక్తి **v.** 2. నిర్ణయించు, తీర్పు చెప్పు
**judge composing the bench** ధర్మాసనంలో ఉన్న న్యాయాధీశుడు
**judge composing the court** న్యాయస్థానంలో ఉన్న న్యాయాధీశుడు
**judge dissenting from judgement** తీర్పుపట్ల న్యాయాధీశుడు భిన్నాభిప్రాయం ప్రకటించడం
**judge-made law** తీర్పుజనిత న్యాయం : న్యాయస్థాన తీర్పులవల్ల ఏర్పడే న్యాయం, న్యాయాధీశుడు రూపొందించిన శాసనం (ఇంగ్లండ్ కామన్ లా)
**judge not too hastily** తొందరపాటుగా ఒక నిర్ణయానికి రాకూడదు
**judges composing the court of appeal** అపీలు కోర్టు న్యాయాధీశులు
**judge's minutes or notes** న్యాయాధీశుని కార్య వివరణ పత్రాలు
**judge's order** న్యాయాధిపతి ఉత్తరువు
**judgement** 1. తీర్పు, నిర్ణయం 2. వివేకం
**judgement and accuracy** వివేచన శక్తి, నిర్దిష్టతా /నిర్ణయం, నిర్దిష్టత
**judgement by default** లోపభూయిష్ఠమైన తీర్పు : ఎక్స్‌పార్టీగా ఇచ్చిన తీర్పు కావచ్చు, దీనికి తగిన కారణం చూపిన మీదట రద్దు చేసి విచారణపై తిరిగి తీర్పు

ఇవ్వవచ్చు

**judgement creditor** డిక్రీదారు, తీర్పు పొందిన ఋణదాత

**judgement debt** తీర్పు /డిక్రీ ఋణం

**judgement debtor** తీర్పు / డిక్రీ ఋణ గ్రస్తుడు

**judgement delivered** తీర్పు ప్రకటించడ మైంది

**judgement in appeal** అపీలు తీర్పు

**judgement in personam** వ్యక్తికి వర్తించే తీర్పు

**judgement in rem** సర్వులకు వర్తించే తీర్పు

**judgement in terms of award** పరిష్కారోచిత తీర్పు

**judgement inter parties** ఉభయపక్ష తీర్పు : ఉభయ పక్షాలకూ వర్తించే తీర్పు

**judgement nisi** ప్రారంభ తీర్పు

**judgement of the public** ప్రజల తీర్పు

**judgement with costs** ఖర్చులతో సహా తీర్పు : నెగ్గిన పక్షానికి ఓడి పోయిన పక్షం ఖర్చులు ఇవ్వాలనే తీర్పు

**judgement without costs** ఖర్చులు మినహా తీర్పు, ఖర్చులు లేని తీర్పు

**judicature** **1.** న్యాయపరిపాలన **2.** జడ్జి పదవీ కాలం **3.** న్యాయస్థానం

**judicial** న్యాయ, న్యాయనిర్ణయం, జుడీషి యల్

**judicial act** న్యాయకార్యం

**judicial administration** న్యాయపాలన

**judicial authorities** న్యాయ నిర్ణయాధి కారులు

**judicial award** న్యాయనిర్ణయం/ ప్రదానం

**judicial balance and steadiness** న్యాయనిర్ణయంలో సమతులనమూ నిలకడా

**judicial committee** న్యాయనిర్ణయ సంఘం

**judicial competence** న్యాయ నిర్ణయ సమర్థత

**judicial control** న్యాయ నియంత్రణ

**judicial custody** న్యాయ నిర్బంధం (విచారణ సం॥)

**judicial decision** న్యాయ సంబంధ నిర్ణయం

**judicial department** న్యాయపాలన విభాగం

**judicial discretion** న్యాయవివేచన

**judicial divorce** న్యాయ సమ్మతమైన విడాకులు

**judicial documents** న్యాయస్థాన అధికార పత్రాలు

**judicial duty** న్యాయపర కర్తవ్యం / విధి

**judicial enquiry** న్యాయస్థాన విచారణ, న్యాయవిచారణ

**judicial factor** న్యాయాంశం

**judicial formulation of law** శాసనం న్యాయసమ్మతంగా రూపొందటం.

**judicial function** న్యాయకార్యవిధి

**judicial inquiry** న్యాయ విచారణ

**judicial lock-up** న్యాయపరమైన నిర్బంధం / లాకప్

**judicially held** న్యాయనిర్ణయ, న్యాయ స్థానంలో నిర్ణయించబడిన

**judicially noticeable** న్యాయపరంగా గమనించదగిన, న్యాయావలోకనం చేయ దగిన

**judicial machinery** న్యాయస్థాన యంత్రాంగం

**judicial magistrate** న్యాయనిర్ణయ మేజిస్ట్రేటు

**judicial method** న్యాయశాస్త్ర పద్ధతి

**judicial notice** న్యాయస్థాన నోటీసు

**judicial office** న్యాయాధికారి పదవి

**judicial officer** న్యాయాధికారి

**judicial opinion** సారాంశంపై వాదాలు విని చెప్పిన తీర్పు / నిర్ణయం

**judicial power** న్యాయ నిర్ణయాధికారం, కోర్టు అధికారం

**judicial procedure** న్యాయశాఖ కార్య పద్ధతి

**judicial proceedings** **1.**న్యాయస్థాన కార్య వ్యవహారాలు **2.** న్యాయ సంబంధమైన చర్యలు / కార్య వ్యవహారాలు, న్యాయిక చర్యలు

**judicial process** న్యాయప్రక్రియ / సమను

**judicial pronouncement** న్యాయస్థాన ప్రకటన

**judicial reference** న్యాయశాస్త్రి సంప్రదింపు / నిర్దేశం

**judicial sale** కోర్టు విక్రయం / అమ్మకం

**judicial separation** న్యాయస్థానం / కోర్టు ద్వారా పొందిన వేర్పాటు (భార్యాభర్తల సం॥)

**judicial service** న్యాయశాఖ సర్వీసు

**judicial sobriety** న్యాయ విషయంలో సంయమనం / నిగ్రహం

**judicial stamp** 1. జుడీషియల్ స్టాంపు / 2. న్యాయస్థానముద్ర / స్టాంపు

**judicial supremacy** న్యాయ సార్వభౌమాధికారం, న్యాయ ఆధిక్యత

**judicial system** న్యాయపరిపాలన విధానం/ వ్యవస్థ

**judicial tribunal** న్యాయనిర్ణయ ట్రిబ్యునల్

**judiciary** 1.న్యాయశాఖ 2. న్యాయనిర్ణయ వర్గం, జుడీషియరీ

**judicious** న్యాయబుద్ధిగల, వివేకవంత

**jugglery of words** మాటల గారడీ

**juicy posting** అక్రమార్జనకు అనువుగా ఉన్న పదవి

**jumped bail** బెయిలు నుంచి పారిపోయిన

**junction** కూడలి, సంధి

**juncture** గడ్డు సమయం / తరుణం

**junior** జూనియర్, కనిష్ఠుడు

**junior grade** జూనియర్ గ్రేడ్, కనిష్ఠశ్రేణి

**junior levirate** కనిష్ఠ దేవర న్యాయం : చనిపోయిన భర్త తమ్మునిగాని, దగ్గరి బంధువును గాని వివాహమాడటం

**junior most** కనిష్ఠతమ

**jura in personam** వ్యక్తిపర హక్కులు

**jura in rem** సర్వపర హక్కులు

**jura publica** సార్వజనిక హక్కులు, **public rights**

**jura regalia / regia** సార్వభౌమాధికారాలు, రాజత్వ హక్కులు **royal rights**

**juridical** న్యాయసంబంధ

**juridical custom** కోర్టు రివాజు

**juridical evidence** న్యాయసంబంధ సాక్ష్యం: ఒక వ్యక్తి కోర్టు ఎదుట ఇచ్చిన సాక్ష్యం

**juridical person** న్యాయదృష్ట్యా వ్యక్తి

**juries are the judges of facts** జూరీలు వాస్తవాలను నిర్వహించే జడ్జీలు అయి ఉండాలి

**jurisdiction** 1. అధికారపరిధి 2. విచారణాధికారం

**jurisdictional area** అధికారపరిధి ప్రాంతం/ క్షేత్రం

**jurisdictional basis** అధికారపరిధి ప్రాతిపదిక

**jurisdictional purpose** అధికారపరిధి ప్రయోజనం

**jurisdictional value** అధికారపరిధి విలువ / మూల్యం

**jurisdiction and powers** అధికార పరిధి – అధికారాలు

**jurisdiction, appellate** అపిలేట్ అధికార పరిధి

**jurisdiction as to time** సమయ విషయంలో అధికారపరిధి

**jurisdiction barred** అధికారపరిధి నిషేధించిన, నిషిద్ధ పరిధి

**jurisdiction clause** అధికారపరిధి క్లాజు

**jurisdiction is a power introduced for the public good on account of the necessity of dispensing justice** న్యాయపాలన ఆవశ్యకత దృష్ట్యా ప్రజా శ్రేయస్సు నిమిత్తం అధికారపరిధిని ఒక అధికార సాధనంగా ప్రవేశపెట్టడమయింది

**jurisdiction, equal** సమాన అధికారపరిధి

**jurisdiction exercisable by court** న్యాయస్థానం ద్వారా వినియోగించదగిన అధికారపరిధి

**jurisdiction, inferior** దిగువ అధికార పరిధి
**jurisdiction not vested in it by law** న్యాయరీత్యా దానిలో నిహితంకాని అధికార పరిధి
**jurisdiction of the court** న్యాయస్థాన విచారణాధికార పరిధి
**jurisdiction, pecuniary** ధనపరమైన అధికారపరిధి
**jurisdiction, superior** సర్వోన్నత అధికార పరిధి
**jurisdiction to adjudicate** 1. న్యాయ నిర్ణయ అధికారపరిధి 2. న్యాయనిర్ణయం చేయటానికి అధికారపరిధి
**jurisprudence** న్యాయశాస్త్రం / విజ్ఞానం
**jurist** న్యాయవేత్త, న్యాయతత్వజ్ఞుడు
**juristic person** న్యాయదృష్ట్యా వ్యక్తి
**juror** జూరర్, జ్యూరీ సభ్యుడు
**jury** జ్యూరీ/న్యాయనిర్ణయ సంఘం సభ్యుడు
**jury man** జ్యూరీ సభ్యుడు
**jury box** జ్యూరీ కూర్చునే స్థానం
**jury is not unanimous** జ్యూరీ / న్యాయ నిర్ణయ సంఘం ఏకాభిప్రాయంలో లేదు
**jury may retire** న్యాయ నిర్ణయ సంఘం ఏకాంతంలోకి వెళ్ళవచ్చు
**jury of accusation** నేరారోపణ చేసే జ్యూరీ
**jury woman** జ్యూరీ సభ్యురాలు
**jus civile** సివిల్ లా, వ్యావహారిక న్యాయ శాస్త్రం
**jus commune** సార్వజనిక న్యాయం
**jus legitimum** న్యాయహక్కు
**jus possessionis** స్వాధీన హక్కు
**jus scriptum** లిఖిత న్యాయం/చట్టం
**jus tertii** మూడో వ్యక్తి హక్కు
**just** న్యాయసంగత, ఉచిత, సరిఅయిన, ధర్మమైన
**justa causa** న్యాయమైన కారణం, న్యాయ సంగత హేతువు
**just and convenient** న్యాయసంగతంగానూ సుకరంగానూ
**just and equitable** న్యాయసంగతంగానూ సమధర్మంగానూ
**just and fair** న్యాయసంగతంగానూ సముచితంగానూ
**just and proper** న్యాయసంగతంగానూ యుక్తంగానూ
**just and reasonable** న్యాయ సంగతంగానూ సహేతుకంగానూ
**just and true account** సరియైన, నిజమైన లెక్క / వివరణ
**just compensation** న్యాయసంగతమైన పరిహారం
**just debts** న్యాయసంగతమైన ఋణాలు
**just decision** న్యాయసంగతమైన నిర్ణయం
**just ground** న్యాయసంగతమైన ఆధారం / కారణం
**justice** 1. న్యాయం 2. న్యాయమూర్తి, జస్టిస్
**justice of peace** శాంతి సంరక్షక న్యాయ మూర్తి
**justiceship** న్యాయమూర్తి పదవి
**justiciable** న్యాయపరిధిలో విచారణ జరపదగిన
**justifiable** న్యాయోచిత, సమర్థనీయ, సమర్థించదగిన
**justifiable reason** న్యాయోచిత కారణం
**justification** న్యాయోచితం, సమర్థనీయం
**justification for the proposal** ప్రతిపాదనకు న్యాయోచిత సమర్థన
**justified** న్యాయోచిత, సమర్థనీయ
**justified by the law** చట్టరీత్యా న్యాయోచితం
**justify** న్యాయోచితం చేయు, సమర్థించుకొను
**just intention** న్యాయమైన ఉద్దేశం
**justly** న్యాయంగా, ధర్మంగా, న్యాయసమ్మతంగా, న్యాయబద్ధంగా
**justness** న్యాయపరాయణత / ధర్మ పరాయణత
**just price** న్యాయమైన ధర
**just probe** న్యాయమైన దర్యాప్తు
**just valuation** సరిఅయిన విలువ కట్టటం
**just value** సరిఅయిన విలువ

**jute manufacturers association** జనపనార ఉత్పత్తిదార్ల సంఘం
**juvenile** బాల, బాల్య
**juvenile convict** బాలనేరస్తుడు
**juvenile court** బాలల న్యాయస్థానం
**juvenile delinquency** బాల నేరత్వం
**juvenile delinquent** బాలనేరస్తుడు
**juvenile employment** బాలలకు ఉపాధి కల్పన
**juvenile offender** బాలనేరస్తుడు/అపరాధి
**juvenile probation** బాల నేరస్తుల ప్రొబేషన్ / పరివీక్ష
**juvenile service bureau** బాలల సేవా సంస్థ
**juxta pose** దగ్గర దగ్గరకు చేర్చు / దగ్గర దగ్గర కూర్చొను
**juxtaposition** సమీప వర్తిత్వం, పక్కపక్కన ఉండటం

## K

**keelage** వర్తకపు ఓడపన్ను (ఓడరేవుసం॥)
**keen competition** తీవ్రపోటీ
**keen interest** తీవ్రమైన ఆసక్తి
**keen mind** తీక్షణ బుద్ధి
**keep alert** అప్రమత్తంగా ఉండు
**keep an account open** ఖాతాను అమలులో ఉంచు
**keep and retain** దగ్గర ఉంచుకోండి
**keep away** దూరంగా ఉంచు
**keep command** అధికారం / నాయకత్వం నిలుపుకొను
**keep debentures alive** డిబెంచర్లను అలాగే ఉంచు
**keeper of records** రికార్డుల పాలకుడు/ సంరక్షకుడు
**keeper of the prison** కారాగార పాలకుడు
**keep in abeyance** అనామతులో ఉంచు/ ఆపి ఉంచు
**keep in confinement** నిర్బంధంలో ఉంచు
**keeping a gaming house** జూదపు గృహం నడపటం
**keep in force** అమలులో ఉంచు
**keeping in good order** సక్రమంగా ఉంచటం
**keeping in view** దృష్టిలో ఉంచుకోవడం
**keep in touch** తెలివిడిలో ఉండు
**keep in good repair** సరిఅయిన స్థితిలో ఉంచు
**keep in peace** శాంతంగా ఉంచు
**keep in suspense** ఎటూ తేల్చకుండా ఉంచు / సందిగ్ధంలో ఉంచు
**keep pace with the work** పని సాగేటట్లు చూచు
**keep pending** అలాగే ఉంచు, పెండింగులో ఉంచు, అనిశ్చితంగా ఉంచు, ఏ చర్యా తీసుకోకుండా ఉంచు
**keep proper accounts** సక్రమమైన లెక్కలు నిర్వహించు
**keep under** అధీనంలో ఉంచుకొను
**keep up promise** వాగ్దానం నిలుపుకొను
**keep up the progress** ప్రగతిని కొనసాగనిచ్చు
**keep vigil** నిఘావేసి ఉంచు
**keep watch** కనిపెట్టి ఉండు, శ్రద్ధగా గమనించు
**keep with file** ఫైలులో ఉంచు
**key industry** కీలక పరిశ్రమ
**key map** కీలక పటం
**key minerals** ముఖ్య ఖనిజాలు
**key note** ముఖ్యపత్రం / సారాంశం
**key note address** ప్రధాన ప్రసంగం
**key point** కీలకాంశం
**key position** కీలక స్థానం/పదవి
**key post** కీలకమైన పదవి
**key role** కీలక / ముఖ్యపాత్ర
**key village centre** ముఖ్య గ్రామకేంద్రం
**kidnap** అపహరించు, ఎత్తుకొని వెళ్ళు
**kidnapping** బలవంతంగా ఎత్తుకుపోవటం / అపహరించటం
**kidnapping from lawful guardianship** న్యాయసమ్మత సంరక్షణ నుంచి

అపహరణ

**kin** సగోత్రుడు / బంధువు

**kind 1.** వస్తురూపం, **2.** రకం, విధం

**kindly expedite reply** దయచేసి త్వరగా జవాబు రాయండి

**kindly instruct further** తరవాతి సూచనలు రాయండి

**kindly refer to your D.O. letter No.** మీ డి.ఓ. లేఖ నెం. నిర్దేశం చూడండి

**kindly review the case** కేసు సమీక్షించండి

**kindred** సజాతీయమైన

**king in council** సభాయుతుడై వ్యవహరించే రాజు

**kingpin** కింగ్ పిన్ / ప్రధాన విషయం / వస్తువు / వ్యక్తి

**kin group** రక్త సంబంధికులు, జ్ఞాతులు

**king's bench** కింగ్స్ బెంచి (ఇంగ్లండు న్యాయస్థానం)

**kins folk** బంధువులు

**kinship** బంధుత్వం

**kinsman** బంధువు

**kit box** పనిముట్ల పెట్టె, కిట్ పెట్టె

**kitchen cabinet** అంతరంగిక మంత్రి మండలి

**kitchen expenditure** వంట ఖర్చు

**kite** సిఫారసు బిల్లు **(accommodation bill)**

**kite flying** సిఫారసు బిల్లుల ద్వారా ద్రవ్య సేకరణ

**kith and kin** బంధు పరివారం

**kleptomania** దొంగిలించాలని కలిగే అపుకోలేని ఉన్మాదం / చౌర్యోన్మాదం

**knave** వంచకుడు, ధూర్తుడు, టక్కరి

**knock down 1.** వేలంపాటలో కొట్టివేయు **2.** పడగొట్టు

**knock down price** వేలం ధర

**knock out** పోటీ లేని వేలం పాట : వేలం పాటలో పోటీ లేకుండా పాటదారులు చేసుకొనే ఏర్పాటు

**know all men by these presents** ఇందుమూలంగా ఈ పత్రం ద్వారా అందరికీ తెలియజేసేది ఏమంటే

**know-how** సాంకేతిక పరిజ్ఞానం

**knowing its nature** స్వభావం తెలుసుకోవటం

**knowingly and unlawfully** తెలిసి, అన్యాయంగా

**knowingly and wilfully** తెలిసి, బుద్ధిపూర్వకంగా

**knowing the nature of the act** చర్య స్వభావం తెలిసి ఉండి

**knowledge and belief** ఎరుక, విశ్వాసం

**knowledge and belief, to the best of** తెలిసినంత వరకు, విశ్వసించే మేరకు

**knowledge, information and belief** ఎరుక - సమాచారం - విశ్వాసం

**knowledge of fact** వాస్తవాల ఎరుక/ పరిజ్ఞానం

**knowledge of law** న్యాయశాస్త్ర పరిజ్ఞానం

**known as** పేరుగల, అనబడే, అనే

**known creditors** తెలిసిన ఋణదాతలు (దివాలా సం॥)

**knowledge of reading, writing in other languages if any** ఏ ఇతర భాషలలోనైనా చదవటం, రాయటంలో పరిజ్ఞానం

**known defects** తెలిసిన లోటుపాట్లు

**known from a long time** చిరపరిచిత

**known sources of income** తెలిసిన ఆదాయ వనరులు

**known to all** సర్వవిదిత, అందరికీ తెలిసిన

**kudos** ప్రఖ్యాతి, ప్రతిష్ఠ, గౌరవం, యశస్సు

# L

**label** విషయ సూచన, చీటీ, లేబిల్

**label affixed** అతికించిన చీటీ

**labelling** చీటీ అతికించటం, లేబిలింగ్

**laboratory equipment** ప్రయోగశాల ఉపకరణాలు

**laborious** కష్టతరమైన, కష్టమైన **toilsome**

**labour** 1. శ్రమ, కూలి 2. కార్మిక వర్గం 3. ప్రసూతి సంబంధ
**labour absenteeism** కార్మికుల గైరు హాజరు
**labour advisory board** కార్మిక సలహా మండలి
**labour appellate tribunal** లేబర్ అపిలేట్ ట్రిబ్యునల్
**labour arbitration** కార్మిక మధ్యవర్తి నిర్ణయం
**labour bureau** లేబర్ బ్యూరో, కార్మిక సంస్థ
**labour caucus** కార్మిక రాజకీయ కూటమి
**labour combination** కార్మిక సమ్మేళనం
**labour commissioner** కార్మిక / లేబర్ కమీషనర్
**labour contract** 1.పనిగుత్త 2.కూలి సరఫరా గుత్త, లేబర్ కంట్రాక్టు
**labour co-operatives** కార్మిక సహకార సంస్థలు
**labour co-operative societies** కార్మిక సహకార సంఘాలు
**labour court** శ్రామిక న్యాయస్థానం, లేబర్ కోర్టు
**labour dispute** కార్మిక వివాదం
**labour emigration** కార్మిక వలస : కార్మికులు వలస పోవటం
**labourer** కార్మికుడు, మజ్దూర్, కూలీ
**labour federation** కార్మిక సమాఖ్య
**labour intelligence** కార్మిక రహస్య సమాచారం
**labour intensive** శ్రమ సాంద్ర, శ్రమ ప్రధాన
**labour intensive industry** శ్రమ ప్రధాన పరిశ్రమ
**labour investigation committee** కార్మిక పరిశీలన సంఘం
**labour laws** కార్మిక శాసనాలు
**labour legislation** కార్మిక శాసన నిర్మాణం
**labour movement** కార్మిక ఉద్యమం
**labour organization** కార్మిక వ్యవస్థ
**labour policies** కార్మిక విధానాలు
**labour priority** శ్రమ ప్రాధాన్యం
**labour problems** కార్మిక సమస్యలు
**labour productivity** కార్మిక ఉత్పాదకత
**labour relations** కార్మిక సంబంధాలు
**labour relations committee** కార్మిక సంబంధాల సంఘం
**labour saving devices** శ్రమ పొదుపు సాధనాలు
**labour supply** కార్మికుల సరఫరా
**labour turnover** కార్మిక ఆవర్తనం / టర్నోవర్, శ్రమశక్తి మొత్తం
**labour union** కార్మిక సంఘం
**labour unrest** కార్మిక అశాంతి
**labour utilization** శ్రమ వినియోగం
**labour ward** ప్రసూతివార్డు
**labour welfare** కార్మిక సంక్షేమం
**labour welfare centre** కార్మిక సంక్షేమ కేంద్రం
**labour welfare fund** కార్మిక సంక్షేమ నిధి
**laches** కర్తవ్య ఉపేక్ష, అశ్రద్ధ
**lack of co-ordination** సమన్వయ లోటు
**lack of discipline** క్రమశిక్షణ లోటు
**lack of integrity** నిజాయితీ లేకపోవటం
**lack of jurisdiction** అధికారపరిధి లేక పోవటం
**lack of practice** అభ్యాసం లోటు
**lack of prudence** వివేకం లేకపోవటం
**lack of quorum** కోరం లోటు / లేకపోవటం
**lacuna** లోపం, వెలితి
**lacuna or defect** లోపం లేదా దోషం
**lading bill** లేడింగ్ బిల్లు, సరుకు రవాణా బిల్లు
**laid before both the Houses (shall cause to be)** ఉభయ సభల సమక్షంలో ఉంచడమైంది
**laid before the Assembly** విధాన సభ సమక్షంలో పెట్టబడిన
**laid before the court** కోర్టు సమక్షంలో పెట్టబడిన

**laid down** విధించిన (నియమాలు వగైరా)
**laid up with fever** జ్వరపీడితమై ఉన్న
**laissez faire** జోక్య రహిత విధానం, స్వేచ్ఛా విధానం (వాణిజ్యం వగైరా) 1. జోక్యం చేసుకోకుండా విడిచిపెట్టు, వ్యక్తి స్వాతంత్ర్యాన్ని అంగీకరించు
**laissez faire leadership** జోక్య రహిత నాయకత్వం
**lame duck session** కుంఠిత సమావేశం
**land acquisition** భూసేకరణ
**land alienation** భూమి అన్యాక్రాంతం
**land appurtenant thereto** దానికి అనుబంధంగా ఉన్న స్థలం / భూమి
**land, dry** మెట్ట, ఖుష్కీ
**land assignment** భూమి అప్పగింత / కేటాయింపు
**land attachment** భూమి జప్తు
**land customs** భూమి సుంకాలు
**land development bank** భూమి అభివృద్ధి బాంకు
**landed estate** భూ సంపద / ఆస్తి
**landed property** భూ సంపద / ఆస్తి
**landed property statement** భూమి ఆస్తి వివరణ పట్టిక
**land encroachment** భూమి అతిక్రమణ
**land for agricultural purpose** వ్యవసాయానికి ఉద్దేశించిన భూమి
**land force** పదాతిదళం
**land form** భూ స్వరూపం
**land gift movement** భూదానోద్యమం
**land grabber** భూ దురాక్రమణదారు
**land grabbing** భూమి దురాక్రమణ : భూమిని చట్ట విరుద్ధంగా ఆక్రమించటం
**land grant** భూదానం
**land·holder** భూకమతందారు / భూకామందు
**land holding** భూమి కమతం
**land improvement** భూమి అభివృద్ధి
**land improvement advances** భూమి అభివృద్ధి అడ్వాన్సులు / ఋణాలు
**land improvement loans** భూమి అభివృద్ధి అప్పులు / ఋణాలు
**landing** దింపటం, దిగటం, అవతరణ
**landing and shipping** దింపటమూ ఎక్కించటమూ (ఓడ సరుకు సం॥)
**landing place** దిగే స్థలం, అవతరణ స్థానం
**land irrigated from a canal** కాలువ సాగు భూమి
**land lady** యజమానురాలు (భూమి, ఇల్లు సం॥)
**land laws** భూచట్టాలు / శాసనాలు
**landless labourer** భూమిలేని రైతు
**landless people** భూమిలేని రైతులు
**land locked** భూపరివేష్టిత
**landlord** భూస్వామి, యజమాని (ఇల్లు, భూమి సం॥)
**landmark 1.** హద్దురాయి, సంకేత హద్దు, మైలురాయి **2.** ప్రసిద్ధ విషయం
**landmine** మందుపాతర
**land mortgage** భూమితాకట్టు / తనఖా
**land owner** భూ యజమాని / సొంతదారు
**land ownership** భూమి యాజమాన్యం
**land reclamation** భూమి పునరుద్ధరణ
**land record** భూమి రికార్డు
**land reforms** భూ సంస్కరణలు
**land rent** భూమి కౌలు
**land requisition** భూమికి అభ్యర్థన
**land revenue** భూమి పన్ను / శిస్తు / రెవెన్యూ
**land route** భూమార్గం, స్థలమార్గం
**landscape** భూతల ప్రకృతి దృశ్యం, ఏకస్థల చిత్రపటం
**land security** భూమి పూచీ
**land settlement** భూమి బందోబస్తు, భూమి సెటిల్‌మెంటు
**landslide** భూపాతం
**landslip** పర్వత భాగం నుంచి జారిపడే భూఖండం
**land survey** భూమి కొలత / సర్వే
**land tax** భూమి పన్ను

land tax assessment భూమి పన్ను నిర్ధారణ
land tax register భూమి పన్ను రిజిస్టరు
land tenancy Act కౌలుదారీ చట్టం
land tenancy certificate భూమి కౌలు దారీ ధ్రువపత్రం
land tenure భూమిపట్టా గడువు / కౌలు గడువు
land transfer certificate భూమి బదిలీ ధ్రువపత్రం
land transportation భూమార్గ రవాణా
land utilization భూమి వినియోగం
land values భూమి విలువలు
language in use వాడుక భాష
language of charge ఆరోపణలోని భాష
language of court న్యాయస్థాన భాష
languish కృశించు, దుర్బలమవు
lapse లోపం, కాలాతీతం, కాలదోషం, రద్దు, కొరవ
lapsed legacy కాలాతీత వీలునామా హక్కు / వసీయతు హక్కు
lapsed sanction కాలాతీత మంజూరు
lapse of a bill బిల్లు కాలాతీతం అవు: బిల్లుకు / చిత్తు చట్టానికి కాలదోషం పట్టటం
lapse of grant గ్రాంటు గడువు దాటి పోవటం
lapse of pending notices పెండింగు నోటీసు రద్దు , నిలిపి ఉంచిన నోటీసుల రద్దు
lapse of policy పాలసీ రద్దు
lapse of time కాలం గడచిపోవటం
lapsing of deposit డిపాజిట్టుకు కాల దోషం పట్టటం
lapsus linguae మాట పొరపాటు
larcenous intent చౌర్యోద్దేశం
larceny చోరీ, అపహరించటం
large operations భారీపనులు / కార్య వర్తనలు
large scale పెద్ద తరహా, భారీఎత్తున, అధిక ప్రమాణం, పెద్ద ఎత్తున
large scale industry భారీ పరిశ్రమ
large scale production భారీ ఉత్పత్తి : విస్తృత పరిధి ఉత్పత్తి
last 1.ఆఖరు 2. గత, చివరి (ర) 3. కడ పటి, అంత్య, మిగిలిన, గడచిన
last aforesaid (on) ఇంతకు ముందు చెప్పినట్లుగా
last and usual place of abode ఆఖరున కాపురమున్న స్థలం
last clear chance స్పష్టమైన ఆఖరి అవకాశం
last foregoing section సదరు చివరి పరిచ్ఛేదం
lasting monument శాశ్వత స్మారక చిహ్నం
last known place of abode తెలిసిన నివాస స్థానాల్లో చివరిది
last pay certificate ఆఖరి జీతం ధ్రువపత్రం
last preceding కట్టకడపటి, దీనికి సరిగా ముందటి, పూర్వపు
last preceding census కట్టకడపటి జనాభా లెక్కలు
last preceding section దీనికి సరిగా ముందటి / పూర్వపు నియమం
last residence చివరగా నివసించిన చోటు, ఆఖరి నివాసం
last rites అంత్యక్రియలు
last survivor మిగిలిన వారసు / అనంతర జీవి
last will ఆఖరి / చివరి వీలునామా
late 1. కీర్తిశేష, గతించిన 2. ఆలస్య(ం)
late arrival ఆలస్యంగా రావటం
late attendance ఆలస్య హాజరు
late fee ఆలస్య రుసుం
late news తాజా వార్తలు
latent నిగూఢ
latent ambiguity అంతర్నిహితమై ఉన్న సందిగ్ధ స్థితి
latent defects నిగూఢలోపాలు
late payment ఆలస్య చెల్లింపు
late permission ఆలస్యానికి అనుమతి
lateral line పార్శ్విక రేఖ, పార్శ్విక వంశాను

క్రమం
**later created right** తరవాత కల్పించిన హక్కు
**later reference** తరవాతి నిర్దేశం
**latest** తాజా, సరికొత్త, ఇటీవలి
**latest date** చిట్టచివరి గడువు / తేదీ
**latest decision** తాజా నిర్ణయం
**latest part** తరవాతి భాగం / ఉత్తర భాగం
**latest version** సరికొత్త కథనం
**latitude** అక్షాంశం
**launch n.1.** లాంచి, మోటారు పడవ **v.2** ఆరంభించు
**launch a movement** ఉద్యమం ప్రారంభించు
**launch a ship** ఓడను జలప్రవేశం చేయించు
**laundry** లాండ్రీ, చాకలికొట్టు
**laureate** అలంకృతుడు, పూజితుడు
**laurels** గౌరవం, కీర్తి
**lavishly** విరివిగా / సమృద్ధిగా
**law 1.**శాసనం, చట్టం, న్యాయం, ధర్మం **2.** న్యాయశాస్త్రం **3.** సూత్రం
**law abiding** న్యాయబద్ధ, శాసనబద్ధ
**law administered by court** న్యాయస్థానం నిర్వహించిన శాసనం
**law and custom** న్యాయమూ ఆచారమూ
**law and equity** న్యాయమూ సమధర్మమూ
**law and judicial decision** చట్టమూ న్యాయనిర్ణయమూ
**law and jurisprudence** శాసనం, న్యాయ విజ్ఞాన శాస్త్రం
**law and justice** న్యాయమూ ధర్మమూ
**law and maxims** శాసనం, సూత్రాలు
**law and order** శాంతి భద్రతలు
**law and practice** శాసనమూ అమలూ
**law-breaker** చట్ట అతిక్రమణదారు, న్యాయ భంజకుడు
**law charges** కోర్టు ఖర్చులు
**law commission** లా కమిషన్, శాసన పరిశీలన సంఘం
**law court** న్యాయస్థానం
**law for the limitation of suits** వ్యాజ్యాల కాలపరిమితికి శాసనం
**law for the time being in force** ప్రస్తుతం అమలులో ఉన్న చట్టం / శాసనం
**lawful** చట్ట సమ్మత, శాసన సమ్మత (శాసన ప్రధానమైనది), శాస్త్రబద్ధం
**lawful act** చట్ట సమ్మత చర్య
**lawful age** చట్ట సమ్మత వయస్సు
**lawful apprehension** చట్ట సమ్మతంగా పట్టుకోవటం, న్యాయ బద్ధంగా పట్టుకోవటం
**lawful authority** చట్టసమ్మత అధికారం
**lawful cause** సమంజసమైన కారణం
**lawful charge** చట్టసమ్మతమైన తాకట్టు
**lawful consideration** చట్టసమ్మత ప్రతిఫలం
**lawful contents** న్యాయసమ్మతమైన విషయాలు
**lawful custody** చట్టసమ్మత నిర్బంధం
**lawful entry** చట్ట (న్యాయ)బద్ధ ప్రవేశం
**lawful excuse** చట్ట సమ్మతమైన నెపం / సాకు / మిష
**lawful guardian** చట్ట సమ్మతమైన సంరక్షకుడు
**lawful heirs** చట్టసమ్మత వారసులు
**lawfully** చట్టసమ్మతంగా, న్యాయ బద్ధంగా
**lawfully administered oath** చట్ట సమ్మతంగా చేయించిన ప్రమాణం
**lawfully constituted** చట్టసమ్మతంగా ఏర్పడిన
**lawful means** చట్టసమ్మత విధానం
**lawful object** చట్టసమ్మత లక్ష్యం
**lawful profession** చట్టసమ్మత వృత్తి
**lawful purpose** న్యాయసమ్మతప్రయోజనం
**lawful votes** న్యాయసమ్మతమైన వోట్లు
**law giver** శాసనకర్త, ధర్మ/న్యాయ నిర్దేశ, స్మృతికర్త
**law in force** అమలులో ఉన్న శాసనం / చట్టం
**law journal** లా జర్నల్, శాసన పత్రిక

lawless అరాచక
lawlessness న్యాయరాహిత్యం, అవ్యవస్థ
law made by Parliament పార్లమెంటు చేసిన శాసనం
law maker శాసన నిర్మాత / కర్త
law making body శాసన నిర్మాణ సంస్థ
law member న్యాయశాఖ సభ్యుడు
law of average returns సగటు రాబడి న్యాయసూత్రం
law of citation ఉదాహరణ / సైటేషన్ చట్టం: దీని ద్వారా శాసనం గురించి తెలియ జేస్తారు
law of comparative cost తులనాత్మక వ్యయ న్యాయం / సూత్రం
law of concentration కేంద్రీకరణ న్యాయం / సూత్రం
law of constant demand స్థిర గిరాకీ సూత్రం
law of constant proportion స్థిరానుపాత సూత్రం
law of constant returns స్థిరాదాయ సూత్రం
law of contracts కాంట్రాక్టుల న్యాయ శాస్త్రం / చట్టం
law of cost వ్యయన్యాయం
law of decreasing returns క్షయమాన ఆదాయ సూత్రం
law of decreasing utility క్షయమాన ఉపయోగ సూత్రం
law of definite proportions నిశ్చిత రామాపాల సూత్రం
law of derived demand అనుమితి డిమాండు సూత్రం
law of diminishing demand క్షయమాన డిమాండు సూత్రం
law of diminishing returns తరుగు రాబడుల సూత్రం, క్షీణాదాయాల సూత్రం
law of equimarginal utility తుల్య ఉపాంత ఉపయోగ సూత్రం
law of evidence సాక్ష్య చట్టం
law officer న్యాయాధికారి
law of inheritance వారసత్వ చట్టం / శాసనం
law of insolvency దివాలా వ్యవహారాల చట్టం
law of jungle ఆటవిక న్యాయం
law of limitation అవధి చట్టం (శాసనం పరిమితం చేసిన), కాల పరిమితి / కాలదోష చట్టం
law of monopoly returns గుత్త ఆదాయ సూత్రం
law of nations అంతర్జాతీయ న్యాయం
law of nature ప్రకృతి ధర్మం, సహజధర్మం
law of neutrality తాటస్థ్య న్యాయం
law of parliament పార్లమెంటు చట్టం/ శాసనం
law of peace శాంతి సంబంధ న్యాయం
law of resistance ప్రతిఘటన సూత్రం
law of the land దేశీయ చట్టం /నియమం
law of torts అపకృత్య శాసనం (సివిల్)
law relating to usury వడ్డీ సంబంధ శాసనం
law reports శాసన నివేదికలు, లా రిపోర్టులు
laws, anticorruption అవినీతి నిరోధక శాసనాలు
law society న్యాయవాది సంఘం
law suit వ్యాజ్యం, దావా
lawyer న్యాయవాది, వకీలు
laxity విశృంఖలత, సడలుబాటు
lay 1. లౌకిక, సాధారణ 2. ఉంచు
lay behind కుంటుపడు, వెనకబడు
lay claim క్లెయింపెట్టు
lay down 1. విధించు, నిర్ధారించు 2. త్యజించు, వదులుకొను
lay down arms అస్త్రసన్యాసం చేయు, లొంగిపోవు
lay down the law నియమం విధించు, న్యాయవిధిని నిర్ణయించు
lay down the procedure కార్యవిధానాన్ని నిర్ధారించు
lay foundation stone శంకుస్థాపన

చేయు, పునాదిరాయి వేయు

**lay information** 1. అభియోగం తేవడానికి సమాచారం అందించు 2. అభియోగంచేయు

**laymen** సాధారణ ప్రజలు, లౌకికులు, వృత్తి శిక్షణ పొందనివారు

**lay-off** లే ఆఫ్, పనిబందు : ముడి సరుకులు దొరకని కారణంగా యాజమాన్యం ఉద్యోగులను తాత్కాలికంగా నిలిపి వేసే కాలం

**lay -off pay** లే ఆఫ్ వేతనం

**lay on the table** సభవారి ఎదుట పెట్టు

**layout** 1. లేఔట్, పథకం రూపురేఖలు 2. ఆకారరేఖ, నమూనా పటం

**lead astray** తప్పుదోవ పట్టించు

**lead a witness** సాక్షికి సమాధానం సూచిస్తూ ప్రశ్నవేయు, సాక్షికి సూచించు

**leaderette** ఉప సంపాదకీయం

**leader of the House** సభా నాయకుడు

**leader of the opposition** ప్రతిపక్ష నాయకుడు

**leader writer** పత్రిక శీర్షికా రచయిత

**lead in a cause** వాదంలో ప్రధానపాత్ర వహించు

**lead in defence** ప్రతివాదం నడుపు

**leading** ప్రముఖ, అగ్ర, సూచక, మార్గదర్శక, ప్రతిపాదక

**leading case** ప్రముఖ వ్యాజ్యం / విషయం, సిద్ధాంత ప్రతిపాదిక వ్యాజ్యం : శాసన అంశం కచ్చితంగా నిర్ణయమై తరువాతి కేసులకు మార్గదర్శకమైన కేసు (ఉదా॥ గోలక్‌నాథ్ కేసు)

**leading counsel** ప్రముఖ న్యాయవాది / సలహా వకీలు

**leading question** జవాబు సూచక ప్రశ్న

**leading sector** పురోగామి రంగం

**lead story** ప్రధాన వార్త

**lead the defence** ప్రతివాదం నడుపు

**lead the evidence** సాక్ష్యం నడుపు

**leaflet** కరపత్రం

**league** సమితి, లీగ్

**leak** n. వెల్లడి v. వెల్లడి అవు, కారు, గండి పడు

**lean years** గడ్డు సంవత్సరాలు

**leap year** లీప్ సంవత్సరం

**learned in law** న్యాయశాస్త్రజ్ఞుడు

**learned judge** ప్రాజ్ఞ న్యాయాధిపతి

**learned profession** నేర్పరివృత్తి, ప్రాజ్ఞ వృత్తి

**learning** అభ్యసనం, విద్య

**lease** n.1. కౌలు, అద్దె, గుత్త v. 2. కౌలు కిచ్చు, అద్దెకిచ్చు

**lease agreement** కౌలు ఒప్పందం

**lease charges** కౌలు ఛార్జీలు

**lease deed** కౌలు దస్తావేజు/పత్రం

**lease for life** జీవిత పర్యంత కౌలు

**lease from month to month** నెలసరి కౌలు

**lease from year to year** సాలుసరి కౌలు

**leasehold** కౌలు కమతం (భూమి)

**leaseholder** కౌలుదారు

**leasehold interest** కౌలుదారీ ప్రయోజనం

**leasehold property** కౌలుదారీ ఆస్తి

**leasehold system** కౌలుదారీ పద్ధతి

**least cost combination** కనిష్ఠ వ్యయ సముదాయం

**least possible delay** సాధ్యమైనంత తక్కువ వ్యవధి

**leave** n.1. సెలవు 2. అనుమతి, అనుజ్ఞ v. విడుచు, త్యజించు

**leave account** సెలవు ఖాతా

**leave allowance** సెలవు భత్యం

**leave application** సెలవు దరఖాస్తు

**leave availed of** వాడుకొన్న సెలవు

**leave due** రావలసిన సెలవు

**leave mark** సెలవు గుర్తు

**leave not due/earned** ఆర్జించని సెలవు

**leave of absence** 1.గైరుహాజరు సెలవు 2. హాజరు కాకపోవటానికి అనుమతి

**leave of the court** కోర్టు అనుమతి

**leave of the House** సభ అనుమతి

**leave on average pay** సగటు జీతం

